

శ్రీమత్యై గోదాదేవ్యై నమః

# తిరుప్పావై

(తాత్పర్య - విశేషార్థ - వేదాంతార్థములతో)

రచయిత - ప్రకాశకులు

**గోపాలాచార్యులు**

మూల్యం రూ Rs 15.00

**1992** సం॥రం

## వి ష య సూ చి క

ద్వితీయ ప్రచురణ - 1000 కాపీలు

ప్రాప్తిస్థానం -
గో పా లా చా ర్యు లు
వానుదాసాశ్రమం
వయా - చుండూరు.
522 318

శ్రీ లక్ష్మీ హయవదనపరబ్రహ్మణే నమః

ఆండాళ్ తిరువడిగళే శరణమ్

— తనియ —

నీళాతుఙ్గస్తనగిరితటీ సుప్త ముద్బోధ్య కృష్ణం
పారార్థ్యం స్వం శ్రుతిశతశిరస్సిద్ధ మధ్యాపయన్తీ
స్వోచ్ఛిష్టాయాం స్రజి నిగళితం యా బలాత్కృత్య భుఙ్క్తే
గోదా తస్యై నమ ఇద మిదం భూయ ఏవాస్తు భూయః॥

— తాత్పర్యము —

చేతను లందరును పరమాత్మకు పరతంత్రులు. ఇది సకలోపనిషత్సిద్ధమైన అర్థము. వారి భారమునంతను వహించవలసిన బాధ్యత పరమాత్మదే. సొత్తును కాపాడువాడు స్వామియే గదా! కాని యాతడు సర్వముక్తి పరిహారార్థమై "రక్ష్యాపేక్షాం ప్రతీక్షతే" అనగా- చేతను లా విషయమును గుర్తించి యాతనిపై నా భారమును మోపినపుడే భగవంతు డా బాధ్యతను వహించును. వహించెనా యిక నాతనికి విశ్రాంతి సున్న. కాని లోకు లా సంబంధమును మరచి స్వతంత్రులమని గర్వించి తిరుగుచుండుటచే పరమపురుషుని బాధ్యత సన్నగిల్లి యాతడు విశ్రాంతిగా నీళాదేవి కుచకలశముల నండగా గొని సుఖముగా నిద్రించెను. శ్రీ ఆండళ్ తల్లి, తాను ధరించి విడచిన మాలికలచే నాతనిని తనకు వశముగావించుకొనెను. ఆమె లోకుల నుద్ధరించుటకై యవతరించిన దగుటచే నాతని చెంత కేగి మేల్కొలిపి జీవులు మరచిన తమ పారతంత్ర్యము నాతని కెరుకపరచి వారిని రక్షించు బాధ్యతను గుర్తింపజేసెను. అట్టి మహోపకార మొనర్చిన యా తల్లి కెన్ని వందనము లర్పించినను మనమీ ఋణవిముక్తులము కాజాలము. కాబట్టి శ్రీ పరాశరభట్టరువారు భక్తిపారవశ్యముచే విశ్వరూపమును సేవించిన అర్జునుని వలె నొడలెరుంగని పారవశ్యమున పరశ్శత ప్రణామముల నర్పించుచున్నారు.

— విశేషార్థము —

వీరసుందర బ్రహ్మరాయడను నొక రాజు శ్రీరంగమునకు ప్రభువుగా నుండెను. అతడు శ్రీ కూరత్తాళ్వానుల శిష్యుడు. శ్రీపరాశరభట్టరు వారు కూరత్తాళ్వానుల కుమారులు, కూరత్తాళ్వానులు

పరమపదమునకు వేంచేసిన పిమ్మట ఆ రాజు ఆలయ ప్రాకారములు కట్టుట కుద్యమించి పిళ్లె యాళ్వారులను నొక శ్రీవైష్ణవునియొక్క తిరుమాళిక (ఇల్లు) అడ్డురాగా దానిని పడగొట్ట వలెనని యుద్యమించెను. ఆ స్వామి పరుగునపోయి భట్టరువారితో మొరపెట్టుకొనెను. అంత భట్టరువారు తమ తండ్రిగారి శిష్యుడు గదా యని చనువుతో నాతనిని పిలిపించి "పెరుమాళ్లకు రక్షకము. ఈ అచేతనము లగు ప్రాకారములు కావు. ఇట్టి భాగవతోత్తముల మంగళాశాసనమే పెరుమాళ్లకు రక్షకము. కావున వారి తిరుమాళికను తప్పించి ప్రాకారమును నిర్మింపు" మని యాదేశించిరి. కాని యా ప్రభువు వారి యాజ్ఞను పాటించలేదు. అంత భట్టరువారు విచారించి శ్రీరంగమును విడచి దక్షిణ దిశయందున్న తిరుక్కోవళూరునకు వెళ్లిపోయిరి. కాని శ్రీరంగనాథుని సేవ లేకపోవుటచే నిద్రాహారములు లేక శుష్కించిపోవుచుండిరి. వారి ప్రియశిష్యులగు నంజీయరు వారు అచ్చటికి వేంచేసి శ్రీ భట్టరువారి హృదయము ప్రసన్నమగుటకై "శ్రీ ఆండాళ్ తల్లినిగూర్చి యొక శ్లోకమును ప్రసాదింపు"డని వారిని ప్రార్థించిరి. అపుడు శ్రీ పరాశరభట్టరు వారు సాయించిన శ్లోకమిది.

మిథిలానగరమున నందగోపుని బావమరిదియగు కుంభుడను మహాత్ముడగు గోస్వామి యుండెను. ఆతడు నిత్యమందరకును పాలను, పెరుగును, నేతిని ధారాళముగ నొసంగుచుండెను. ఇతడు యశోదాదేవికి తమ్ముడు. ఇతని భార్య ధర్మద. వీరికి శ్రీరాముడను కుమారుడును, నీళాదేవి (నప్పిన్న) యను కుమార్తెయు నుండిరి. శ్రియఃపతి పరమపదమున వేంచేసియున్నపుడు ఇతర దేవీ మారులతో సహా నిత్యముక్తు లందరకును శ్రీ దేవి పురుషకారముగా నుండును. నారాయణుడు శ్రీరాముడుగా నవతరించినపుడు సీతాపిరాట్టి యందరకును పురుషకారముగా నుండెను. అటులనే భగవాడును శ్రీకృష్ణుడుగా నవతరించినపుడు ఈ నీళాదేవి (నప్పిన్నపిరాట్టి) యే అందరకును పురుష కారభూతురాలుగా నుండును. చేతనులతో భగవంతునకు తొమ్మిది సంబంధము లున్నను వాని నెరింగి పాటించువారి బాధ్యతనే యాయన వహించును. అది లేనిచో నుదాసీనుడుగ నుండును. కాని దీర్ఘ జ్వర పీడితునకు వాని కా జ్వరము తగ్గి యాకలి పుట్టి యన్నము నడిగినగాని పెట్టుటకు వైద్యు లంగీ కరించనటుల సంసారతాపపీడితులను ఈ సంబంధమును గుర్తించి రక్షణ నపేక్షించినవారినే యాయన రక్షించును. కాని ప్రజలు ఈ సంబంధములను మరచి తాము భగవంతునకు పరతంత్రుల మను మాటయే తెలియక స్వేచ్ఛాసంచారులగుటచే భగవంతుడును వారినుపేక్షించి ప్రశాంతముగా నప్పిన్నపిరాట్టియొక్క వక్షఃస్థలముపై పవళించి నిశ్చింతముగా నుండెను. అందువలన ప్రజలు అష్ట కష్టముల ననుభవించుచుండిరి, మన ఆండాళ్తల్లి దయామయురాలగుటచేతను ప్రజలను రక్షించు టకే అవతరించిన తల్లి యగుటచేతను పరమాత్మ చెంత కేతెంచి ఆయనకు చేతనులతో గల నవవిధ సంబంధములను విన్నవించి, వారిని రక్షించి భారమాతనిదే యని తెలిపి ప్రజలను రక్షించుమని ప్రార్థించెను.భగవానుడు తనకు వశుడగుటకై తాను ధరించి విడచిన మాలికతో నాయనను వశపరచుకొని

తన ప్రార్థన నాతడు కాదనకుండునట్లు మొగమాటపరచి వీరిని రక్షింపజేసెను. అట్టి మహోపకార మొనరించిన యా తల్లికెన్ని వందనము లర్పించినను మనమా ఋణవిముక్తులము కాజాలము. కావున శ్రీపరాశరభట్టరు వారు భక్తిపారవశ్యముచే పరశ్శతప్రణామము లర్పించుచున్నారు.

## — వేదాంతార్థము —

### నీళాతుఙ్గస్తనగిరి తటీ సుప్తం -

వేదాంతపరమగు నర్థమున 'స్తన' మనగా భక్తి. 'గిరి' యనగా అచలము. 'స్తనగిరి' యను టచే నిశ్చలమైన భక్తి యని యర్థము. ఆ భక్తికి 'తుంగ' యను విశేషణముండుటచే భగవత్ప్రాప్తికి గల యుపాయము లన్నిటికంటెను ఈ భక్తి సర్వోత్కృష్టమైనదని తెలియుచున్నది. ఈ భక్తి యెవ రిది? 'నీళా'- నప్పిన్న పిరాట్టివలె "ప్రియో హి జ్ఞానినో ఽ త్యర్థమహం, స చ మమ ప్రియః" సర్వజ్ఞ డును, సర్వశక్తి గలవాడును నగు భగవంతునకును (అత్యర్థ) చెప్పజాలనంత ప్రేమగల భక్తునిది.

### సు ప్తం -

మైమరచునంతటి వ్యామోహము. మైమరచుట యనగా - రాధ 'అచ్యుత దత్త చిత్తయై శూన్య ఘటమున పెరుగును చిలుకునట్లును, శ్రీకృష్ణుడు ఆమె భక్తికి పరవశుడై పాలు పితుకుటకు ఎద్దు చెంతకు చేరునట్లును ఉండుటయే.

### కృష్ణం ఉద్బోధయ్‌ -

భగవంతునకు చేతనులతో గల స్వస్వామి భావ సంబంధమును, రక్ష్య రక్షకభావ సంబంధ మును జ్ఞాపక మొనర్చుట. ఈ సంబంధములు చేతనుని స్వత్వమును, భగవంతుని స్వామిత్వమును తెలుపున వగుటచే "విధినిర్మిత మేత దన్వయం భగవన్పాలయ" అని తెలుపుటయే.

### అ ధ్యా ప యం తీ -

వాస్తవముగా 'అధ్యాపన' మనగా గురూచ్చారణానుచ్చారణమే. అనగా వేదవాక్యములను ఆచార్యు డొకమారుపదేశించగా శిష్యుడు దానిని రెండు మార్లు చ్చరించుట. "వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యః" "వేదాన్తకృ ద్వేదవిదేవ చాహం" - వేదవిత్ అహ మేవ – వేదము నెరింగినవాడను నేనొక్క డనే, అను భగవంతునకు గూడ ఆండాళ్ తల్లి సంతచెప్పవలసినంత యవసరము మనము కలుగ జేసితిమి.

శ్రీకృష్ణుని విద్యాభ్యాసావస్థలో యశోదాదేవి తన మాటను వినిపించుకొనక ఆటలకు మరగి పారిపోవుచున్న శ్రీకృష్ణుని గట్టిగా పట్టుకొని “కృష్ణ! త్వం పఠ” అనగనే శ్రీకృష్ణుడు “అమ్మా! ఈ చదువున కేమి ఫలము?” అని యడుగగా ఆ తల్లి “ముక్తిరేవ” అనెను. దానిని విని “అమ్మా! నేను నా స్వగృహమున (పరమపదమున) నిత్యముక్తుల చదువులు విని విని విసుగెత్తి పాలు, పెరుగు, మీగడ, వెన్న, నెయ్యి మొదలగు పదార్థముల ననుభవించుటకు ఇచ్చటికి వచ్చినను నీ వా విద్యోపదేశముతోనే నన్ను విసిగించుచున్నావు. “అస్తు తే” ఆ ముక్తిని నీవే తీసికొనుము. నేను “దధ్యాదీని భజామి” అని చెంగున విదలించుకొని పారిపోయెను. ఈ కథను వినిన మన ఆండాళ్ తల్లి యీతనిని కట్టిపెట్టిన గాని అధ్యాపనము సాగదని తలంచి “స్వోచ్ఛిష్టాయాం స్రజి నిగళితం” ఇంక అచ్చట నేమియు దొరకకనో, అట్టి త్రాడు తంకరలతో కట్టుట కిష్టము లేకనో అటునిటు చూచి తాను మెడలో ధరించియున్న మాలతో ఆతనిని కదలకుండ కట్టిపెట్టి “పారార్థ్యం స్వం శ్రుతిశతశిర స్సిద్ధ మధ్యాపయన్తీ” అని తన యధ్యాపనమును సాగించినదట.

ఇంత యుపకారము చేసిన యా తల్లిని తనివితీర సేవించకుండ నుండగలమా ?.

— తనియ —

అన్నవయల్ పుదువై యాణ్డాళ్ అరఙ్గర్కు
ప్పన్ను తిరుప్పావై ప్పల్ పదియమ్, ఇన్నిశైయాల్
పాడిక్కొడుత్తాళ్ నఱ్పామాలై, పూమాలై
శూడిక్కొడుత్తాళై చ్చొల్లు.

— తాత్పర్యము —

హంసలు నడయాడు జల సమృద్ధిగల దగుటచే సస్య సమృద్ధిగల శ్రీవిల్లిబుత్తూరునం దవతరించిన ఆండాళ్ తల్లి శ్రీరంగనాథుని విషయమై విమర్శించి పాయించిన శ్రావ్యములగు విలక్షణములైన రాగములతో నిండిన తిరుప్పావై పాశురముల మాలతో బాటు పరిమళమే నిరూపకముగా గల పూలతో గుచ్చబడిన పూమాలను తన కొప్పున ధరించి సమర్పించెను, అట్టి ఆండాళ్ తల్లిని అనుసంధింపుడు.

— విశేషార్థము —

తిరుప్పావైలోని పదునెనిమిదవ పాశురమున “మాతవి పన్దల్ మేల్ పలకాల్ కుయిలినఙ్గళ్ కూవినకాణ్” “మాధవి పందిరిమీద కోకిలసంఘములు అనేకమారులు కూయుచున్నవి సుమా” అను వాక్య

మున "ఈ కోకిలలకు నీవు ఆచార్య కోటిలో చేరియున్నావు. నీ యొద్ద కోకిలలు మృదుమధురగాన కౌశలమును అభ్యసించుటకై ప్రతి దినము నీ జాజి పందిరిపై వేచియుండును. వానికి నీ దర్శనము, నీ మాటల ననుభవించుటయు లభించక నోరెండిపోవునటుల కూయుచున్నవి." వీని స్వరమున కీ మాధుర్య మెట్లబ్బిన దనగా దీనికి మూలకారణము అండాళ్ తల్లి యొక్క మధురగాన శిక్షణమే.

వాఙ్మాధుర్యాత్ సర్వలోక ప్రియత్వం
వాక్పారుష్యాత్ సర్వలోకా ప్రియత్వమ్ ।
కో వా లోకే కోకిలే నో పకారః ?
కో వా లోకే వాయసే నా పకారః ?"

అటులనే గానములో కోకిలలకువలెనే, నడకలో హంసలకు గమన సౌందర్యము కవులచే వర్ణింపబడుచున్నది. ఆ సౌందర్యము వాని కెట్లు వచ్చినదనగా

## అన్నవయల్ పుదువై ఆండాళ్ అరఙ్గఱ్కు -

నప్పిన్న పిరాట్టియొక్క జాజి పందిరియందు కోకిలగుంపులవలె మన ఆండాళ్ తల్లి యొద్ద గమన చాతుర్యమును బడయుటకై యా తల్లి యవతరించిన శ్రీవిల్లిబుత్తూరు నందలి పొలములలో సంచరించు హంసలు ఆమె వేళకు వచ్చి ఆమె యొద్ద నడకసౌందర్యము నభ్యసించుచుండునట!

## అరఙ్గఱ్కు ప్పన్ను తిరుప్పావై ......... పాడికొ్కాడు త్తాళ్ -

ఈ తనియలో పుండరీకాక్షులు, ఈ తిరుప్పావై దివ్య ప్రబంధమును శ్రీరంగనాథుని గూర్చి పాయించిన తిరుప్పావై యని పాయించిరి గదా ! ఆండాళ్ తల్లి తిరుప్పావు పాడినది శ్రీకృష్ణుని గురించి యని యీ ప్రబంధములో తెలియుచున్నది. ప్రాప్యనిష్కర్షను తెలుపు "శిత్తం శిఱుకాలే" అను 29వ పాశురమున

"పెత్తమ్ మేయ్త్తుణ్ణుఙ్కులత్తిల్ పిఱన్దు ............... గోవిన్దా ...............
ఉన్దన్నోడుత్తో మేయావో మునక్కే నామాట్చెయ్ వోమ్"

పశువులను మేపి జీవించు కులమునందు పుట్టి అనియు, నీతోనే సంబంధము కలవార మగుదుముగాక! నీకే కైంకర్యము చేయుదుము గాక! అనియు కృష్ణ విషయమయ్యే కదా ప్రాప్య నిష్కర్ష చేయుచున్నారు! అట్టి తరి "అరఙ్గఱ్కు ............ పాడికొ్కడుత్తాళ్" అనునది యెట్లు సంగతమగుచున్నది? అనగా —

అండాళ్ తల్లి శ్రీవిల్లిపుత్తూరులో వేంచేసియుండి పుష్ప మాలలు కట్టి సమర్పించి యారాధించినది వటపత్రశాయి పెరుమాళ్లను. "రఙ్గేశం సున్దరవరం వరయామాస సున్దరీ"అని భర్తగా వరించినది శ్రీరంగనాథుని. ధనుర్మాసవ్రత మాచరించుచు "రఙ్గేశం పూజయామాస విధినా నియత వ్రతా" తానాచరించిన ధనుర్మాసవ్రతమున కారాధ్యునిగా నియమించుకొన్నదియు శ్రీరంగనాథునే. "చకార పాణి గ్రహణం గోదాదేవ్యా శ్శ్రియఃపతిః" అని యామెను వివాహము చేసికున్నది రంగనాథుడు. "శూడిక్కొడుత్త ......" అను తనియలో శ్రీ పుండరీకాక్షులు "అమ్మా! నీవు "వేఙ్గడవఱ్కెన్నైవిది యెన్ఱ విణ్ణప్పమ్, నాఙ్కడవా వణ్ణమే నల్గు" శ్రీనివాసునకే కైంకర్యము చేయునటుల విధింపుము అని ప్రార్థించిన ప్రార్థనను నెనెప్పుడును తప్పనట్లనుగ్రహింపు"మని ప్రార్థించిరి ఈ ప్రమాణములను పురస్కరించుకొని శ్రీ అండాళ్ తల్లి ప్రేమించి పెండ్లాడినది శ్రీకృష్ణునా? శ్రీనివాసునా? శ్రీరంగనాథునా? అని యుదయించునట్టి భిన్న భిన్న భావములకు ఒకటియే సమాధానము కాన్పించుచున్నది. ఎన్ని రూపములు మారినను అన్నిటికిని ధర్మి ఒక్క శ్రీమన్నారాయణుడే కదా! అవతార మూర్తియగు శ్రీకృష్ణుడైనను, అర్చామూర్తియగు వటపత్రశాయి యైనను, శ్రీనివాసుడైనను, శ్రీరంగనాథుడైనను అసలు మూర్తి నారాయణు డొక్కడే కదా! "ఉద్ధృతాసి వరాహేణ కృష్ణేన శతబాహునా" అను తైత్తిరీయ నారాయణో పనిషత్తులోని మృత్తికను స్వీకరించు నీ మంత్రమున, భూమి నుద్ధరించిన వరాహునకును, శ్రీకృష్ణునకును అభేదాన్వయము గోచరించు సామానాధికరణ్య మెట్లు ఘటించు ననగా- ఈ కృష్ణ శబ్దమునకు "కృషి ర్భూర్వాచక శ్శబ్దః, ణశ్చ నిర్వృతి వాచకః" అనగా కృష్ అనగా అపరిమితము, 'ణ' అనగా సుఖము- అనగా- నిరవచ్ఛిన్న సుఖ స్వరూపుడని వ్యుత్పత్త్యర్థము. ఈ యర్థము వరాహుని యందును, వట పత్రశాయి యందును, కృష్ణుని యందును, శ్రీనివాసుని యందును, శ్రీరంగనాథుని యందును సమన్వయ మగుట కాక్షేప మేమున్నది? "రసో వై సః" అనునటుల వారు మూర్తీభవించిన ఆనంద స్వరూపులే గదా! పూమాలను ఒకరికి సమర్పించినది, పామాలను (తిరుప్పావును) మరియొకరికి సమర్పించినది. ఇందు విరోధ మేమున్నది?

అండాళ్లు తల్లి భూదేవియొక్క అవతారముగా పూర్వాచార్యులు భావించుచున్నారు. కృష్ణావతారమును ముగించుకొని యా యవతారమునందు తాను చేయదగినంత లోకోద్ధరణను చేయలేక పోవుటచే చిన్నబుచ్చుకొని శ్రీమన్నారాయణుడు శేషతల్పమునందు పరుండియుండగా భూదేవి చూచి కారణము నారసి, కల్పారంభమున భగవానుడు ప్రజ లుజ్జీవించుటకై "సహ యజ్ఞైః ప్రజాః సృష్ట్వా" అనునటుల తనను గురించి కీర్తనము, ప్రపదనము, ప్రసూనార్పణము అను సర్వసాధారణములును, సుఖోత్తరములునునగువానిని విధించెను గదా! వానిని "సర్వేషాం ప్రకటం విధాతు మనిశం శ్రీధన్వినవ్యే పురే జాతాం" అనునట్లు శ్రీవిల్లిపుత్తూరున నవతరించినది. కావుననే యీ మూడు పనులను

ఠానాచరించి ప్రజల కాదర్శప్రాయ యగుటకై పెరియాళ్వార్ల పట్టిగా పెరిగెను. ఈ యవతారమునకు ముఖ్యప్రయోజనము భగవద్గుణ కీర్తనమే. దానిని తిరుప్పావై ప్రబంధమునే అనేకావృత్తులుగ నుపదేశించెను.

— తనియ —

శూడిక్కొడుత్త శుడర్ క్కొడియే, తొల్ పావై
పాడి యరుళవల్ల పల్ వళైయాయ్, నాడినీ
వేఙ్గడవఱ్కెన్నై విది యెన్ఱ విమ్మాఱ్ఱమ్,
నాఙ్గడవా వణ్ణమే నల్గు.

— తాత్పర్యము —

దీనియందు పూమాలను తానుధరించి సమర్పించిన రీతినిన్ని, తిరుప్పావై పాశురములను పాడి సమర్పించిన రీతినిన్ని చెప్పి శ్రీనివాసు నుద్దేశించి సాయించిన యీ తిరుప్పావై యర్థములను మేము దాటిపోకుండునట్లు కృపజేయుమని ఆండాళ్ తల్లిని ప్రార్థించుచున్నారు.

"ఓ ఆండాళ్ తల్లీ! నీవు ధరించి విడచిన పూలదండను సర్వేశ్వరునకు సమర్పించిన ఉత్తమ స్త్రీ రత్నమవు. ఆయన అనుగ్రహముచేతనే అనాద్యనుష్ఠానపరంపగా పెద్దలాచరించుచు వచ్చుచున్న తిరుప్పావై ప్రబంధమును సాయించగల శక్తిని భగవంతుడు ప్రసాదించగా లోకము నుద్ధరించుటకై సాయించితివి. అనేక కంకణములతో నలంకరించబడిన శ్రీహస్తములు కలదానా! నీవు మన్మథుని "నన్ను శ్రీనివాసునకే దాసి నగునట్లుగా విధింపుము" అని ప్రార్థించిన ప్రార్థనను మేముకూడ ఎల్లప్పుడును తప్పునట్లుగ కృపజేయుము."

— విశేషార్థము —

శూడిక్కొడుత్త = తాను ధరించి సమర్పించిన.

భాగవతశేషము భగవంతునకు ప్రియతమము. కావుననే శ్రీకృష్ణబలరాములు మధురకు వేంచేసినపుడు కంసునకు చందనము తీసికొనిపోవుచున్న కుబ్జను సిలిపి శ్రీకృష్ణుడు చందనము నిమ్మని కోరుటలో నెన్నిరకముల చందనముల చూపించినను స్వీకరించక "దీయతా మనులేపనం" అని కోరెను. దీనికి మన పూర్వాచార్యు లొక రసవత్తరమైన అర్థమును నెప్పుచురు. అను + లేపనం. అను = పశ్చాత్; నీవు ముందుగా నీ దేహమునకు చందనమును రాసుకొని పిమ్మట మాకొసంగుము- అని యడిగెనని సాయింతురు. శ్రీకృష్ణు డిట్లు ప్రార్థించి లభించుటచే భాగవతస్పర్శగల ద్రవ్యము నందు భగవంతునకుగల వ్యామోహము వ్యక్తమగుచున్నది. తన యింట పాలు, పెరుగు, వెన్న,

నెయ్యి మొదలగు పదార్థముల నేలోటును లేకున్నను శ్రీకృష్ణుని కవి సొక్కక భగవద్గుణాను సంధాన ముతో తయారు చేసిన గోపికా గృహములోని యా పదార్థములనే వారు కట్టినను, కొట్టినను. తిట్టినను, మొట్టినను లక్ష్యపెట్టక దొంగిలించియే తినుచుండెను. అటులనే ఉత్తమ స్త్రీ లక్షణములతో నలరారు చున్న మన ఆండాళ్ తల్లియొక్క కేశస్పర్శయు, దేహస్పర్శయుగల మాలికలనే అపూర్వవస్తులాభ ముగా స్వీకరించుచుండెను.

## శుడర్ క్కొడియే -

కొడి యనగా తీగ. తీగ వృక్షము నవలంబించియే పెరుగునటుల ఆండాళ్ తల్లియు పరమాత్మ యొక్క విశ్లేషమును సహింపలేక యాయన నవలంబించియే నిలచినది. దీనివలన నామెకుగల భగవత్పారతంత్ర్యము తెలియుచున్నది. ఈ 'కొడి' కి 'శుడర్' అను విశేషణమును చేర్చుటచే ఫలాంత రముల నపేక్షించు భక్తులకును భగవంతుని విషయమై పారతంత్ర్యమున్నను అది ఫలము చేజిక్కు వరకునే యగుటచే ఆండాళ్ తల్లియొక్క పారతంత్ర్యము యావదాత్మభావియని తెలియుచున్నది.

## తొల్ పావై ।

తొల్ పావై యనుటచే 'శ్రుతిశతశిరస్సిద్ధం' అనునట్లుగా నిది యుపనిషత్సిద్ధమని తెలియు చున్నది

## పల్ వళై యాయ్ -

అనుటచే చేతిక ధరించు ఆభరణములని యర్థము తెలియుచున్నది. వేదాంతపరమగు అర్థములో చేయి యనగా "జ్ఞాన కైక్కొ తా" జ్ఞానమని యర్థము. చేతికి కంకణములువలె జ్ఞానమునకును మంత్రత్రయార్థజ్ఞానము, తత్త్వత్రయార్థజ్ఞానము, అర్థపంచకజ్ఞానము మొదలైనవి ప్రకాశకములు.

## ఎన్నై వేఙ్గడవఱ్కు విది -

నన్ను శ్రీనివాసునకు భార్యనుగా చేయుము - అని మన్మథుని ప్రార్థించుచున్నది. దేవతాం తర భజనమే పనికిరాని ఆండాళ్ తల్లికి ఈ మన్మథప్రార్థన తగునా? యనగా - నమ్మాళ్వారును, తిరుమంగై యాళ్వారును మడల్ గ్రహణమొనరించినట్లుగ నిది ప్రాప్యత్వరను సూచించు కార్యమగు టచే నీ విషయమును తిరువాయ్ మొళి ప్రబంధమునందు "తీర్ప్పారై యామిని" (4-6-1) అను పాశురావతారికలో విపులముగా విమర్శించిరి. ఇది యొక ప్రాప్యత్వరాసూచకమగుటచే భగవంతున కెంతయో ప్రియకరమని వ్యాఖ్యాకారులు వివరించియున్నారు. చేతనునకు భగవంతునితోగల తొమ్మిది సంబంధములలో భార్యాభర్తృసంబంధమున్నూ యొకటి యగుటచే భగవంతుడు భరించువాడుగను, తానాయనచే భరింపబడువానిగను తెలుపు సంబంధమగుటచే దీని నందరును అనుసంధింప వచ్చును.

# తిరుప్పావై అవతారిక

ఈ అవతారికలో పెరియవాచ్చాన్పిళ్ళైగారు ఈ ప్రబంధమును ప్రసాదించిన ఆండాళ్‌తల్లి యొక్క వైలక్షణ్యమును, ప్రబంధ వైలక్షణ్యమును, ఇందలి విషయవైలక్షణ్యమును సాయించు చున్నారు

ఆత్మస్వరూపమునే యెరుంగని సంసారులకన్నను ఋషులు మిన్న. వారికన్నను ఆళ్వారులు మిన్న. వారికన్నను ఆండాళ్ తల్లి మిన్న. అందులకు కారణము ఒక ధనిక కుటుంబమునందు పది మంది సోదరులు కలరు. వారి కపారముగా ధనము కలదు. అందు తొమ్మిది మందికి సంతానము లేదు. ఒక్కరికి మాత్రము ఒకే ఆడ శిశువు కలదు. ఇది యొక అవిభక్త కుటుంబము. కావున నీ పదిమంది ధనసంపత్తియు నా యొక ఆడబిడ్డకే చెందునటుల జ్ఞానధనాఢ్యులగు పదుగురాళ్వారులలో, ఎటుల సంప్రాప్తించిన నేమి గాని, బిడ్డయనదగు నీ యాండాళ్ తల్లి పెరియాళ్వార్ల పట్టియై పెరుగు చుండుటచే నా యాళ్వార్లందరి జ్ఞాన సంపద యంతయు నీమె కొక్కతికే సంక్రమించిన దగుటచే నీమె కీ యౌన్నత్యము సిద్ధించినది.

ఒక పురుషు నింకొక పురుషుడు ప్రేమించుట కంటె ఒక స్త్రీ యొక పురుషుని ప్రేమించుట సరళమగుటచే ఆళ్వార్లందరి కంటెను పెరుమాళ్ల విషయమై ఆండాళ్‌తల్లికి చరమావధియగు పరమభక్తి యధికము. కావున నీ తల్లి మార్గశిరమాసస్నానమను నొక మిషను కల్పించి, దానికి నోము అను నొక పేరు పెట్టి ఆ మిషగా భగవంతుని సన్నిధి కేగి "నీకు యథేష్ట వినియోగార్హమగు నీ యాత్మ అనర్థములకు పాల్పడకుండగ జేసి దీని స్వరూపమునకు తగిన కైంకర్యమును ఆత్మ యున్నంత వరకు స్థిరముగా నుండునట్లు కృపజేయు మనుచున్నారు.

ఈ నోమునకు ప్రమాణ విచారము -

"య శ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః ।
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాంగతిమ్॥"

శాస్త్రమున చెప్పబడిన కర్మలను శాస్త్రవిధి తప్పి చేసినను, శాస్త్రమున చెప్పబడని కర్మల నెంతయో శ్రద్ధగా నాచరించినను ఆ కర్మలకు ఫలము గాని, సుఖము గాని, మోక్షము గాని బడయ నేరరు అని యుండుటచే ఈ నోమునకు ప్రమాణ మేమనగా —

మీమాంసాశాస్త్రమున "హోలాధి కరణన్యాయ" మని యొక న్యాయము కలదు. "హోల" యనగా వసంతోత్సవము. దీనిని "హోలాహ" మనియు చెప్పుదురు. ఫాల్గుణ కృష్ణ పాడ్యమినాడు దీని నాచరింతురు. ఇంకొకరిపై నొకరు వసంతమును జల్లుకొందురు. ఇదియే యీ వ్రతమునకు ప్రమాణము.

ఉపనిషత్తులో "యే తత్ర బ్రాహ్మణా స్సమ్మర్శినః ......... యథా తే తత్ర వర్తేరన్ । తథా తత్ర వర్తేథాః" గృహస్థాశ్రమములో నుండగా నొక కర్మను చేయవచ్చునా? చేయరాదా? ఎట్లు చేయవలెను? అను సందేహము కలిగినప్పుడు మంచిచెడ్డల నెరింగి నట్టియు, అర్థకాములు గాక ధర్మకాములైనట్టియు పెద్దలు ఆ సందర్భములో నెట్లు వర్తింతురో నీవును నట్లే వర్తింపు మనియు, భగవానుడు భగవద్గీతలో "యద్య దాచరతి శ్రేష్ఠః । తత్తదేవే తరో జనః" శిష్టులుగా పరిగణింపబడువారు అట్టి సమయములలో ప్రవర్తించు విధమును గమనించి యట్లే చేయవలెననియు చెప్పుటచే నిది శిష్టాచారమే.

దీనినే ఆండాళ్ తల్లి తిరుప్పావైలోని 26వ పాశురమున "మేలైయార్ శెయ్‌వన గళ్ వేణ్డువన కేట్టియేల్" పూర్వులాచరించినవని సాయించిరి.

ఈమెకు వివాహవయస్సు రాగానే పెరియాళ్వార్లీమెకు తగిన వరు నన్వేషించుటలో వ్యగ్రచిత్తులై యుండగా నామె తండ్రిగారితో "భగవన్తం వినా నాన్యం । వృణే ఽ భీష్టం పిత! స్సతీ । మా శోకం కురు ధర్మజ్ఞ! మదర్థం రక్షకో హరిః॥" "నాయన గారూ! నేను భగవంతునే పెండ్లాడుదును. నా కాతడే రక్షకుడు. మీరు నా విషయమై నిశ్చింతగా నుండు"డని చెప్పి యోదార్చెను. అంత నా విష్ణుచిత్తులు దివ్యదేశములలో నున్న మూర్తులను వివరించగా నామె శ్రీరంగనాథుని భర్తగా వరించెను.

అంత నామె తండ్రిగారు తనకు వినిపించు శ్రీమద్భాగవతమున గోకులమందలి గోపాంగన లందరును కలసి హేమంతర్తువునందు మార్గశిరమాసమున కాత్యాయనీ వ్రతము నాచరించి శ్రీకృష్ణుని అనుగ్రహపాత్రులై అభీష్టమును బడసిన వృత్తాంతము నెరింగి తానును అటులనే యాచరించ గోరి శ్రీ విల్లిబుత్తూరునే గోకులముగను, వట పత్రశాయి కోవెలనే నందగోపుని భవనముగను, గర్భాలయమున వేంచేసియున్న వటపత్రశాయినే శ్రీకృష్ణుని గను భావించి యీ ధనుర్మాసవ్రతము నాచరించెను.

— ఆండాళ్ తల్లి యనుష్ఠించిన ధనుర్మాసవ్రత విధానము —

తన యింటనే శ్రీరంగనాయకుని విగ్రహమునుంచుకొని బ్రాహ్మీముహూర్తమునందు "రంగా, రంగా" యని మేల్కొని స్నానమాచరించి తెల్లని శుభ్రవస్త్రమును, ఊర్ధ్వ పుండ్రమును ధరించి తన

రంగనాథ విగ్రహమును పీతాంబరముతోను, భూషణములతోను అలంకరించి షోడశోపచారముల శాస్త్రోక్తముగ జరుపును. పిమ్మట వ్యంజనములతో శర్కరపొంగలిని భక్తితో నైవేద్యము గావించి, తాంబూలము సమర్పించి, ద్రావిడభాషలో దినమున కొక పాశురము చొప్పున వ్రాసి కర్పూరహారతితో విన్నవించుచు శ్రీరంగనాథునకు ప్రదక్షిణ నమస్కారముల నొనరించి చేతులు జోడించి, నిలిచి, తన కోరికను నిశ్చల చిత్తముతో, వినయ ముట్టి పడునట్లు విన్నవించుచుండెడిది. భగవంతుని ప్రీతికై ప్రతి దినమునను భాగవత తదీయారాధనమును సలుపుచుండెడిది. తాను మాత్రము భగవంతునకు నివేదించిన కట్టుపొంగలి (పులగము) ని మాత్రము ఒక్కమారు మాత్రమే యారగించి యొక నెల రోజు లీ వ్రతము నొనర్చెను. ఇట్లు విన్నవించిన ముప్పది పాశురములే తిరుప్పావై దివ్య ప్రబంధ మైనది.

ఈ వ్రతము ననుష్ఠించు మనమున్ను ఈ క్రింది నియమములను పాటించవలసియున్నది. —

1. ఈ నెల దినములును క్షురకర్మను, అభ్యంగనమును విడచి, బ్రహ్మచర్యవ్రతమును పాటించుచు, నేలపై పరుండవలెను.

2. గ్రామాంతర సంచారమును విడువవలెను,

3. ప్రసాదప్రతిపత్తికై నివేదించిన భోగములలో నొక కణమును మాత్రమే స్వీకరించవలెను. ఆయా విశేష పాశురముల రోజులలో విశేషభోగముల జేసి ఆరగింపు చేసినను కట్టుపొంగలిని మాత్రము తప్పక చేసి దానిని నివేదించి దానినే ఆహారముగా నొక్కసారి మాత్రమే స్వీకరించవలెను. విశేషభోగములను భక్తులకు వినియోగించవలెను.

4. ఆరాధన అయిన పిమ్మట గోదాఅష్టోత్తరశతనామావళితో పూజ చేయవలెను,

5. పిమ్మట ధూపదీపములర్పించి హవిస్సు నివేదించవలెను.

6. పిమ్మట హారతినిచ్చి తిరుప్పళ్లి యెళుచ్చి, తిరుప్పావై ప్రబంధములను మున్నడిపిన్నడిగా శ్రావ్యముగా సేవాకాలము చేయవలెను.

7. తిరిగి విశేషభోగమును నివేదించి, మంగళాశాసనమును గావించవలెను.

8. తర్వాత తిరుప్పావై శాత్తుమరై పాశురముల రెండింటిని ఒక్కొక్కటి రెండేసిసార్లు విన్నవించవలెను.

9. ఆపై ఆనాటి పాశురమును రెండుసార్లు కర్పూరహారతితో విన్నవించవలెను.

10. ఆటుపిమ్మట గోదా తిరునక్షత్ర తనియను, "నీళాతుంగ...." అను తనియను హారతితో విన్నవింపవలెను.

11. తరువాత "కఱ్పైపిఱక్కప్పూర్" "తిరువాడి పూరత్తిల్" అను రెండు వాళ్తిరునామములను అనుసంధించి ఆటుపిమ్మట "సర్వదేశ దశాకాలేషు" అనెడు శాత్తుముఱై తనియనుల ననుసంధింపవలెను.

12. ఆటుపిమ్మట గోదాచతుశ్శ్లోకిని విన్నవించవలెను.

## ధనుర్మాసవ్రత మూలకారణము

భగవదవతారములలో అరవతారములు లోకమునకు హెచ్చుగా నుపయోగించునవి కాలేదు. రామ కృష్ణావతారములు రెండు మాత్రమే యొకటి అనుష్ఠానము మూలముగను, రెండవది యుపదేశము మూలముగను మన కుపయోగించు నవతారములు. శ్రీరామావతారములో లేని సౌలభ్యపూర్తికై శ్రీకృష్ణావతారమును నారాయణుడు స్వీకరించెను. అందుచే కృష్ణుడు మథురలో నవతరించినను అప్పటికప్పుడు గోకులమున కేగి తన సౌందర్యగుణచేష్టాదులచే నచ్చట నున్న పెక్కుమంది ఆడపిల్లలను వశపరచుకొని వారితో కలసి పెరుగుచున్న సమయమున వారు తనతో సమానమగు యవ్వనమును లభించియుండగా శ్రీకృష్ణుని శృంగారచేష్టలను గోపవృద్ధులు సహించజాలక, అతని నడ్డజాలక వారినందరను నేల మాళ్యములో దాచియుంచి కృష్ణునితో కలియనీయకుండిరి. అంత శ్రీకృష్ణుడు పర్జన్యాదుల సమర్థుడగుటచే వర్షము కురియకుండ జేసెను. దానిచే పశువులకును, మనుష్యులకును జీవితము దుర్ఘట మయ్యెను. గోపవృద్ధులు కన్నెపిల్లలచే నోము నోపించిన వర్షము కురియు నను నమ్మకముతో, నా దాచియుంచిన కన్యకల నందరను తీసికొని కృష్ణుని చెంత కేతెంచి వర్షపాతమునకు మూలమగు నోమును ఈ పిల్లలచే నోపించు మని నిర్బంధించిరి. అంత నాతడు దాని కంగీకరించి వారలతో "బ్రాహ్మీముహూర్తమున మీరందరును వచ్చినచో ఆ వ్రతమునకు కావలసిన సన్నిధానము నంతను సమకూర్తును. నన్ను స్నానమునకై లేపి తీసికొనిపొండు" అని సెలవిచ్చెను. గోపికలును అతికష్టముపై తమ గృహములఁ జేరి పరున్నను నిద్రపట్టక, కృష్ణగుణచేష్టితములను తలంచుకొని, లేవజాలక పరున్నవారి నొక్కొక్కరినే లేపుకొనుచు బ్రాహ్మీముహూర్తమునకు శ్రీకృష్ణుని భవనమునకు జేరి వరుసగా శ్రీకృష్ణుని లేపి, కావలసిన దానిని లభించి వ్రతమును ముగించుచున్నారు.

❁ ❁ ❁ ❁

## మొదటి పాశురము

## "మార్గళి త్తిజ్గళ్"

మార్గళి త్తిజ్గళ్ మదినిఱైన్ద నన్నాళాల్
నీరాడప్పోదువీర్ పోదుమినో నేరిళైయీర్
శీర్మల్గు మాయ్ప్పాడి చ్చెల్వచ్చిఱుమీర్గాళ్
కూర్వేల్కొడుం దొళిలన్ నన్దగోపన్ కుమరన్
ఏరార్న్దకణ్ణి యశోదై యిళఞ్జిజ్గమ్
కార్మేని చ్చెజ్గణ్ కదిర్మదియమ్పోల్ ముగత్తాన్
నారాయణనే నమక్కే పఱై తరువాన్
పారోర్ పుగళ ప్పడి న్దేలోరెమ్బావాయ్.

— తాత్పర్యము —

విలక్షణములైన బహువిధములగు ఆభరణములను ధరించి సంపన్నమగు గోకులములో నివసించు భాగ్యవతులగు నో బాలికలారా ! మార్గశిరమాసమున నిండారు వెన్నెల గల మంచిరోజు లాసన్నమైనవి గదా! వాడియగు బల్లెము నాయుధముగా గొని మన కృష్ణున కపకారము చేసినవారిని తీవ్రముగా దండించి మనలను కాపాడెడు నందగోపునకు విధేయుడైన కుమారుడును, సహజముగనే సుందరములగు నేత్రములకు మంగళార్థమై కాటుకను పెట్టుకొని అలంకరించుకొనియుండు మన యశోదాదేవి చేతిలో సింహపు పిల్లవలె పెరుగుచున్నట్టియు, నల్లని శరీరము, ఎర్రని కండ్లు, అను కూలురకు చంద్రుని వలె ఆహ్లాదకరముగను, ప్రతికూలురకు సూర్యుని వలె తేజస్సు గల ముఖమును గల నారాయణుడే, అనన్యార్హశేషభూతలమగు మనకే నోమునకు వలయు పరికరముల నొసంగ సంసిద్ధుడై యున్నాడు కావున జాగుచేయక యీ నోమునం దన్వయించి దాని కంగముగా స్నానమాడ గోరువారందరు వెంటనే రండు.

## — విశేషార్థము —

మార్గళి తింగళ్ -

సమశీతముగా నుండు కాలము. దేవతలకు ఉత్తరాయణము పగలును, దక్షిణాయనము రాత్రియు నని గణన కలదు. ఇది ఉత్తరాయణమునకు సన్నిహిత పూర్వ మాసమగుటచే ఉత్తరాయణమునకు బ్రాహ్మముహూర్తము వంటిది. భగవంతుడు గీతలో "మాసానాం మార్గశీర్షోఽహం" అని సాయించినట్లు ఇది భగవంతుని యూర్జిత పదార్థములలో నొకటి యగుచున్నది. కేశవాది యుప వ్యూహములలో మొదటివాడగు కేశవుడు అధిష్ఠానముగా గల వైష్ణవమాసము. సస్యము లన్నియును అంకురించి, పుష్పించి, ఫలించు కాలమగుటచే గోపికలయొక్క వికాసమునకును తగినకాలము. గోపికల స్వేచ్ఛావిహారము నడ్డునట్టి ముదుసలులు ఆ మాత్రపు చలికే భయపడి బైటికి రాజాలని కాలము.

పరమపద సౌధము నధిరోహించుటకై 'ప్రమేయశేఖర' మను రహస్యగ్రంథమున జెప్పబడిన సోపాన పరంపరలో రెండవది ఆభిముఖ్యము. అనగా, భగవద్భాగవతు లన్నచో అనుకూల బుద్ధిని కలిగియుండుట. ఇది అద్వేషము వలన జన్మించును. అద్వేష మనగా భగవంతుడన్నను, భగవద్భక్తులన్నను గిట్టకపోవుట లేకుండుట. ఇట్టి యాభిముఖ్యము జనించుట మానవుని జీవితములో సుప్రభాతము. అట్టి సమయ మాసన్నమగుట పెన్నిధి లభించినటులనే. ఇది క్రమముగా పరమప్రాప్యమగు అర్చామూర్తియొక్క కైంకర్య భాగ్యమును ప్రసాదించును. ఇట్టి తరి ప్రశంసించవలసినది ముఖ్యముగ కాలమునే. ఇందులకు శ్రీరామాయణము నందలి "చైత్ర శ్శ్రీమా నయం మాసః పుణ్యః పుష్పితకాననః" అను శ్లోకమే మనకు ప్రమాణము. శ్రీరామ పట్టాభిషేకమును తలపెట్టినంతనే సిద్ధముగా నమరియున్న మాస మగుటచే వాల్మీకి దీనిని నెంతయో ప్రశంసించెను. ఈ మాసమునకు పెరుమాళ్ల (శ్రీరాముని) తో గల సారూప్య వైరూప్యములను పరిశీలింతము.

| పెరుమాళ్ (శ్రీరాముడు) | చైత్రమాసము |
|---|---|
| 1. ఇతరదేవత లందరి కన్నను ప్రధానుడు. | మాసము లన్నింటి కంటెను మొదటి మాసము. |
| 2. మానవులకు రాజు. | మాసములకు రాజు. |
| 3. "రంజనాద్రాజా" అనునట్లు ఆనంద ప్రదుడు. | ఇది పుష్పాకరమగు వసంతర్తువునకు ప్రధాన మాసమగుటచే ఆనంద ప్రదమైనది. |

4. దశరథచక్రవర్తి పెరుమాళ్లకు పట్టాభిషేక మును తలపెట్టినంతనే ప్రజలచే జ్యేష్ఠు డనియు గుణవంతుడనియు వేనోళ్ల కొని యాడబడినవాడు. వసంతర్తువు తలయెత్తగనే మాసములలో మొదటి దగు గుణాధిక్యము కలదని దాని గుణముల నుగ్గ డించుచు ప్రజలందరి చేతను కొనియాడబడు మాసమిది.

5. తాను తనకు శేషభూతులైన చేతనులను తన రక్షణ కధీనులుగా బడయు వాడు రాముడు. భగవంతునకు ప్రియమైన పత్రపుష్ప ఫలాదుల నొసంగి భక్తులు భగవంతుని సేవించుటకై సహక రించి యాతని కృప కధీనులుగా చేయు మాస మిది.

6. అగస్త్యమహర్షి "రామా! నీవు లోకులనంద రను పవిత్రముగా చేయగలవాడవనియు, వాల్మీకి మహర్షి "భోగ్యభూతు" డనియు వర్ణించిరి. ("పావన స్సర్వలోకానాం త్వ మేవ రఘునన్దన" "పుంసాం దృష్టిచిత్తాప హారిణం") "చైత్ర శ్శ్రీమానయం మాసః పుణ్యః పుష్పిత కాననః" అని వాల్మీకి దీనికిన్ని పావనత్వమున్ను, భోగ్యత్వమున్ను కలవని చెప్పెను.

7. తన ఉత్సవమునకై అలంకరింప బడిన రాజ్యము కలవాడు. తన ఉత్సవమునకై తానే పుష్పములతో అలంక రించుకొనిన కాలమిది.

8. పెరుమాళ్లు స్వర్ణకిరీటమును ధరించుటకు సిద్ధపడియున్నాడు. ఈ మాసమున్ను పుష్ప కిరీటమును ధరించుకొని సిద్ధపడుచున్నది.

మార్గళీ త్తిజ్ఞళ్ -

"దేవాన్ భావయతా నేన తే దేవా భావయస్తు వః" అని శ్రీగీతాచార్యుడు సెలవిచ్చినట్టుల మనము శాస్త్రోక్తములగు కర్మలను ఆ యా దేవతల నుద్దేశించి గావించినచో వారు ప్రసన్నులై మన కభీష్టముల ప్రసాదింతురు. అట్టి దేవతారాధనను వారు మేలుకొనియుండు పగటి సమయముననే గదా గావించవలయును! మనకీ దినమునకు బ్రాహ్మీముహూర్త మెట్టిదో దేవతల కీ మాసమట్టిదని వెనుక సహేతుకముగ తెలిపియున్నాను.

కావున నిది సత్త్వోన్మేషసమయము. గోపాంగన లపేక్షించునదియును సాత్త్వికఫలమే గావున ఫలమున కనుకూలమైన కాల మిది యని కాలమును కొనియాడుచున్నారు.

## మదినిఱైన్ద నన్నాళ్ -

నిండుచంద్రుడుగల మంచిరోజులు. ఆహా! మాసమునకు తగిన శుక్లపక్షముకూడ తోడైనదే. శుక్లపక్షములో శుభనక్షత్రమునందు మంగళకార్యము నారంభించవలెనను విధికలదు. ఆహా! మన మెంత భాగ్యవతులమో! అట్టి కాలము మనము కోరకుండగనే తానే ఆసన్నమైనది. చంద్రుడు క్షీణ దశ పోయి తన తేజస్సును యథేష్టముగా వెదజల్లు కాలమిది. మనమును మన పెద్దల యాటంకముచె మనకు కలిగిన శ్రీకృష్ణ కల్యాణగుణానుభవావరణము తొలగి యథేష్టముగా నాతనితో కలసి మెలసి మన యాశల నన్నిటిని బడసి యనుభవించదగిన కాలమిది. ఆహా! యెంత భాగ్యము!

## నన్నాళ్ ఆళ్ -

ఆహా! ఎంత మంచిరోజులు! మాసమునకును పక్షమునకును తీసిపోని శుభవాసరము గదా! యిది. అదేమి యనగా - భగవద్గుణములను మానసికముగ నైనను అనుభవింపనీయని పాపముల వంటి మన పెద్దల అడ్డంకులు తీరి, వారే స్వయముగ నీ వ్రతాచరణమునకై మనలను యథేష్టముగా విడచిన రోజిది. ఇది భగవత్కృపకే ఫలము. చేతనులను తన కభిముఖముగా చేసికొనుటకై యనేకావ తారముల నెత్తగా మనము పెడముఖము పెట్టుట మాని సుముఖులమైన కాలమిది. భగవానుడు "తానహం ద్విషతః క్రూరాన్" అను తీక్ష్ణవచన సక మూలకు త్రోసిపుచ్చి "దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తి తే" అని తానే తనను సుకరముగా చేరుటకు ఆటంకములగు పాపములను తొలగించి భక్తియోగమును ప్రసాదించు కాలమిది.

అక్రూరుడు తనది కంసుని యన్నము తిని పెరిగిన శరీరమగుటచే వానికి వలె అధర్మమునకే సాధన మగుట మాని, శ్రీకృష్ణుని సందర్శించు భాగ్యము తనకు లభించినదనియు "అద్య మే సఫలం జన్మ సుప్రభాతా చ మే నిశా" యని తనకు పాపాంధకారము తొలగి భగవద్దర్శన సుప్రభాతము లభించినదనియు సంతోషించినటులనే మనకును గాఢాంధకారమువంటి మన పెద్దల యవరోధము తొలగి శ్రీకృష్ణసంశ్లేషమున కనుకూలమైన కాల మాసన్నమైనదే!

## నన్నాళ్ ఆళ్ -

ఊణాధ్యాయమును (తినబోవు భోజన క్రమాను సంధానము) చేయు లుబ్ధ బ్రాహ్మణుని వలెనే, రాముడు రాజైనచో 'ఈ సుఖములను బడయుదుము, ఆ సుఖములను బడయు దుము' అని ఉవ్విళ్లూరుచున్న అయోధ్యాపురుల ఆశావినాశావకాశము వలె గాక పదునాలుగు సంవత్సరములు గడపి శ్రీరామచంద్రుడు అయోధ్యకు వేంచేసి పట్టాభిషిక్తుడైన దినము వారి కెట్టిదో అట్టిదే మన కీ దినమని పొంగిపోవుచున్నారు.

ఇట్టి గోపాంగనలు మాసమును, పక్షమును, దినమును కొనియాడుటచే వీరికి గల కృష్ణ సంశ్లేషత్వరాతిశయము సూచింపబడుచున్నది.

నీరాడ - స్నానమును చేయుటకు.

ఈ పదము పెద్దల స్నానమునకై వాడవలసిన గౌరవపదము. వీరు చిన్న పిల్లలైనను భగవద్భక్తులగుటచే ఒకరి నొకరిట్లే ప్రసంగించుకొనవలెను. 'నంబి' యను తిరునామమును ఆళ్వారులందరును పెరుమాళ్ల విషయమై వాడిరే గాని శ్రీమధురకవులా పదమును తమ యాచార్యులగు నమ్మాళ్వార్ల విషయమున వాడిన యుదారులు గావుననే వారు చిన్న గ్రంథకర్తలైనను మధురకవులైరి. సాక్షాత్తుగ పరమపురుషావతారుడై, వృష్టిచిత్తాపహారియగు శ్రీరామచంద్రుడు తన కన్నుమోల నిలచి యున్నను "పాదమూలం గమిష్యామి యానహం పర్యచారిషం" అని శబరి తన యాచార్య తిరువడి గళ్లను చేరుట కనుజ్ఞనిమ్మని కోరుటచేతనే రామాయణ ముఖ్య పాత్రలలో నొకతెగా పరిగణించ బడెను. శ్రీవైష్ణవులు పరమపదించినచో, చనిపోయిరి, స్వర్గస్థులైరి, నిర్యాణమును చెందిరి యనుటయు, చివరకు పరమపదించిరి యనుటయును సంప్రదాయ విరుద్ధమనియే మన పెద్దలు భావింతురు. ఇక నేమనవలెననగా - "ఆచార్యతిరువడిని చేరిరి" అనవలెనని శబరి నేర్పిన మాటనే వాడుట వైష్ణవ లక్షణము. శ్రీకూరేశుల ధర్మపత్నియగు ఆండాళ్లమ్మగారు తమ పుత్రులగు భట్టరువారి శ్రీపాద తీర్థమును రహస్యముగా తీసికొనిరట. ఎంబెరుమానారులు ఇతర శ్రీవైష్ణవులతో వేంచేసియుండగా వారి ఆచార్యులగు పెరియనంబిగారు వేంచేసి వారికి సాష్టాంగప్రణామమును గావించిరట. "ఇదేమి యిట్లు చేసితిరి? ధర్మమా" యని శ్రీరామానుజు లడుగగా వారు "దాసుడు శ్రీయామునాచార్యులవారు వేంచేసి యున్నారని తలంచి సేవించితి" ననిరట. ఇదియే గదా భగవత్సంబంధమును పురస్కరించుకొని గౌరవించవలసిన రీతి.

ఆధ్యాత్మికాది తాపత్రయసంతప్తులగు ముముక్షువులు సంసారతాపశాంతికై పరబ్రహ్మానుభవమునందు నిమగ్నులగుటయే సరియగు నీరాట్టము (స్నానము చేయుట).

నీరాడప్పోదువీర్ పోదుమినో - స్నానముచేయగోరువారు రండు.

"పురుషార్థమెంత గొప్పదియైన దానిని బడయుటకు అంత దుష్కరకర్మానుష్ఠానము చేయవలెనని భయపడుచున్నా" మని గోపిక లనగా ఆండాళ్ తల్లి "నిజమే. ఈ పురుషార్థ మట్టిది కాదు. వీనికి కావలెనను కోరిక యుండుటయే చాలును. అనగా, వర్ధసకుండుటయే యీ పురుషార్థమునకు

ముఖ్యసాధనము. ఇది చేతనుని పారతంత్ర్యస్వరూపమున కనుకూలమైనది. ఇది సాధనకోటిలో చేరదు కావున దీనికి 'నమః' పదముతో విరోధము లేదు." అనుచున్నారు.

ముముక్షువున కితరపురుషార్థము లన్నియును తన శేషత్వ పారతంత్ర్య స్వరూపమునకు విరుద్ధము లగుటచే వానిని బడయుటకు అధికారి యోగ్యతలు సంపాదించుకొనియే వాని సాధనానుష్ఠానమునకు గడంగవలెను. కాని యీ వ్రతాంగమగు స్నానము స్వరూపానురూప పురుషార్థమగుటచే దీనికి వద్దనకుండుటయే ప్రధానాంగము. శ్రియఃపతి "రక్ష్యాపేక్షాం ప్రతీక్షతే" అనగా- తన రక్షణ కృత్యమునకు మన మేమాత్ర మడ్డుపడినను ఆయన చాచిన చేతిని ముడుచుకొనును. మన మడ్డుట యనగా స్వప్రయత్న ప్రవృత్తి. అనగా- మన కోరికను మనమే బడయుగల మను అహంకారము. ఇది యాయన రక్షణ నడ్డును, కావుననే వార్తామాల ప్రబంధములో "భగవత్ప్రవృత్తి ప్రతిబంధక స్వప్రవృత్తి నివృత్తిః ప్రపత్తిః" (అనగా- మన ప్రయోజనమునకై మనము చేయు ప్రయత్నము ఆయన మన కొరకై చేయు ప్రయత్నము నడ్డును) అని కలదు. కావున మన ప్రయత్నమును విడువవలెను. "మనము భక్తులమైనచో ఆయన ప్రపన్నుఁడగును. మనము ప్రపన్నుల మగుచో ఆయన భక్తుడగును". ప్రపన్ను డనగా ఏ పనిని చేయక యుండువాడు. భక్తు డనగా తానే సాధనానుష్ఠానము చేయువాడు. మనము భక్తుల మగుట యనగా, మన రక్షణ ప్రయత్నమును మనమే చేసికొనుట. ఆయన ప్రపన్నుడగుట యనగా మన రక్షణ ప్రయత్నము విడచి యూరకుండుట. అనగా- మనలను రక్షించుకొనుటకు మనమే ప్రయత్నించుకొనినచో ఆయన మన రక్షణ భారమును విడచి కూర్చొనును. అట్లుగాక మన రక్షణ భారమును మనము ఆయనపై నుంచి యూరకున్నచో ఆయన మన రక్షణకై పడవలసిన పాట్లన్నియు పడును. దీనినే ఆళ్వారు "అత్తతు పత్తినిల్, ఉత్తతు వీడుయిర్" అని పాడించిరి. అనగా మన రక్షణ ప్రయత్నమును మనము విడచినచో "ఉయిర్ పెత్తతు వీడు" ఆత్మ లభించునది పరమపదమే. ద్వయమంత్రములోని పూర్వఖండమున ఉపాయాంతర పరిత్యాగ పూర్వక శ్రియఃపతి చరణారవింద ఉపాయాధ్యవసాయమున్ను, ఉత్తర ఖండమున లక్ష్మీనారాయణుల నిరంతర కైంకర్య ప్రార్థనయు తెలుపబడెనవి. ప్రపత్త్యుపాయమునకు ఫలనియమము లేకుండుటచే మన మే ఫలమునకై ప్రపత్తిని చేసితిమో దాని సాతని కెరింగించుటయే ఉత్తరఖండయొక్క ప్రయోజనము, దానిని భగవంతు డెరుగడా! యన్నచో మనము కోరి లభించిన గాని యది పురుషార్థము (పురుషునిచే కోరబడినది) కానేరదు.

హో మ మి నో -

రంము. ఈశావాస్యోపనిషత్తునందు ప్రపన్ను లనుసంధించ వలసిన మంత్రముగా తెలుపబడిన "అగ్నేనయ .........." అను మంత్రములో "అస్మాన్ నయ" అని నన్నే కాదు, నా సంబంధుల

నందరను అర్చిరాది మార్గము ద్వారా పరమపదమునకు తీసికొని వెళ్లుమని బహువచన ప్రార్థన కనిపించుచున్నది. ఇది శ్రుతి సమ్మతమైన యర్థమే. ఈ ఆండాళ్‌తల్లి పిరాట్టియొక్క అంశ. ఈమె ప్రతికూలురను కూడ "తేన మైత్రీ భవతు తే" "విదిత స్సహి ధర్మజ్ఞః శరణా గతవత్సలః" అని యింటి గుట్టును సదస్యమొనర్చిన యిల్లాలు. పెరియాళ్వార్లు తమ ప్రథమ ప్రబంధమగు పల్లాణ్డు నందు ఐశ్వర్యార్థులను, కైవల్యార్థులను గూడ ముముక్షువులతో కలిపి ఆహ్వానించి, వారి యందఱితో కలసి భగవన్మంగళాశాసనమును గావించిరి. ఇట్లు పరసమృద్ధిని గోరు నీ తల్లి ప్రాణ సఖురాండ్రను విడువ గలుగునా? అందుచే అందరను రండను చున్నారు.

## పో దు మి నో -

రండు. ఇది తమకే ఫలమను భావముతో దీని కంగీకరించినవారి పాదములను పట్టుకొని ప్రార్థించుచున్నారు. నమ్మాళ్వారులును "అడియార్ కళ్ కుழாங్గళుడన్ కూడవ తెన్డుకొలో" అనగా - భాగవతగోష్ఠితో కూడి భగవదనుభవమును గావించుట యేనాడో గదా? అని ప్రార్థించిరి. శ్రీభాష్యకారులును పరమపదమునకు వేంచేయుటకు ముందు తమ అనుయాయులకు సుకర నిరపాయోపదేశము నుగా "యద్వా భాగవతాభిమానవసతిః" అనియు, "తస్మా న్నిత్య మతన్ద్రితో భవ సతాం తేషాం సమారాధనే" అని భాగవతసమారాధననే యుపదేశించిరి. "వరవరముని భృత్యై రస్తు మే నిత్యయోగః" అను విధిని ఆండాళ్ తల్లి అనుష్ఠానపర్యంతమును గావించుచున్నారు.

## నే రి ழை యా ర్

విలక్షణములైన ఆభరణములుకలవారలారా! ప్రపన్నాగ్రేసరుల దివ్యమంగళ విగ్రహమునకు

"బద్ధే నాఞ్జలినాఽఽనతేన శిరసా గాత్రై స్సరోమోద్గమైః ।
కణ్ఠేన స్వరగద్గదేన నయనే నోద్గీర్ణబాష్పామ్బునా ॥"

అనగా - అంజలిబంధము, నతశిరస్కము, గగుర్పొడిచిన గాత్రము, డగ్గుత్తికస్వరము, నేత్రములనుండి ప్రవహించుచున్న ఆనందాశ్రుఝరి మొదలగునవియే ఆభరణములు, అవి లేని కేవల భూషణాలంకారము శవాలంకారమే. ఆభరణములను వ్యత్యాసముగా ధరించుట, కట్టుబట్టను విపరీతముగా ధరించుట, ఒడలంతయు పాలిపోయి కృశించుట - ఇవియన్నియు భక్తిపారవశ్యకార్యము లగుటచే శ్రీకృష్ణు డెంతయో సంతసించును. "భక్త్యా తుష్యతి" "భక్తిప్రియో మాధవః" "భక్తిక్రీతో జనార్దనః" గదా!

శీర్మల్గు మాయ్ప్పాడి -

సంపద మిక్కుటమైన గోకులము. ఉభయవిభూతినాయకు డడుగిడుటచే గవ్యము పదిరెట్లు పెరిగిపోయెను. వస్తువున కాదరము గుణములవలననే. భగవంతుని కల్యాణగుణములు గాఢాంధకారమందు కాగడావలె పుష్కలముగా వెలుగొందునది యీ లీలావిభూతియందే విడువదలచుకొన్నను విడువని పరత్వమున్ను, సంకల్పించి కల్పించుకొన్న సౌలభ్యమును ప్రకాశించునది యీ గోకులముననే. కావున దీనిని సంపన్నగోకుల మనుచున్నారు. పరమపదమున నిత్యముక్తులు నిత్యాంజలిపుటబద్ధులై "నమః, నమః" అనుచున్నను "అవాకీ అనాదరః" అను నట్లుండు తత్త్వము గోకులమున కేతెంచి తానే నమస్కరించు స్థితికి వచ్చినది. శ్రీకృష్ణుని దొంగతనము ఋజువైన పిమ్మట.తల్లి యాతని శిక్షించుటకై చేతన్ సెలగోలపట్టుకొని వెంబడించగా "ఈ తప్పు పైరింపు మింక దొంగిలి పోవనే నని మినుముట్టనేడ్చువాడు" అని పోతనయు, "తొళ్ళైయుం ఇణైక్కణ్ణ యశోత్తై" కాటుక కన్నుల నలుపుచు నేడ్చుచు కార్చు కన్నీటితోను, ఈ తప్పుమన్నింపుమను వదనముతోను" – అని కులశేఖరులును పాయించిరి కదా!

పరమపదమున దుర్లభ దర్శనమైన యీ గోపవేషమును సేవించవలయు నని యే కదా నాయ్చ్చిమారులు వైదిక పుత్రులను పుట్టిన వారిని పుట్టినట్లుగా పరమపదమునకు గొనిపోయినది యును!

ఆయ్ప్పాడి -

గోకులము. కుడి యెడమ లెరుంగని గోపికలు నివసించు ఊరు. తమ్ముడు చేసిన తప్పులకు బలరాము దండగా నుండు ఊరు. అల్లరులను జూచి పైపడువారుండు ఊరు. ఇంద్రునకు కుడు విందును గుట్టకు పెట్టుదన్న, సరే యని సమ్మతించు అమాయకులుండు ఊరు. శ్రీకృష్ణుడు ఇంటిని పీకి పందెల వేసినను అదియే చాలునని సంతోషించు ఊరు.

సెల్వచ్చిఱుమీర్ కాళ్ -

సంపన్నులైన చిన్న పిల్లలారా! సంపత్తు అనగా ఇచ్చట భగవత్స్పర్శయే, ఆయూరి పిల్లలలో నది లేనివా రరుదు. వావివరుస చేతనైన నేమి, ప్రేమచే నైన నేమి, శ్రీకృష్ణుని బలవంతము చేతనైన నేమి మొత్తమా యూరి పిల్లలలో వాతనిచే తాకబడని వారు లేరు. ఈ భగవత్సంబంధమే వీరికి సంపద. దానినే కైంకర్యమందురు. కైంకర్యమనగా శ్రీకృష్ణునకు ముఖవికాసమును కలిగించు వ్యాపారము. అది వయస్సులో నున్న స్త్రీలకు సులభమే. స్త్రీలు, పిల్లలు అనుటచే పారతంత్ర్య పరాకాష్ఠలో

నున్నవారని యర్థమును గ్రహించవలెను. దీనిచే అహంకారము గాని, దేవతాంతర స్పర్శ గాని లేని వారని యర్థము. అన్యశేషత్వము గాని, స్వాతంత్ర్యము గాని లేనివారని భావము.

ఏర్కొళ్వేల్ కొడున్దొழిలన్ నన్దగోపన్ -

వాడియగు బల్లెముచే బూని క్రూరవ్యాపారములు చేయు నందగోపుడు.

కూరత్తాళ్వారులు తమ తండ్రిగారి తిరువధ్యయనమున కొక యరటియాకును కోసి సాన కారుచుండగా జూచి "అయ్యో! వృక్షమా! నీ కెంత హానిని కలిగించితి" నని యేడ్చుచు నచ్చటనే మూర్ఛిల్లి చిరకాల ముండి పోయిరట- మరియు, ఒక కప్ప పామునోట నుండి అరచుచుండగా "అయ్యో! ఈ కప్ప తన మొర నెవ్వరు విని రక్షింతురని యిట్లు ఏడ్చుచున్న" దని మూర్ఛచెందిరట. అట్టి దయాళు డీ నందుడు. తన కసాధారణమైన ఆయుధ మీ బల్లెమే, ఇంతవరకు దాని నొక మూల పడవైచెను. అది తుప్పు పట్టి రూపుమాసెను. అట్టివాడు బిడ్డ లిద్దరు బయలుదేరగనే ఆ బల్లెమును వెతికి తీసి బాగుగా పదును పెట్టించి యా బిడ్డల తొట్టి క్రింద నొక గండుచీమ ప్రాకినను అదియును నొక రాక్షసుడని భావించి యా బల్లెముతో సింహముపై కురికినట్లు ఉరికి దానిని చంపువాడట.

కుమరన్ - విధేయుడు.

ఉపాధ్యాయుని చేతబెత్తమును జూచి వీధిబడి చిరుత భయపడునటుల, బల్లెమును చేబూనిన నందుని జూచి శ్రీకృష్ణు డత్యంత విధేయుడై మెలంగుచుండెను. కొట్టినను, తిట్టినను హితకాముడగు తండ్రియే గదా యధికారి! శ్రీకృష్ణుడు పొరుగిండ్లలో చేయగలిగిన పాడుపనుల నన్నిటిని చేసి వచ్చి యింట నొక మూల నక్కియుండును, ఆ యిండ్లవారు వచ్చి నందుని చెంత మొరలిడగా "ఆం! అంతపని చేసినాడా? రానిండు. వాని తాళము పట్టెద" నని కోపముతో నందుడు శ్రీకృష్ణుని రాకకై యెదురుచూచుచుండగా శ్రీకృష్ణుడు మెల్లగా వినయ ముట్టిపడ, నేమియు నెరుంగని వానివలె తండ్రి గారికి సాష్టాంగముగ నమస్కరించి నిలచును. నందుడా వినయమును జూచి "రా, బాబూ! రా" యని పిలచి తలను దువ్వుచు "అయ్యో! ఈ అమాయకుని పైనా వారీ నేరములు చెప్పుట? ఈ యొప్పుల కుప్పనా నేను కొట్టదలంచుట? ఎంత వెర్రి!" అని విలపించి యూ వచ్చిన వారినే నిందించును. ఇది "కుమరన్" పదములో నున్న హార్దభావము

## ఏరార్న్దకణ్ణి యశోదై యిళఞ్జిఙ్గమ్ -

అందమైన కన్నులు గల యశోద బాలసింహము.

శ్రీకృష్ణానుభవముచే యశోదకు కలిగిన ఆనందానుభవ మామె కన్నులలో గానవగును. లోకులు పుణ్యపాపపరవశులగుటచే వారి కన్నులలో విలక్షణ వికారములు గాన్పించునుగాని యుభయ విభూతి నాయకుని బిడ్డగా బడయుటచే నా భాగ్యమంతయు నామె కన్నులలో తాండవించును. "సదా పశ్యన్తి సూరయః" అనునటుల నిత్యసూరులు రెప్పపాటు లేక, రాత్రింబవళ్లను విభాగము లేక అనుభవించు దివ్యమూర్తిని తానొక్కతెయే అనుభవించగల భాగ్యవతి గదా యశోద ! నందుని యొద్ద వినయముట్టిపడు నా బిడ్డయే యశోదముందు బాలసింహమై యథేష్టముగా విహరించును. శ్రీకృష్ణుని యల్లరుల నెరింగియు నాతని భయపెట్టజాల దీ యశోద. ఆమె యీతనికి చెంబెడు నీళ్లనైనను పోయక "పూణి త్తొఴు విసల్ పుక్కు పుఴుది యళైన్ద పొన్మేని కాణ ప్పెరుదు ముకప్పన్" పశువుల కొట్టములో ప్రవేశించి యచ్చట నాడియాడి యొడలి నిండుగా దుమ్మును పట్టించుకున్న శ్రీకృష్ణుని తిరుమేను ఆమెకు బంగరుపూతపూసినటుల మిక్కిలి ఆనందదాయకమైనటుల, ఆయన చేయు అల్లరులును ఆమె కాకర్షకములే యగుటచే నిరుగుపొరుగులు వచ్చి మొరపెట్టు చున్నను

"కాంతలు తల్లితో తన వికారము లెల్ల గణించి తెల్పగా
శాంతుని పెంపునన్ పరమసాధుని కైవడి గోల మాడ్కి, వి
భ్రాంతుని పైవడిన్ జడుని భంగి కుమారకు డూరకుండు, నే
వింతయు లేక తల్లికుచ వేదికపై తలమోడ్చి యాడుచున్."

కృష్ణుడు అది యెవ్వరిని గూర్చియో యనునట్లు నటించగా తల్లి యది సహజవినయమే యని భ్రమించి యొడిలో నిడుకొని బుగ్గలు నొక్కి "ఔనా? బాబూ! అట్లు చేసినావా? ఎందుకు చేశావు?" అని యిట్లు మందలించగా నామె హృదయము నెరింగి మరింత యల్లరిచేయ నలవడినాడు. ఆ యిరుగు పొరుగువారు "మా మాట నమ్ముమమ్మా, ఇదుగో, ఈ సుగణ నడుగుము, ఇదిగో, యీ లలిత నడుగుము, ఇదిగో, యీ లీలావతి నడుగుము. మా యింట నెంత వెన్నను, ఎంత నేతిని దొంగిలించినాడో!" అనగా యశోద "అంత మంది చూచుచుండగా చేసిన పని దొంగతన మెట్లగు నమ్మా? మా యింట పాలకు కొదువా? పెరుగుకు కొదువా? వెన్నకు కొదువా? దీనికి మీ యింట దొంగిలించు కర్మమే మమ్మా?" అని వారినే మందలించ నిక నీతడు సింహము కాకున్న కుండ గలడా ?

కా ర్మే ని - నల్లని దేహముగలవాడు

ఎవరట్టినను చూడక నుండలేయని తిరుమేని కాంతి.

"మణి విడమ్బిని తస్య మనోహరే ।
వపుషి సక్తమనా మునిమణ్డలీ ।
వ్రత మముఞ్చత వేద మముఞ్చత ।
జప మముఞ్చత హోమ మముఞ్చత ॥"

ఇంద్రనీలమాణిక్యకాంతి ననుకరించు ఆ గోపాలకృష్ణుని దివ్యమంగళ విగ్రహమును ఆ యరణ్యమున సంచరించు మునిబృందము వ్రతమును చేయుచున్నవా రావ్రతమును, వేదాధ్యయనమును చేయుచున్నవా రా వేదాధ్యయనమును, జపమునుచేయుచున్నవా రా జపమును, హోమమును చేయుచున్నవా రా హోమమును మాని నివ్వెరపాటుతో చూచిరట! అట్టి విరాగులను కూడ నిశ్చేష్టులను గావించు దివ్యమంగళవిగ్రహ మిది. వర్షించు మేఘము తాపార్తుల తాపమును శాంతింపజేయునట్టుల నా కృష్ణుని దివ్యమంగళవిగ్రహము సంసార తాపతప్తుల తాపము నార్చును.

శ జ్గ ణ్ - ఎర్రని కన్నులు కలవాడు.

లోని వాత్సల్యమును బైటికి చూపు కన్నులు కలవాడు. నల్లని మేఘముపై రెండు తామరపుష్పములు వికసించినట్లుండు కన్నులవి. ఈ గోపాంగనల నింతకాల మెడబాసిన దుఃఖము వారికన్నను తనకే యనేకమడుంగు లధికమని తోపించు కన్నులవి. ఇందులకు ప్రమాణము పిరాట్టి తిరువడితో "ఊర్ధ్వం మాసాన్న జీవిష్యే" ఒక నెలను మించి బ్రతుకజాలనని సందేశమంపగా విని శ్రీరామచంద్రుడు "న జీవేయం క్షణ మపి" నేనామెను విడచి యొక్క క్షణకాలమైనను బ్రతుకజాల ననెను గదా!

కతిర్మతియమ్పోల్ ముగత్తాన్ - సూర్యచంద్రులను పోలిన ముఖముకలవాడు.

నేత్రానందమున కాతని తిరుముఖమండల సందర్శనమున్ను, ప్రాప్తికి విషయమున్ను ఆ తిరుముఖమే.

నారాయణనే - నారాయణుడే.

మనము నారములము. ఆయన మన కాధారమైన నారాయణుడు. మాణిక్యహారములోని దారము వలె ఆయన మన కాధారభూతుడు. నారాయణానువాకములో అంతగా పొగడబడినవాడు అబలల కింత భృత్యుడై వారి కనుసన్నలలో మెలగుచున్నాడు, చూడుడు.

ఈ పదము ఈ నోము నోచువారనుసంధించ వలసిన మంత్రమ్ము అష్టాక్షరీ మంత్రరాజమ్మే యని తెలుపుచున్నది.

నమక్కే - మనకు.

ఈ తిరునామము ననుసంధించుటకు భగవంతునితో చేతనునకున్న నవవిధసంబంధజ్ఞానమున్నవారే అధికారులు, ఆ సంబంధములను అష్టాక్షరీమహామంత్ర మిట్లు తెలుపుచున్నది.

"పితా చ రక్షక శ్శేషీ భర్తా జ్ఞేయో (రమాపతిః) స్వామ్యాధారో మమాత్మాచ భోక్తా (బాద్య మనూదితః) ఆద్యమను = అష్టాక్షరీమహామంత్రము.

నారాయణనే నమక్కే -

ప్రాప్యప్రాపక వాచకపదములు 'ఏవ' కారములతో కూడియున్నవి మొదటి 'ఏవకారము' ఉపాయనైరపేక్ష్యమును తెలుపును. అనగా - భగవంతుడు మనలను రక్షించుటలో మనము చేయు సాధనానుష్ఠానములను గాని, తాను రక్షించుటకు వేరొక సహాయమును గాని యపేక్షించడు. రెండవ 'ఏవకారము' చేతనుని ఆకించన్య, అనన్య గతిత్వములను తెలుపును, అనగా - ఉపాయాంతరములు గాని, రక్షకాంతరములు గాని లేకుండనుండవలసిన ప్రాప్యుడగు జీవునియొక్క స్వరూపమును తెలుపుచున్నది. రక్షకత్వమువలెను, ప్రాప్యత్వము వలెను ఉపాయత్వము కూడ భగవంతుని స్వరూపములో సహజముగనే అంతర్భూతమై యున్నది. ఆతని పూర్తినిబట్టి చూచినను ఆడడే ఉపాయభూతుడగును. ఇతరదేవత లపూర్ణులగుటచే నారాయణుని చేతివైపు చూతురు. నారాయణుడొక్కడే ఎప్పుడును తెరచియుండు తలుపులుగల భవనము వంటివాడు. అందుచేతనే కాకాసురునివంటి అసహ్యాపచారకునికిని గతి కలిగినది. ప్రతినిత్యము లెక్కలేకుండ తిట్టునట్టి శిశుపాలుడైనను ప్రతితిట్టునకును "కృష్ణా! నీవు జారుడవు, కృష్ణా! నీవు చోరుడవు" అని యిట్లు కృష్ణశబ్దమును జోడించియే తిట్టెను. కావుననే కాకాసుర, శిశుపాలురు విముక్తులైరి. శ్రీగుణరత్నకోశమున "కాకం తం చ విభీషణం శరణ మిత్యుక్తి క్షమౌ రక్షతః" అని యిట్లుభయుల శరణాగతియు భగవంతుని క్షమాగుణ ప్రసారము నడ్డినవి. ఈ గోపాంగనల కట్టి యడ్డు లేకుండుటచే వీరిపట్ల భగవంతుని క్షమాప్రసార మనర్గళమే దీనినే 'నమక్కే' అను పదము సూచించుచున్నది.

పఱై తరువాన్ - నోమున కంగముల నొసంగును.

'పఱై' యని పేరు పెట్టుట లోకుల కొరకే. తమకు వలయునది "ఉనక్కే నామాట్చెయ్వోం" అనగా, సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును సర్వేశ్వరుని సర్వవిధకైంకర్యమే, కావుననే ప్రాప్య నిష్కర్ష పరమగు 29వ పాశురములో "ఇత్తై పఱైకొళ్వా న్నన్రుకాణ్ గోవిన్దా" "కృష్ణా! మా ప్రయాస యంతయు ఈ పఱై కొరకు కాదని నిషేధించి కావలసినది కైంకర్యమే యని నిష్కర్షించిరి.

పారోర్ పుగழ - లోకులు పొగడునట్లుగా.

సమ్మతించని గోపవృద్ధులును సంతోషపడి మమ్ములను పొగడునటుల మేము మా పురుషార్థమును లభింతుము. స్వరూపజ్ఞానముకలవారి యాత్రను అది లేనివారు నిందించుట న్యాయమే, మన కులమందలి పెద్దలు స్వరూపజ్ఞానము లేనివారైనను అట్లు నిందించరు. ఏమనగా, మన నోము వలన వారికి కావలసినంత వర్షము కురియును గదా! వారెందులకు నిందింతురు?

ఈ పాశురమున -

1. కాలమును కొనియాడి
2. అధికారి యోగ్యతను చెప్పి
3. పిలుపును విన్నవారికి కలుగు పౌష్కల్యమును చెప్పి
4. శ్రీకృష్ణుని సంశ్లేషకనుకూలమైన గోకులమున పుట్టుట గోపాంగనల భాగ్యమని పొగడి
5. శ్రీకృష్ణుడు నందగోపునకును, యశోదపిరాట్టికిని విధేయుడగుటచే మనకభీష్టసిద్ధి కడ్డు లేదని చెప్పి
6. తమవారు తమలను శ్రీకృష్ణున కగపడకుండునట్లు దాచినను విడువని యాతని శరీరసౌంర్య మును చెప్పి
7. ఎట్టివారైనను విడచుటకు వీలులేని సంబంధ ద్రఢిమను చెప్పి
8. ఉపాయభూతుని నిరపేక్షత్వమును
9. తమ ఆకించన్య పౌష్కల్యమును జెప్పి
10. ప్రతికూలురును సంతసించి తమను ప్రశంసించు ఫలపర్యవసాయమును చెప్పి

యీ పాశురమును ముగించుచున్నారు.

## — వేదాంతార్థము —

కావ్యములు ఉత్తమ, మధ్యమ, అధమములని మూడువిధములు, ధ్వన్యర్థము ప్రధా ముగా గలది ఉత్తమకావ్యమనియు, వాచ్యార్థమునకన్న ధ్వన్యర్థమధికరసవంతము కానిచో మధ్యవ కావ్యమనియు, ధ్వన్యర్థమసలే లేనిచో అధమకావ్యమనియు నందురు. ఈ తిరుప్పావై దివ్యప్రబ ధము ఉత్తమకావ్యమనుట నిర్వివాదము. ఇది ప్రతి శ్రీవైష్ణవాలయములందును, ప్రతి శ్రీవైష్ణవ గృహ ములందును ప్రతినిత్యము ననుసంధింపబడును. అది లేనిచో ఆరాధనకు పూర్తి లేనే లేదు. మన సిద్ధాంతమునకు రామానుజసిద్ధాంతమని శ్రీరంగనాయకులు నామకరణము చేసిరి. అట్టి రామానుజులు దీనిని నిరంతర మనుసంధించుచు 'తిరుప్పావై జీయరు' అను తిరునామముతో ప్రసిద్ధిని గాంచిరి. కాబట్టి యీ ప్రబంధమున వాచ్యార్థముకన్న ధ్వన్యర్థమున్ను వేదాంతార్థమనియు, స్వాపదేశార్థమనియు పెద్దలు సాయించుచుందురు.

నేను పాశురమును, తాత్పర్యమును వ్రాసిన పిమ్మట అనేకవ్యాఖ్యానములనుండియు, పురా ణేతిహాసములనుండియు కొన్ని అర్థములను 'విశేషార్థము' అను పేరుతో విపులముగ వ్రాసి, పిమ్మట వేదాంతార్థమును వ్రాయుచుందును, పాఠకులు ఆ యర్థమును శ్రద్ధతో గమనించవలెను.

ఈ పాశురమునందు అధికారిస్వరూపమున్ను, ఉపాయ (సాధన) స్వరూపమున్ను, ఉపేయ (ఫల) స్వరూపమున్ను సంగ్రహముగా తెలుపబడుచున్నవి.

మొదట ఈ సాధనమును పరిగ్రహించుటకు తగిన కాల మాసన్నమైనదని కాలమును కొనియాడుచున్నారు.

మార్గళి త్తిఙ్గళ్ - మార్గళి మాసము.

దేవతలకు ఉత్తరాయణము పగలుగను, దక్షిణాయనము రాత్రిగను పరిగణింపబడును. మనకు తెల్లవారుటకు ముందున్న సమయము బ్రహ్మముహూర్త మగునట్లు ఈ మాసము దేవతలకు తెల్లవారుటకు (సంక్రమణమునకు దగ్గర) పూర్వకాలమగుటచే వారికి బ్రాహ్మముహూర్తమనదగి యున్నది. అది సత్త్వగుణోన్మేషమునకు ప్రధానసమయము. దీనిచే రజస్తమోగుణములణచివేయ బడును. ఇది జ్ఞానాభిలాషను కలుగజేసి తత్సాధనమగు ఆచార్యానువృత్తికి ప్రేరేపించును. వారు సకలశాస్త్రసారతమార్థమగు అర్థపంచకజ్ఞానమును ప్రసాదింతురు. దానిచే —

## మ తి ని క్షై న్ద

ఇచ్చట 'మతి' శబ్దమునకు చంద్రుడు. జ్ఞానము నను రెండర్థములు కలవు. చంద్రునివలెనే జ్ఞానమున్ను పూర్ణముగా నభివృద్ధిజెందియుండును. దానిచే ఆత్మవినాశమునకు ప్రధానకారణమనదగు భగవద్భాగవత విరోధాభినివేశము పోయి వారి విషయమై అభిముఖ్య ముదయించును ఇది క్రమముగా పరమపురుషార్థప్రాప్తివరకు అనువర్తించును.

## నన్నాళ్ ఆల్ -

"జన్మాంతర సహస్రేషు । తపో జ్ఞాన సమాధిభిః ।
నరాణాం క్షీణపాపానాం । కృష్ణే భక్తిః ప్రజాయతే।"

అనునట్లు కొన్ని వేల జన్మలలో గావించిన తపస్సు, జ్ఞానము, ధ్యానముల మూలమున ఆగామి, సంచిత పాపపుంజమంతయు నశించి భగవంతునియందు భక్తి వృద్ధిపొందుటకును, మోక్ష సామ్రాజ్యమునధిరోహించుటకు కాలము తనంతనే తటస్థించుటచే మిక్కిలి ఆశ్చర్యముదయించి, "నన్నాళ్ ఆల్" అనుచున్నారు. పాంచభౌతిక శరీరమునకు పంచభూతము లత్యంతావశ్యకము లగు నటుల జ్ఞానరూపమైన ఆత్మకును జ్ఞానమెంతయో ఆవశ్యకమైనది. దీనిని బడయుట కనుకూలించు కాలము నిజముగ ప్రశంసించదగిన దనుటలో ఆశ్చర్యమేమున్నది?

## శీర్మల్గుం మాయ్ప్పాడి -

శీర్ = అసంఖ్యాకములైన సర్వేశ్వరుని వాత్సల్య, కృపాక్షమాది కల్యాణ గుణములు.

మల్గుం = భగవంతునితో పరమసామ్యాపన్నులైన నిత్య, ముక్త గోష్ఠిలో వలె గాక, గాఢాంధకారములోని పెద్దదీపము వలె ఆ గుణములు తమకు తగిన సాపరాధులును, పాపులును అధికముగా నుండుటచే లీలావిభూతియం దా గుణములు అభివృద్ధములై యుండును.

ఆయ్ప్పాడి = అట్టివారు నివసించుచున్నటి.

ఆయ్ప్పాడి = జ్ఞానజన్ములు సాదరముగా వర్తించునట్టి యూరు.

జన్మలు శరీరజన్మయనియు, జ్ఞానజన్మ యనియు రెండు విధములు. పుత్రపౌత్రాదులు శరీరజన్ములు. శిష్యప్రశిష్యులు జ్ఞానజన్ములు. అనగా- ఆచార్య సమాశ్రయణమును గావించి ప్రణిపాత, పరిప్రశ్న, సేవలతో వారి యనుగ్రహమును సంపాదించుకొని పంచసంస్కార సంస్కృతులై

మంత్రత్రయార్థ జ్ఞాన, అర్థ పంచకజ్ఞాన ప్రాప్తిరూపమైన జన్మకలవారని యర్థము. మన పూర్వాచార్యులు వీరినే తమకు ప్రధాన పుత్రులుగా భావించిరి. కావుననే శ్రీమన్నాథమునులు ఈశ్వరమునులనెడు తమ కుమారుల వలన పుట్టనున్న ఆళ్వందారులను ఈశ్వరమునుల కొప్పగించక జ్ఞానోపదేశమునకై వారి బాధ్యతనంతను ఉయ్యక్కొండారుల కప్పగించిరి.

శెల్వ చ్చిఱుమీర్ గాళ్ -

శెల్వ మనగా ఐశ్వర్యము, ఇట్టి జ్ఞానజన్మల కైశ్వర్యము భగవత్కైంకర్యమే యని మన పూర్వాచార్యుల సిద్ధాంతము. అన్నిటిని విడిచి శ్రీరామసేవకై తట్ట, త్రవ్వ గోలలతో అనుగమించు లక్ష్మణస్వామిని వాల్మీకి మహర్షి "లక్ష్మణో లక్ష్మి సమ్పన్నః" అనుటయు, సర్వసంగపరిత్యాగము చేసి కైంకర్యాభిలాషతో శ్రీరాముని సన్నిధికేతెంచిన విభీషణాళ్వారులను "అన్తరిక్షగత శ్శ్రీమాన్" అనుటయు, మొసలి నోట పడి పెక్కు దేవమానములు పీడింపబడిన గజేంద్రుని విష్ణుధర్మము "స తు నాగవర శ్శ్రీమాన్" అనుటయు నిందులకు ముఖ్యప్రమాణములు.

ఏతావతా – అట్టి గ్రామమున భగవత్సంబంధము గలిగి భగవదనుభవమునకు కావలసిన అభినివేశము కలిగియున్న

శిఱుమీర్ గాళ్ - చిన్న పిల్లలారా!

వయస్సుచే చిన్నవారును, ఆడవారు నగుటచే తమను తాము రక్షించుకొన జాలనట్టి అనన్యార్హ శేషభూతులగునట్టి.

నేరిழையీర్ -

అందులకు తగిన జ్ఞాన, భక్తి, వైరాగ్యములనెడు ఆభరణములుగల జ్ఞానజన్మలైన సిద్ధోపాయనిష్ఠులారా! జ్ఞాన జన్మలనగా భగవదేకపరులు, నారాయణుడు తప్ప వేరుదైవము నెరుంగనివారు. గొల్లలును భగవదేకపరులే. వారెన్నడును తమను స్వతంత్రులనగా భావింపరు. వీరు శ్రీకృష్ణుని తప్ప వేరు దైవము నెరుంగనివారు ఈ సాదృశ్యమును బట్టి గొల్లలును జ్ఞానజన్మలే. శరీరజన్మలగు గొల్లవారైనచో ప్రకృతి సంబంధమువలన దేవతాంతర, సాధనాంతర, ఫలాంతరప్రవృత్తి యుండిన నుండవచ్చును గాని, జ్ఞాన జన్మలగు గొల్లవారికి నీ మూడింటికి నవకాశ మెంతమాత్రము నుండదు గాన వారాకారత్రయసంపన్నులే యగుదురు. ఆకారత్రయమనగా – అనన్యార్హ శేషత్వ, అనన్య భోగ్యత్వ, అనన్యశరణత్వములు. త్రైవర్ణిక (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య) జన్మయు నంత ప్రధానము కాదు. వారిలోను కొందరికి నీ మూడు ప్రవృత్తు లుండుటను చూచుచున్నాము గదా! అట్టి దోషగంధ మొకింతయు లేనివారు జ్ఞానజన్మలే. ఇది మన పూర్వాచార్య సిద్ధాంతము.

## నీరాడప్పో దువీర్ పోదుమినో -

ఇచ్చట నీరాట్ట మనగా భగవత్కైంకర్య గుణానుభవానుసంధానము. అనగా - భగవత్కళ్యాణగుణచేష్టాదుల ననుభవించుటకు కోరికగలవారు రండు. ఎండదెబ్బ తిన్నవారికి చల్లని నీటిస్నాన మెట్లానందప్రదమో, అట్లే తాపత్రయసంతప్తులగు ముముక్షువులకు భగవద్గుణానుసంధానము నట్టిదే.

## కూర్వేల్ కొడున్దొళిలన్ నన్దగోపన్ కుమరన్ -

మిక్కలి తీక్ష్ణమైన హింసాకాండను జరిపించు బల్లెముగల నందగోపుని కుమారుడు.

నిరపరాధి ప్రాణులను హింసించుట పాపము కాదా యన్నచో స్వార్థమైన హింస పాపావహము గాని భగవంతుని నిమిత్తమైన హింస, హింస కానేరదు. "మన్నిమిత్తం కృతం పాపం । అపి ధర్మాయ కల్పతే" నాకొరకు శాస్త్రనిషిద్ధమైన పాప మొనరించినను అది ధర్మమే భగవానుడు భగవద్గీతలో "యజ్ఞార్థాత్ కర్మణోఽన్యత్ర । లోకోఽయం కర్మబన్ధనః ॥" అని సెలవిచ్చెను. యజ్ఞమనగా "యజ దేవపూజాయాం" అను ధాతువునుండి పుట్టినదగుటచే "యజ్ఞార్థాత్ కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబన్ధనః" అనుటచే నిట్టి యజ్ఞముకొరకై చేయబడిన కర్మకాక యితర కర్మలన్నియును బంధహేతువులగుచున్నవని తాత్పర్యము. "చాతుర్వర్ణ్యం మయాసృష్టం........" "న మాం కర్మాణి లిమ్పన్తి, న మే కర్మఫలే స్పృహా" 'సమస్తభూతసృష్టికిని కారణములగు కర్మలకు బాధ్యులు ఆ చేతనులే గాని నేనెంత మాత్రమును కాను. కావున ఆ కర్మలు నన్ను బంధించవు.'

కృష్ణతాపిన్యుపనిషత్తులోని కథ — యమునకావలియొడ్డున నిరాహారదీక్షతో తపస్సు చేయుచున్న దుర్వాసుని వ్రతాంతమందగు పార్వణము రోజున గోపికలందరును అనేకపక్వాన్నముల తీసికొని పోవుచు యమున పొంగుటచే దానిని దాటుటకుపాయమేమని కృష్ణుని అడుగగా అస్ఖలిత బ్రహ్మచారియగు కృష్ణుడు దారినిమ్మను చున్నాడన్నచో యమున దారి నిచ్చునని చెప్పగా వారట్లు చేసి యమునను దాటి యా పక్వాన్నములను దూర్వాసునకు నివేదించిరి. అతడు వానిని పూర్తిగా నారగించెను. తిరిగి వారు యమునకు దాటు మార్గమేదని యాతని ప్రశ్నింపగా నాతడు "సదోపవాసి మార్గ మిమ్మన్నాడ"ని యడుగుడని తిరిగి నదిని దాటుటకు మంత్రముగా నుపదేశించగా వారాతనితో "మీరు మేము తెచ్చిన పక్వాన్నముల పూర్తిగా నారగించితిరిగదా మీరు సదోపవాసు లెట్లగుదురు" రని ప్రశ్నించిరి. అందుల కా ఋషి పదునారువందల భార్యలున్నను కృష్ణుడస్ఖలితబ్రహ్మచారి యెట్లగు

చున్నాడో అటులనే నేనును ఈ పక్వాన్నముల నన్నిటిని ఆరగించినను నదోపవాసినే" యని సమాధాన మిచ్చెను. "న మాం కర్మాణి లిమ్పన్తి । న మే కర్మఫలే స్పృహా ।" అను భగవానుని వాక్యమే దీనికి పదుత్తరము. ఈవిధముగ ఫలాశ లేక యే కర్మలను చేసినను ఎవ్వడును ఆ కర్మలచే బద్ధుడు కాడని తాత్పర్యము.

## నన్దగోపన్ కుమరన్ -

ఇచ్చట నందగోపుడనగా నంద+గోప అనుటచే, (నంద) భగవంతుని కల్యాణ గుణములను, దివ్యచేష్టలను అనుభవించుచు ఆనందనిర్భరుడై, (గోప) తన ఆచార్యులవలన లభించిన మంత్ర మంత్రార్థములను అనధికారుల పరముకాకుండ కాపాడునట్టి సదాచార్యుడు. అట్లు తానానందించు టయే గాక తనను ఆశ్రయించిన భక్తులకు ఆ యర్థముల నుపదేశించి రక్షించు ఆచార్యులే నంద గోపులు.

"గురుం ప్రకాశయేత్ ధీమాన్ । మన్త్రం యత్నేన గోపయేత్ ।

అప్రకాశప్రకాశాభ్యాం । క్షీయేతే సమ్పదాయుషీ॥"

తన గురువునకు కీర్తి వచ్చునటుల మంత్రమంత్రార్థములను కాపాడుకొన వలెను. దానికి విపరీతముగా ప్రవర్తించినచో ఐశ్వర్యమున్ను ఆయువున్ను క్షీణించును. సంపదనగా భక్తి, ఆయు వనగా శేషత్వజ్ఞానము. ఇవి తరిగిపోవునని భావము.

## కూర్వేల్ కొడున్దొழిలన్ -

ఇచ్చట 'వేల్' అనగా భగవంతునకు నాస్తికుల వలన సిద్ధించు అనర్థముల బాపు మంగళా శాసనమని యర్థము. నిజముగా అర్చామూర్తులను కాపాడునవి ప్రాకారములును, కవాటములును కావనియు, భాగవతమంగళాశాసనములే రక్షకములనియు మన పూర్వాచార్యుల విశ్వాసము.

## కొడున్దొழిలన్ -

ఆ క్రూరవ్యాపారము లేవి యనగా- అల్పదోషమున కధికశిక్షను విధించు రాజును ప్రజలు క్రూరు డందురు. అటులనే భగవంతునకు వచ్చునట్టి అల్పానర్థములకు అధిక మంగళాశాసనము చేయుట. ఇది ప్రేమ కార్యము.

## కు మ ర న్ -

ఇట్టి యాచార్యులకు ఉత్తమ పుత్రునివలె అత్యంత విధేయుడై హృదయమును కనిబెట్టి కైంకర్యమును చేయు శిష్యుడు.

"దైవాధీనం జగత్సర్వం । మన్త్రాధీనం తు దైవతమ్ । -
తన్మన్త్రం బ్రాహ్మణాధీనం । బ్రాహ్మణో మమ దైవతమ్॥"

సమస్త లోకములు భగవంతునకధీనములై యుండును. ఆ భగవంతుడు మంత్రమున కధీనుడు ఆ మంత్రము ఆచార్యున కధీనము. ఆ ఆచార్యులే నాకు దైవము- అని భగవంతు డాన తిచ్చెను. ఇచ్చట బ్రాహ్మణు లనగా "ఆచార్యో వేదసమ్పన్నః" అనునటుల తాను వేదము నధ్యయ నము చేయుచు, ఇతరుల కధ్యయనము చేయించువారగు ఆచార్యులే. అట్టి ఆచార్యులకు భగవం తుడు విధేయుడై యుండును.

## ఏరార్న్దకణ్ణి యశోదై ఇళంసింగమ్ -

ఆనందముతో నలరారు కన్నులుగల యశోద బాలసింహము.

## య శో ద -

అనగా అష్టాక్షరీ మహామంత్రము. "మన్త్రో వై మాతా" అను శ్రుతి, మంత్రమును తల్లిగా చెప్పు చున్నది. తల్లి బిడ్డను తన గర్భమున నిడుకొని సమయము వచ్చినపుడు కనునటుల మంత్రము తనచే తెలుపబడు నారాయణుని తన గర్భమునం దుంచుకొని తగిన యధికారి తటస్థించునపు డాతనికి తన యర్థమును ప్రకాశింప జేయును.

మరియు, "యశః దదాతీతి - యశోదా" కీర్తి నిచ్చునది. మంత్రమున్ను

"ఐహ లౌకిక మైశ్వర్యం । స్వర్గాద్యం పారలౌకికమ్ ।
కైవల్యం భగవన్తం చ । మన్త్రో ఽయం సాధయిష్యతి॥
(వృద్ధ హారీత స్మృతి - 3 - 87)

అనునటుల ఐహిక, పారలౌకికైశ్వర్యములను, కైవల్యమును, ముక్తిని తనను శ్రద్ధతో నాదరించు వారికి ప్రసాదించును. అందుచే అష్టాక్షరీ మంత్రసామ్య ముండుటచే యశోద యనగా అష్టాక్షరీ మహామంత్రము.

## ఏరార్న్ద కణ్ణి -

ఈమె కీ విశేషము కలదు, 'కణ్' అనగా జ్ఞానము. అది సౌందర్యముతో నిండియుండుట అనగా లక్ష్మీనారాయణుల గూర్చిన దగుటయే. కాబట్టి అర్థపంచక జ్ఞానమును, నవవిధ సంబంధ జ్ఞానమును ప్రసాదించు మంత్రమని యర్థము.

ఇళం సింగమ్ -

అష్టా మంత్రముచే ప్రకాశింపజేయబడు శ్రేష్ఠుడు. అష్టాక్షరీ మహామంత్రము, భగవంతుని వ్యాప్తిని, వ్యాపించు రీతిని, వ్యాప్యవస్తువులను, వ్యాప్తిఫలమును, భగవంతుని కల్యాణ గుణములను ప్రకాశింపజేయునది గాన "యశోదై ఇళం సింగమ్" అని చెప్పబడుచున్నది.

కార్మేని - నల్లని శరీరముకలవాడు

నల్లతనముతో చల్లదనమును చేర్చుట మన పూర్వాచార్య సంప్రదాయము. అనగా- సేవించు వారి తాపత్రయమును శమింపజేయు శరీరమని యర్థము. భగవంతునకును, మేఘమునకును అనేక ధర్మములలో పోలిక గలదు.

1. ఇతడు మేఘమువలె నల్లగను, చల్లగను ఉండును.

2. మేఘమంతటను నిష్పక్షపాతముగా వర్షించునట్లు భగవంతుడును "సమో ఽ హం సర్వ భూతేషు" అని తన నాశ్రయించిన దేవ, తిర్యక్, మనుష్య, స్థావరములలో తరతమ భావము లేక అందరకును నిష్పక్షపాతముగా ఫలముల నిచ్చును.

3. మేఘము కొద్ది జలమును గ్రహించి దానికి పది రెట్లుగా జలమును వర్షించునట్లుగా భగవంతుడును "పత్రం పుష్పం ఫలం తోయం" అనునటుల మననుండి పత్ర పుష్పఫల తోయాదుల గ్రహించి మన కుత్తమ పురుషార్థములను ప్రసాదించును.

సుదాముడు ప్రీతితో తెచ్చిన పిడికెడు అటుకులను తినెనో లేదో రెండవ పిడికిటికై చాచిన చేతిని పట్టుకొని రుక్మిణీదేవి "స్వామీ! మీరాపిడికె డటుకులను తిని "తర్పయత్యఙ్గ! మాం విశ్వమేతే పృథుక తణ్డులాః" "సుదామా! ఈ నీ పిడికె డటుకులు నన్నును, నాలో నున్న బ్రహ్మాండములను ఆనందపరచిన" వంటిరి గదా! "ఏతావతాలం విశ్వాత్మన్" ముల్లోకముల నితని కొనంగుటకు మీరు ప్రీతితో తిన్న యటుకులే చాలును. ఇంక రెండవ పిడికిలిని కూడ తిన్నచో నిక నేమిత్తు" రని యడ్డుపడెను. కృష్ణు డాతని కపారైశ్వర్యమును మోసుకొనిపోయి చేర్చెను, "యోగ క్షేమం వహామ్యహం" అనెను కదా! ఇదియును ఒక మేఘసామ్యము.

4. మేఘము వర్షర్తువందు తనకున్న నీటినంతను వర్షించి శరదృతువున ఇక నిచ్చు జల మొక బొట్టైనను లేక వెలవెల బోవును. అటులనే భగవంతుడు భక్తుల కెంత యిచ్చినను

తృప్తి తీరక "గోవిన్దేతి యదాక్రన్దత్ కృష్ణా మాం దూరవాసినం। ఋణం ప్రవృద్ధ మివ మే హృదయా న్నాపసర్పతి" ద్రౌపది మహత్తరాపత్తులో దూరముననుండి "శంకచక్ర గదా పాణే...... రక్ష మాం శరణాగతామ్" అని యాక్రోశించినది కదా! అందుకు నేనేమి తగిన సత్కారమును చేయగలిగితిని? నేను చేసినవన్నియు వడ్డీకి మాత్రమే సరిపోయెనే! అసలు ఋణ మట్లే యుండిపోయెనని పరితపించెను కదా!

5. మేఘము దర్శనీయముగా నుండునటుల శ్రీమన్నారాయణుడును దర్శనీయసౌందర్యముతో పూర్ణుడు.

ఈ విధములగు సామ్యములను బట్టి మన కన్నివిధముల పొందదగినవాడు భగవంతుడే యని చెప్పబడినది.

శొ ణ్గ క్ష్ణ్ - ఎఱ్ఱని కన్నులు కలవాడు.

"ప్రియో హి జ్ఞానినోఽ త్యర్థమహం స చ మమ ప్రియః" అనినట్లు నాభక్తునకు నాయందును, నాకు నా భక్తుని యందును గల ప్రీతిని సర్వజ్ఞుడను, సర్వశక్తి కలవాడనైనను నేను చెప్పలేననెను. (అత్యర్థం = అతిక్రాన్తా భిధేయం = చెప్పదగుటను దాటిపోవుట). అట్టి వాత్సల్యమంతయు ఆతని కన్నులలో గాన్పించుటచే "ఎఱ్ఱని కన్నులుకలవాడ"నుచున్నారు పరత్వముచేతను, ఐశ్వర్యముచేతను కన్నులెఱ్ఱబారవచ్చును. ఆ రెండును ఈతనికి సహజగుణములే కావున సహజముగనే ఆతని కన్ను లెఱ్ఱబారియుండును.

"కార్మేని" యనుటచే సౌలభ్యసౌశీల్యములును, "శణ్గక్ష్ణ్" అనుటచే వాత్సల్యస్వామిత్వము లును తెలుపబడుటచే ఆశ్రయించుటకు సౌకర్యమును తెలుపు గుణము లీతనికి కలవని తెలియు చున్నది, ఇవియే గదా ద్వయమంత్రమున మొదటి నారాయణ పదముచే తెలుపబడు గుణములు!

1. వాత్సల్యము — రక్షించునో రక్షించడో యని ముందువెనుకాడ నవసరములేక తప్పక రక్షించు నను విశ్వాసము కలిగించును.

2. స్వామిత్వము — నాకు దర్శన మిచ్చునా? యని సంకోచించ నవసరములేక అందరకును స్వారాధ్యుడు, సులభదర్శనుడని తెలుపును.

3. సౌలభ్యము — అంత గొప్పవాడు మనవైపు తన కటాక్షమును ప్రసరింపజేయునా యని సిగ్గుపడి వెనుదీయనవసరములేదని తెలుపును.

4. సౌశీల్యము — గొప్పవాడు మిక్కిలి తక్కువవారితో, తనకంటె గొప్పవారితో వలె, కలసి మెలసియుండు స్వభావము.

ఈ నాలుగు గుణములను ఎట్టివారైనను భగవంతుని నిస్సంకోచముగా నాశ్రయించవచ్చునను ధైర్యము నొసంగు కల్యాణగుణములు.

కతిర్ మదియమ్ పోల్ ముకత్తాన్ -

సూర్యకిరణములతో గూడిన చంద్రునివంటి ముఖముకలవాడు.

"అధృష్యశ్చాభిగమ్యశ్చ। యాదోరత్నైరివార్ణవః" సముద్రము తనయందుండు తిమింగిలాదులచే ప్రవేశించుట కశక్యముగా నుండునట్లును, రత్నములతో సేవించదగినదిగా నుండునట్లును, నారాయణుడును తేజస్వియగు సూర్యునివలె భక్తిలేని వారిచే తేరిపారి చూచుట కశక్యుడయ్యు, చల్లని చంద్రునివలె భక్తులకు దరిజేరి సేవింపదగియున్నాడని తాత్పర్యము. ఈ విషయమునే నమ్మాళ్వార్లు "పత్తుడై యడియవర్కెళియవన్, పిఱర్గళుక్కరియ విత్తకన్ ( 1—3—1 ) అని సాయించిరి.

నారాయణనే - నారాయణుడే.

"నారాణామయనం యః సః" అను తత్పురుష సమాసముచే సర్వస్వామి యగువాడే మనకు వలయువాని నన్నిటిని ప్రసాదించువాడని పరత్వము తెలుపబడుచున్నది. "నరాః అయనం యస్య సః" అను బహువ్రీహి సమాసముచే మన మంగీకరించక పోయినను మనలను విడువక మన కంతర్యామిగా వేంచేసియుండు వాడని యాతని సౌలభ్యము తెలుపబడినది. మన మాచరించు సాధనానుష్ఠానమున్ను, నారాయణుని కృపయున్ను రెండును కలసి ఫలసిద్ధికాక, భగవంతుడే స్వయముగా గజేంద్రునకు వలె ఆపన్నులున్న చోటున కేగి వారి యాపదలను బాపి యభీష్టముల నొసంగుటలో నితరసహాయము నపేక్షించదని తెలియుచున్నది.

తారేమ్ నమక్కే పఱై తరువాన్ -

అనుటచే చరమశ్లోకమందలి 'మాం' పదముయొక్క సౌలభ్య సూచకమగు అర్థమును "కతిర్ మదియమ్ పోల్ ముకత్తాన్" అనుటచే 'అహం' పదముయొక్క పరత్వార్థమున్ను సూచింపబడినవి.

ఈ విధముగ 'నందగోపన్' మొదలు ఇంతవరకు ఆచార్య పరాధీనతయు, వాత్సల్యాది ఆశ్రయణ సౌకర్యాపాదక గుణములున్ను, జ్ఞానశక్త్యాది ఆశ్రితకార్యాపాదక గుణములున్ను కలిగి

యున్న శ్రీ నారాయణుడే పర్వత సౌలభ్యములతో నిండియుండి సర్వసమాశ్రయణీయుడై, సకల పురుషార్థప్రదుడై వేంచేసియున్నాడు అని చెప్పబడినది.

స మ క్కే - మనకే.

సాధనాంతరములను, ఫలాంతరములను, దేవతాంతరములను, తన రక్షణను తానే చేసికొందునను దురభిమానమును విడచి, నారాయణుడే పురుషార్థ ప్రదుడని నమ్మియున్న మనకే.

"అనన్యాశ్చింతయన్తో మాం । యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం । యోగక్షేమం వహామ్యహమ్॥"

అను శ్లోకార్థము నిచ్చట గమనింపుడు. ఇచ్చట 'మనకే' యని 'ఏ' కారముండుట వలన ఒక చేతితో నితరోపాయముల నాచరించుచు నొక చేతితో పరమపురుషుని పాదముల నాశ్రయించిన ఉభయకూలస్థులకు సర్వేశ్వరుడు వారు గావించు కర్మాను గుణముగనే ఫలముల నిచ్చును గాని చరమ శ్లోకమున చెప్పబడిన యీ యుపాయాంతరముల నన్నిటిని రుచి వాసనలతో విడచి నారాయణునే యుపాయముగా నమ్మినవారికి వలె తన కృపతో ఫలము నొసంగడని తాత్పర్యము.

పఱై తరువాన్ పారోర్పుగழ -

పురుషార్థము నొసంగును. అందువలన భూలోకమునందుండువారిలో లౌకికులు గాని, వైదికులు గాని, పరమవైదికులుగాని యందరును పొగడునట్లు ఈ వ్రతమున ప్రవేశించి దాని కంగముగా స్నానమాచరించుటకు రండు - అని అన్వయించవలెను.

ఫలశ్రుతి — ఈ వ్రతము ఫలాపేక్షకలవారికి ఐహిక, పారలౌకికఫలప్రదము. నిష్కాములకు నిత్యకర్మవలె అనుష్ఠించతగినది. ఈ విధముగా నిది యందరకును కర్తవ్యము.

## సందర్భానుసారముగా ననుసంధింపదగిన పాశురములు

"ఏరార్న్ద కణ్ణియశోతై యిళంసింగం" అనుచోట —

ఉన్దమడిగళ్ మునివర్ ఉన్నై నానెన్ఱుయిల్ కోలాల్,
నొన్దిడమోదవుఙ్గిల్లేన్ ఉఙ్గళ్ తమానిర్రై యెల్లామ్,
వన్దు పుగుతరుమ్పోదు వానిడై త్తెయ్వఙ్గళ్ కాణ,
అన్దియమ్పోదఙ్గు నిల్లేలాழியఙ్గైయనే వారాయ్.

(పెరియతిరుమొழி. 10-4-8)

యశోద శ్రీకృష్ణుని అల్లరి చేష్టలకు గ్రామస్థులు పెట్టు మొరలను విని విసిగి సంధ్యాసమయ మైనను నింటికి రాక యూరుపట్టుకొని తిరుగాడు కృష్ణు నిట్లు కోపించుచున్నది —

కృష్ణా! మీ తండ్రిగారా నిన్ను కోపపడరు. నేను నా చేతి బెత్తముతో నిన్ను మొత్త జాల కున్నాను. చూడు, నీవు మేపు ఆవులన్నియు వచ్చి యూరిలో పడుచున్నవి. ఇది ఆకసమున భూత ములు సంచరించు సమయము. ఈ అసురసంధ్య వేళ బైట తిరుగక యింటికి చేరుము.
పై సందర్భములోనిదే —

మిడఱు మెళుమెళుత్తోడ వెణ్ణెయ్ విళుజ్గిప్పోయ్,
పడిఱు పలశెయ్ దిప్పాడి యెజ్గుమ్ తిరియామే,
కడిఱు పలతిరి కానదరిడై క్కన్రిన్‌పిన్,
ఇడఱ వెన్నైక్కొయ్ పోక్కినేన్ ఎల్లే! పావమే.

(పెరియాళ్వార్ తిరుమొళి 3–2–6)

చిన్నపిల్ల లింటిలో చేయు నల్లరులను భరించలేక యింకను నైదేండ్లు నిండకముందే కాన్వెంట్ బడులకు పంపునటుల యశోద శ్రీకృష్ణుని దూడలను మేపుటకై యడవికి పంపి యాతని రాక కొంచె మాలస్యమగు సరికిట్లు పశ్చాత్తాప పడుచున్నది.

అయ్యో! నాబంగరుకొండను వెన్నను, మీగడను మ్రింగి యూరిలో సంతటను అల్లరిచే యుచు తిరుగకుండ అయ్యో! నాపాపమా! శ్రమపడునట్లుగా నా బిడ్డను అడవుల కేల పంపితినో–అని. అదే సందర్భము —

ముళుదుమ్ వెణ్ణె యళైన్దు తొట్టుణ్ణుమ్ ముగిళ్ శిజ్ఞాఱుత్తామరై క్కైయుమ్,
ఎళ్లిల్‌కొళ్ తామ్బు కొణ్డడి ప్పొద అక్కొళ్ గునిలైయుమ్, వెణ్ణెయిర్ తోయ్‌న్ద శెవ్వాయుమ్,
అళుగైయు, మఞ్జానోక్కు, మన్నోక్కు మణికొళ్ శెజ్ఞారువాయ్ నెళివ్పదువుమ్,
తొళుకైయు, మివై కణ్డ వశోదై తొల్లై యిన్బ త్తిఱు దిక్కణ్డాళే.

(పెరుమాళ్ తిరుమొళి 7–8)

కుండలోనున్న వెన్ననంతను చేతినిండ తీసికొని లేత చిగురువలెను, తామరపువ్వువలెను ఉన్న చిన్నచేతులను, మంచి అందమైన త్రాడును తీసికొని యశోద కొట్టుటకు రాగా భయపడి నిల చిన కీతిని, తెల్లని పెరుగు అంటుకొని యున్న యెర్రని నోటిని, యేడ్పును, భయపడి చూచు ఆ చూపును, చక్కని యెర్రని చిన్న పెదవులదరుటయును, క్షమింపు మని జోడించి నమస్కరించు చున్న చేతులను, వీని నన్నింటిని చూచుటచే బ్రహ్మానందముయొక్క చరమసీమ ననుభవించు కన్నులుగలదగుటచే యశోద "పేరార్న్ద కణ్ణి" అనబడును.

❀ ❀ ❀ ❀

# రెండవ పాశురము

# "వైయత్తు వాళ్వీర్ గాళ్"

## — అవతారిక —

సిద్ధౌషధమును సేవించువారు ముందుగా పథ్యాపథ్యముల బాగుగా నెరింగి దానిని సేవించవలసినట్లుగా నీ ధనుర్మాస వ్రతము ననుష్ఠించువారున్ను చేయవలసినవానిని, చేయరానివానిని బాగుగా నెరింగి యాచరింపవలెనని యీ పాశురమున తెలుపబడుచున్నది, సాంసారిక విషయములలో విడువవలసినవానిని విడుచుటయు దుర్లభమే, పట్టవలసినవానిని పట్టుటయు దుర్లభమే. దానికి కారణము నిజముగా వస్తుస్వభావమునుబట్టి వచ్చునట్టి యొకమంచిగాని, చెడు గాని లేదు. అట్లు తోచుట చేతనుని పుణ్యపాపమును బట్టియే. దేశకాలావస్థలనుబట్టి యొకనా డొకవస్తువు నాదరించిన వాడే కొన్ని రోజులు గడచిన పిమ్మట దానినే యనాదరించుచున్నాడు. అనాదరించినదానిని తిరిగి యాదరించుచున్నాడు. ఆ యాదరానాదరములు వస్తుస్వభావమును బట్టియైనచో నెప్పుడును నొకే విధముగ నుండవలెను. వాని తారతమ్యము నెరుంగుట దుశ్శకము. భగవద్విషయ మట్లు గాక సకల కల్యాణగుణాకరుడగు సర్వేశ్వరుని పరిగ్రహించి అల్పాస్థిరముల విడచుట సుకరము.

క్రిందటి పాశురమున ఫలస్వరూపమున్ను, సాధనస్వరూపమున్ను, అధికారి స్వరూపమున్ను చెప్పబడినవి. ఈ పాశురమున నా యధికారికి సంభవించు స్వభావములు చెప్పబడుచున్నవి.

### రెండవ పాశురము

వైయత్తు వాళ్వీర్గాళ్ నాముమ్ నమ్బావైక్కు,
శెయ్యుమ్ కిరిశైగళ్ కేళీరో, పాఱ్కడలుళ్
పైయత్తుయిన్ర పరమ నడిపాడి,
నెయ్యుణ్ణోమ్ పాలుణ్ణోమ్ నాట్కాలే నీరాడి,
మైయిట్టెళుదోమ్ మలరిట్టు నామ్ ముడియోమ్,
శెయ్యాదన శెయ్యోమ్ తీక్కుఱళై చ్చెన్రోదోమ్,
ఐయముమ్ పిచ్చైయు మాన్దనైయుమ్ కైకాట్టి,
ఉయ్యు మాఱెణ్ణి యుగన్దేలో రెమ్బావాయ్.

## — తాత్పర్యము —

భూలోకములోనిది యగు గోకులమున బుట్టి సుఖించుచున్న యో భాగ్యవతులారా! మన మాచరింపబోవు ధనుర్మాస వ్రతమునకు ముఖ్యముగా చేయవలసిన కర్తవ్యమును వినుడు. పాల కడలిపై శేషతల్పమున నెమ్మదిగా పవళించి జగద్రక్షణ చింతను గావించుచున్న పరాత్పరుడగు శ్రీమన్నారాయణుని పాదారవిందముల స్తుతించవలెను. నేతిని వాడరాదు. పాలను త్రాగరాదు. వేకువనే మేల్కాంచి స్నానము నాచరించవలెను. కన్నులకు కాటుక నిడరాదు. శిఖయందు పువ్వులను దాల్చరాదు. శాస్త్రము చేయరాదని చెప్పిన పనులను చేయరాదు. ఒకరిపై నొకరు నేరములను చెప్పరాదు. సత్పాత్రులకు, చేయదగినంత దానమును చేయవలెను. బ్రహ్మచారులకు, సన్న్యాసులకును యథా శక్తిగా భిక్ష నొసంగవలెను. ఇట్టివి మన కుజ్జీవన మార్గములు. వీని నన్నింటిని సంతోషముతో పాటించుచు నీ నోమును కొనసాగించవలెను.

## — విశేషార్థము —

వైయత్తు వాళ్వీర్ కాళ్ -

భూమిపై జన్మించియుండియు సుఖించుచున్న ఓ భాగ్యవతులారా!

ఇతర యవతారములలో లేని సౌలభ్యముయొక్క కొరతను తీర్చుటకై శ్రీకృష్ణుడై గోకులమున నవతరించి తన గొప్పతనమును కనబరచక అల్పునివలె నుండి ప్రవర్తించుచున్న సమయమునందే అతనితో కలసి సుఖించుటకై పెట్టిపుట్టిన భాగ్యవతులారా! ఈ సుఖమునకు పరమపదసుఖ మొక సాటియా? అచ్చట కేవల పరత్వానుభవ మొక్కటియే గాని యాతని సౌలభ్య సౌశీల్యముల ననుభవించుట కుచితమైన స్థాన మీ గోకులమే గదా!

పరమపదము త్రిపాదియగుటచే అచ్చట అనుభవించువా రసంఖ్యాకములుగ నుందురు. సంసారము పాదపరిమిత మగుటచే భోక్త లల్పముగ నున్నను ఇచ్చట అనుభావ్యమగు భగవంతుని కల్యాణ గుణము లసంఖ్యాకములుగ నుండును ముముక్షువులు గాని, ముక్తులు గాని అనుభవించ గోరునదియు, భగవంతునిచే ననుభవింపజేయబడునదియు, వారనుభవించునదియు "సో ఽ శ్నుతే సర్వాన్కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితే తి" అనియు, "తస్మిన్ యదన్త స్తదుపాసితవ్యమ్" అనియు శ్రుతివాక్యములచే చెప్పబడు భగవత్కల్యాణ గుణములు చీకటియందలి దీపమువలె విచ్చలవిడిగా ప్రకాశించున దీ లీలావిభూతియందే, ఉపనిషత్తుచే అగ్నికి ఎరుపు రంగును, నీటికి తెలుపు రంగును, భూమికి నలుపు రంగును చెప్పబడుచున్నవి. కావున భూమికి తమోగుణము ప్రధానము. కావుననే ఆళ్వార్లు భూమికి "ఇరుళ్ తరు మా ఞాలమ్" అని బిరుదు నొసంగిరి. అనగా- అజ్ఞానమును భూరి

వాన మొసంగు విశాలమైన భూమండల మని వాని కర్థము. ఆ గుణ మజ్ఞానమునే పెంపొందించును. వానిచే నిచ్చట నున్నవారు పాపులుగనే ప్రసిద్ధులై యుందురు. ప్రవాహమున కెదురీదు నేర్పరులు లేకుందురా? శ్రియఃపతి అధికారి దోషమును చూడనట్టియు, చూచినను ఇష్టపడునట్లు చేయు వాత్స ల్యమున్ను, ఒక్కసారి "శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే" అన్నచో వారి పాపములను బాప గల ఓర్పున్ను, పాప ఫలమగు దుఃఖమును వారనుభవించుచుండగా చూచి సహించ లేనట్లు చేయు కృపయును ఆవశ్యకములగుటచే నవి లీలావిభూతియందే ప్రకాశించును. పరమపదమున నవి యున్నను వానికి విషయములు లేకుండుటచే పనిలేక పడియుండును. ఆ గుణముల ననుభవించుటకే నిత్యసూరులు తగునట్లు తమ రూపముల మార్చుకొని యిచ్చటికే వచ్చి యనుభవింప జూతురు.

"అహృత సహజ దాస్యాః సూరయః ప్రస్త బన్ధాః,
విమలచరమదేహా ఇత్యమీ రఙ్గధామ!
మహితమనుజ తిర్యక్ స్థావరత్వా శ్శ్రియ స్తే ।
సునియత మితి హ స్మ ప్రాహురేభ్యో నమస్తాత్ ॥
(రఙ్గరాజ స్తవము. శ్లో. 33)

ఓ రంగనాథా! నీ యర్చావతారప్రయుక్తమైన కల్యాణ గుణముల ననుభవించుటకే నిత్య సూరులున్ను, ముక్తులున్ను, ముముక్షువులగు ప్రపన్నులున్ను నీ శ్రీరంగమున పూజనీయులగు భాగవ తులుగను, పశుపక్ష్యాదులుగను, తరులతాగుల్మాదులుగను పుట్టి యనుభవించుచుందురని సాయించిన మహానుభావులకు మా నతిసందోహములు.

అవతారసౌలభ్యమునకును, దయాదిగుణములకును వశీభూతులైనవారు మరియొక స్థానము నేవగింతురు. శ్రీరామచంద్రుడవతారమును చాలించి వానరులతోను, రాక్షసులతోను, కోసలవాసుల తోను తన స్థానమగు పరమపదమునకు పయనించు సమయమున శిరియ తిరువడి (ఆంజనేయులు). శ్రీరామునితో

"స్నేహో మే పరమో రాజన్ ! త్వయి నిత్యం ప్రతిష్ఠితః ।
భక్తి శ్చ నియతా వీర ! భావో నాన్యత్ర గచ్ఛతి ॥"

అని విన్నవించెను. అనగా - ఓ వీరాగ్రణీ! రామచంద్రా! నాకు నీయం దనన్యభక్తి కలదు. అందుచే నాకు నీతో పరమపదమునకు రావలయు నను ఉద్దేశము కూడ లేదనెనట. ఇచ్చట "రాజన్" అని సంబోధించి 'స్నేహః' అనుటయు, 'వీర'యని సంబోధించి 'భక్తి' యనుటలో గల తారతమ్యము నారయుదము.

"రాజా ప్రకృతి రఞ్జనాత్" అను నటుల తన పరిపాలనలో నున్న ప్రజల నానందింపజేయు వాడు రాజు. అట్టి దృష్టితో నాకు నీయందు స్నేహము మాత్రమే యున్నదనియు. 'వీర' యని సంబో ధించుటచే "వినా ఈరతే" పక్షియైన గరుత్మంతునితో సంచరించుచున్నాడు గాన 'వీర' యని యర్థము. ఇతడు నారాయణున కసాధారణమైన వాహనముగాన ఆ దృష్టిలో (నారాయణత్వభావనలో) నీయందు నాకు అనన్యమైన భక్తి కలదని తాత్పర్యము ధ్వనించుచున్నది. 'భక్తి' యనగా శ్రీరామచంద్రుడు లక్ష్మణుని "నాతో రావలదు, ఇంటియొద్దనే యుండు" మనగా అయన "జలా న్మత్స్యా వివోద్ధృతౌ" అని ప్రాణమే విడుతుననెను. ఇది భక్తి. 'స్నేహ' మనగా విషయము తెలియకున్నను ఒక వ్యక్తి యెడబాసినచో తెలియకుండగనే దశరథునకు వలెనే ప్రాణములు పోవుట.

ఇటులనే తొండరడిప్పొడి యాళ్వారులును "ఇన్దిర లోక మాళుం అచ్చువై పెరినుం వేణ్డేన్" (తిరుమాలై. పా, 2) అనగా – "ఈ లోకమునందే యుండి భగవన్నామానుసంధాన రసానుభవము లభించినచో స్వర్గమునకు పోయి దాని నేలునట్టి సుఖము లభించినను నేను కోర" వని పాయించిరి.

ఇటులనే తిరుప్పాణి యాళ్వారులును 'అమలనాది పిరాన్' అను గ్రంథమందలి 10వ పాశురములో "కొణ్డ ల్వణ్ణనై" అనుచోట శ్రీరంగనాథుని వర్ణించి "కణ్ణకణ్గళ్ మత్తొన్నినై కాణావే" అనగా "అయనను సేవించిన నా కన్నులతో పరమపదవాసుదేవునైనను చూడ" నని పాయించిరి.

వా ళ్ళై ర్ కా ళ్ -

ఆ యూరిలో పుట్టినను వయస్సు మీరి యుండక ఆ శ్రీకృష్ణుని కటాక్షమునకు గురియగు నటుల ఆతనికి తగిన వయస్సులో నుండుట. ఆహా! యేమి వీరిభాగ్యము! శ్రీకృష్ణావతారమునకు ముందో వెనుకనో గాక యాతనికి సమకాలీనులై జన్మించుటయు, ఆ యూరియందే పుట్టుటయు, ఆతనికి తగిన వయస్సులో నుండుటయు వీరిభాగ్యము కదా! యని యాండాళ్ తల్లిగారు ముగ్ధులగు చున్నారు.

వా ళ్ళై ర్ కా ళ్ -

ఆ గ్రామమున వసించుట, సుఖించుట వేర్వేరు కావు. అక్కడ నుండుటయే సుఖించుట. ఈ గోకులవాసము శ్రీరంగవాసము వంటిదే.

"ఇదం హి రఙ్గం, త్యజతా మిహాఙ్గం । పున ర్నచాఙ్గం యది చాఙ్గ మేతి ।
పాణౌ రథాఙ్గం శయనే భుజఙ్గం । యానే విహఙ్గం చరణేఽమ్బు గాఙ్గమ్ ॥"

అని మతాంతర ప్రవర్తకులైన పెద్దలే యాడుపడిరి.

అప్పను కాని యిట్లు చెప్పుచున్న ఆండాళ్‌తల్లికిని ఈ సుఖము సమమే గదా! అట్లుండ 'సుఖించువారలారా!" యని యితరులగూర్చి చెప్పనేల? యన్నచో తాము ఒంటరిగా ననుభవించు ననుభవము రసానుభవముగా గోచరించదు. అందుచే దానిని రసవంతముగా జేసియిచ్చువారిని కొనియాడుచున్నారు.

"కదా న్వహం సమేష్యామి । భరతేన తథానఘ !
శత్రుఘ్నేన చ వీరేణ । త్వయా చ రఘునన్దన ॥"

(శ్రీరామా-అరణ్య- )

శ్రీరామచంద్రుడు దగ్గరనే యున్న లక్ష్మణస్వామితో "లక్ష్మణా! నేనా భరతశత్రుఘ్నుల తోను, సీతోను ఎప్పుడు కలసియుందునో గదా యనెను. లక్ష్మణునితో కూడియుండియు నిట్లనుటలో ఆ లక్ష్మణ సంశ్లేష మానంద మొసంగునది వారిద్దరితో కలిసియున్నపుడే సట. లంకలో "విభీషణ స్తు ధర్మాత్మా" అనునట్లు భగవత్తత్త్వము నెఱింగి యనుభవించి యానందించువాడు విభీషుణు డొక్కడే యగునట్లు గాక గోకులమున పరమపదమునందు వలె ఒక గ్రామమునందుండు వారందరును భగవ దనుభవమే యాత్రగా గలవారగుటచే వారిభాగ్యమును కొనియాడుచున్నారు.

## వైయత్తు వాళ్వీర్ కాళ్ -

"ధ్యాయతో విషయా న్పుం సః' అనునటుల సంసారులు భోగచింతనతోనే కాలమును గడుపుచు చివరకు "బుద్ధి నాశాత్ ప్రణశ్యతి" అనునటుల ఉన్న జ్ఞానమును కూడ పోగొట్టుకొని నశించు ప్రపంచములో నుండియు భగవద్ధ్యానముతో కాలమును గడుపుచు చివరకు చరమపురుషార్థమైన నిత్య నిరవచ్ఛిన్న భగవత్కైంకర్యమును బడయగలవా రింతమంది యొకచోట నుండుట యేమి యాశ్చ ర్యమో! ఇది కుంపటిలో తామరపూవు వికవించినట్లున్న దని ఆండాళ్‌తల్లి పరవశించుచున్నారు. "వైయత్తు వాళ్వీర్‌కాళ్" అనుటచే పరమపదము నందున్న వారు క్లేశపడుచున్నారని ధ్వనించు చున్నది. పరమపదమున నెన్నడును గాని యనుభవించని భగవంతుని కొన్ని కల్యాణగుణములు గోకులమున కొల్లలుగ చూరగొనబడుచుండ పరమపదవాసులగు నా నిత్యముక్తులకు శ్రీరామచంద్రు డడవి కేగినపు డయోధ్యావాసము వలె నున్నది. సుమిత్ర లక్ష్మణునితో "అయోధ్య నడవి యనియు, అడవి నయోధ్యయనియు భావింపు" మని చెప్పినటులున్నది గదా! "అయోధ్యా నామ పూః" అని ఛాందోగ్య శ్రుతి పరమపదమునకు "అయోధ్య' యని పేరిడినది. వస్తువున కతిశయము గుణములను

ఇష్టమే గదా! అవి భగవంతునకు పరమపదములో నున్న కన్న లీలావిభూతిలోనే అధికముగా ప్రకాశించుటచే లీలావిభూతియే గొప్పది. ఇచ్చట నున్నవారందరును యోగ్యతను సంపాదించుకొని అచ్చటికి పోవలెనే గాని "న చ పున రావర్తతే" "అనావృత్తి శ్శబ్దాత్" అను శ్రుతి, సూత్రములలో చెప్పినటుల అచ్చటివారు ఇచ్చటికి వచ్చి యీ సౌలభ్య, సౌశీల్య, వాత్సల్య, క్షాంతి, కృపాది గుణముల ననుభవించుట కెన్నడును నోచుకొన లేదు గదా! అందుచేతనే ఆళ్వార్లు ఇచ్చటనున్న భక్తులగు సంసారులను "విణ్ణో రారిలుం నీళియర్" పరమపదవాసుల కంటె శ్రేష్ఠులని కొనియాడిరి.

నాముం - మనము.

ఏ పురుషార్థములైనను ప్రసాదించువాడు ఆ నారాయణుడే యను నధ్యవసాయము గల మనము. "ఫల మత ఉపపత్తేః" (బ్ర. సూ. 3-2-8), ఫలం = ఐహికమైనట్టియు, ఆముష్మికమైనట్టియు ఫలము, అతః (ఏవ) = పరమపురుషుని వలననే. ఉపపత్తేః = సర్వజ్ఞుడును, సర్వశక్తియును, మహోదారుడును, హోమ, దాన, యాగాదుల చేతను, ఉపాసన చేతను ఆరాధింపబడు భగవంతుడైన నారాయణుడే ఆ ఫలములను, స్వస్వరూప ప్రాప్తిరూపమైన మోక్షమును ఇచ్చుటకు సమర్థుడు. అంతియే గాని "క్షణ ధ్వంసియు, నచేతనమును నగు కర్మ కాదు" అను సిద్ధాంతాదరము గల మన మని యర్థము.

ఈ గోపాంగనలు అనన్యార్హ శేషభూతలును, అనన్యశరణ్యలును నగుటచే, చాతకపక్షి వర్షాధిదేవత యగు నింద్రుని తప్ప మరియొకరిని తన యభీష్టసిద్ధికై యాదరించనటుల, వీరును మరియొకరిని తేరిపారిచూడరు. "ఏకః కృతీ శకున్తేషు యోఽన్యం శక్రా న్న యాచతే". ఎంత యుపాయాధ్యవసాయ మున్నను "వరిల్ పొగడేన్, తేడిల్ కేడేన్" అనువటుల "వచ్చిన దానిని విడువను, పోయినదానిని వెతకను" అని యుండరాదు. ఫలప్రాప్తి యెప్పుడెప్పుడను ఆర్తి యుండవలెను. "పేత్తుక్కు త్వరిక్కై" ఫలము నిచ్చువాడు ఆతడే యైనను ప్రాప్యరుచి యున్నచోట నుండనీయదు. "ఈ ఫలము కాలక్రమముగా నెపుడో చేజిక్కునదియే" అను నమ్మకముగల మనమని యర్థము.

నంపావైక్కు - మన నోమునకు

ఇంద్రజిత్తు చక్రవర్తి తిరుమగనిని (రామచంద్రుని), ఆతని పరివారమునున్ను, నశింపచేయవలెనని చేసిన నికుంభిలాయాగమువలెను, పౌండ్రకవాసుదేవుడు శ్రీకృష్ణుని, ద్వారకావాసులను బాధించుటకై యభిచారహోమమును గావించి, కృత్యను బుట్టించి విడచినట్లును గాక నారాయణుడును, ఆతని విభూతియును సుఖించుటకై చేయుచున్న యాగమిది. లేక - వేరొక ఫలమును పొందుటకై చేయు నోము గాక శ్రీకృష్ణుడును, ఆతని విభూతియును స్థిరముగ నుండవలెనని యాచించు నోమిది.

శెయ్యుం కిరిశైగళ్ - చేయవలసిన కృత్యములను.

ప్రపన్నులైనను చేతను లగుటనే ఫలము సిద్ధించుటకొరకును, కాలక్షేపమునకును అవగాహించి యనుభవించుటకైన యనుష్ఠాన మని భావము ఆరంభించి విడువదగినది కాదు. పదింతలుగ చేసితీరవలసినదే.

"శెయ్యుం కిరిశైగళ్" అను మాట శ్రీకృష్ణుని చెవికి సోకగనే యాతడు "అయ్యో! వీరు సాధనాంతరములలో ప్రవిష్టులు కారు గదా!" యని భయపడును. ఇది ఉపాయానుష్ఠానము కాదు. ఫలమును పొందవలె నను తొందరయే. దానికి కారణము ప్రాప్యవైలక్షణ్యము. అది యాతడు దుర్గుణములకు దూరుడును, సద్గుణములకు ఆకరుడు నగుటయే. శ్రియఃపతిని ప్రపత్తిచేసితిమి కదా యని యీ త్వర లేనిచో ప్రపత్తి చేసినట్లుగనే పరిగణింపబడదు. వీరు ముముక్షువులే గదా! ముముక్షువులకు జ్ఞానఫలముండవలదా? అదియే గదా యీ త్వరకున్ను, దానివలన పుట్టునట్టి యుపాయాన్వేషణమునకును మూలము, క్షుద్రమైన గ్రామ్యసుఖములోని యభిలాషయే విపరీతచేష్టలలో ముంచివేయగా నది భగవద్విషయవ్యామోహమునం దుండవలదా? అందువలన ఉపాయోపేయములు నారాయణుడే యని నమ్మియున్నవారి కిక చేయవలసిదేమియు నుండదు. గావ వారు చేయునవన్నియును ఫలకోటిలో చేరునంతియే. వీరు చేయునవన్నియును భగవంతుని యొక్కయు, భాగవతుల యొక్కయు ముఖవికాసమునకే కాగలవు. అవియే వారికి ఫలము.

కేళీ రో - వినుడు.

"ఆడపిల్లలు సుమండీ! కృష్ణుడు సుమండీ! జాగ్రత్త జాగ్రత్త" అని ఆతనితో కలయుట నడ్డువారున్న యూరిలో నిది యేమి గోష్ఠి! ఇట్లుండుట ఆశ్చర్యము, ఆశ్చర్యము!! భగవంతుడనిన ముఖమును త్రిప్పివేయువారి కోలాహలముతో నిండియున్న యీ యూరిలో కృష్ణానుభవమున కిట్లు త్వరపడువా రింతమంది యుండుట యెంత వింతగానున్నది! అని యీ భాగవత గోష్ఠిని తలంచుకొని ఆండాళ్ తల్లి నివ్వెర పడుచున్నారు. ఈ నాలుగు రోజులును గడచిపోయినచో నిక మననా కృష్ణునితో కలియనిత్తురా?

కేళీ రో - వినుడు.

అనగా వినుటయే పరమపురుషార్థము. శిరియ తిరువడి (ఆంజనేయుడు) లంకలోనున్న అశోకవాటికలోని శింశుపావృక్షముపై కూర్చొని క్రిందనున్న సీతాపిరాట్టితో పరిచయము గావించుకొనుట యెట్లని యనేకవిధములుగా విమర్శించి చివరకు "సంశ్రవే మధురం వాక్యం" అన్నట్లు "రాజా దశ

రఘో నామ రక్ష కుర్జార వాజిమాన్" అని ప్రారంభించెను. ఈ శ్లోకాంతమున వాల్మీకి 'హో' యను పదమును ప్రయోగించెను. వాల్మీకి మహర్షి "యాత డెంత బుద్ధిమంతుడు!" అని యాశ్చర్యచకితుడగుచున్నాడు. ఆ మాటలు వినుటయే సీతమ్మకు పరమప్రయోజనముగా నుండెను.

మహాభారతమున సవాలక్ష గ్రంథముచే ధర్మార్థ కామ మోక్షము లనెడు చతుర్విధ పురుషార్థములను జెప్పి వైశంపాయనుడు "ఇందు నీవు నిశ్చయించుకొన్న పురుషార్థమేది?" యని యడుగగా జనమేజయుడు "పురుషార్థో ఽ య మేవైకో యత్కథా శ్రవణం హరేః" అనెను. అనగా "శ్రీమహావిష్ణువు యొక్క చరిత్రను మీరు చెప్పగా నేను వినుట యొక్కటియే యుత్తమ పురుషార్థమని నేను నమ్ముచున్నా" ననెను. చెప్పెడువారు ఆచార్యులని యనిపించుకొన వలెనని చెప్పువారు కారు. వినువారు తమకు తెలియని యర్థములను వినిపించుచున్నా రని యనుకొనువారు కారు, ఇది భక్తుల కాలక్షేప విధానము. భగవద్గీతలో భగవానుడు పదియవ యధ్యాయమున

"మచ్చిత్తాః మద్గత ప్రాణాః । బోధయ న్తః పరస్పరమ్ ।
కథయ న్త శ్చ మాం నిత్యం। తుష్య న్తి చ రమ న్తి చ॥"

అనగా- "వారి చిత్తముల చలింపనీయక నాపై నుంచి, నా రూపగుణ చేష్టితముల నొకరితో నొకరు చెప్పుటయే పురుషార్థముగను, వినువారు వినుటయే పురుషార్థము గను బోధించుకొనుచు" నని భక్తుల కాలక్షేప పద్ధతిని వివరించెను

భరతాళ్వారు (భరతుడు) శ్రీరామచంద్రుని తోడితెచ్చుటకై వెడలి మార్గ మధ్యమున గుహుని కలిసెను. అపుడు

"ఆచచక్షే చ సద్భావం । లక్ష్మణస్య మహాత్మనః ।
భరతా యాప్రమేయాయ । గుహో గహనగోచరః॥"

అనగా- అడవుల పిట్టల గొట్టుకొని జీవించు గుహుడు ఇంతయని చెప్పుటకలవి గాని మహిమ గల భరతునితో మహాత్ముడైన లక్ష్మణునకు శ్రీరామచంద్రుని యందున్న భావ బంధమును సమగ్రముగా చెప్పెనట. ఇది యెంత యాశ్చర్యకరమైన విషయమో ఆలోచింపుడు.

మాకు మీరు చెప్పిన దేదియైనను మంచిదే. తగిన దేదో చెప్పరాదా? యనగా-

పాఱ్కడలుళ్ పైయత్తుయిన్ల -

నారాయణు డాప్తులను రక్షించుటకై పరమపదము వారి కందరాకయున్నడని అచ్చట నుండి పాల సముద్రము వరకును పయనించి వచ్చి జగత్తును రక్షించు నుపాయ మేదా యను నాలోచనలో నిమగ్నుడై యార్తు లెవ్వరైనను పిలుతురేమో యని చెవియొగ్గి శేషతల్పముపై పవళించి యున్నాడు. తాను 'అ' కారవాచ్యు డగుటచే (అవ-రక్షణే) రక్షణభారము తనదే గాన "రక్ష్యాపేక్షాం ప్రతీక్షతే" అనునటుల నెవరైనను రక్షింపుమని తనను ప్రార్థింతురో యని యెదురుచూచుచుండునట. సర్వముక్తి ప్రసంగమును పరిహరించుటకును, పురుషార్థమగుటకున్ను (పురుషునిచే కోరబడునది పురుషార్థము), అజీర్ణవ్యాధిగ్రస్తునకు విందువలె గాకుండుటకై యీ మాత్రము ప్రార్థనను సర్వేశ్వరు డపేక్షించును.

పై య త్తు యి న్ల -

"తెల్లని పాల ప్రవాహము మీద నద్వితీయమైన శేషుని పక్కగా పరచుకొని దానిపై దొంగ నిద్రను (త్రిజగ ద్రక్షణ చింతను) అనుభవించుచున్న" అనుచున్నారు. ఈ నిద్రలో తత్త్వ మెరింగిన యాళ్వారులు దీనిని దొంగనిద్ర యందురు. నిజముగ దేవతలు అస్వప్నులు గదా!

పై య త్తు యి న్ల -

శ్రీమన్నారాయణుడు పర-వ్యూహ-విభవ-అంతర్యామి-అర్చావతారము నని యైదు రూపములతో వేంచేసియుండును. ఇందు వెనుక వెనుక రూపముల కన్నను ముందు ముందు రూపములు "సులభో హ్యుత్తరోత్తరః" అనునట్లు సులభములు. ఈ యైదింటిలో మొదటిదగు 'నారాయణత్వము' 'నారాయణనే' యను పదముచేతను, విశేషణముల చేతను మొదటి పాశురమున చెప్పబడినది, అచ్చటినుండి నానావిధావతారముల స్వీకరించుటకై పాలసముద్రమున పవళించిన వ్యూహావతార మీ పాశురమున చెప్పబడినది. (వ్యవసాయదారుడు విత్తనముల పరీక్షించుటకై వానిని తడిపి తడిగుడ్డను మూటకట్టి మొలకలు వచ్చినచో వానిని పొలమున నాటును. అటులనే క్షీరసాగర శాయి అవతార కందము. ఆతనినుండియే యవతారముల యావిర్భావము.)

"ఏష నారాయణ శ్శ్రీమాన్ । క్షీరార్ణవనికేతనః ।
నాగపర్యఙ్కముత్సృజ్య । హ్యాగతో మధురాం పురీమ్॥"

ఈ శ్లోక మీ సత్యమును ఋజువు చేయుచున్నది.

ప ర మ న్ -

ఈ శబ్దము, బంగరునందు పొదిగిన యింద్రనీల మాణిక్యమునకు వలె తెల్లని శేషునిపై నూతన జలధరవర్ణుడు పవళింపగా నాతని శరీరమున పుట్టిన కాంత్యతిశయమును చెప్పుచున్నది.

ప ర మ న్ -

అను శబ్దమునకు "పరః మా యస్మాత్" అను వ్యుత్పత్తిని బట్టి, యెవరికంటె గొప్పవాడు లేడో, యను నర్థము సిద్ధించుచున్నది. 'పరమ' అను పదమునకు విశేషణము లేకపోవుటచే నన్నింటి యందును గొప్పవాడను నర్థము సిద్ధించుచున్నది.

అ డి పా డి -

భగవంతుని గొప్పతనమునకు చివరిహద్దును గురించి చర్చించినచో తమ నైచ్యముయొక్క చివరిహద్దులో నిలువవలసినదే, అనగా- ఆ శ్రియఃపతియొక్క ఆధిక్యమును నిజముగ నెరింగినవాడు ఆతని చరణములపై పడి తన నైచ్యమును విన్నవించుకొనవలసి వచ్చును. అందులకే 'పరమన్' అనుటతోడనే 'అడిపాడి' అనుచున్నారు.

ప్రకరణమును బట్టి వీరిప్పుడు శ్రీకృష్ణుని పాదములను గూర్చి కదా పాడవలసి యున్నది. మరియును వీరి కిప్పుడు కన్నుల యెదుటనున్న శ్రీకృష్ణుని చరణములే భోగ్యముగా నుండుట సమంజసము గాని పరలోకమున నున్న క్షీరసాగర శాయిచరణములు కాదే! అట్టితరి శ్రీకృష్ణుని గురించి పాడుట మాని క్షీరసాగరశాయిని గూర్చి పాడనేల? అనగా, ఉభయత్ర ధర్మి యొక్కడే గదా! వ్యూహమైనను విభవమైనను ఆ వాసుదేవుని అవతార విశేషమే గదా! మరియొక ముఖ్యకారణ మేమనగా- వీరు శ్రీకృష్ణుని గురించియే ప్రత్యక్షముగా పాడినచో ఊరి పెద్దలు "మనము వీరిని వర్షమునకై నోము నోచుడని విడువగా, వీరు దానిని విడచి శ్రీకృష్ణుని గూర్చి పాడుచున్నారు. చూచితిరా"యని యనుకొనకుండుటకై యేదో యొక దేవుని పేరు చెప్పుచున్నారను కొనుట కట్లు పాడుచున్నారు. కపట సన్న్యాసి వేషధారి యగు అర్జునునకు కన్యగా నున్న సుభద్రను పాదసంవహనాది సేవలకై నియోగించగా నామె యొకనా డా సన్న్యాసిపాదము లొత్తుచుండగా నా సన్న్యాసికి (అర్జునునకు) ఆపాద మస్తకము గగుర్పాటు కలిగి యాతని మనోభావమును పైకి సూచించుచున్న తరి బలరాము డాతని సందర్శనమున కే తెంచుచున్నట్లు విని యీ దొంగసన్న్యాసి "హరే హరే మాధవ మాధవేతి హరి స్మృతే రన్యథయాఞ్చకార" అనగా నారాయణ నామాను సంధానమున నా కామ వికారముల మరుగు పరచెను. అట్లే వీరా కృష్ణ స్మృతి నీ పాటలతో కప్పిపుచ్చుచున్నారు.

## పాఙ్గాడలుళ్ పైయత్తుయిన్త -

"నాగపర్యఙ్క ముత్సృజ్య హ్యాగతో మధురాం పురీం" అని వెనుక చెప్పినట్లుగ శ్రీకృష్ణావతారమునకు మూలకారణమైన క్షీరాబ్ధినాథుని పాడదొడంగిరి.

## అ డి పా డి -

చేతను లైనచో శేషత్వమందరకును సమానమే. "దాసభూతా స్స్వత స్సర్వే హ్యాత్మానః పరమాత్మనః" అని కదా సిద్ధాంతము! ఆ మర్యాదచే "అడిపాడి" యనుట సమంజసమే.

## పాడి నెయ్యుణ్ణోం పాలుణ్ణోమ్ -

ఇట్లాతని తిరునామ సంకీర్తనమును చేసి నేతిని గాని, పాలను గాని భుజింపము.

అనగా. కేవలము నేతిని, పాలను మాత్రమే స్వీకరింపమని యర్థము కాదు. ఇట్టి భోగ్య పదార్థములను వేనిని కూడ వాడమని యర్థము. "పాడి నెయ్యుణ్ణోం" అనుటచే ఆకంఠముగ తినినవారికి తిరిగి తినపని లేదని తాత్పర్యము. వీరు తినిరా? అన్నచో వినుడు పెరియాళ్వార్ల శ్రీసూక్తి "ఉణ్ణానాళ్ పసియావ దొన్ఱు మిల్లై, నమో నారాయణా వెన్ఱు ఉనపాదమ్ నన్నానాళ్ అవై పట్టిని నాళ్" అనగా - "ఎన్నిదినములు భౌతికాహారమును తినకున్నను ఆకలియనున దొకింతయును లేదు. కాని 'నమో నారాయణా' యని నీ పాదారవిందములను సేవించని దినములే నాకు ఉపవాసదినములు," అనిరి. అట్టి యుపవాస మీ గోపికలకు కలనైనను ఉండదుకదా! వీరికి ధారక పోషక భోగ్యములు కృష్ణుడే.

ఈ భాషలో నమలి తినవలసినచో 'ఉణ్ణ' అనియు, త్రాగవలసినిచో 'కుడి' యనియు వాడవలెను. వీరట్లు గాక "నెయ్యుణ్ణోమ్. పాలుణ్ణోమ్" అని త్రాగవలసిన రెండింటికిని తినుటయను అర్థము గల శబ్దమును వాడిరి గొల్లలంత చదువరులు కారు గదా! కావుననే శ్రీకృష్ణునికి "నెయ్యుణ్ణాన్, పాలుణ్ణాన్" అని వాడుక పేరై యుండెను. పెరియాళ్వార్లు సీరాట్టములో యశోదపిరాట్టి భావనలో "కఱన్ద నల్పాలుం తయిరుం కడైన్దురిమేల్ వైత్త వెణ్ణెయ్, నీ, పిఱన్దతువే ముతలాక పెత్తఱియేన్" అని పాయించిరి. అనగా, పితికిన మించి గుమ్మపాలును, కమ్మని గట్టి మీగడపెరుగున్ను, తరచి యుట్టిలో పెట్టిన వెన్నను నీవు పుట్టినది మొదలు యెఱుంగనని యర్థము. ఈ గోపాంగన లందరుమ అట్టివారే. అందుచే వీరు తినదగినదిది, త్రాగదగినదిది యను భేదమునే మరచిరి. దీని సారాంశమేమనగా "మన మా శ్రీకృష్ణునితో సంశ్లేషించువరకు ఉపవాసముతో శుష్కింప జేసికొంద" మని వీరు నిశ్చయించుకొనిరి యోగ్యుడైన భక్తు డుపవసించుట వారి శత్రువుల కనర్థదాయకము, కఠోపనిషత్తు నందు

"ఆశా ప్రతీక్షే సంగతం సూనృతం చేష్టా పూర్తే పుత్రపశూగ్ంశ్చ సర్వాన్. ఏత ద్వృంక్తే పురుష స్యాల్ప మేధసః యస్యా నశ్నన్వసతి బ్రాహ్మణో గృహే" అను మంత్రమున "ఎవని యింట బ్రహ్మజ్ఞాని యగు నొకడు ఉపవసించునో ఆ గృహయజమానియొక్క సర్వస్వమునున్ను ఈ పాపము భస్మము గావించును" అని యున్నది. అటులనే వీరుపవసించుట యెవరి యనర్థములకొరకన్నచో వీరు తిని నచో తృప్తి చెందువాడును, తినకున్నచో నుపవసించువాడును శ్రీకృష్ణుడే కావచ్చు ననునట్లున్నది. "యస్యాత్మా శరీరం" అనునట్లుగా చేతనులు పరమాత్మకు శరీరభూతులు గదా! అందులకే వీరిట్లు చెప్పుచున్నారు. "మద్భక్తం శ్వపచం వాపి నిందాం కుర్వన్తి యే నరాః । పద్మకోటి శతేనాపి న క్షమామి వసుంధరే!" అని తన భక్తుల నొక్క నిందావాక్యము పలికిననే సహించనివాడు వారుపవసించిన సహించగలడా? తాను భుజించవలెనన్న వారిని భుజింపజేయవలెను గాన వెంటనే వారి యభీష్టముల నొసంగును.

నాట్కాలే నీరాడి - మిక్కిలి వేకువనేపోయి స్నాన మొనరింతము.

ఆ శ్రీకృష్ణుడు వేంచేయు సమయమునకు మనము స్నానానుష్ఠానములలో నుండదగదు గాన ముందుగనే స్నానాదుల గావించి యాతనికి భోగార్హలమై యుందమని నిశ్చయించుకొనుచున్నారు. మన మిప్పు డాతనికన్నను ముందుగా స్నానమున కేగినచో వాతడు, మనవంటి చేతనులను రక్షించుటకు మంచియవకాశ ముండునని పాలసముద్రమును విడచి గోకులమునకు వేంచేయుట వ్యర్థమే యని తలంచును. మరియును "ఆర్తార్తే, ముదితే హృష్టా, ప్రోషితే మలినా కృశా" అనగా తన భర్త నెడబాసిన స్త్రీ స్నానపానముల చేయక కృశించునటులనే శేషియగు సర్వేశ్వరుడును తన శేషభూతుల నెడబాసినచో తానును స్నానపానముల విడచి కృశించును. చేతనేశ్వరులకు భార్యాభర్తృ సంబంధము సహజమే కదా! ఇందుల కుదాహరణము-"న మే స్నానం బహుమతం వస్త్రాణ్యాభరణాని చ । తం వినా కైకయీపుత్రం భరతం ధర్మచారిణమ్॥" విభీషణుడు పట్టాభిషిక్తుడైన పిమ్మట శ్రీరామచంద్రుని అభ్యంగన మొనర్చి నూతన వస్త్రాభరణముల ధరింపుమని ప్రార్థించు సందర్భములోనిదీ శ్లోకము. "నన్నెడబాసి భరతుడున్న రీతిగా ఆతని నెడబాసిన నేనుండుట ధర్మము గదా!" యని తాత్పర్యము. మరియొక తాత్పర్య మేమనగా - వీరు భరతునివలె తమ విరహతాపమును వారింపజేసికొనుటకై 'నోము' అని యొక మిషను కల్పించుకొని స్నానముచేయగోరుచున్నారు. శ్రీరామాయణమున అరణ్యకాండలో శ్రీరామచంద్రుడు భరతునిగూర్చి యిట్లను చున్నాడు.

"అత్యన్తసుఖ సంవృద్ధః సుకుమార స్సుఖోచితః ।
కథ న్వపరరాత్రేషు సరయూ మవగాహతే" ॥

పాపము మనభరతుడు మిక్కిలి సుఖసాధనములతో పోషింపబడినవాడు. మిక్కిలి సుకుమారుడు, అట్టివాడు నీరు సూర్యకిరణములచే వేడి యెక్కక మునుపే అపరరాత్రులలో మేల్కాంచి తన రామవిరహతాపమును చల్లార్చు కొనుటకై సరయూనదియొద్ద కేగి యెట్లు స్నానమొనర్చుచున్నాడో గదా యని మిక్కిలి విచారించెను. అటులనే యీ గోపికలును సూర్యోదయమునకు ముందుగనే తాపోపశాంతికై చల్లని నీటిలో స్నానమును జేయ నుద్యమించుచున్నారు.

ఈ పదము తత్తద్వర్ణాశ్రమోచితమగు స్నానాదికర్మలన్నిటికి నుపలక్షణము. దీనిచే ప్రపన్నాధికారికిని ఫలమును కోరక తన వర్ణాశ్రమములకు తగిన కర్మలు "కర్మ కైంకర్యత్తిలే పుగుం" అనునటుల కైంకర్యబుద్ధితో చేయదగినవని సూచింపబడుచున్నది.

**మైయిట్టెళుదోం** - కాటుక నలంకరించుకొనము.

భగవంతుడు భక్తులపట్ల తనకు గల అత్యంత వ్యామోహముచే వారు తనకు చేయునట్లు తాను వారికి కైంకర్యము చేయవలెనని కనిపెట్టుకొని యుండును. గోపాంగనలు తమ శరీరముల కేమాత్ర మలంకరించుకొన జూచినను అతడు "నేనే చేతు" నని అడ్డమువచ్చును. అట్టి యవకాశము నాతనికి కల్పించకుండుటకై "మనము శరీరముల కలంకారములనే చేసికొనవ"ద్దను కొనుచున్నారు.

**మలరిట్టు నాం ముడియోం** - మనంతట మనము పువ్వులను ధరించకుందము.

వారు పుష్పములను ధరించుట శిరోజముల పరిమళముకొరకును కాదు, అందముకొరకును కాదు. ఉత్తమజాతి స్త్రీలగుటచే వారి కేశసంపర్కముచే ఆ పూలకే పరిమళమును పట్టించుటకై వారు వానిని ధరింతురు. వారు సహజసుందరులును. "నాం ముడియోం" (మనము ధరింపము) అనుటలో నొక రహస్య మున్నది. కృష్ణుడే స్వయముగా పువ్వులను దెచ్చి వారి తలలలో నలంకరించి "దీనిని తీసివేయవల" దని యొట్టుపెట్టునట. "అపుడు మనమేమి చేయగలము మనము పరతంత్రులము గదా!" ఆతడట్లు చేయునా అన్నచో —

శ్రీవిష్ణు పురాణమున

"అత్రోపవిశ్య సా తేన కాచిత్ పుష్పై రలఙ్కృతా ।
అన్యజన్మని సర్వాత్మా విష్ణు రభ్యర్చితో యయా ॥"

(5-15-35)

అంతర్హితనమైన శ్రీకృష్ణుని వెతుకుచున్న గోపికలు ఒకచోట శ్రీకృష్ణుడొక గోపికను కొనిపోయి యామెను కూర్చుండబెట్టి ప్రక్కనున్న లతాపుష్పముల దెచ్చి గ్రుచ్చి యామె నలంకరించినట్లూహించి "ఆహా! ఈమె పూర్వజన్మమున సర్వాంతర్యామియగు సర్వేశ్వరుని పుష్పములతో పూజించియుండవలెను. అందుచే నీ జన్మలో నాతనిచే నిట్టి సమ్మానమును లభించెనని యాశ్చర్యపడిరి.

శెయ్యాదన శెయ్యోం - పెద్ద లాచరించని పనులను మన మాచరించవలదు.

ఇది ప్రపన్నుల స్వరూపమును తెలుపు వాక్యము. ఫల-సాధనములు భగవంతుడే యని నమ్మియున్న ప్రపన్నులే యైనను జ్ఞానముకలవారగుటచే స్వరూపవిరుద్ధములగు రాగద్వేషాదుల విడచుటయును, శమదమాదులను సంపాదించుటయును వీరికి కర్తవ్యములే.

భరతున కయోధ్యాధిపత్యమును దశరథచక్రవర్తి స్వయముగ నిచ్చుటచేతను, శ్రీరామచంద్రుడు సంతోషముగ నంగీకరించుటచేతను, కులగురువైన వసిష్ఠమహర్షి "యిది శాస్త్రవిరుద్ధము-కాదు, స్వీకరింపు" మని యాదేశించినను భరతాళ్వానులు "మా వంశమున సర్వవిధముల యోగ్యులగు అన్నగారుండగా తమ్ముడు రాజగుట పూర్వ మెన్నడును లేకపోయినదగుటచే నేనీ పదవి నంగీకరిం" పనని నిర్మొహమాటముగా చెప్పివేసెను గదా!

ఈ శిష్టాచారము ననుసరించి మనమును శాస్త్రము చేయుమని విధించినను మన పెద్దలు చేయని పనులను మనము చేయదగదు. అనగా, భగవంతుడు "సుహృదం సర్వభూతానాం" అనునట్లు సకలప్రాణుల హితమును కోరువాడైనను అతని భక్తులను పురస్కరించుకొనియే యాతని నాశ్రయింపవలెను. విభీషణుడు అందరొక్కచోటనే యున్నను శ్రీరామచంద్రు నాశ్రయించునపుడు "నివేదయత మాం క్షిప్రం విభీషణ ముపస్థిత"మ్మని సుగ్రీవాదుల పురుషకారముగా మున్నిడుకొనియే యాశ్రయించెను. అటులనె మనమును ముందుగ లేచినవారు పరున్నవారిని లేపుకొని యందరును కలిసి గాని శ్రీకృష్ణుని సన్నిధి కేగరాదు.

మన పూర్వాచార్యులగు ఆళ్వందారులును స్తోత్రరత్నమున తామెంత జ్ఞానానుష్ఠానసంపన్నులైనను తమ యోగ్యతను పురస్కరించుకొని పెరుమాళ్లను శరణు వేడక "పితామహం నాథమునిం విలోక్య । ప్రసీద మద్వృత్త మచిన్తయిత్వా" "స్వామీ! నీవు నా నడువడికను గణింపక మా తాతగారగు నాథమునులకు మనుమడ నని నన్ననుగ్రహింపు" మని ప్రార్థించిరి. ఇవియే మనకు ప్రమాణములు.

తైత్తిరీయ వల్లియు "అథ యది తే కర్మ విచికిత్సా వా వృత్తవిచికిత్సా వా స్యాత్, యే తత్ర బ్రాహ్మణా స్సమ్మర్శినః........ యథాతే తత్ర వర్తేరన్, తథా తత్ర వర్తేథాః" అని "నీకు కర్తవ్య కర్మలో గాని, అనుష్ఠానములో గాని సందేహముదయించెనేని నీ బుద్ధితో నీవే నిర్ణయించుకొనక నీ సమీపమున నున్న ధర్మవేత్తలైన పెద్దలు ఆ సందిగ్ధసమయములో నెట్లు ప్రవర్తించిరో యెరింగి నీవు నట్లే ప్రవర్తింపు" మని యాదేశించినది.

సాక్షాత్తుగా భగవంతుడే భగవద్గీతలో

"యద్య దాచరతి శ్రేష్ఠః । తత్తదేవేతరో జనః ।
స యత్ప్రమాణం కురుతే । లోక స్తదనువర్తతే ॥"

అనగా, లోకమున గొప్పవాడుగా పరిగణింపబడువాడు దేనిని ప్రమాణముగా గొని యేపని నెట్లు చేయునో, యితరులును దానినే ప్రమాణముగా గొని అటులనే యాచరించవలె నని యానతిచ్చెను.

తీక్కుఱళై చెన్ఱోదోం - ఇతరుల కనర్థకరములైన మాటలను వెళ్లి యొకరితో చెప్పము.

ఇది సీతాపిరాట్టి మనకు నేర్పిన ధర్మము.

"లోష్టమర్దీ తృణచ్ఛేదీ । నఖఖాదీ చ యో నరః ।
స వినాశం వ్రజ త్యాశు । సూచకోఽశుచి రేవ చ॥"

పనిలేక మట్టిబెడ్డల చిదుపువాడును. గడ్డిపరకలను త్రుంపువాడును, తన గోళ్లను పండ్లతో కొరికికొనువాడును, కొండెములు చెప్పువాడును, ఆచారవిహీనుడును వెంటనే నశింతురు. కావున మనము కూడ మనలో మనము "నప్పిన్నై నఙ్గాయ్" (నప్పిన్నా! నీ వెంత నిండు తల్లివమ్మా!) అనియు, "నాయక ప్పెణ్పిళ్లాయ్" (నాయకు రాలవైన పిల్లా) అనియు "పేయ్ప్పెణ్ణే" (పిచ్చిపిల్లా) అనియు నొకరి నొకరము అని యనిపించుకొనిన మాటలను శ్రీకృష్ణుని చెవికి సోకనీయరాదు సుమండీ!

అయోధ్యావాసుల కొకతరి పరస్పరవిరోధము జనించినను "పరస్పరం న హింసన్తి । రామ స్యార్థే మనస్వినః" అన్నట్లు శ్రీరామచంద్రుని ముఖము వాడు నని యొకరి నొకరు హింసించుకొను వారు కారట. ఇటుల శేషిముఖము వికసించునట్టి పనులనే శేషభూతులు చేయవలెను. గోకులవాసు లందరును శ్రీకృష్ణునకు నిరతిశయ ప్రీతిపాత్రులగుటచే నెవ్వరిమీద నేరములు చెప్పినను శ్రీకృష్ణుని ముఖము వాడును.

లక్ష్మీదేవియును "న కశ్చి న్నాపరాధ్యతి" యనియు. "కిమేత న్నిర్దోషః క ఇహ జగతి?" (లోకమున తప్పులు చేయనివారుందురా? అనియు అనేకోపాయములతో శ్రియఃపతిని మరపించి చేతనులను తన బిడ్డలనుగా రక్షించు లోకమాతగా నుండునదియు, నొకప్పుడు చేతనుల విషయమై నేరములు చెప్పినను శ్రియఃపతి "ఎన్నడియార్ అదు శెయ్యార్, శెయ్‌దారేల్ నన్ఱు శెయ్‌దార్" (నా భక్తులట్టి కూడని పనుల నెన్నడును చేయరు, చేసినట్లు నీవు ఋజువు చేసినను అవి నా కత్యంత ప్రియకర వ్యాపారములే సుమ్మీ) అనును.

ఐయముం పిచ్చైయుం ఆన్దనైయుం కైకాట్టి -

సంభావనను, భిక్షను చేతనైనంత సమర్పించి.

'ఐయం' - అనగా సత్పాత్రుల కధికముగా ధనము నొసంగుట. దీనికి వేదాంతపరమైన అర్థమేమనగా "ఐయం" అనగా భగవదనుభవము. "పిచ్చై" అనగా భాగవతానుభవము. అనగా, ఎవరు దేనిని గోరిన దానిని వారికి అనుభవింపజేయుచు గడుపుదము.

ఇళైప్పెరుమాళ్ (లక్ష్మణస్వామి) గుహునకు చక్రవర్తి తిరుమగన్ (శ్రీరామచంద్రులను) గూర్చి వినిపింపగా, గుహుడు భరతునకు భాగవతుడగు ఇళైప్పెరుమాళ్లని గూర్చి వినిపించెను.

ఆన్దనైయుం - వారు తీసికొనగలిగినంత.

మనల నెంతమంది యడిగినను, వారెంత తీసికున్నను మన కంత సంతసము. వీరికి శ్రీకృష్ణ పరిచయముచే సంక్రమించిన గుణమిది. ఆయన పాత్రుల గొనియాడువాడు. "ఉదారా స్సర్వ ఏవైతే" అనెను గదా! అనగా, 'ఔదార్య' మనగా ఇచ్చిన గాని యుండలేనట్టియు, అడిగినదాని కంటె అధికముగా నిచ్చునట్టియు స్వభావము. ఇది ఇచ్చువాని ధర్మము. కాని శ్రీకృష్ణుడీ ధర్మమును పుచ్చుకొనువారి కారోపించుచున్నాడు. ఎవరైనను "ఇదేమయ్యా?" అని అడిగిన "మే మతమ్ = నాయిష్ట" మనును. దీని భావ మేమనగా 'చతుర్ణాం పురుషార్థానాం దాతా దేవ శ్చతుర్భుజః' అనునట్లు నాలుగు భుజములను నాలుగు పురుషార్థముల నిచ్చుటకు చాచుకొని కూర్చుండును. అడుగువారు లేనిచో నాతని కెంతయో బాధ కదా! అందుచే "మత్తో యత్కించన గృహ్ణన్తి తే హి మమ సర్వస్వదాయినః" (నానుండి యే మాత్రము గైకొన్నను నాకు సర్వస్వము నొసంగువారే). "తీసికొనువారు సర్వస్వము నిచ్చువా రెట్లగుదురు?" అనగా "ఆశ్రిత సకల ఫలప్రదత్వం హి మమ సర్వస్వం" (అడుగువారు దేని నడిగినను ఇచ్చుట నాకు సర్వస్వమైన గుణము) అది తీసికొనువారున్ననే గదా ప్రకాశించునది! కాబట్టి నానుండి యేమాత్రమైనను అర్థించి తీసికొనువారు నాకు సర్వస్వము నిచ్చువారే. అనగా, నా సకలఫలప్రదత్వమనెడు ప్రధాన ధనమును బ్రతికించినవారగుదురు. ఇది "మే మతం"

కై కా ట్టి - సర్వము నిచ్చియు

"ఒన్ఱుం శెయ్యప్పెత్తిలోమ్" అయ్యో! వీరి కేమియు చేయజాలకపోతిమే యని చింతించుట. ద్రౌపది కంత యుపకరించియు శ్రీకృష్ణునకు అవతారము చాలించునపుడు కన్నులు చెమర్చెనట. అది యేమని యుద్ధవు డడుగగా —

"గోవిన్దేతి యదాక్రన్దత్ కృష్ణా మాం దూరవాసినమ్
ఋణం ప్రవృద్ధ మివ మే హృదయా న్నాపసర్పతి ॥"

అనెనట. అనగా, మహత్తరమైన ఆపద దాపరించగా ఆమె దూరముననున్న నన్ను "శంఖ చక్ర గదాపాణే! ద్వారకానిలయా చ్యుత! , గోవిన్ద! పుణ్డరీకాక్ష! రక్ష మాం శరణాగతామ్ ॥" యని ఆక్రోశించినది కదా! అది చక్రవడ్డీతో పెరిగిన ఋణముపలె నా హృదయమున నాటుకొని పోకున్న దని సెలవిచ్చెను.

కై కా ట్టి -

ఇట్లు జ్ఞానము నుపదేశించియు తాను వారి కుపకారము చేసితినని మనస్సునందైనను తలంచకుండుట.

ఉయ్యుమాఱెణ్ణి - ఈ విధముగా ఉజ్జీవించు మార్గమును సంకల్పించి.

భగవద్విషయములో పూర్తిగా నవగాహించిననాడే వీడుజ్జీవించినవాడు అగుచున్నాడు. అదియే లేనిచో "అసన్నేవ స భవతి" అనునట్లు లేనివారిలోనే జమ అగుచున్నాడు కదా!

ఎణ్ణి ఉగన్దు - ఈ తలంపు పుట్టినదిమొదలుకొనియే రుచించును.

"ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్ ॥" అను గీతలోని 9వ అధ్యాయా రంభ శ్లోకమున భక్తియోగమును ప్రశంసించుచు "సుసుఖం కర్తుం" అని భగవాను డానతిచ్చెను. అనగా, ధ్యానమునకు విషయమైన భగవంతుడు అన్నివిధముల సకలప్రాణి మనోహరు డగుటచే ఆతనిని ధ్యానించుటయు మహదానందసంధాయక మగును. "కృష్ణే త్యక్షరయో రయం మధురిమో ద్గారః క్వచిల్లక్షితః" అనగా, "కృష్ణా" అను నీ రెండక్షరముల నుచ్చరించునపు డుద్భవించు మాధుర్య రసాస్వాద మెందైన గలదే? యను నట్లాతని నామమే యింత యానందసంధాయకమైయుండ నాతని

రూపము, చేష్టలు, సూక్తులు మొదలగువానిని తలంచుటచే కలుగు ఆనంద రస నిష్యంద మెంతైన నుండునా? కాబట్టి వ్రతానుష్ఠానమునకు సంకల్పించి సంతోషముతో చేయవలసిన కృత్యములను శ్రద్ధగా వినుడని యన్వయము.

ఈ పాశురమున 'ఏలోరెమ్బావాయ్' అను పాశురశేషము పాదపూరణార్థమే, దానికి ప్రత్యే కార్థము లేదు. ఇదియొక త్రింశద్దివసవ్రతము. దీనిని 'యజ్ఞ' మన వచ్చును. ఇది దైవయజ్ఞము. భగవద్గీతలో భగవానుడు "అహం క్రతు రహం యజ్ఞః" "నేనే క్రతువును, నేనే యజ్ఞము" ననెను. దీనికి భాష్యకారులు 'క్రతు' వనగా కామ్యమగు జ్యోతిష్టోమాదిక మనియు. 'యజ్ఞ' మనగా నిత్య కర్మగా పరిగణింపబడు పంచమహాయజ్ఞములనియు వివరించిరి, ఈ వ్రతము ఫలాపేక్షలేని నిత్యకర్మ వంటిదే గాన దీనిని 'యజ్ఞ' మన వచ్చును. 'హతో యజ్ఞస్త్వదక్షిణః' దక్షిణ లేని యజ్ఞము నిష్ప్ర యోజనము. ఆ దక్షిణయైనను సాత్త్వికమైనది కావలెను. దానికి లక్షణము గీతలో

"దాతవ్యమితి యద్దానం । దీయతేఽనుపకారిణే ।
దేశే కాలే చ పాత్రే చ । తద్దానం సాత్త్వికం స్మృతమ్ ॥"

అనగా, సాత్త్వికములగు దేశకాలపాత్రలనారసి ప్రత్యుపకార కటాక్ష గంధము లేకుండగనే "ఇచ్చుట నా ధర్మ" మని శ్రద్ధాభక్తులతో నీయబడిన సాత్త్వికదానము కావున నీ పాశురమున నట్టి దానమునే యీ వ్రతమున కంగముగా చేయవలెనని విధింపబడుచున్నది.

## — వేదాంతార్థము —

పరమపదమున కళ్యాణగుణములతో శ్రియఃపతి ననుభవించు రుచికలవారై, అందుల కాతడే యుపాయమని నమ్మియున్న సిద్ధోపాయనిష్ఠుల (ప్రపన్నుల) కుండవలసిన లక్షణముల నీ పాశురమున చెప్పుచున్నారు.

### నంపావైక్కు -

ఇచ్చట 'పావై' యనగా వ్రతము. వ్రత మనగా 'ఏతద్వ్రతం మమ' అని శ్రీరామచంద్రు డానతిచ్చినట్లు అచంచలమైన, అనుల్లంఘనీయమైన నియమము. ఆ నియమము ప్రపన్నులకు భగవ న్మంగళాశాసనమున నుండవలెను. అదియును అయన విషయమై మాత్రమే కాక "అడియో మోడుం నిన్నోడుం" అని పెరియాళ్వారు పాయించినట్లు ఆయన భక్తుల విషయమయ్యును ఉండవలెను. దానినే వీరిచ్చట నంపావై = మన నోము అనుచున్నారు.

క్షే శీ రో -

ఉన్మ_స్తకమైన ఆనందానుభవములో మునిగియున్నవారు క_ర్తవ్యమును మరచుట స్వాభావికము.

"స్థానాభిలాషీ తపసి స్థితోఽహం
త్వాం ప్రా ప్తవాన్ దేవమునీన్ద్రగుహ్యమ్ ।
కాచం విచిన్వన్ సమవాప్య రత్నం
స్వామిన్! కృతార్థోఽస్మి వరం న యాచే ॥"

ధ్రువుడు భగవంతుని గూర్చి తపస్సు చేసి ఆయనను ప్రత్యక్షముగా దర్శించిన ఆనందపారవశ్యముచే "గాజుపెంకులు వెతుకువానికి రత్నము లభించినటుల నిన్ను పొందగలిగితిని. నాకిక వరము పనిలే" దనెను. తమ నోమున కెన్నియో పరికరముల నడుగవలయునని గట్టి పట్టుతో వచ్చిన యీ గోపాంగనలు 'శీరియ శిఙ్గా సనత్తిరున్దు యాం వన్దకారియ మారాయన్దు' అని ప్రార్థించినట్లు ఆయన ఆస్థానవేదిక నలంకరించి కూర్చొని యుండగా "ఆహా! మన కా సర్వేశ్వరుడు డెంత వశం వదుడై యున్నాడు!" అను నీ యానందమున మునిగి వచ్చిన పనిని మరచి 'అన్దివ్వులగ మళన్దాయ్' అని మంగళాశాసనము చేయదొడంగ లేదా? అటులనే 'ఇరుళ్ తరు మా ఞాలమ్' అగుటచే భగవద్విషయము కొండపైకి నీరెక్కించినట్లు దుర్లభమైన సంసారములో నింతమంది యీ నోమునం దన్వయించుచు కుతూహలముతో చేరియున్నారే!" యను ఆనందపారవశ్యమున మునింగి పరాకుగా నుండుటచే 'వినుడు' అని హెచ్చరించి వినిపించవలసి వచ్చినది.

నాట్కాలే నీరాడి -

ఇది నిఖిల వర్ణాశ్రమ ధర్మములకును ఉపలక్షణము. అజ్ఞానావృతచేతస్కులగు కొందరు (మేము ప్రపన్నులము, మాకు "సర్వధర్మాన్ పరిత్యజ్య.... మోక్షయిష్యామి మా శుచః" అని భగవాను డానతిచ్చె నని అజ్ఞానముచే శాస్త్రమున విధించబడి శిష్టాచారములో నున్న వైదికధర్మముల విడచి చెడుచున్నారు. ఈ పాశురమున "నాట్కాలే నీరాడి" అనుటచే ప్రపన్నులకైనను వారి వారికి వర్ణాశ్రమములుగా విధింపబడిన కర్మల న్నియు ఫలసంగక_ర్తృత్వముల విడిచి భగవదారాధన బుద్ధితో భగవత్ప్రీతిగా చేయవలసినవియే యని తెలుపబడుచున్నది.

"త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధ స్సమ్ప్రకీ_ర్తితః" అని గీత 18వ అధ్యాయమున తన మతముగా శ్రీకృష్ణు డాదేశించిన కర్మలను స్వరూపతః విడచినవారి పట్ల యాత డెట్లు ప్రసన్నుడగును ?

మైయిట్టు ఎళుదోం -

మై = కాటుక. ఇది కన్నులు బాగుగా ప్రకాశించుటకై ధరింపబడును. కన్ను అనగా జ్ఞానము. అది బాగుగా ప్రకాశించుట యనగా ఆత్మ యాథాత్మ్య సాక్షాత్కారమునకు తగినంత తీక్ష్ణముగా నుండుట. ఇదియే జ్ఞానయోగము. "జ్ఞానయోగో జితస్వాన్తైః పరిశుద్ధాత్మని స్థితిః" అని గీతార్థ సంగ్రహమున యామునాచార్యులవారు సాయించిరి. ఆ జ్ఞానయోగము నుపాయముగా పరిగ్రహింపమని యర్థము. సర్వధర్మపరిత్యాగములో నిదియొకటి.

మలరిట్టు నాం ముడియోం -

ఇది సకల భోగోపకరణములకును ఉపలక్షణము. పువ్వులు భోగరూపములు. వీరికి భగవదనుభవమునకు మించిన భోగము మరియొకటి లేదు. ఆ భగవదనుభవమే భక్తియోగము. "సుసుఖం కర్తుం" సాధన దశలో కూడ భోగరూప మయియే యుండును. ధ్యేయమంత ప్రియతమమైన దగుటచే నాతని ధ్యానమున్ను ప్రియతమమే యగును. "పువ్వులను ధరించము" అనుటచే భక్తియోగమును మోక్షసాధనముగా నవలంబించమని తెలియుచున్నది. ఇదియును సర్వధర్మపరిత్యాగములలో నొక్కటియే. దీనిని జీవించియున్నంతవరకును భగత్ప్రీతికై కాలక్షేపమున కవలంబించెదము.

ఈ వాక్యమున 'నాం ముడియోం' అనుటలో నొక రహస్యమున్నది. సహస్రనామములలో భగవంతునకు "ఏకో నైక స్సవః కః కిం యత్తత్పద మనుత్తమమ్" అని 'తత్' అను తిరునామ మొకటి కలదు. దీనికి భట్టరువారి వ్యాఖ్యానము ననుసరించి "స్వజ్ఞానభక్తిం భక్తానాం తనోతీతి తదుచ్యతే" తను = విస్తారే, అను ధాతువును బట్టి యట్టి భక్తిని, జ్ఞానమును తన భక్తులకు విస్తరింప చేయువాడని యర్థము. భగవానుడు గీతలో "తేషాం సతతయుక్తానాం భజతాం, ప్రీతిపూర్వకం దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తి తే॥

తేషా మే వానుకమ్పార్థం । అహ మజ్ఞానజం తమః ।
నాశయా మ్యాత్మభావస్థో । జ్ఞానదీపేన భాస్వతా ॥"

అనియును సెలవిచ్చెను. అనగా, తన భక్తుల హృదయమునందుండి జ్ఞానమనెడు దివ్య జ్యోతిని వెలిగించి తనను చేరుటకు సాధనములైన జ్ఞానభక్తులను ప్రీతితో నిచ్చెదననెను. అటులనే మనంతట మనము మోక్షమునకు సాధనములుగా జ్ఞానభక్తుల నవలంబింపకున్నను, పండునందున్న గుణములు భోక్తయొక్క భోగమునకే యగునట్లు జీవునియందలి గుణములు భగవంతుని ప్రీతికే యుపయోగపడునని అనుటచే నందులకు గాను అతడే స్వయముగా మనకా జ్ఞానభక్తుల నొసంగి

"వీనిని విడనాడవల" దని యొట్టు పెట్టిన మనము చేయదగిన దేమున్నది? సహించవలసినదే. మనము స్వయముగ వాని నార్జించుట స్వాతంత్ర్యాపాదకమైనట్లు, ఆతనిచ్చునపుడు "మాకు స్వరూప విరుద్ధము, మేము స్వీకరింప" మనుటయు నట్లే దోషావహమే. కావున స్వీకరించవలసినదే

## శెయ్యాదన శెయ్యోమ్ -

ఎన్ని యవకాశములున్నను భాగవతపురుషకారము లేకయే మనము భగవంతుని ఆశ్రయింపరాదను సిద్ధాంతము వ్యక్తమగుచున్నది.

## తీక్కుఱళై చెన్ఱోదోమ్ -

చాడీలు చెప్పు స్వభావము కూడ వాక్పారుష్యములో చేరినదే. దానిచే సమస్తలోకమునకు విద్వేషము జనించును. దానిని భగవంతుడు సహించడు. కావుననే

"వాఙ్మాధుర్యాత్ సర్వలోకప్రియత్వం
వాక్పారుష్యాత్ సర్వలోకాప్రియత్వమ్ ।
కోవా లోకే కోకిలేనోపకారః ?
కోవా లోకే వాయసేనాపకారః ? ॥"

అని యొక కవి చెప్పెను. అందుచే భగవంతున కప్రియమగునట్టి వాక్పారుష్యదోషమును విడచివేయుదము. ఇదియే "ఉయ్యుమాఱు" ఉజ్జీవించుటకుదారి,

## సందర్భానుసారముగా ననుసంధించుకొన దగిన పాశురములు —

1. సందర్భము — ఇన్దిరలోకమాళుం - అను పాశురము.

పచ్చై మామలై పోల్ మేని పవళవాయ్ కమలచ్చెజ్గణ్,
అచ్చుదా వమరరేఱే ఆయర్తమ్‌కొళున్దే యెన్నుమ్,
ఇచ్చువై తవిర యాన్ పో యిన్దిరలోకమాళుమ్.
అచ్చువై పెఱినుమ్ వేణ్డే నరజ్గమానగరుళానే.

(తిరుమాలై. 2)

## — తా త్ప ర్య ము —

"పచ్చని పెద్దకొండవంటి శరీరమున్ను, పగడమువంటి యెఱ్ఱని అధరమున్ను. పద్మముల వంటి కన్నులున్ను గల ఓ సర్వేశ్వరా, నిత్యసూరుల నాయకుడా! గొల్లబాలకుడా!" అని నోటితో పలుకుటచే గలుగు నీ రసానుభవమునే గాని, నేను స్వర్గమున కేగి ఆ పదవినేలు నట్టి అనుభవము లభించినను కోరను.

2. అదే సందర్భములో "కొణ్డల్వణ్ణనై" అనుచోట తిరుప్పాణాళ్వార్ పాయించిన 'అమలనాది పిరాన్" 10వ పాశురము.

కొణ్డల్వణ్ణనై క్కోవలనాయ్ వెణ్ణె
యుణ్డవాయన్, ఎన్నుళ్ళం కవర్న్దానై
అణ్డర్కోన్ అణియరఙ్గన్ ఎన్నముదినై
కణ్డ కణ్గళ్ మత్తొన్టినై క్కాణావే.

— తాత్పర్యము —

నల్లని మేఘమువంటి శరీరకాంతి కలవాడును, గోపాలుడుగా నవతరించి వెన్నను తినిన నోరుకలవాడును, నా మనస్సును దొంగిలించినవాడును, నిత్యసూరినాయకుడును, భూమికి అలంకార మనదగిన శ్రీరంగమందున్నవాడును, నాకు అమృతమువలె భోగ్యభూతుడును నగు శ్రీరంగనాథుని సేవించిన నా కన్నులు పరవాసుదేవు నైనను చూడవు.

3. "పాడి నెయ్యుణ్ణోం పాలుణ్ణోం" అనుచోట.

పెరియాళ్వార్ తిరుమొழி (5-1-6)

కణ్ణా! నాన్ముకనై ప్పడైత్తానే! కారణా! కరియాయ్! అడియేన్ నాన్,
ఉణ్ణానాళ్ పశియావతొన్నిల్లై ఓవాతే నమోనారాయణావెన్ఱు,
ఎణ్ణానాళు మిరుక్కు శుర్చామ వేతనాణ్మలర్ కొణ్డునపాదమ్ -
నణ్ణానాళ్, అవై తత్తుఱుమాకి లన్దైనక్కవై పట్టినినాళే.

— తాత్పర్యము —

కృష్ణా! బ్రహ్మను సృష్టించినవాడా! జగత్సృష్టికి కారణమైనవాడా! నల్లని మేఘమువంటి కాంతిగలవాడా! నీకు దాసుడనైన నేను భుజింపని రోజులలో నాకలి నెరుంగను. అష్టాక్షరీమంత్రమును విడువకుండగా అనుసంధించని రోజులున్ను, అప్పటి కప్పుడు విడచిన పుష్పములను తెచ్చి మూడు వేదముల మంత్రములచే నీపాదముల నర్చించనప్పుడున్ను, నాకు నిజముగా ఉపవాస దినములు.

❀ ❀ ❀ ❀

# మూడవ పాశురము

# "ఓఙ్గి యులగళన్ద"

## — అవతారిక —

మన పూర్వాచార్యులకు 'నారాయణ' పదమును ముందుగా ప్రయోగించినచో వెంటనే దానికి ముందుండు గ్రంథములో దాని యర్థమును చెప్పుటయును, ముందుగా నర్థమును జెప్పినచో వెనువెంటనే శబ్దమును జెప్పుటయు నను నాచారము కలదు. మొదటి పాశురమున "నారాయణనే నమక్కే పఱై తరువాన్" అని నారాయణ పదమును ప్రయోగించిరి. పిమ్మట రెండవ పాశురమున 'పాఱ్కడలుళ్ పైయత్తు యిన్ఱ' అనుటచే రక్షణాధ్యవసాయమున్ను, దానికి కావలసిన సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వ, స్వామిత్వ, వాత్సల్య ప్రభృతి గుణజాతమున్ను చెప్పబడినవి. ఈ పాశురమున ఉభయ విభూతియోగమున్ను, అంతర్బహిర్వ్యాప్తి మొదలగు అర్థములున్ను చెప్పబడుచున్నవి.

'నార' పదమునకు నిత్యపదార్థసమూహ మర్థము. ఆ పదార్థములు స్వరూపమును బట్టి స్వరూపముతో నిత్యమైనవియు, ప్రవాహరూపముతో నిత్యమైనవనియు రెండు విధములుగ నుండును. స్వరూపముతో నిత్యమైనవనగా సహజముగా ఉత్పత్తివినాశములు లేని పరమపదమున నుండు పదార్థములు. ప్రవాహతో నిత్యము లైన వనగా నదీప్రవాహమున మనము చూచుచున్న నీరు ఉత్తరక్షణమున నచ్చట లేకున్నను, మరియొక నీరు ఆ స్థానము నాక్రమించి ప్రవాహమును సాగించుచుండును. అట్లే యొకే రూపముతో నే వస్తువున్ను కాన్పించ కున్నను వస్తువు నశించక మరియొక రూపముతో కాన్పించుచునే యుండును. కుండపగిలి పెంకులును, అవి చితికి చూర్ణమును అగును. మన్ను లేకపోలేదుగదా! ఆ మన్ను నిత్యమే. ఇదియే ఛాందోగ్యోపనిషత్తులోని సద్విద్యాప్రకరణమున "మృత్తికేత్యేవ సత్యమ్" అని చెప్పబడినది. ఈ రెండు విధములగు నిత్యపదార్థములకును నారములని పేరు. కావున నీ పదముచే లీలావిభూతి యనబడు భగవంతుని క్రీడకు పరికరమైన బ్రహ్మాండములున్ను, భోగవిభూతి యనబడు —

> "వైకుణ్ఠే తు పరే లోకే । శ్రీసహాయో జనార్దనః ।
> ఆస్తే విష్ణు రచిన్త్యాత్మా । భక్తై ర్భాగవతై స్సహ ॥"

అనునట్లు శ్రీమన్నారాయణుడు శ్రీ. భూ ,నీలాదేవులతోను, నిత్య, ముక్త బృందముతోను నిరంతరమును భోగముల ననుభవించుచుండు శ్రీవైకుంఠలోకమున్ను తెలుపబడుచున్నవి. కావున

నారాయణపదముచే ఉభయవిభూతియోగము చెప్పబడుచున్నది. ఈ పాశురమున నా యర్థము త్రైవిక్రమవృత్తాంతముచే సూచింపబడుచున్నది. ఈ యవతారమున నొక పాదముతో క్రింది లోకములను, పైకిజాపిన పాదముతో పైలోకములను కొలచి వానిని తనవిగ స్వాధీనపరచుకొనుట సూచింపబడుచున్నది.

వ్రతము ననుష్ఠించుచున్న గోపాంగనలకు ఫలాపేక్షలేకున్నను, తమను నోము నోచుటకై యనుమతించినవారికి కృతజ్ఞతా సూచకముగ పాడియును, పంటయును సమృద్ధిగా నుండవలెనని కోరుచున్నారు. (ఈ పాశురమును మనవారు బ్రాహ్మణేతరుల శుభకార్యములలో వారి కాశీర్వచనముగా ననుసంధించి అక్షతల నుంచుట ఆచారముగ నున్నది.)

భగవాను డర్జునునకు భగవద్గీత నుపదేశించుచు తొమ్మిదవ యధ్యాయారంభమున ఉపాసనకు ముఖ్యమగు ఉపాస్యుని కల్యాణగుణముల నెఱింగిన నాతనికి తనయందు ప్రీతి యతిశయించునని తెలుపుటకు ముందు "ప్రవక్ష్యా మ్యనసూయవే" నీకు అసూయ లేకపోవుటచే నీవు నా గుణముల యందు దోషారోపణ చేయవు గాన నీ కీ రహస్యమును చెప్పుచున్నాననెను. అసూయ యనగా సత్పురుషుని సద్గుణముల యందు దోషముల నారోపించు దుర్జనుని దుర్గుణము. "అది నీకు లేదు గాన ఆ గుణముల నీకు తెలుపుచున్నా" ననెను. "అక్షాన్తి రీర్ష్యా । అసూయా తు దోషారోపో గుణేష్వపి". అసూయ ఈర్ష్య వంటిది కాదు. అది యెట్టి దనగా-

"జాడ్యం హ్రీమతి గణ్యతే, వ్రతరతే దమ్భః, శుచే కైతవం,
శూరే నిర్ఘృణతా, మునౌ విమతితా, దైన్యం ప్రియాలాపిని,
తేజస్విన్యవలిప్తతా, ముఖరతా వక్తరి, అశక్తి స్థిరే ।
తత్కో నామ భవే త్సుగుణినాంయో దుర్జనై ర్నాఙ్కితః?॥"

యథేష్టముగా సంచరించక పెద్దలపట్ల సంకోచముతో వర్తించు సజ్జనుని దుర్జనుడు జడుడనును. నియమనిష్ఠలు కలవానిని దాంభికుడనును. సదాచార సంపన్నుని నటనయనును. శూరుని దయావిహీను డనును, సత్యమునకై మితముగా భాషించువానిని మతివిహీను డనును, అందరకును ప్రియముగా మాటలాడువానిని దీను డనును, తేజోవంతుని గర్విష్ఠి యనును. నేర్పుగా మాట్లాడువానిని వసరుబో తనును. దీర్ఘాలోచన పరుని శక్తివిహీను డనును. దీనిని బట్టి చూడగా దుర్జనుడు పేరుపెట్టి యాక్షేపించని సజ్జనుని గుణ మొక్కటి యును కలదా ? యనిపించును. దీనినే 'అసూయ' యందురు.

గీతోపదేశమును ముగించుచు భగవానుడు ఫలశ్రుతిలో దీనిని భక్తుల గోష్ఠిలో అర్థవిశేషము లతో నుపన్యసించువానికి ముఖ్యమైన మోక్షమునే ఫలముగా జెప్పెను. పిమ్మట, ఆచార్యుల ద్వారా గీతార్థముల నధిగమించిన వానికిన్ని ఫలమును జెప్పెను. పిమ్మట దీని కర్థము నెరుంగకున్నను ఆచార్యుల యుపదేశము ద్వారా మూల శ్లోకముల నెరింగి కంఠస్థపరచువారికిన్ని ఫలమును చెప్పెను. అటుపిమ్మట కంఠస్థపరచలేకున్నను ఆచార్యుల ద్వారా విశ్వాసముతో వినినవారున్ను, అట్లు వినుట కైనను అవకాశము లేనివారు పైన జెప్పబడిన యోగ్యతలు కలవారిని జూచి యసూయపడకున్నచో వారున్ను భగవద్భక్తికి ఆటంకములైన పాపముల బాపుకొని క్రమముగా ముక్తిని బడయగలుగుదురని సెలవిచ్చెను.

అటులనే, యీ వ్రతము ననుష్ఠించు గోపాంగనల జూచి యసూయను జెందక యనుమతించి యానందించువారికొరకై పాడిపంటలను ఫలముగా జెప్పుచున్నారు.

## మూడవ పాశురము

ఓఙ్గి యులకళన్ద వుత్తమన్ పేర్ పాడి,
నాఙ్గళ్ నమ్బావైక్కు చ్చాత్తి నీరాడినాల్,
తీఙ్గిన్ని నాడెల్లామ్ తిఙ్గళ్ ముమ్మారి పెయ్దు,
ఓఙ్గు పెరుఞ్జెన్నె లూడు కయలుకళ,
ప్పూఙ్గువళై ప్పోతిల్ ప్పొఱివణ్డు కణ్పడుప్ప,
త్తేఙ్గాతే పుక్కిరున్దు శీర్త ములై పత్తి
వాఙ్గ, క్కుడమ్ నిఱైక్కుమ్ వళ్ళ ప్పెరుమ్బశుక్కళ్,
నీఙ్గాద శెల్వమ్ నిఱైన్దేలో రెమ్బావాయ్.

### — తాత్పర్యము —

తమ కీ వ్రతానుష్ఠాన ప్రధానఫలము శ్రీకృష్ణ సంశ్లేషమే యైనను దీని కనుమతించినవారికి కలుగు ఐహికఫలముల నిందు చెప్పుచున్నారు.

త్రివిక్రముడై భూమిని కొలిచి స్వాధీన పరచుకొనినవాని తిరునామము ననుసంధించుచు మనము మన సాధనమునకు వ్రతమను పేరుపెట్టి వానికి అంగముగా స్నానము నాచరించినచో భూమిలో నెవ్వరికిని ఏ విధములగు నుపద్రవములు నుండవు. ప్రతి నెలకును పది దినముల కొక వర్షముగ మూడు వానలు కురియును. వరిపొలము లున్నతముగా పెరుగును. నీటి కొరత లేకుండుటచే వరిమళ్లలో బొలుసుచేపలు త్రుళ్లుచుండును. ఆ మళ్లలో నీటి సమృద్ధిచే పుట్టిన కలువ పువ్వులలో నందమైన తుమ్మెద దంపతులు మకరందమును త్రాగుచు నిద్రించును. ముంజేతి బలము కలవారు సాహసముతో పాలను పితుకుట కుద్యమించి పాలిచ్చునంత వరకును కదలక మెదలక యోపికతో సావధానముండి పొదుగుపై చేతినుంచి లాగినంతనె యీ యుదారములగు గొప్ప ఆవులు పాలకై పెట్టిన కుండల నన్నింటిని నింపివేయును.

ఈ విధముగ పాడియును, పంటయును సమృద్ధిగా నుండును. కావున నా మాటలను నమ్మి యీ వ్రతము నారంభింపుడు.

## — విశేషార్థము —

[illegible] - [illegible]

తన కొరకు సఫలమును వరకును సంకుచిత స్వరూపుడై వామనుడుగా నుండుటయును, ఆపై చెక్కుచెదరని సంతోషముతో పెరిగి త్రివిక్రము డగుటయును "అవికారాయ శుద్ధాయ", "సదైకరూప రూపాయ" యను ప్రమాణములను బట్టి నిర్వికారుడగు శ్రియఃపతికి తగునా? యన్నచో- ఆ వికారములు సంసారి చేతనులకు వలె కర్మమూలకము లైనను, స్వార్థములైనను దోషముగా లెక్కింపబడును. కాని పరమాత్మ కృత్యములు పరులకొరకు కృపచే చేయబడునవి గాన గుణావహములే యగును. 'కృప' యనగా, పరుల దుఃఖముల జూచి సహింపలేక పోవుటయు, వానిని తొలగించ వలెనని యుపక్రమించుటయును, వానిని జూచి దుఃఖించుటయును పరమాత్మకు కృపయని జెప్పుదురు. "అవాప్తసమస్తకాముడును, నిరతిశయానంద యుక్తుడునగు శ్రియఃపతికిని దుఃఖముండునా?" యని శ్రీ భట్టరువారి నొకరు ప్రశ్నించగా, "వాల్మీకి రామాయణమున "వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః" అను వాక్యమునందలి ప్రజల కొక దుఃఖము వాపురించినచో రాముడు వారికంటె నెక్కువగా దుఃఖించునని వర్ణించెను గదా!" అని చెప్పగా, ఆ స్వామి "స్వామీ! అది యవతార ప్రసంగము గదా! నా ప్రశ్న పరమపదవాసుని గురించి" యనిరి. దానిని విని భట్టరువారు "అది గుణప్రకరణమా? దోష ప్రకరణమా?" యని ప్రశ్నించిరి. శ్రీరామచంద్రుని యౌవరాజ్యపట్టాభిషేక సందర్భములో ప్రజలు దశరథుని మ్రోల శ్రీరామచంద్రుని కల్యాణ గుణముల వర్ణించు ఘట్టమిది. ఈ గుణములలో

ఇది యొక సద్గుణమే యైనపుడు ఇది దోషమెట్లగును? అతడెచ్చట నున్నను అది యాతనికి గుణమే యగును. సాంస్పర్శికములును, సాంకల్పికములును నగుచో నొక దేశ విశేషమును బట్టియు, నొక కాలవిశేషమును బట్టియు, ఒక యవస్థావిశేషమును బట్టియు మారుచుండును. ఇది స్వాభావిక సహజ గుణమగుటచే నెచ్చట నేయవస్థలో నున్నను గుణము గుణమే, దోషము కానేరదని సాధించిరి.

ఈ శ్లోకమున 'భృశం', 'మనుష్యాణాం' అనుటచే తన అంతఃపురపరివారవిషయమే కాదు ఈ దయ, సకల మానవ విషయమైనదనియు, "రాజా రాష్ట్రకృతం పాపం" అనునటుల నా రక్షణ లోని యేమరుపాటువలననే గదా వీరి కీ దుఃఖము కలిగినదని పరదుఃఖమును జూచి సహించ లేక పోవుటవలన నాదుఃఖ మీతనికి రెట్టింపుగా నుండును. ఈ దయకు పాత్రాపాత్రవిభాగము లేదు. ఎట్టి వాడైనను సరియే, ఆపదలో నున్నచో నీ కృప ప్రసరించును.

మాఱనేర్ గ్రామమున నొక చండాలుడు గొప్ప యాపదలో నుండి యెదురుగా వచ్చుచుం డగా నొక శ్రోత్రియస్వామి వానిని జూచి "దూరముగా పొమ్మ"ని గద్దించెను. దానిని విని అచ్చట నున్న రామానుజదాసుడను నొక భక్తుడు "అదేమి స్వామీ? అత డెంత యాపదలో వచ్చుచున్నాడో చూడుడు. మీరిట్లాతని గద్దించుట తగునా? మీకు గిట్టనిచో తప్పుకొని పోరాదా? అంతకును చాలనిచో నింటికేగి సచేలస్నాన మాచరించరాదా? యనెను. అందులకా శ్రోత్రియుడు "ఆదేమండీ. శాస్త్రవిరుద్ధ ముగా మాట్లాడుచున్నారే? అతడాపదలోనున్నచో నితరులైనచో తొలగిపోవుదురు. బ్రాహ్మణుడైనచో వాడే తొలగిపోవలెను. మీరీ శాస్త్రము నెరుంగరా? యనగా నా దాసుడు "ఓ దయావిహీనుడా? దయ కొక శాస్త్రమును, కట్టుబాటును కూడనా?" అనెను.

శ్రీకూరేశులు తిరువధ్యయనమునా డొక యరటియాకును కోసి దానినుండి చొన కారుచుం డగా "అయ్యో! ఈ చెట్టున కెంత బాధను కలిగించితిని!" అని యచ్చటనే మూర్ఛపడి చాల సేపుండి పోయిరట. రాజ్యసుఖమును, సంసార సుఖమును పోగొట్టుకొని చెట్టును, పుట్టను పట్టి తనపలెనే యలమటించుచున్న సుగ్రీవుని, వానరుడైనను, శ్రీరామచంద్రు డాతనియందు జాలితో నాతని శత్రు వగు వాలిని జంపి, రాజ్యమున నిలిపెను. కర్తవ్యధర్మము నుపదేశించినంత మాత్రముననే విభీషణుని రావణు డవమానించి లంకనుండి వెడలగొట్టగా శ్రీరాము డాతనియందలి కృపతో రావణుని జంపి యా విభీషణునకు లంకారాజ్యాభిషేకమును గావించి "విజ్వరః ప్రముమోద హ!" అనునట్లు తన మన స్తాపమును తొలగించుకొని సంతోషించుట - అనునివి అధికారులనుబట్టియా? తన కృపాగుణమును బట్టియా ?

## ఓట్టీయుల కళస్ద -

శ్రీ వామనమూర్తి బలిచక్రవర్తిని "ఆదిన్ శ్రీసతి కొప్పుపై తనువుపై నంశోత్తరీయంబుపై పాదాబ్జంబులపై కపోలతటిపై పాలిండ్లపై నూత్నమర్యాదంబునం జెందు కరము"తో గదా యాచించినది. గోసహస్రప్రదమగు చేతితో గదా యాచించినది! "అభయం సర్వభూతేభ్యో దదామి" యను అభయహస్తముతో గదా అర్థించినది! గో, గోప, గోపాంగనలపై నొక్క రాతిచినుకునైనను పడనీయక యేడహోరాత్రములు గోవర్ధన పర్వతమును ధరించిన చేతితో గదా భిక్షించినది!

మరియును. "నిన్ శెమ్మాపాదపర్పు తలై శేర్త్తాలై" అని ఆళ్వారులను ప్రాప్యనిష్కర్షగా నీ పాదారవిందములను శిరమున నిడుమని ప్రార్థించి లభించక మట్టిలెక్కించిన పాదారవిందములతో గదా కాడు, మోడు, మిట్ట, పల్లము, కొండ, గుట్ట యనక భూమినంతను కొలచినది!

"యావ న్న చరణౌ భ్రాతుః । పార్థివ వ్యఞ్జనాన్వితౌ ।
శిరసా ధారయిష్యామి । న మే శాన్తి ర్భవిష్యతి ॥"

అనగా. నా సోదరుడగు శ్రీరామచంద్రుని చక్రవర్తి చిహ్నములతో నలరారు శ్రీపాదములను నా తలపై దాల్చిన గాని నా మనస్తాపము తీరదని భరతాళ్వాను లాశించిన పాదములతో గదా భూమినంతను కొలచినది! కొన్ని యుగముల వరకును విమోచనను గాంచని అహల్యాశాపమును బాపిన చరణారవిందములతో గదా కఠినమైన భూమినంతను కొలచినది!

## ఓట్టీ యులగళస్ద -

దీనికి మొదటి వ్యాఖ్యానములో, 'యాచన లభించుటకు ముందు పొట్టివాడై' అన్నచోట యాచనలోని నీచతను గమనించి 'భక్షితేఽపి లశునే నారిష్టశాన్తిః' అనునట్లు (ఉల్లితినినను రోగము కుదురలేదు), నీచవృత్తికి పాల్పడినను ఫలము సిద్ధించునో లేదో యని పొట్టిగా నయ్యెనట. ఇచ్చట యాచనలోని నీచతకు శ్రీవేదాంతదేశికుల"వైరాగ్యపంచకము"లోని క్రింది శ్లోకము ననుసంధించవలెను.

"కాచాయ నీచం కమనీయ వాచా । మోచాఫలస్వాదు ముచా న యాచే ।"

అరటిపండు యొక్క మాధుర్యమును మించిన నా మధురవాక్కులతో నొక గవ్వకై యొక నీచుని యాచించను - అనిరి.

శ్రీకులశేఖరాళ్వార్లు

నాథే నః పురుషోత్తమే త్రిజగతా మేకాధిపే చేతసా
సేవ్యే స్వస్య పదస్య దాతరి సురే నారాయణే తిష్ఠతి ।
యం కంచి త్పురుషాధమం కతిపయగ్రామేశ మల్పార్థదం
సేవాయై మృగయామహే నర మహో మూకా వరాకా వయమ్ ॥

అనగా- "ఉత్తమ పురుషుడు, త్రిలోకప్రభువు, భక్తులకు తన స్థానమునే ప్రసాదించు వాడును నగు శ్రీమన్నారాయణుని విడచి, నరాధముడు, ఒక పల్లెకు ప్రభువు, కొలదిపాటుగ నొసంగు నీచు నొకని నాశ్రయించి యాచించుచున్నామే! మన మెంత నీచులమో!"- అని సాయించిరి.

"యాఞ్చా మోఘా వర మధిగుణే నాధమే లబ్ధకామా" కాళిదాసు. ఒక నీచుని నుండి తన యభీష్టమును బడయుట కన్నను, ఒక గుణాఢ్యునిచే "లేదు పొమ్మ" ని త్రోసి వేయబడినను మంచిదే యని భగవంతు డీ వృత్తికి సాహసించెను.

"తృణా దపి లఘు స్తూలః । తూలాదపి చ యాచకః" అనునట్లన్నిటి కంటెను తేలిక యైనది యెండు గడ్డిపరక, దాని కంటెను తేలికైనది దూది, దానికి మించి తేలికయైనవాడు యాచకుడు. అట్టి యాచనకా శ్రియఃపతి సిద్ధపడుట! అర్జునుని గుర్రముల త్రోలుటకన్నను నీచ వృత్తి కదా యిది! ఐనను భక్తవాత్సల్య మా నీచతను పాటించనీయదు.

ఓ ర్లీ —

ఇచ్చట ఆంధ్రభాగవతమునందలి వామనచరిత్రలోని పద్యములను, క్రింది శ్లోకమును అనుసంధించవచ్చును.

బలి వామన సంవాదము —

క స్త్వం బ్రహ్మ?న్నపూర్వః, క్వ చ తవ వసతిః? యాఽఖిలా బ్రహ్మసృష్టిః,
కస్తే త్రాతా? హ్యనాథః, క్వ చ తవ పితరౌ? నైవ తాం తం చ జానే ।
కస్తేఽభీష్టం దదాని? త్రిపదపరిమితా భూమిః అత్యల్పమేతత్
త్రైలోక్యం, భావగర్భం బలి మితిచ వదన్ వామనో న స్స పాయాత్ ॥

శ్లోకార్థము —

బలిః - బ్రహ్మన్! త్వం కః? = పూజ్యుడా నీవెవరవు?

వామనః - అపూర్వః = నేను క్రొత్తవాడను, నాకు వెనుక నెవ్వరును లేరు. (నే నాది పురుషుడను)

బలిః - క్వ చ తవ వసతిః? = నీ నివాస మెచ్చట?

వామనః - యాఽఖిలా బ్రహ్మసృష్టిః = ప్రభూ! ఒకస్థాన మేమున్నది. ప్రపంచమంతయు నాదే. (నేను సర్వవ్యాపకుడ నని యంతరార్థము)

బలిః - కస్తే త్రాతా? = నీకు దిక్కెవ్వరు?

వామనః - అనాథః = నాకు దిక్కు లేదు (ఇంద్ర, రుద్ర, బ్రహ్మాదులకు ఒకరిని చెప్పగా 'అథ' యను ప్రశ్న పుట్టుచుండును. నారాయణుని చెప్పిన తర్వాత 'అథ' అను ప్రశ్నకు తావులేదు. కావున అతడు 'అనాథుడు')

బలిః - క్వ చ తవ పితరౌ? = నీ తల్లిదండ్రు లెక్కడ?

వామనః - నైవ తాం తం చ జానే = అమ్మను, అబ్బను నే నెరుంగను. (నేను స్వయంభువును)

బలిః - కస్తేఽభీష్టం దదాని? = నీ కేమి యిమ్మందువు?

వామనః - త్రిపదపరిమితా భూమిః = మూడడుగుల మేర.

బలిః - అత్యల్ప మేతత్ = అయ్యో! ఇదిచాల స్వల్పమే?

వామనః - త్రైలోక్యమేతత్ = ఇది నాకు మూడు లోకముల నిచ్చినంత.

(ఈ సమాధానములలో స్ఫురించు పరత్వమును గమనింపుడు)

ఆంధ్రభాగవతమునందలి మరియొక విధమగు సమాధానము —

ఇది నాకు నెలవని యేరీతి బలుకుదు
నొకచోటనక యెందు నుండనేర్తు
ఎవ్వనివాడనం చేయుని బలుకుదు
నాయంతవాడనై నడువ నేర్తు
నీ నడువడియని యెట్లు వక్కాణింతు
పూని ముప్పోకల బోవనేర్తు
ఇది నేర్తు నది నేర్తు నని యేల చెప్పంగ
నేరుపు లన్నియు నేన నేర్తు

నొరులుగారు నాకు నొరులకు నేనొదు
నొంటి వాడ చుట్టమొకడు లేడు
సిరియు తొల్లి గలదు చెప్పెదు నాటెంకి
సుజను లందు తరచు సొచ్చియుందు.

బలినుండి మూడడుగుల భూమిని దానముగా తీసికొని కొలుచుకొనుటకై పెరిగిన సందర్భములో

ఇంతింతై వటు డింతయై మరియు తా నంతై నభోవీధిపై
నంతై తోయజ మండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై
నంతై సత్య పథోన్న తుండగుచు బ్రహ్మాండాంత సంవర్థియై.

రవిబింబం బుపమింప పాత్రమగు ఛత్రంబై, శిరోరత్నమై,
శ్రవణాలంకృతియై, గళాభరణమై, సొవర్ణ కేయూరమై,
ఛవిమత్కంకణమై, కటిస్థలి నుదంచద్ఘంటయై, నూపుర
ప్రవరంబై, పదపీఠమై వటుడు తా బ్రహాండము న్నిండుచోన్.

## వామనుని సౌందర్యము -

శంభుండో! హరియో! పయోజభవుడో! చండాంశుడో! వహ్నియో!
దంభాకారత వచ్చెగాక ధరణిన్ ధాత్రీసురుం డెవ్వ డీ
శుంభ జ్జ్యోతను డీ మనోజ్ఞతను డంచున్ విస్మయ భ్రాంతులై
సంభాషించిరి బ్రహ్మచారి గని తత్సభ్యుల్ రహస్యంబుగన్.

ఓజ్జి యులగళన్ద ప్రారంభమున మొదటి వ్యాఖ్యానములో "పిఱర్ కార్యం శెయ్య పెరుగై యాలే వళర్న్ద పడి" అన్నచోట నిందులకు శ్రీరామాయణమున దశరథుని పుత్రకామేష్టిలో తమ తమ హవిర్భాగములను సాక్షాత్తుగా గైకొనుట కేతెంచిన దేవగణము బ్రహ్మతో, రావణుని వలన తమకు కలుగుచున్న బాధలను చెప్పుకొని వానిని దండింపుమని వేడగా శ్రీమహావిష్ణు వొక్కడే యందులకు తగినవాడనియు, ఆతని ప్రార్థింపుడనియు నిశ్చయించుకొని యాతని కొరకై నిరీక్షించుచుండగా శ్రీమహావిష్ణు వచ్చుటికే వేంచేయు విషయము నుగ్గడించుచు వాల్మీకి మహర్షి "ఏత స్మి న్నంతరే విష్ణు రుపయాతో మహాద్యుతిః" అని శ్రీమహావిష్ణువునకు "మహాద్యుతిః" అనునొక విశేషణమును ప్రయోగించెను. దీనిచే దేవకార్యనిర్వహణ మనెడు మహొపకారము తనకు లభించినదను ఆనందముతో నాతనికి సర్వాంగీణమైన యొక యపూర్వమైన కాంతి వెల్లివిరిసి ప్రవహించెను.

ఉత్తమన్ పేర్ పాడి -

"ఏతే సత్పురుషాః పరార్థఘటకాః స్వార్థం పరిత్యజ్య యే ।
సామాన్యాస్తు పరార్థ ముద్యమ భృత స్స్వార్థావిరోధేన యే ।
తేఽమీ మానుషరాక్షసాః పరహితం స్వార్థాయ నిఘ్నన్తి యే ।
యే తు ఘ్నన్తి నిరర్థకం పరహితం తే కే న జానీమహే॥

( భర్తృహరి - నీతిశతకం )

స్వార్థమును పూర్తిగా విడచి పరుల యనర్థముల బాపుటకై తన జీవితము నుపయోగించు వాడు ఉత్తముడు.

తమ తమ కర్మానుభవమునకై సంసారమున నానాయోనులలో పుట్టి దుఃఖపరంపరల నను భవించుచు నల్లాడుచున్న చేతనుల దురవస్థను జూచి పరుల దుఃఖమును చూచి సహించలే కుండుట, దానిని పరిహరించక నుండలేకపోవుట యను దయ జనించి నారాయణుడు పరమపదవాస మును గూడ విడచి, యాయా యవసరములకు తగినటుల యాయా ప్రాణులకు సజాతీయుడై యవ తరించి, కర్మలవలన మన మనుభవించు కష్టములకన్నను, కొన్నిమడుంగులు అధికములైన కష్టము లను సహించి, సర్వవిధముల ప్రాణుల నుద్ధరించుటకై ప్రయత్నించుచున్నాడు.

"ఇన్రై తిరువాడి ప్పూర మెమక్కాక,
వన్రో విజ్జాణ్డాళవతరిత్తాళ్" (ఉప. రత్న, 22 పా)

భూదేవి సంసారిచేతనులను జూచి వారి దుఃఖములను బాపి వారి నుద్ధరించుటకై పరమపద మునందు పరమాత్మతో కలసి తానను భవించుచున్న యవిచ్ఛిన్నభోగజాతము నంతను విడచి పెరియాళ్వార్ల పెంపిళ్లగా నవతరించెను.

ఇదుగో, ఇట్టివారుత్తములు.

శ్రీరామచంద్రుడు ఋషులను రక్షించుటకై అవసరమైనచో తన ప్రాణమునైనను, అంత కంటె ప్రియమైన పిరాట్టిని, అంతకన్నను పుట్టినది మొదలు ఒక్క క్షణకాలమైనను విడువక కూడ నుండు లక్ష్మణప్పెరుమాళ్లనైనను విడుతునని ప్రతిజ్ఞ గావించెను.

తన ప్రయోజనమున కంతరాయము లేకుండగా నితరులకొరకై యత్నించువారు మధ్య ములు. స్వార్థమునకై పరులను పీడించి పొట్టను నింపుకొనువారు అధములును, మానుషరాక్షసులును నట. ఇక, తమకు లేకున్న మానె, యితరులకు ఉండనేల? యను నీర్ష్యతో పరులను పీడించు దుర్యోధనాదులవంటివారికి భాషలో పేరే లేదట. వీరు గడ్డితొట్టిలోని కుక్కవంటివారు.

ఉత్తమన్ పేర్ పాడి -

లోకమున బద్ధులనియు, ముక్తులనియు రెండు విధములగు జీవకోటి కలదు. "ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః". వారిద్దరికన్నను విలక్షణుడగుటచే పరమపురుషుడు 'ఉత్తమపురుషుడు' అనబడుచున్నాడు. ఇది శ్రుతి. స్మృతి సిద్ధాంతము. అట్టివాని 'పేర్ పాడి' అనగా, తిరునామానుసంధానమును చేయుదము.

ఆండాళ్ తల్లి అవతారము, ముఖ్యమైన చేతనోజ్జీవనమునకై సృష్ట్యాదియందే పరమాత్మ కల్పించిన, పరమపురుషుని గుణకీర్తనము, అతడే రక్షకుడను గట్టి నమ్మకము, అతనికి పుష్పమాల లను సమర్పించుట - అను సర్వసాధారణములును, సర్వోత్తమములునగు మూడు సాధనములను తా నవలంబించి. లోకులచే నవలంబింప జేయుటకే యని గోదాచతుశ్శ్లోకిలోని "కల్పాదౌ" అను రెండవ శ్లోకము తెలుపుచున్నది.

ఈమె యవతారమునకు ముఖ్యప్రయోజనమైనది భగవద్గుణకీర్తనమే యగుటచే నది తిరుప్పావై ప్రబంధమున ననేకావృత్తులుగ నుపదేశింపబడినది.

1. పైయత్తు యిన్ట పరమనడిపాడి. — 2 పా.
2. ఉత్తమన్ పేర్ పాడి. — 3 పా.
3. వాయినా ల్పాడి — 5 పా,
4. కేశవనై ప్పాడవుమ్. — 7 పా.
5. పాడి ప్పఱై కొణ్డు — 8 పా.
6. నామమ్ పలవుమ్ నవిన్ఱు — 9 పా.
7. ముగిల్ వణ్ణన్ పేర్ పాడ. — 11 పా.
8, మనత్తు క్కినియానై ప్పాడవుం. — 12 పా.
9. కీర్తి మై ప్పాడి ప్పోయ్ — 13 పా.
10. పఙ్గయకణ్ణానై ప్పాడ — 14 పా.
11. మాయనై ప్పాడ — 15 పా.
12. తుయి లెళ్ల ప్పాడు వాన్ — 16 పా.

| | | |
|---|---|---|
| 13. | ఉన్ మైత్తునన్ పేర్పాడ | 18 పా. |
| 14. | పోత్తియాం వన్దోమ్. | 21 పా. |
| 15· | 6మారులు పోత్తి | 24 పా. |
| 16. | ఉన్దనైన్ప్పాడి | 17 పా. |
| 17. | అడిపోత్తుం పారుళ్ కేళాయ్. | 29 పా. |

## పేర్ పాడి -

ఆ పేరు అష్టాక్షరీ మంత్రములోని 'నారాయణ' అనునదియే. ఈ తిరునామ మితరు లెవ్వరికిని చెందకుండునట్లు వ్యాకరణ సూత్రకారులు "పూర్వపదా త్సంజ్ఞాయా మగః" అను సూత్రముచే నారాయణ అను పదము ఒకరికి రూఢియగు పేరు అయినచో 'ణ' కారము వచ్చును- అనిరి. అనన్య పరమైన - అనగా- కేవలము నారాయణునే చెప్పుటకైన, నారాయణోపనిషత్తులోను, ఇతరత్రను వేదము లావరించిన దీ నారాయణ పదమునే. ఋషులు తమ పురాణేతిహాసములలో అధికముగా వాడిన దీ పదమునే. ఆళ్వారులును, ఆచార్యులును ఆదరించిన దీ పదమునే. ఈ పదము విష్ణు, వాసుదేవ పదములవలె గాక భగవంతుని బాహ్యాభ్యంతరవ్యాప్తితో బాటు, ఆ వ్యాప్తిరీతిని, ఫలమును, వ్యాపింపబడు పదార్థములను, భగవంతుని కల్యాణ గుణములను మొదలగు నర్థముల నెల్లను స్పష్టముగా బోధించును. దీని కర్తమైన శ్రియఃపతి కన్నను ఈ పదముయొక్క వైభవమధికము. శ్రీకృష్ణు డెచ్చటనే ద్వారకలో నున్నను ఈ పదము ద్రౌపదికి నోటియందే యుండి ఆమెకు మాన రక్షణ గావించెను. పరత్వ, సౌలభ్యములను ఈ శబ్దము బహువ్రీహి, తత్పురుష సమాసములతో స్పష్టముగా బోధించును. బహువ్రీహివలన అన్నింటిలో నంతర్యామిగా నుండువాడని సౌలభ్యమును, తత్పురుషవలన తనకంటె వేరైన సమస్తమునకు ఆధారభూతుడను పరత్వమును బోధించును గదా! ఇందలి యేకదేశమైన 'అయన' పదము 'ఈయతే' ఇత్యయనం' అని ప్రాప్యత్వమును, 'ఈయతే అనేనే త్యయనం' అని ప్రాపకత్వమును తెలుపును. మనకీ నారాయణుడు తల్లి, తండ్రి, తోడు, నీడ మొదలగు సకలవిధ బంధువని తెలుపును. మన మాయన నాదరింపకున్నను ఆయన అందరి హృదయములలో వేంచేసియుండి మన సత్తనే కాపాడుచుండును.

ఈ తిరునామమును కీర్తించి మన మీ నోమును ప్రారంభించినచో మనకును, మనవారికిని కావలసిన ఫలము లన్నియును సిద్ధించును. ఇది కర్మ, జ్ఞాన, భక్తి, ప్రపత్తి నిష్ఠు లందరకును అవలంబనీయమై ఆ సాధనములను సార్థకపరచును. దీని నుచ్చరించుట భగవంతుడు ప్రసాదించిన నాలుకను సార్థకపరచుకొనుటకే. కులశేఖరులు ఈ నామము నుచ్చరించిన మోక్షము తప్పక సిద్ధించునను విశ్వాసముతో

"శ్రీమ న్నామ ప్రోచ్య నారాయణాఖ్యం ।
కే న ప్రాపు ర్వాఞ్ఛితం పాపినోఽపి ।
హా! నః పూర్వం వాక్ప్రవృత్తా న తస్మిన్ ।
తేన ప్రాప్తం గర్భవాసాది దుఃఖమ్॥"

"అహా! ఎంత పాపాత్ములైనను నారాయణుని నామాను సంధానమును గావించి యభీష్టమును బడసిరి. అయ్యో! నేను నా పూర్వ జన్మలో దీనిని నోట నుచ్చరించనైనను లేదు గదా! సత్యము. అట్లుచ్చరించియే యున్నచో తిరిగి నాకీ జన్మ యెట్లు వచ్చెడిది?"అని పశ్చాత్తప్తచిత్తులై యీ జన్మలో నైనను ఆ తిరునామము నుచ్చరించి తరింతు నని దానికి ముఖ్యకరణమైన తమ నాలుకను "ప్రావర్తయ ప్రాఞ్జలి రస్మి జిహ్వే । నామాని నారాయణగోచరాణి" "ఓ నాలుకా! నీకు నమస్కరింతునే. నారాయణనామాను సంధానము చేయవే" యని ప్రార్థించిరి. ఋషులున్ను

"నారాయణేతి నామో ఽ స్తి । వాగస్తి వశవర్తినీ ।
తథాపి నరకే ఘోరే । పతన్తీ తి కి మద్భుతమ్!"

"ప్రజలారా! మీ కొక వింతయైన మాటను వినిపింతుము. వినుతు. 'నారాయణ' అను తిరు నామ మందరకు నందుబాటులో నున్నది. దాని నుచ్చరించగల నాలుక మన స్వాధీనములో నున్నది. ఇన్ని సౌకర్యములున్నను అందరును దీని నుచ్చరించి పరమపదమును బడయక ఘోరనరక యాతన లకు గురియగు చున్నారు. చూడు డెంత వింతయో" అనిరి.

పా డి -

పాడుట యనగా "ప్రేమత్తోడే పేణి యనుసన్ది క్క వేణుమ్" ప్రేమకో ఆర్ద్రహృదయులై ఆదరించి యుచ్చరించవలెను. ఆ ప్రేమ, ఆ యార్ద్రత యెట్లు కలుగు ననగా – దాని యర్థమును భావించిన కలుగును. ఆర్ద్రహృదయముతో ననగా

"బద్ధేనా ఞ్జలి నాఽఽనతేన శిరసా గాత్రైః స్సరోమోద్గమైః ।
కణ్ఠేన స్వరగద్గదేన నయనే నోద్గీర్ణబాష్పామ్బునా ॥"

అనగా – రెండు చేతులను జోడించి, శిరస్సును బాగుగావంచి, భగవంతుని గుణచేష్టలను తలచుకొనుటచే కలుగు సర్వాఙ్గీణరోమాంచము (గగుర్పాటు)తో, డగ్గుత్తికతో, నేత్రముల నుండి ఆనంద బాష్పధారలు ప్రవహించుచుండ అనుసంధించవలెను. ఇట్టి మహనీయుని దర్శించుటయే జన్మ సాఫల్యము.

"అశ్రుపాత శిత నేత్రామ్బుః । పులకీకృతగాత్రవాన్ ।
సదా పరగుణావిష్టః । ద్రష్టవ్య స్సర్వదేహిభిః ॥"

భగవదనుభవమువలన కలుగు ఆనందపారవశ్యమున చల్లని కన్నీరు మున్నీరుగా కారుచుండగా, ఒడలంతయు గగుర్పాటుతో నిండియుండగా, భగవద్గుణామృత ఝురులయం దోలలాడు భక్తుని దేహధారులందఱును సేవించిన చాలును. అందువలననే తరించవచ్చును.

అట్లు పాడుదమని ఆండాళ్ తల్లి యాదేశించుచున్నారు, ఇచ్చట నంజీయరు శ్రీభట్టరువారి నడిగిన ప్రశ్నను, దానికి వారొసంగిన సమాధానమును స్మరించవలెను.

"స్వామీ! నామసంకీర్తనకు అందరును, అన్నివేళలయందును, అన్నివిధములచేతను అధికారులేనా? దీనికి దేశ, కాల, అధికారి, ప్రకార, ఫలనియమములు ఏవియును లేవా"యని ప్రశ్నించిరి.

దానికి శ్రీభట్టరువారు "యోగ్యుడైనచో నెట్లున్న నట్లే చేయును. అయోగ్యుడైనచో యోగ్యతను సంపాదించుకొన పనిలేదు. "శుద్ధ్యశుద్దిగళిరణ్డుమ్ తేడవేణ్డా, ఇరుక్షపడియే అధికారియామిత్తనై" అని కదా శ్రీవచన భూషణ సిద్ధాంతము అనగా- అశుచిగా నున్నవాడు శుచిత్వమును గాని, శుచిగా నున్నవాడు అశుచిత్వమును గాని సంపాదించుకొన పనిలేదు. ఉన్నవాడున్నట్లే నామ సంకీర్తనము చేయవచ్చును. మనకు వలయు సౌభాగ్యములను చేకూర్చునను గట్టి నమ్మకముతో గదా మన మా శ్రియఃపతి తిరునామము ననుసంధించుచున్నాము! అట్టి సమర్థుడు మన కింతకు ముందున్న విరోధులను పోగొట్టజాలడా" అని యానతిచ్చిరి. గంగలో స్నానము నాచరించుట కేగువాడు ముందుగ నొక గుంటలో మునిగి పోవలెనా?

ఈ ప్రపన్నులు వేరొక సాధనములతో విరోధులైన పాపములను పోగొట్టుకొని శుద్ధిని సంపాదించుకొని తిరునామ సంకీర్తనమును చేయుదమన్నంత ఆలస్యమును సహించలేరు. ఈ యధికారి తనను భగవంతునకు శరీరముగా తలంచును. శరీరమాలిన్యమును శరీరియే గదా పోగొట్టుకొనును! కృష్ణానుస్మరణం పరమ్" అనుటలో 'పరమ్' అనుటచే నాతని కన్న పరుడైన వేరొక శేషి యున్నచో గదా! ఆతని నాశ్రయించి మనము ప్రాయశ్చిత్తము చేసికొన వలెను! అట్టి వాడేడి?

"మత్తః పరతరం నాన్యత్ కిఞ్చి దస్తి ధనఞ్జయ" అని భగవానుడే తెలిపెను గదా!

నాఙ్గళ్ -

"ఇమ్మై వన్దిత్తనైయు మముదు శెయ్‌దిడ పెరిల్" (నా. తి) అనగా- ఆండాళ్ తల్లి తిరుమాలిరుంశోలైలో వేంచేసియున్న సుందర బాహుపెరుమాళ్ల యెదుట నొక గంగాళముతో అక్కారరిశ ప్రసా

దము నుంచి "స్వామీ! నేడు నీవిచ్చటికి వేంచేసి దీనిని పూర్తిగా అరగించినచో నేను నీ కిట్టి నూరు గంగాళముల అక్కారరిశ ప్రసాదమును అరగింపుజేసి ఆ పై యావదాత్మభావిగా నీ సేవను చేయుదు" నని విన్నవించెను. అట్టి గోష్ఠికి చెందిన వారము మనము. వీరు "పాడి నెయ్యుణ్ణోమ్" అనువారు· వీరికి పాడుటయే పరమభోగ్య పదార్థమగుటచే వీరికి కడుపు నిండిపోయినది. ఇతరములైనవి వారికి సొక్కవు.

## నమ్మాబ్బైక్కు - మన నోమునకు

భగవద్గీత 9వ అధ్యాయము 16వ శ్లోకమున భగవానుడు "అహం క్రతు రహం యజ్ఞః" అని సెలవిచ్చెను. క్రతువనగా ఫలమును కోరి చేయు జ్యోతిష్టోమాదిక మనియు, యజ్ఞ మనగా నిష్కామ ముగా చేయు నిత్యనైమిత్తికములగు పంచ మహాయజ్ఞములని శ్రీభాష్యకారులు వివరించిరి. మన సంప్రదాయమున ఫలాపేక్షతో చేయు క్రతువులు లేవు. వేదముయొక్క పూర్వభాగము, ఉత్తర భాగమువలె మనకు ప్రమాణమూర్ధన్యమైనను అందు పేర్కొనబడిన కర్మలన్నియు ఫలసంగకర్తృత్వ ములను విడచి భగవత్ప్రీతికై కైంకర్యబుద్ధితో చేయవలసినవియే. ఈ గోపిక లాచరించునది క్రతువా? యజ్ఞమా? వీరి దృష్టిలో నిత్యకర్మల వంటి యజ్ఞమే. వీరి పెద్దల దృష్టిలో నిది జ్యోతిష్టోమాది క్రతు వుల వలె పాడిపంటలకొరకు చేయబడు క్రతువే. "ఏమైన నేమి? మనకు శ్రీకృష్ణుని సాన్నిధ్యము, నోరార నా మహనీయుని నామోచ్చారణము, ఆ మహనీయుని కైంకర్య పురుషార్థము మొదలగు మన యభీష్టములు సిద్ధించు నెపము గావున మనము దీని నాచరింతము" అని గోపాంగనల యభి ప్రాయము. ఆళ్వారులు గావించిన 'మడల్ గ్రహణము' కన్నను, ఆండాళ్ తల్లి చేసిన కామ దేవా రాధనము కన్నను చెడిపోయినదా? యని సంతోషముతో ప్రారంభించిరి. ఇది అకామ, సకామములుగా అన్వయించునదగుటచే దీనికి స్నానాదులు కొన్ని విధులు తప్పవు కావున

## శాత్తి నీరాడినాల్ -

ఈ స్నానమును గ్రామస్థులు వ్రతాంగ స్నానమని భావింతురు. వీరి కిది శ్రీకృష్ణవిశ్లేష తాప శాంతికి చేయు శీతల తీర్థావగాహనము. వీరి నీళాట్టమునకు ముఖ్యార్థము శ్రీకృష్ణ కల్యాణగుణావ గాహనమే. భరతాళ్వానులు "అపర రాత్రేషు సరయూ మవగాహతే" అపర రాత్రివేళ సరయూనదిలో స్నానము చేయుచుండిరట. అట్లు చేయుటలో ముఖ్యాభిప్రాయము శ్రీరామ విశ్లేష జనిత తాపోప శాంతియే. వెలుగు వచ్చిన, నీరు వేడి యెక్కి తాపమును తీర్చదనియే అపర రాత్రమున సలిలావ గాహమును చేయుట,

## తిష్ఠస్తి నావెల్లామ్ -

"యత్రాష్టాక్షర సంసిద్ధో । మహాభాగో మహీయతే ।
న తత్ర సఞ్చరిష్యన్తి । వ్యాధి దుర్భిక్ష తస్కరాః॥"

ఈ శ్లోకము అష్టాక్షరీ మహామంత్రము అర్థశక్తిచే మనలను రక్షించు విధానమును బోధించుచున్నది. ఎట్లనగా- శాస్త్రోక్తరీతిగా అష్టాక్షరీ మంత్రమును పురశ్చరణగావించి సిద్ధిని బడసిన పురుషు డెక్కడెక్కడ పూజింపబడునేని అచ్చట వ్యాధులు గాని, కఱవులు గాని, దొంగలు గాని యుండరు

## వ్యాధులు ఆత్మవినాశకరములగు నవి యారు —

1. శరీరమునే ఆత్మయని తలంచుట. 2. తనను స్వతంత్రుడ ననుకొనుట. 3. నారాయణుని విడచి యితర దేవతలకు తనను దాసుడనని తలంచుట. 4. తన రక్షణను తానే గావించుకొనగల ననుకొనుట. 5. ఔపాధిక బంధువులనే ఆత్మ బంధువులనుగా భావించుట. 6. సాంసారిక భోగాను భవమునకే ప్రవృత్తి నని తలంచుట- అనునవి.

దీనికై అష్టశ్లోకిలోని "దేహ సక్తాత్మ బుద్ధిః" అను శ్లోకార్థము నెరుంగవలెను. అందు చెప్పిన షట్ రోగములకు మందు ఈ మంత్రములో నుండుటచే దాని నెరింగిన యా రోగములుండవు.

దుర్భిక్షమనగా- ఐశ్వర్యము లేకుండుట. ఐశ్వర్యములలో ముఖ్యమైన ఐశ్వర్యము భగవద్భాగవత కైంకర్యము. ఈ మంత్ర మా కైంకర్యమును బోధించుటచే దుర్భిక్షము - అనగా- భగవద్భాగవత కైంకర్యాభావ ముండబోదు.

తస్కరులనగా — న్యాయముగా నొకరి యనుభవమున కేర్పడిన వస్తువును వారి యనుమతిని బడయక తన యనుభవమునకై బలాత్కారముగా నుపయోగించుకొనువారు. అట్టి వస్తువు లన్నిటికంటెను మిన్న నిత్యమైన ఆత్మవస్తువు. అది భగవధీనమైనది. ఐనను దాని నెరుంగక "నేను స్వతంత్రుడను" అని గాని "నేనితరులకు దాసుడను" అని గాని తలంచుట. ఇది యా యాత్మ నపహరించుటయే గదా! ఈ మంత్రమున ప్రణవము 'నీవు స్వతంత్రుడ వెంత మాత్రము కావు. నీ రక్షణలో నీకు స్వామ్యత లేదు. అందుచే నీవు భగవద్భాగవతులకు మాత్రమే దాసుడవు' అని బోధించుటచే అట్టి దొంగలుండరు. ఇది యీ శ్లోకమునకు వాస్తవమైన యర్థము.

ఇట్లు మంత్రసిద్ధిగల పురుషు డొక్కడున్ననే యీ దోషములుండవని చెప్పగా నిక నిచ్చట నెందరు మంత్రనిష్ఠులుండగా లోకము వ్యాధి దుర్భిక్ష తస్కరులు లేక పాడిపంటలతో తులతూగు చుండునని వేరుగ చెప్పవలెనా?

నాడెల్లామ్ –

భగవంతుని కృప యొక్క రీతోనే నిలచిపోవునది కాదు. భక్తునకు భగవంతునియందలి ప్రీతి "త్వద్భృత్య భృత్య పరిచారక భృత్యభృత్య భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ!" అని భగవంతుని చరమ భక్తునివరకును వ్యాపించినటులనే "కేశవన్ తమర్ కీழ் మేల్ ఎమరో ఏழ్ఏழ் పిఱప్పమ్" అనునటుల భగవత్ప్రీతియును ఆ భక్తుని సంబంధిసంబంధుల వరకును వ్యాపించుటచే మన సంబంధము గల ఊరు నాడు మొదలగున వన్నియు సుభిక్షముగా నుండు ననుచున్నారు.

తీజ్గిన్ట్రి నాడెల్లామ్ –

శ్రీరామచంద్రుని రాజ్యమువలె సర్వసమృద్ధులతో తులతూగును. సకలాపదలును మాసిపోవును.

"నగరాణి చ రాష్ట్రాణి ధనధాన్యయుతాని చ" అనునట్లుండును. ఈ సమృద్ధి మన మార్జించిన పుణ్యఫలమా? కాదు. అది శ్రీరామచంద్రుని పాలనముచే వచ్చినది. ఈ సంపదయు నట్టిదే.

తీజ్గళ్ ముమ్మారి పెయ్దు – నెలకు మూడుసార్లు వర్షించి.

ఒరుపులు, వరదలు లేకుండగా తల్లి చంటిబిడ్డ తలపై ఆరారగా నూనె పెట్టినట్లుండుట. తొమ్మిది రోజులు ఎండయు, నొక రోజు వర్షమునై 'నికామే నికామే పర్జన్యః ప్రవర్షతి" అవసరమైన సమయములలో కావలసినంత వర్షము కురియును.

ఓజ్గు పెరుంశెన్నె లూడు కయలుకళ – పెరిగిన పెద్ద సస్యముల మధ్య చేపలు త్రుళ్లగా –

త్రివిక్రమునివలె పెరుగుట. మారీచుడు శ్రీరాముని "వృక్షే వృక్షే చ పశ్యామి"అనునట్లున్నది. ఒక దుబ్బు ఒక మడిని కబళీకరించుకొని, యచ్చట నిక అవకాశము లేకపోవుటచే ఆకాశమున చోటున్నంతవరకు పెరిగియుండును.

ఊడు కయలుకళ – మధ్య చేపలు ఎగురగా –

ఏనుగు గున్నలవలె పెరిగిన చేపలు చేలకు లోపలనుండి పైకి పోవుటకు స్థానములేక గర్వముచే త్రుళ్లుచుండును. ఇది చేపలనుభవించుచున్న ఆనందమును తెలుపును.

పూఙ్గువళై ప్పోతి ఱ్పొ ఱివణ్డు కణ్పడుప్ప –

పూచిన కలువ పువ్వులలో సుందరమైన తుమ్మెదలు నిద్రించగా –

మకరందమును పానముచేయుటచే గాని, పరస్పరము కలియుటచేగాని తుమ్మెదల కాంతి యంతయు శరీరమున ఊర్చి తీసికొనవచ్చునన్నట్లున్నది. ఆ భ్రమరమిథునము ఆ పువ్వునందలి స్పర్శసుఖముచే మత్తుపదార్థమును పానముజేసిన వారివలె పరుండి యొడ లెరుంగక నిద్రించినది, లేచినపుడు "నన్ను నీవు లేపలేదు, నీవు నన్ను లేపలేదు" అని యొకదానితో నొకటి చిర్రు బుర్రు మనుచుండును.

ఊడుకయలుగళ, పూఙ్గువళై ప్పోతి ఱ్పొ ఱివణ్డు కణ్పడుప్ప –

అందమైన కలువపువ్వులలో అందమైన తుమ్మెదలు నిద్రింకగా చేపలు క్రింద త్రుళ్లుచుండుటచే సస్యములున్ను. కలువ పువ్వులున్ను ఒకేసారి కదలుటచే హంసతూలికాతల్పమున నిద్రించు రాజపుత్రుని దాసీజనము చామరములతో వీచుచున్నట్లుగా ఆ తుమ్మెదలు నిద్రించుచున్నవి. ఈ సందర్భములో శ్రీభట్టరువారు సాయించిన యొక కథ గమనించ తగ్గది.

శ్రీవిల్లిపుత్తూరులో నొక తుమ్మెదల మిథున ముండెను. అందు ఆడుతుమ్మెద గర్భమును ధరించి కదలను మెదలను లేక ఆండాళ్ సన్నిధిలోని యొక పుష్కరిణిలోని యొక కలువపువ్వులో విశ్రమించెను. మగ తుమ్మెద యెచ్చటికైన నేగి ఆహారమును గొనితెచ్చి భార్యను సంతోషపెట్టవలెనని యెగిరిపోయి యొక చెరువునందలి తామరపువ్వునందలి మకరందమును సేవించుచుండగా దైవవశమున ప్రొద్దుగ్రుంకి అది యా తామరపువ్వులో నిర్బంధించబడిపోయెను. ఉదయమున సూర్యకిరణములచే నా పద్మము వికసింపజేయబడగా దారిని లభించి యా మగతుమ్మెద ఆడుతుమ్మెద యొద్దకు రాగా నది మగతుమ్మెద ముఖమునందలి పుప్పొడిని చూచి రాత్రి తన చెంతకు రాక మరి యొక తుమ్మెదతో రమించి వచ్చినదను ప్రణయరోషముతో తటాలున తలుపులు బిగించుకొని లోపలికి పోయినదట. (సూర్యరశ్మి సోకగనే కలువలు ముకుళించును – తామరలు వికసించును)

ఇది సస్యములయొక్క అభివృద్ధి. ఇకపైన పశువులయొక్క అభివృద్ధి జెందు విషయము చెప్పబడుచున్నది.

తేఙ్గాతే పుక్కిరున్దు _ భయపడి వెనుదీయక ప్రవేశించి యుండి.

మిక్కిలిగ ముంజేతి బలముకలవారై యున్నవారు పాలుపితుకుటకు సిద్ధపడియుండవలెను. ఇందులకు కారణము పాలధార మారకపోవుటచే విడచిపోవుటకు వీలులేకపోవుట. కావున ప్రతివారును పాలను పితుకుటకు సిద్ధపడరు.

ఇరున్దు _ కదలక యుండి

పాలధార మారినగదా వేచియుండదగినది.

శీర్తములై - బలసియున్న చనుకట్టు.

వ్రేలును చుట్టి పట్టుకొన శక్యముకాదు. రెండుచేతులతోను గట్టిగ బిగియపట్టి పితుకవలెను.

పత్తి వాఙ్గ కుడం నిఱైక్కుమ్ - పట్టి లాగగా కుండ నిండును.

అనగా, చనుకట్టును పట్టుకొని చేతిని తీసివేసినను తనంతనే పాలను కార్చుచుండును. పెట్టిన కుండలన్నియును నిండుచునే యుండును. కుండలను పెట్టకుండుట యజమాని దోషము కాని పశువుదోషము కాదు.

వళ్ళల్ - ఔదార్యముగల

శ్రీకృష్ణుని రీతియే యీ పశువులకును ఉండును. శ్రీకృష్ణుడు దౌత్యసారథ్యముల చేసి తన సౌలభ్యమును ప్రకటించినట్లుగా ఈ పశువులున్ను చిన్న పిల్లలకున్ను కట్టుటకును, కొట్టుటకును తమను స్వాధీనపరచుకొని నిలచును.

పెరుమ్ పశుక్కళ్ -

శ్రీకృష్ణుని గుణములే ధారకములగుటకును, అతని కరస్పర్శచేతనే పెరుగుటకును ఒక యుపపత్తి కలదు. మోకాలిలోతు నవనవలాడు పచ్చగడ్డిగల బీడులోనికి పశువులను త్రోలికొనిపోయి తన పశువులనందు మేతకై విడచి తానొక చెట్టుపై కెక్కి శ్రీకృష్ణుడు

"అధరే వినివేశ్య వంశనాళం । వివరాణ్యస్య సలీలమఙ్గులీభిః ।
ముహురన్తరయన్ ముహుర్వివృణ్వన్ । మధురం గాయతి మాధవో వనాన్తే ॥"

తన పిల్లనగ్రోవిని పెదవిపై నుంచుకొని దాని రంధ్రములను తన వ్రేళ్లతో మాటిమాటికిని విలాసముగా నొకతరి మూయుచు, నొకతరి తెరచుచు మధురముగా పాడుచుండగా నా మేయుచున్న ఆవులు

మమతన్ మోములు మీదికెత్తుకొని రోమంథంబుచాలించి, హృ
త్కమలాగ్రంబుల దృష్టి నిల్పి మురళీగానామృతశ్రేణి క
ర్ణములం గ్రోలుచు మేత మాని గళితానందాశ్రులై చిత్రతో
పములై గోవులు చూచుచున్న వవిగో పద్మాక్షి! వీక్షించితే.

అనునట్లు మేత లేక నిలచిపోవును. ఇది గుణములే ధారకములగుటకు ఉపపత్తి.

సాయంకాల మిండ్లకు చేరుసరికి పశువుల రెండు డొక్కలును దించుకొనిపోయి యుండుటను గాంచి శ్రీకృష్ణుడు జాలితో తన పశువుల నన్నగారి కొప్పగించి

"సాయం తనే ప్రతిగృహం పశుబంధనార్థం
గచ్ఛన్త మచ్యుతశిశుం (ప్రణతోఽస్మి నిత్యమ్)॥"

అనునట్లు తాను స్వయముగ ప్రతియింటికిని ఏగి స్వయముగ నా పశువులను గట్టి యొక్కసారి ఆపుచ్ఛమస్తకమును తన చల్లని చేతితో నిమిరి యింటికి వచ్చుచుండెడివాడు. ఆ ప్రీతి పూర్వకమగు కరస్పర్శచే నవి మిక్కిలి బలసి సమృద్ధిగ పాలను స్రవింపజేసెడివి.

వళ్లల్ -

ఆరు నెలలు సహవసించిన వారు వీరగుదు రన్నట్లు ఇంత కాలమునుండియు పగలంతయు శ్రీకృష్ణునితోనే తమ జీవితమును గడుపు నీ పశువులకు ఆ కృష్ణుని యౌదార్యమేల రాకుండును? "ఉదారా స్సర్వ ఏవైతే" యని పాత్రలను ప్రశంసించు ఔదార్యము గదా యాతనిది! అదియే యీ పశువులకును సంక్రమించి యెన్ని పాలనిచ్చినను తృప్తి జెందవు.

నీజ్గాద శెల్వమ్ నిఱైన్దు - తరుగని ఐశ్వర్యము నిండియుండి.

జీవులయొక్క పుణ్యాపాపములకు తగినట్లుగా భత్యము నిచ్చు సర్వేశ్వరుని మూలముగా వచ్చిన సంపత్తు అయినగదా హద్దు కలిగి యుండునది!

"పాపానాం వా శుభానాం వా" పాపులైన గాని, పుణ్యశీలురైన గాని వీరిని దయచూడవలసినదే యను లక్ష్మీదేవి మూలముగ వచ్చిన ఐశ్వర్య మగుటచే నూటగలదై యుండును గదా! కావున తరుగని ఐశ్వర్య మనబడుచున్నది.

## — వేదాంతార్థము —

### ఓఙ్గి యులగళన్ద -

శ్రియఃపతి వామనుడై బలిచక్రవర్తి స్వాధీనములోనున్న తన సొత్తును తన పాదములతో కొలిచి తనకు స్వాధీనపరచుకొనినటుల "దాసభూతాః స్వత స్సర్వే హ్యాత్మానః పరమాత్మనః" అనున టుల వాస్తవముగా తన సొత్తగు నాత్మలు ప్రకృతిసంబంధముచే అహంకారగ్రస్తులై పెడదారి త్రొక్కు చుండగా వారిని కటాక్షించి తనకు దాసులనుగా చేసికొనెను.

దేవాసురయుద్ధమున భగవదనుగ్రహముచే విజయమును గాంచిన యింద్రాదిదేవతలు ఆ సామర్థ్యమంతయు తమదే యని గర్వించి యహంకరించుచుండగా వారి కొక అగ్నిజ్యోతిరూపముగ భగవంతుడు దర్శనమిచ్చి తత్త్వమును బోధించి అహంకారమును పరిహరించి తన విభూతిలో చేర్చు కొనెనని కేనోపనిషత్తు చెప్పుచున్నది. అర్జునుడు తానే కర్తననియు. తన ప్రవృత్తినివృత్తులు తన యధీ నమే యనియు భ్రమించి, తనకు కర్తవ్యమగు యుద్ధమును చేయనని ధర్మసంస్థాపకుని సన్నిధిలోనే ధనుర్బాణముల సన్న్యసింప నాతని కా కర్తృత్వము ప్రకృతిది గాని, భగవంతునిది గాని యని "ప్రకృతేః గుణసమ్మూఢాః" అనియు, "దైవం చైవాత్ర పఞ్చమమ్" అనియు విస్తారముగ బోధించి "కరిష్యే వచనం తవ" అనిపించి ఆతనిని వశవరచుకొని అతనిచే కర్తవ్యమును కొనసాగించెను. ఈ పాశురములో 'కొలచుట' యనగా తన చరణస్పర్శచే పవిత్ర మొనర్చుట. కొన్నివేల సంవత్సరముల కైనను ప్రాయశ్చిత్తముచేనైనను తొలగని అహల్యాపాపరాశిని తన చరణపరాగలేశముచే పరిహరించిన మహాత్ముడు గదా తాను! "శిలా బాలా జాతా చరణ రజసా యత్కులశిశోః" అని కదా అభియుక్తోక్తి! సాంకర్యదోషముతో చాలకాలముగ వేరొకరి యధీనమున పడియున్న భూమిని తిరిగి కొలతలు కొలిచి (resurvey) ఎవరిభూమిని వారికి అప్పగించినట్లు, బలిచే నాక్రమించబడిన భూమిని స్వాధీసపరచు కొని తిరిగి యొకసారి అంతయు నున్నదో లేదో యని కొలిచి చూచుకొనుట, లేక, "నాయడుగు పడిన భూమి నాదే" యని త్రొక్కి నడచి ప్రమాణము చేయుటయే యీ త్రివిక్రముని కృత్యము.

### ఉత్తమన్ పేర్ పాడి -

ఉత్తము డనగా తానొక్కడే. "అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః" అని తానే, బద్ధాత్మలు, ముక్తాత్మలు అని యిద్దరు పురుషులు, వారికి పైవాడు పరమ పురుషుడు అని పురుషోత్త మత్వమును సమర్థించుకొనెను గదా!

భగవంతున కనేకములగు తిరునామములున్నను వేదములు, ఋషులు, ఆళ్వార్లు, పూర్వాచార్యులు మొదలగు సర్వోత్తమ ప్రమాణప్రమాతలందరును మిక్కిలి ఆదరించిన తిరునామము "నారాయణ" యనునదియే. ఆ నామఘటితమైన అష్టాక్షరీ మహామంత్రమును.

పాడి -

అనగా, పాట కొన్ని కట్టుబాట్లతో గదా పాడబడును! అటులనే యీ మంత్రమునున్ను "ప్రేమత్తోడే పేశి యను సంధిక్క వేణుమ్" ఈ మంత్రము ప్రయోజనకారి కావలయునన్నచో, "మన్త్రత్తిలుమ్, మన్త్రత్తు క్కుళ్ళిడాన వస్తువిలుమ్, మన్త్రప్రదనాన ఆచార్యన్ పక్కలిలుమ్, ప్రేమ కనక్క వుండానాల్ కార్యకరమావదు."

"మన్త్రే తద్దేవతాయాం చ । తథా మన్త్రప్రదే గురౌ ।
త్రిషు భక్తి స్సదా కార్యా । సా హి ప్రథమసాధనమ్॥"

అనునట్లు మంత్రము నందును, మంత్రప్రతిపాద్యుడైన నారాయణునియందును. మంత్రమును ప్రసాదించిన ఆచార్యుని యందును భక్తియున్ననే కార్యకరమగును. ఆ విధముగా "అనధికారిగళ్ శెవియిల్ పడాతే" వినకూడని వారికి వినబడ కుండునట్లు ఆర్ద్రహృదయముతో ననుసంధించవలెను.

ఈ పాడుటకు ఫలము "యన్త్రాష్టాక్షర సంసిద్ధో ......." అను శ్లోక సందర్భమున వెనుక చెప్పబడినది. ప్రాజ్ఞులీ మంత్రమును సుకుమారమైన నల్లకలువపూవు యొక్క దళపు అంచుతో సమిధలను కోయునట్లు ఇతర ఫలములకు వాడరు. కేవలము అర్థాను సంధానముచే కలుగు ఆనంద లోభముచే నుచ్చరించుటయే ఫలముగా నుచ్చరింతురు.

నాజ్గళ్ నమ్పావైక్కు చ్చాత్తి నీరాడినాల్ -

ఇక్కడ నీరాట్ట మనగా ఆతపసంతప్తుడు చల్లని విశాలమైన మడుగున మునిగి లేవనట్లుగా తాపత్రయ సంతప్తుడు తిరుమంత్ర, ద్వయ మంత్రముల యందు 'నారాయణ' పదముచే బోధింపబడు భగవంతుని కల్యాణగుణాను సంధానమున నిరంతరము మునుక లిడుటయే.

నాడెల్లామ్ -

వ్రతము నాచరించు వారును, దాని కంగముగ భగవంతుని కల్యాణగుణ సారమున మునుగు వారును, దాని సాధుత్వమునకై తిరుమంత్రార్థము ననుసంధించు వారును ప్రాదేశికులే యైనను వారి మూలముగ దేశమున కంతకును ఈ ఫలము సంక్రమించుట భగవంతుని కృపాస్వభావము. "నెడు

మార్క్కడిమై" అను శబ్దమునకు "భగవంతుని కృప తదీయులవరకు పర్యవసించుట" పారిభాషికమైన అర్థవిశేషము. ఇది రెండు విధములు. భక్తునిపై గల భగవదనుగ్రహము తదీయ సంబంధి సంబంధుల వరకును ప్రసరించుట యొకటి. భాగవతులకు గల భగవత్ప్రీతి భగవంతునితో నిలచిపోక తదీయుల వరకును పర్యవసించుట రెండవది. మొదటిదానికి 'కేశవన్ తమర్' అను తిరువాయ్మొழி ప్రమాణము. రెండవదానికి "నెడు మాఱ్ఱడియై" అను తిరువాయ్మొழி ప్రమాణము. ఇచ్చట మొదటి 'నెడు మాఱ్ఱడియై' ప్రసంగము - అనగా - భగవంతునకు ప్రపన్నుల వ్రతదీక్షవలననూ, వారు గావించు సార్థమంత్రానుసంధానము వలననూ, భగవత్కల్యాణగుణావగాహనము వలననూ కలుగు అనుగ్రహము వారివరకు మాత్రమేకాక, వారున్న, ఊరువరకే గాక, ఆ యూరున్న రాష్ట్రము వరకే కాక, ఆ రాష్ట్రమున్న దేశమువరకు పర్యవసించును.

"ఆస్ఫోటయన్తి పితరః । ప్రనృత్యన్తి పితామహాః ।
వైష్ణవో నః కులేజాతః । స న స్సన్తారయిష్యతి ॥"

అనగా నొకవంశమున నొక్క వైష్ణవదీక్షగల పురుషు డవతరించినచో ఊర్ధ్వలోకములలో నున్న యాతని పితరులును, పితామహులున్ను "అహా! మన వంశమున పరమభాగవతు డుదయించెను. అతడు మనలను తరింపజేసి మనకు పరమపదమును బడయజేయు" నని యానందముతో భుజములు తట్టుకొనుచు నాట్యమును గావింతురు.

ఆ యనుగ్రహమునకు ఫలమును చెప్పుచున్నారు —

తీ ఙ్గి న్ఱి -

'తీఙ్గు' అనగా రోగము. శారీరకరోగము లపారములు. వానికి చికిత్సలును అంతియే. ఆ రోగము లీ శరీరముతోనే పోవును గాన అంత ప్రమాదకరములుకావు కాని నిత్యమగు ఆత్మవస్తువునే నాశ మొనరించు ప్రమాదకరములగు కొన్ని రోగములు కలవు. వానిని గురించి 'తీఙ్గిన్ఱి'కి విశేషార్థమున వ్రాసియున్నాను. అవి వీరిని భగవంతుని నిగ్రహమునకే పాలుగావించును. వీరే అసురులు. అసురులనగా - భగవదాజ్ఞయగు శ్రుతిస్మృతుల నుల్లంఘించి చరించుటయే జీవయాత్రగాగలవారు. వారు భగవంతునే ద్వేషింతురు. మహాక్రూరులు. వారిని భగవంతుడు జన్మపరంపరల నెత్తించి చివరకు పంది, కుక్క మొదలగు నీచాతినీచములై, అమంగళకరములైన జన్మలలో విసరిపారవైచును, ఇట్లు వారు ప్రతిజన్మయందును ఇట్టి జన్మలనే బడయుచు క్రమముగ తరు, గుల్మ. లతా, పాషాణాది

జన్మలవరకును బడయుదురు. స్థిరమైన ఆత్మ నిట్లనర్థముల పాల్జేయు రోగములు ఆరు మాత్రమే కలవు. ఆ ఆరింటికిని మందు అష్టాక్షరీమహామంత్ర మొక్కటి మాత్రమే. వాని నన్నింటిని ఈ మంత్రము నిర్మూలింపజేయును. ఆ యర్థమును శ్రీపరాశరభట్టరువారు అష్టశ్లోకి యందలి "దేహాసక్తాత్మ........." అను నాల్గవ శ్లోకమున నిట్లు సాయించిరి.

"దేహాసక్తాత్మ బుద్ధి ర్యది భవతి పదం సాధు విద్యా త్తృతీయం
స్వాతంత్ర్యాన్ధో యదిస్యా త్ప్రథమ మితరశేషత్వధీశ్చే ద్ద్వితీయమ్ ।
ఆత్మత్రాణోన్ముఖశ్చే న్నమ ఇతి చ పదం బాన్ధవాభాసలోలః
శబ్దం నారాయణాఖ్యం విషయచపల ధీశ్చేచ్చతుర్థీం ప్రపన్నః ॥"

(తృతీపదమనగా ప్రణవములోని 'మ' కారము. ప్రథమపదమనగా లుప్తచతుర్థితో గూడిన 'అ' కారము. ద్వితీయపదము అనగా ప్రణవమునకు మధ్యనున్న 'ఉ' కారము.)

ఇందు దేహాత్మభ్రాంతి మొదలగు రోగములుగా పరిగణింపబడు నీ యారును ఈ అష్టాక్షరీ మంత్రాను సంధానముచే నివర్తించును. ఈ విధము ఈ శ్లోకమున సంగ్రహముగా చెప్పబడెను. ఈ రోగములు ఈ వ్రతానుష్ఠానపరులగు ప్రపన్నుల కుండకుండుటయే గాక, వారి సంబంధమున్నచోట కూడ నుండవు.

తీజ్గళ్ ముమ్మారి పెయ్‌దు — నెలకు మూడు వానలు కురియును.

అవగా - సత్త్వగుణము తలయెత్తుటచే ఆకారత్రయము సిద్ధించును. ఆకారత్రయమనగా, ఆత్మకుండవలసిన అనన్యభోగ్యత్వము, అనన్యశేషత్వము, అనన్యశరణ్యత్వము, అనగా, భగవంతుని యందేకాక తదితరములు వేనియందును భోగ్యతాబుద్ధి లేకుండుట.భగవంతునికేగాని తదితరు లెవ్వరికిని వినియోగింపబడుటకు అనర్హమైయుండుట. భగవంతునియందె గాని తదితరములగు వేనియందును ఉపాయత్వబుద్ధి లేకుండుట అనునవి,

ఈ ఆకారత్రయమనబడు అనుకూలవృష్టిచే సస్యమువలె ఉత్తమాత్మవర్గమంతయు అభివృద్ధిని బొంది యానందించుచుండును.

"త్వదీక్షణసుధాసిన్ధువీచివిక్షేప శీతలైః
కారుణ్యమారుతానీతై శ్శీతలై రభిషిఞ్చ మామ్"

అని దేవరాజాష్టకమున శ్రీకాంచీపూర్ణులు సాయించిరి. అనగా. భగవత్కృపాదృష్టి యనెడు అమృతసాగరతరంగపరంపర. అది చల్లగా, తాపత్రయహరముగా నుండును. అది యాతని కృప యనెడు గాలిచే మనపై ప్రసరించవలెను. దానిచే మన యాత్మ యుజ్జీవించును.

ఓజ్గు పెరుంశెన్నె లూడు కయలుకళ — (ఇది ఆచార్యసమృద్ధి)

ఒక మడికి ఒకే దుబ్బు చాలునో యన్నట్లు సస్యములు పెరుగగా ఆ దుబ్బుల మధ్య, వాని మొదళ్లలో "మనకు మంచి ఆశ్రయము లభించె" నని ఆనందపారవశ్యముతో చేపలు త్రుళ్లు చుండగా —

అనగా, ఇట్టి ఆకారత్రయ సంపన్నులై యొక్క యూరున కొక్కరే చాలు నన్నట్లు విద్యా వినయసంపదలతో పెరిగియున్న ఆచార్యుల నడుమ వారి పాదారవిందముల నాశ్రయించి "మనకీ కాలమున నిట్టి ఆచార్యులు లభించిరే" యను నానందముతో శిష్యవర్గము త్రుళ్లుచుండుట. ఇచ్చట సచ్ఛిష్యుడు మత్స్యముతో పోల్చబడెను. చేప నీటిని విడచిన "ముహూర్తమపి జీవావో జలాన్మత్స్యావివోద్ధృతౌ" అని శ్రీలక్ష్మణస్వామి తనను గూర్చియు, సీతాదేవిని గూర్చియు చెప్పినట్లు, శిష్యుడును ఆచార్య సేవ తప్పినచో తహతహలాడిపోవును. తిరుమలనంబి అనంతార్యుల చరిత్రను చూడుడు.

పూజ్గువళై ప్పోదిల్ పొఱివణ్డు కణ్ పడుప్ప —

కలువ పువ్వునందు, అనగా, అట్టి ఆచార్యుల హృదయ కమలమందు సుందరమైన 'దేవ వణ్డు' అని చెప్పబడు శ్రియఃపతి లక్ష్మిదేవితో గూడ "యోగిహృదయే ష్వాసీన మీశం భజే" యనునట్లు ఉత్తరోత్తర సుఖానుభవముతో వేంచేసియుండును. (ఇదంతయు సదాచార్య సమృద్ధి.) ఇందుల కుదాహరణముగా పెరియాళ్వార్లు సాయించిన 'శెన్నియోజ్గు' ప్రబంధములో

"పనిక్కడలిల్ పళ్లికోళై పళ్గక విట్టోడివన్దు, ఎన్
మన క్కడలిల్ వాళ్గవల్ల మాయ మణాళనమ్బి,
తని క్కడలే తనిచ్చుడరే తనియులగే యెన్టెన్ఱు
ఉనక్కిడ మాయిరుక్క యెన్నైయున క్కురిత్తాక్కినైయే."

"స్వామీ! నాయందలి ప్రేమచే పరమభోగ్యమైన పాలసముద్రము నందలి శేషశయ్యను గూడ విడచి పరుగునవచ్చి నా హృదయమను మహాసముద్రమున సుఖించుటకై దానిని నిత్యవాసముగా కల్పించుకున్న స్వామీ! నీకు పాలసముద్రము, సూర్యమండలము, పరమపదము మొదలగు భోగ స్థానములుండగా వాని నన్నిటిని విడచి స్వరూపజ్ఞానశూన్యుడనగు నన్ను సర్వవిధపరిపూర్ణుడవగు నీవు

కుడం నిఱైక్కుమ్ -

వారు ఈ శిష్యుల హృదయము లనెడు కుండలను జ్ఞాన మనెడి పాలతో నింపివైతురు.

వళ్లల్ పెరుం పశుక్కళ్ -

ఉదారమైనట్టియు, పూజనీయమైనట్టియు గోవులు. అనగా, శిష్యులకు విధేయులై వారిని జ్ఞానములో తమతో సమానులుగా జేయు క్షమాదిగుణ సంపన్నులై గోవులవలె నిరంతరము పూజనీయులైన, భగవంతుని కన్న మిన్నగా భావించతగిన ఆచార్యసంపదయును, వారొసంగు జ్ఞానపరిపాకముచే లభించు నిత్యనిరవచ్ఛిన్నమైన భక్తిసంపన్నులగు శిష్యసంపదయు నిండియుండును.

## — వేదాంతార్థ తాత్పర్య సంగ్రహము —

అహంకార, మమకారగ్రస్తమైన ఆత్మవర్గమును వారినుండి విడిపించి, తన పాదస్పర్శచే పవిత్ర మొనరించి, తనకు వశపరచుకొనువాడు సర్వేశ్వరుడు. అతని వాత్సల్య, స్వామిత్వ, సౌలభ్యాది గుణములను తెలుపు అష్టాక్షరీ మహామంత్రమును మన మర్థసహితముగా ననుసంధించుచు భగవత్కల్యాణగుణానుభవమున నవగాహించి యుండవలెను. అట్లున్నచో ఆత్మవినాశకరములగు ఆరు రోగములు పోవును. దేశమంతయు ఆకారత్రయ సంపన్నమగును. ఒక్క యూరును దిద్దుబాటు చేయుట కొక్కరే చాలునంత యోగ్యతతో పెరిగి గొప్పవారుగా సమ్మానింపబడు ఆచార్యగోష్ఠిలో వారి మధ్య వారి పాదముల నాశ్రయించి శిష్యవర్గము సంతోషముతో త్రుళ్లుచుండును. అట్టి ఆచార్యుల హృదయ కమలమునందు నారాయణుడు లక్ష్మీదేవితో వేంచేసియుండును. శిష్యు దాచార్యులు గావించు పరీక్షలకు తట్టుకొని చలించక వారి సన్నిధిలో నుండి సమయానుసారముగ వారి పాదారవిందముల నాశ్రయించి పాదసంవాహనాది సేవలు చేయగా వారనుగ్రహించి వీరి హృదయములు నిండునట్లు జ్ఞానోపదేశము చేయుదురు.

ఈ వ్రతము నాచరించుటకు ఫలముగ నీ విధముగ ఆచార్య సమృద్ధియును, శిష్య సమృద్ధియును, జ్ఞాన సమృద్ధియును సంపూర్ణమై యెడతెగక యుండును.

## — సందర్భాను సారముగ ననుసంధించుకొన దగిన పాశురములు —

పాశురముయొక్క అవతారికలో —

1. మేలాత్తేవర్కళుం నిలత్తేవరుమ్ మేవిత్తొళుమ్,
మాలార్ తన్దిననాళ్ అడియేన్ మనత్తే మన్నినార్,
శేలేయ్ కణ్ణియరుమ్ పెరుం శెల్వముమ్ నమ్మక్కళుమ్,
మేలాయ్ తాయ్తన్దైయు మవరే యిని యావారే.

(తిరువాయ్మొళ్ళి 5.1.8)

పరమపద వాసులైన నిత్యసూరులును, భూమిపై నుండు శ్రీవైష్ణవులును ఆశపడి ఆశ్రయించ దగిన సర్వేశ్వరుడు ఇపుడు వచ్చి నా మనస్సునందు స్థిరముగ వేంచేసియున్నాడు. చేపలవంటి కన్నులుగల స్త్రీలును, గొప్ప ఐశ్వర్యమును, గుణవంతులగు బిడ్డలును, పూజ్యులగు తల్లిదండ్రులును ఇక మీద నాకా సర్వేశ్వరుడే యనుచున్నారు.

నాలుగవ పాశురము

# "ఆ ళి మ ళై క్క ణ్ణా"

— అవతారిక —

నిత్యవిభూతితోను, లీలావిభూతితోను కూడియుండు నారాయణుడు శ్రీకృష్ణుడై గోకులమునకు వచ్చి తనను తక్కువగా జేసికొని ఆడపిల్లలు చెప్పినట్లు చేయు చేతిలోని మనిషియై వర్తించుచున్న రీతిని చూచినచో నితరదేవతలు వారికి సేవలు చేయుదురని వేరే చెప్పవలెనా? భగవంతునాశ్రయించినవారిని జూచి "రాక్షసులు దూరముగా పారిపోవుదురు. దేవతలు దగ్గరగా జేరి నమస్కరింతు" రన్నట్లు దేవతలు తమంతనే వచ్చి సన్నిహితులై యుందురు. క్రూరముగా దండించు యమధర్మరాజు కూడ తన కింకరులతో "ప్రభు రహ మన్యనృణాం న వైష్ణవానాం" "నేను లోకమున కంతకును ప్రభువునే గాని వైష్ణవులకు దాసుడ" ననెను. ఈ పాశురమున వర్షమునకు ప్రభువగు మేఘుడు "నేనీ గోష్ఠియందు కైంకర్యమును సలిపి నా స్వరూపమును లభించవలెనని వచ్చితిని. ఈ గోష్ఠికి చేయవలసిన కైంకర్యము నాజ్ఞాపింపు" డని ప్రార్థించుచున్నాడు. "భీషాస్మా ద్వాతః పవతే" యని శ్రుతి తెలిపినట్లుగా తమ తమ యధికారములను స్థిరముగా సంరక్షించు కొనుటకై సర్వేశ్వరునకును, ఆతని ప్రియపరికరమునకును యథోచిత సేవల నొనరించు నాచారము దేవతలకు కలదు. శ్రీకృష్ణుడవతరించిన సందర్భమున

"మన్దంమన్దం జలధరాః । జగర్జు రనుసాగరమ్" అనియు, "ననృతు శ్చాప్సరో గణాః" అనియు నిట్లే తమతమ స్వరూప లాభమునకై వరుణ ప్రభృతులు యథోచిత కైంకర్యమును జేసిరి గదా! ఇపుడు తదీయుల కైంకర్యమునకై గడంగిరి. భగవద్విషయమున కైంకర్యమును జేసినవారికిని ఫలప్రాప్తి పురుషకారులగు తదీయుల మూలముననే యన్నచో నిక తదీయులకే కైంకర్య మొనర్చువారికి చెప్పవలెనా?

"సిద్ధి ర్భవతి వా నేతి సంశయోఽచ్యుతసేవినామ్ ।
న సంశయోఽస్తి తద్భక్త పరిచర్యారతాత్మనామ్॥"

భగవంతు నాశ్రయించి ఫలమును బడయగోరు వారికి ఫలప్రాప్తిలో సంశయమున్న నుండ వచ్చును. ఆతడు స్వతంత్రుడు గదా! ఆళ్వార్లకు కోరగనే ఫలము లభించినదా? "కూవిక్కొళ్ళుం కాలమ్ ఇష్టం కుఱుకాదే" అని యెంతయో మొరలిడిరి. కాని తదీయుల సేవను గావించినవారికి ఫలప్రాప్తిలో సంశయము లేదు.

"తన్ గురివిన్ తాళిణైగళ్ తన్నిల నొన్బిల్లాదార్,
అన్బు తన్బాల్ శెయ్‌దాలు మమ్బుయైకోన్ - ఇన్బమిగు
విణ్ణాడు తానళిక్క వేణ్డియిరాన్ ................
........................................................"

అనగా- తన యాచార్యుల శ్రీపాదములయందు ప్రేమ యొక్కింతయు లేక, పురుషార్థ ప్రదుడు శ్రీపతియే గదా యని యాతనియం దెంత ప్రేమను కనబరచినను ఆతడు వారికి పరమ పదము నీయజాలడు.

"ఞాన మనుష్టానమివైనన్గాగవే యుడైయ
నాన, గురవైయడైన్దక్కాల్, మానిలత్తీర్!
తేనార్ కమలత్తిరు మామగళ్ కొళునన్
తానే వైకున్దం తరుమ్,"

జ్ఞానమును, దానికి తగిన అనుష్ఠానమును పూర్తిగా గలిగియున్న ఆచార్యు నాశ్రయించినచో శ్రియఃపతి, తనయందు భక్తి లేకున్నను, తానే పరమపదమును ప్రసాదించును.

అనెడు అన్వయ వ్యతిరేకములచే ఉపదేశరత్నమాలయందు వరవరముని పుంగవులు సాయించిరి. అందులకే గదా! విభీషణాళ్వాను

"నివేదయత మాం క్షిప్రం విభీషణ ముపస్థితమ్" అని సుగ్రీవాదులను పురస్కరించుకొని శ్రీరాముని సాన్నిధ్యమును బడసినదియును. అట్లు చేయక పోవుట చేతనే గదా మహారాజు (సుగ్రీవుడు) వాలిచే దెబ్బలు తిన్నదియును. ఈ అన్వయ వ్యతిరేకములచే తదీయ సమాశ్రితులకు ఫలము కరతలామలకమను విషయము దూఢము.

## నాలుగవ పాశురము

ఆழிమళైక్కణ్ణా ఒన్ఱు నీ కైకరవేల్,
ఆழியుళ్ పుక్కు ముగన్దుకొడార్తేఱి,
ఊழిముతల్వ నురువమ్పోల్ మెయ్ కఱుత్తు,
పాழியన్దోళుడై ప్పఱ్పనాబన్ కైయిల్,
ఆழిపోల్ మిన్ని వలమ్బురిపోల్ నిన్ఱతిర్న్దు,
తాళాతే శార్ఙ్గ ముదైత్త శరమళైపోల్,
వాழవులకినిల్ పెయ్దిడాయ్, నాఙ్గళుమ్
మార్గழినీరాడ మకిழ்న్దేలో రెమ్బావాయ్.

### — తాత్పర్యము —

ఓ వర్షాధిదేవతయైన వరుణుడా! నీకు సహజమైన జలప్రదానమున నొకింతయును సంకోచింపవలదు. నీవు సముద్రమున లోపలి భాగమున ప్రవేశించి, యందున్న నీటినంతను కడుపార త్రావి, గట్టిగా త్రేల్చి (ఉరిమి), ఆకసముపై కెక్కి, అంతటను వ్యాపించి, కాలము మొదలు సమస్త పదార్థముల సృష్టించు శ్రీమన్నారాయణుని శరీరమువలె నీ శరీరమును నల్లబరచుకొని, విశాలమై సుందరమైన భుజములు గల నారాయణుని కుడిచేతి యందున్న చక్రమువలె మెరసి, యాయన యెడమ చేతి యందున్న శంఖమువలె గర్జించి, ఆతని ధనుస్సునుండి వెలువడు బాణముల వలె వర్షధారల వర్షించి లోకులు సుఖించునట్లును, మేమును మా వ్రతమున కంగమగు స్నానమును ఆనందముతో సాగించుకొనునట్లును ఆలసింపక వర్షించుము.

### — విశేషార్థము —

అవతారిక –

ఉభయవిభూతి నాయకుడగు సర్వేశ్వరుడు భూమండలమున సౌలభ్యపరాకాష్ఠయగు శ్రీకృష్ణుడై యవతరించెను. మత్స్య కూర్మాద్యవతారము లన్నియు కొన్ని బ్రహ్మాదిదేవతల కొరకును, మరికొన్ని వ్యక్తిగత సంరక్షణకును ఐనవే గాని సమస్త చేతన సంరక్షణ కొక్కటియును కాలేదు.

శ్రీరామావతార మొకింత ప్రాదేశిక ప్రజాసంరక్షణోపయోగిమైనను తానొక చక్రవర్తికి బిడ్డడై, స్వయముగా చక్రవర్తియై యుండుటచే ప్రజలకంత అందుబాటులో లేకుండెను, ఆ లోటును తీర్చుకొనుటను, సర్వసమాశ్రయణీయు డగుటకును శ్రీకృష్ణుడై అవతరించెను.

"సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః" అనునట్లు తన నాశ్రయించిన వారిలో జాతినిబట్టి గాని, ఆశ్రమమునుబట్టి గాని, విద్యా, ధన, అభిజనములనుబట్టి గాని, లింగమును బట్టి గాని, సమర్పించు వస్తువుల తారతమ్యమును బట్టి గాని వైషమ్యము లేక (కొందరిని చేరదీసి, కొందరిని విడచుట లేక) అందరును సమముగా తన నాశ్రయించుటకు వీలుగా వెంచేసియుండెను.

"మాం హి పార్థ! వ్యపాశ్రిత్య । యేఽపి స్యుః పాపయోనయః ।
స్త్రియో వైశ్యా స్తథా శూద్రాః । తేఽపి యాన్తి పరాంగతిమ్ ॥"

అర్జునా! నన్నాశ్రయించి భజించువారు పాపజన్ములైనను, సత్కార్యానుష్ఠానమునకు స్వాతంత్ర్యము లేని స్త్రీలైనను, ప్రతిగ్రహ, యాజన, వేదాధ్యాపనములకు అధికారములేని వైశ్యులైనను, వైదికకర్మాధికారములేని శూద్రులైనను తమకు విధించబడిన వర్ణాశ్రమధర్మములనే నాకు ప్రియకరము లగునటుల గావింతురేని వారును మోక్షమును నిరాఘాటముగ బడయగలుగుదురని తన సౌలభ్యమును సువిదితమొనరించెను. తన యనుష్ఠానమునందును కుడియెడమ లెరుంగని గోపబాలకులు

"ఎన్నడునైన యోగివిభు లెవ్వని పాదపరాగమింతయున్
కన్నుల గాన రట్టి హరిన్ కౌగిలి జేర్చుచు జెట్టబట్టుచున్
తన్నుచు గ్రుద్దుచున్ నగుచు తద్దయ పైబడి కూడి యాడుచున్....
................................................................"

అనునంతటి సులభుడయ్యెను.

"పత్రం పుష్పం......" అని చెప్పుట మాత్రమే కాక సుదాముడు భక్తితో తన కొసంగిన అటుకులను తిని

"నన్వేత దుపనీతం మే । పరమ ప్రీణనం సఖే ।
తర్పయ న్త్యఙ్గ! మాం విశ్వ । మేతే పృథుకతణ్డులాః ॥"

"మిత్రమా! నాకత్యంతప్రియమైన యీ యటుకులను తెచ్చిచివోయీ! ఆహా! ఇవి నన్నేగాక (నా కుక్షియందున్న) సమస్తప్రాణులకును తృప్తికలిగించుచున్నవోయి." అని యెంతయో ప్రశంసించి చివరకు సమస్తసంపదలను చేతికీయక "యోగక్షేమం వహామ్యహం" అను మాటను అక్షరశః అమలు జరిపెను.

వరుణుడు, శ్రీకృష్ణుడు గోపాంగనలతో నున్నచోట ఆ గోష్ఠి కేదైనను సేవను చేసి దాని మూలముగ తన స్వరూపమును బడయవచ్చునని యచ్చటికి వచ్చెను.

మిథున కైంకర్యవైభము నెరింగిన లక్ష్మణస్వామి. శ్రీరామచంద్రుడు సీతాదేవితో నడవికి పయనించుచుండగా నీ తరుణమును జారవిడువరాదని

"స భ్రాతు శ్చరణౌ గాఢం । నిపీడ్య రఘునన్దనః ।
సీతా మువాచాతియశాః । రాఘవం చ మహావ్రతమ్ ॥"

శ్రీరాముని పాదారవిందములను గట్టిగా పట్టుకొని సీతాదేవి పురుషకారముగా నాతని నిట్లు ప్రార్థించెను.

"అహం సర్వం కరిష్యామి । జాగ్రత స్స్వపత శ్చ తే ।
భవాంస్తు సహ వైదేహ్యా । గిరిసానుషు రంస్యతే ॥"

"శ్రీరామా నీవు సీతాపిరాట్టితో నితరసహాయము లేక పర్వతచరియలయందు సంచరించుచుండగా నేను నీకు నిద్రించుచున్నప్పటి సేవకై యీ ధనుర్బాణములను, మేలుకొనియున్నప్పటి సేవకై యీ తట్ట, త్రవుగోల పరికరములను బూని సేవలనొనర్తు"నని యువ్విళ్లూరుచు శ్రీరామచంద్రుడు వలదన్నను వినక పాదద్వంద్వంబులను బంధించెను. ఇట్టివారిని విడువనని గదా శ్రీరామచంద్రుని వ్రతము.

"సకృదేవ ప్రపన్నాయ । తవాస్మీతి చ యాచతే ।
అభయం సర్వభూతేభ్యో । దదా మ్యేత ద్వ్రతం మమ ॥"

శ్రీరామచంద్రుని యీ స్వభావము లక్ష్మణస్వామి యెరుంగనిది కాదు.

ప్రణవార్థ మిదియే కదా! పిరాట్టితో కూడియున్న సకలగుణాభిరాముడగు నారాయణునకు సర్వదేశ, సర్వకాల, సర్వావస్థలలోను సర్వవిధకైంకర్యములను చేయవలెనని గదా! మనకా ప్రణవము విధించుచున్నది. దానినే కదా! మన ఆళ్వారులు "ఒழிవిల్ కాలమెల్లా ముడనాయ్ మన్ని, వழுవిలా వడిమై శెయ్యవేణ్డుమ్ నామ్" అని బోధించిరి.

## — విశేషార్థము —

### ఆళిమళైక్కణ్ణా! ఒన్ఱునీ కైకరవేల్ –

వరుణదేవుడా! నీవు భగవంతునితో సమానుడవు. నీవును ఆయన వలె తారతమ్యము చూడక అందరను సమముగా వర్షింపుము. అనగా ఆ వరుణుడు "తల్లులారా! పుణ్యాత్ములున్న చోట కురియు మనియును, పాపాత్ములున్న చోట కురియవలదనియు కదా! భగవానుడు నా కానతిచ్చెను. నేను దాని నుల్లంఘించగలనా?" అని ప్రశ్నించగా, గోపాంగనలు భగవంతుడు చేయు రక్షణకార్యము విలక్షణ మైనది. అందు సంకోచమున్న నుండనిమ్ము. ఇది పిరాట్టి (సీతమ్మ) గోష్ఠి, యెరుగుదువా? తనకు అపారమగు దుఃఖమును కల్పించిన రావణునకును

"మిత్ర మౌపయికం కర్తుం । రామః స్థానం పరీప్సతా"

"తేన మైత్రీ భవతు తే । యది జీవితు మిచ్ఛసి"

"విదిత స్సహి ధర్మాత్మా । శరణాగతవత్సలః ॥"

"రావణా! శ్రీరామునితో స్నేహమును నెరపుట నీకు మేలు. మంచిఆవు చావదలంచినను అదియే యుక్తము. ఆతడు శరణాగతధర్మమును లెస్సగ నెరింగినవాడు" అని యింటిగుట్టును గూడ నాతని కెరింగించెను గదా! కావున మా గోష్ఠికి తగినట్లు సేవ నొనర్పుమని యాదేశించిరి.

### ఆళిమళైక్కణ్ణా -

మండలి వర్షము (ముక్కువాన మొ॥ కొలత) నకు నిర్వాహకుడవైన వరుణదేవుడా! నీవు గంభీరమైన స్వభావముగలవాడవు. వర్షమునకు నిర్వాహకుడవు. భగవంతుడు సృష్టి, సంహార, వ్యాపార ములను బ్రహ్మరుద్రుల తలపైనుంచి చల్లని రక్షణ వ్యాపారమును తాను సాగించినట్లుగా తన వలెనే చల్లని చేతితో కాక రక్షించగలవాడవని సర్వేశ్వరునిచే ఆదరింపబడదగినవాడవు గదా! నీవు. పుణ్య మును చేసినవారున్న చోట కురియుట, పాపము చేసినవారున్న చోట కురియకుండుటయు నీ స్వభా వము. అట్లు చేయక మా పుణ్యమునే తలంచి దానికి తగినట్లుగా వర్షింపుము. మాది పిరాట్టి గోష్ఠి సుమా! ఆమె భగవంతునితో "పుణ్యాత్ముని యాతని పుణ్యమే రక్షించును. పాపాత్ముని రక్షించువా రెవ్వరుందురు? అందుచే మనమట్టివారిని రక్షించుటయే ధర్మము. ఆ యుపపత్తి రామునకు తగినదని

తోచుటచేతనే "దోషో యద్యపి తస్యస్యాత్" అని విభీషణుని రక్షించుఘట్టములో "దోషః తస్యస్యాదేవ" వానికి దోషముండవలెను - అని అభిలషించెను. సుప్రసిద్ధుడగు వైద్యుడు ఇతరవైద్యులెవరును కుదర్చని రోగమును కుదిర్చిననే తన పేరు ప్రతిష్ఠితమగునని తలంచునట్లు భగవంతుడును "దోషః తస్య స్యాదేవ" అని యభిలషించెను.

శ్రీ భట్టరువారు శ్రీగుణరత్నకోశమున

"మాతర్మైథిలి! రాక్షసీ స్త్వయి తథైవార్ద్రాపరాధా స్త్వయా ।
రక్షన్త్యా పవనాత్మజా ల్లఘుతరా రామస్య గోష్ఠీకృతా ।
కాకం తం చ విభీషణం శరణ మిత్యుక్తిక్షమౌ రక్షతః ।
సాన స్సాన్ద్ర మహాగస స్సుఖయతు క్షాన్తి స్తవాకస్మికీ॥"

"అమ్మా! లక్ష్మీదేవీ! శ్రీరామజయ వృత్తాంతమును నీకు వినిపించిన తిరువడికి నీవు "ఏమి బహుకరింతునా"యని యాలోచించుచుండగా ఆతడే అచ్చట నున్న రాక్షస స్త్రీ వధకు తన కనుజ్ఞ నిమ్మని ప్రార్థించెను. పది మాసములు రాత్రింబవళ్లు తనను పీడించి పీడించి యప్పటికిని వారు మానక తర్జన భర్జనలను చేయుచున్నను వారు బాధింపబడకుండ కాపాడితివే తల్లీ! శ్రీరామచంద్రుడు కాకాసురుని, విభీషణుని తన కాళ్లపై పడినపుడు గదా రక్షించెను. అది యేమి గొప్పపని యమ్మా? నీ దయ కాయన దయ తక్కువే గదా! మే మెంత పాపాత్ముల మైనను నీ క్షమాగుణమును నమ్మి నిశ్చింతగా నున్నామమ్మా" అనిరి.

"పితేవ త్వత్ప్రేయాన్ జనని! పరిపూర్ణాగసి జనే ।
హితస్రోతోవృత్త్యా భవతి చ కదాచి త్కలుషధీః ।
కిమేత న్నిర్దోషః క ఇహ జగతీ తి త్వము చితై ।
రుపాయై ర్విస్మార్య స్వజనయసి మాతా తదసి నః॥"

అమ్మా! నీ భర్త (మా హితమునకే అనుకొనుము) మా పాపములకు క్రుద్ధుడై మమ్ములను శిక్షించుటకు ఒకసారి నృసింహావతారమును ధరించును. అట్టితరి నీవు "అదే మండీ? ఈ సంసారమున తప్పులు చేయని వారుందురా? వీనిని దండించిన మీ రాయా యవతారములలో ననేక శ్రమలతో సంపాదించిన యుపాధులు పోవా ? వీనిని విడచిన నరకాది శిక్షాశాఖ యేమగునందురా - ఎంత

పాపాత్ముడైనను పశ్చాత్తప్తుడై "శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే" యని మీ శ్రీపాదముల నాశ్రయించిన క్షమింపుడు. అట్లు గాక యింకను పాపాభిముఖుడే యైనవానిని దండింపుడని యుపాయముల నుపదేశించి, మమ్ములను రక్షించి మాకు తల్లివైతివి కదమ్మా" యని పాడించిరి.

ఒన్ఱు నీ కైకరవేల్ -

దయామయుడగు తండ్రి తనను లక్ష్యపెట్టక యిల్లు విడచిపోయిన తన బిడ్డకు తానే రహస్యముగా పర్పించ్చి వేరొకరిచే అన్నమును పెట్టించునట్లు, భగవంతుడును తనను లక్ష్యపెట్టక దేవతాంతరులను గొలుచు పామరుల పట్ల కినియక, వారారాధించు దేవతలకే వారి భక్తులకు ఫలమునిచ్చు శక్తినిచ్చి యా దేవతల ద్వారా వారి యభీష్టముల తీర్చునట

ఈ యర్థమునే క్రింది గీతా శ్లోకములు వివరించుచున్నవి.

"యో యో యాం యాం తనుం భక్తః । శ్రద్ధయార్చితు మిచ్ఛతి ।
తస్య తస్యా చలాం శ్రద్ధాం । తామేవ విదధామ్యహమ్॥
స తయా శ్రద్ధయా యుక్తః । తస్యారాధన మీహతే ।
లభతే చ తతః కామాన్ । మయైవ విహితాన్ హి తాన్॥"

వర్షము నిచ్చుటలో నీ యౌదార్య మిట్లుండవలె ననుచున్నారు.

ఆళియుళ్ పుక్కు.......పెయ్‌దిడాయ్ -

ఈ గ్రంథము లక్ష్మణస్వామి కైంకర్యాశవలె నున్నది. ఆయనకు మూడు కోరికలుండెడివట. మిక్కిలి యాకలిగొన్నవాడు "అట్ట శోఱుం వేణుమ్, అడుగిల శోఱుం వేణుమ్" ఉడికిన అన్నమును ఉడుకుచున్న అన్నమును నేనే తిందునని యాశపడునటుల లక్ష్మణస్వామియు "అడిమై శెయ్య వేణుమ్, ఎల్లావడిమైయుం శెయ్యావేణుమ్, ఏవికొళ్ళవుం వేణుమ్" అనగా – శ్రీరామచంద్రుని సేవను నేనే చేయుదును. సకలవిధ సేవలను నేనే చేయుదును. ఆజ్ఞాపింపబడి నౌఖరువలె సేవలను నేనే చేయుదును – అని ఊణాధ్యాయమును గావించునట్లు, ఈ గోపాంగనల వర్షపు ఆర్తి యున్నది.

ఊణాధ్యాయమనగా – తిండిపోతు ముందునుండియే నే నిట్లు తిందును, అట్లు తిందును, అంతా తిందును అని ఆలోచించుకొనుచు ప్రొద్దుపుచ్చుట.

ఆழ்ந்துయుళ్ పుక్కు - సముద్రములోపల ప్రవేశించి.

పూర్వము ఇక్ష్వాకువంశపు రాజగు సగరచక్రవర్తి అశ్వమేధయాగమును చేయుచుండగా దేవేంద్రుడు అసూయతో నా యజ్ఞాశ్వము నపహరించి పాతాళమున తప మొనరించుచున్న కపిల మహర్షి పార్శ్వమున విడచెను. అపుడు అరువదివేలమంది సగరపుత్రులు అశ్వాన్వేషణకై సముద్ర ప్రాంతీయ భూమిని త్రవ్విరి. అప్పటినుండియు సముద్రమునకు సాగరమను పేరు ప్రసిద్ధమయ్యెను. సముద్రమధ్యభాగము ఆదిసృష్టిలోనిది. అందులోని నీటిని

ముకన్దుకొడు - త్రాగి.

పైపై నీటిని తీసికొని రాకూడదు. సముద్రమున ఇసుకయే మిగులునట్లు త్రాగవలెను.

ఆర్త్తు - ధ్వనించి

సీతాపిరాట్టిని చూచివచ్చెనను నమ్మకము వానరులకు కలుగునట్లు హనుమంతుడు గర్జించెను. రుక్మిణీదేవి వివాహలగ్న మాసన్నము కాగా "శ్రీకృష్ణుడు రాలేదే. నాకు శిశుపాలునే భర్తగా బ్రహ్మ వ్రాసిపెట్టెనా? యని దుఃఖభారాక్రాంతురాలై యుండగా శ్రీకృష్ణుని పాంచజన్య ధ్వని వినిపించెను. వీనివలన వారి వారికి కలిగిన ఆనందము, వర్షములు లేక కృశించుచున్న మా పెద్దలకును, శ్రీకృష్ణవిరహముచే తప్తులమైన మాకును కలుగునట్లు గర్జింపుము. విరహదశలో మేఘదర్శనము బాధకమే యైనను ప్రస్తుత మిది కృష్ణసంశ్లేషమునకు కారణమగుటచేతను, ఊరిపెద్దలపట్ల కృతజ్ఞతా సూచకమును అగుటచే ఫలగౌరవమును బట్టి అపేక్షితమే.

ఏ ఱి -

ఆకసమున నంతటను ఆక్రమించి ఛాందినీని విస్తరింప జేసినట్లును, మదపుటేనుగులవలె ఆకసమునంతను వ్యాపించవలెను.

ఊழிముతల్వ నురువమ్పోల్ మెయ్ కరుత్తు -

జగత్తుల నన్నింటిని సృష్టించుటకు కారణమైన సర్వేశ్వరుని శరీరమువలె నీ శరీరము నల్లగా నుండవలెను.

అనగా, భగవంతుడు దీర్ఘకాలము తనయందు ఉపసంహరింపబడియున్న జగత్తును నిర్మించుటకై సంకల్పించగనే వెనుకటి వలె గాక నలుపెక్కినట్లు నీ శరీరమునందలి రంగులో కూడ ఒక విశేషముండవలెను.

**మె య్ క రు త్తు -**

శారీరకమగు రంగునందు మాత్రమే నీ కాతనితో సామ్యము. ఆతని హృదయమందలి స్వభావము నీకు రాదు. నీవు వర్షించిన తర్వాత తెల్లనిజారి పోవుదువు గదా!

**పా ఴి య న్దో ళ్ -**

బలము గలిగి సుందరములైన బాహువులు.

ఉభయవిభూతులును ఆ బాహువుల క్రింద రక్షణకై యొదిగినను రక్ష్యకోటియే యల్పమై యాతని రక్షణశక్తి యధికమై యుండును.

**పఱ్పనాబన్ కైయిల్ ఆఴిపోల్ మిన్ని -**

పద్మనాభుని చేతిలోని చక్రము వలె మెరసి.

గంభీర హృదయులు "నీకు కుమారుడు పుట్టె" నని వినినచో దానిచే కలిగిన యానంద మతిశయించియున్నను దానిని పైకి కనబడనీయరు. కాని వారి యంతరంగులు మాత్రము ఆ ప్రీతిని బైటకు చూపుచు నేతి వసంతము లాడుకొనుచు తిరుగుదురు. అటులనే జ్యేష్ఠ పుత్రుడగు బ్రహ్మ పుట్టిన తర్వాత చక్రత్తాళ్వార్లు ఆ యానందమునకు ప్రవాహమును పెట్టి కొనియాడిరి. కనుక ఆ చక్రము నుపమానముగా చెప్పుచున్నారు.

**వలమ్పురిపోల్ నిన్ఱదిర్న్దు -**

పాంచజన్య శంఖమువలె స్థిరముగా ధ్వనించి.

భారత యుద్ధమునందలి శ్రీకృష్ణుని పాంచజన్య ధ్వనివలె నుండవలెను. అనుకూలురు సుఖించునట్లును, ప్రతికూలురు నశించునట్లును నుండవలెను. "నిన్ఱదిర్న్దు" అనుటచే ఆ శంఖమువలె నొక్కసారి ధ్వనించి విడువరాదు. అది మారకయుండి ధ్వనించవలెను.

**తా ఴా దే** = ఆలసించక.

నోము ప్రారంభము నుండియు ఉపవాసముచే చిక్కియున్న మా శరీరములున్న రీతిని చూచితివి కదా ! ఆలస్యము చేయరాదు. "ముప్పత్తు మూవ రమరర్కు మున్ శెన్ఱు" అనునట్లు ఆ పదకు ముందుగనే వెళ్లి నారాయణుని వలె నుండవలెను. వర్షాధారపు భూములవలె గాక భగవదాశ్రయణము నదీ మాతృకము వలె నుండవలెను.

శార్ఙ్గ ముతైత్త శరమళై పోల్ -

ధనుస్సు త్రోసిన బాణవర్షము వలె.

శత్రువులు లేకపోవుటచే నిశ్చేష్టమైయున్న శ్రీరామచంద్రుని చేతి ధనుస్సు ఆతని క్రీగంటి చూపు పడగనే తానే స్వయముగా శరముల వర్షించెను.

శార్ఙ్గముతైత్త -

బాణవర్షము శ్రీరామచంద్రుడు కనుసంజ్ఞ చేసిన తర్వాత అతని చేతను అర్ధశక్యముగా నుండును. మిత్రులు, శత్రువులు అను భేదము లేకుండ లోకమంతయు సుఖించునట్లు వర్షింపవలెను.

అనగా దానిని విని ఆ మేఘుడు "ఇది భగవంతుని యాజ్ఞచే నేనిదివరకే చేయుచున్న పని గదా! మీ గోష్ఠికి నే నేమి కైంకర్యము చేయుదుననగా —

నాఙ్గళుమ్ మార్గళినీరాడ -

మేము వేకువన నేగి వ్రతస్నానము నాచరింతుము.

మకిళ్ న్దు - సంతోషించి.

వర్షమువలన మా పెద్దలును, శ్రీకృష్ణసంశ్లేషమువలన మేమును సంతోషించి స్నానము చేయుదు మనుచున్నారు. ఇదియే గదా నీ సేవకు ఫలము. సేవయనగా సేవింపబడువాని ముఖవికాసమునకు కారణమైన కాయిక వ్యాపారము.

"ఆరాధనానా సర్వేషాం । విష్ణో రారాధనం పరమ్ ।
తస్మా త్పరతరం ప్రోక్తం । తదీయారాధనం నృప ॥"

దేవతాంతరారాధన కన్న మిన్న శ్రీమన్నారాయణారాధన. అంతకుమిన్న తద్భక్తుల సమారాధన. కాబట్టి మే మానందించుటయే నీకు పురుషార్థము. అది నీకు ఘటించును.

ఈ పాశురమున మేఘము లనుట భక్తోజ్జీవన తత్పరులగు విద్వాంసులు. వారికిని, మేఘములకును గల సామ్యమిచ్చట తెలుపబడుచున్నది.

మేఘము

ఉప్పని సముద్రజలమును త్రాగి మధురతమమైన నీటిని వర్షించును.

ఆచార్యులు

శ్రుతిసాగరమునుండి దురవగాహములైనట్టియు, కఠోరములగునట్టియు అర్థములను గ్రహించి వానిని స్వాదిష్టము లొనరించి సకలానుభవయోగ్యము లగునట్లు ప్రసాదింతురు,

మేఘము

అచ్చటచ్చట సంచరించుచు వర్షించును.

ఆచార్యులు

పుణ్యదేశములను, పుణ్యనదులను సందర్శించు నెపముతో దేశమునం దంతటను తిరుగుచు ఆస్తికప్రజలకు సదర్థోపదేశములను గావించి సంతుష్టులను గావింతురు.

మేఘము

సర్వదా వర్షించక యొకానొక సమయమునందే వర్షించును.

ఆచార్యులు

వీరును యోగ్యులగు శ్రోతలను పరిశీలించి, ఆయా యవకాశములందు మాత్రమే సదుప దేశముల గావింతురు.

మేఘము

మేఘము వర్షముచే పల్లములను, గుంటలను నింపును.

ఆచార్యులు

వీరును తమ సదుపదేశవర్షముచే నాస్తికులను ఆస్తికులనుగాను, మందులను జ్ఞానపూర్ణులను గాను గావింతురు.

మేఘము

సకాలమున వర్షించనిచో లోకమున నానావిధములగు పీడలుదయించును.

ఆచార్యులు

వీరు తగిన సమయములో నుపదేశించనిచో దేహాత్మభ్రాంతి, స్వస్వాతంత్ర్యభ్రాంతి, అన్య శేషత్వభ్రాంతి, స్వరక్షణేస్వాన్వయభ్రాంతి, ఆభాసబంధుభ్రాంతి, విషయప్రావణ్యము అను ఆత్మ వినాశకరములగు ఆరు రోగము లుదయించును.

మేఘము

ఎంత అధికముగా వర్షించినను తృప్తిని చెందదు. ప్రతిఫలము నొకింతయును అపేక్షించదు.

ఆచార్యులు

ఎంతెంత రహస్యమయార్థముల నెంతెంతకాల ముపదేశించినను తృప్తిని చెందరు. ప్రత్యుప కారము నపేక్షింపరు.

మేఘము

ఒకప్పుడు కొద్దిపాటి చినుకులను చిందించి పోవును. వేరొక సమయమున మహావృష్టి నొసంగి జగత్తును ముంచెత్తును.

ఆచార్యులు

ఒక్కొక్క సమయమున చినుకుల వలె మంత్రాక్షరములను కర్ణకుహరమున నుపదేశించి విడతురు. వేరొకసమయమున శ్రుతి, స్మృతి, ఇతిహాస, పురాణ, ఆగమ, దివ్యప్రబంధ, పూర్వా చార్య శ్రీసూక్తి మయోపన్యాసముచే "ఆహా! ఏమి యీ ఝుంఝామారుతోపేతమైన సదర్థమహావర్ష మును గురిపించి రీ యాచార్యులని ప్రశంసింప జేతురు.

మేఘము

ఇది యొకప్పుడు కాలిన పెనముపై నీటి బిందువులవలె కురిసిన వర్షపుజాడయైనను కాన్పిం చని స్థలమున వర్షించును. వేరొకప్పుడు ముత్యపుచిప్పలలో వర్షించి ముత్యములను పుట్టించును.

ఆచార్యులు

వీరును ఒకప్పుడు గావించిన ఉపదేశములు పాత్రయొక్క అయోగ్యత, అనవధానత, ఉపే క్ష మొదలగు దుర్గుణములచే నిరర్థకమై పోవును. మరియొకప్పుడు సత్పాత్రలయందు (ముత్యపు చిప్పలవలె స్వచ్ఛకరణత్రయయుక్తులగు శ్రోతలయందు) ఉపదేశించిన యుపదేశసూక్తులు పరంపరగా పరోపదేశముల కుపయోగపడి పెక్కుమంది నానందపరచి యుజ్జీవింపజేయును.

మేఘము

తొలివానలు ఘర్మాభితప్తులకు తాపోపశాంతిని కలిగించును.

ఆచార్యులు

తాపత్రయసంతప్తులగు చేతనుల తాపములను తమ శ్రీసూక్తులచే శాంతింపజేయుదురు.

## — వేదాంతార్థము —

ఇది తిరుప్పావైలో ముఖ్యమైన పాశురము. విశిష్టాద్వైతసిద్ధాంతసౌధమునకు ఆధార స్తంభ ములనదగు ఆళ్వారెంబెరుమానార్ల (నమ్మాళ్వార్లు, రామానుజులు) విషయమై సమగ్రముగ సమన్వ యమగు పాశురమిది.

## — నమ్మాళ్వార్ల విషయమైన సమన్వయము —

ఆళ్ మళై క్కణ్ణా -

విశాలమైన భూమండలమందున్న సమస్తచేతనులున్ను భగవంతుని కృపావర్షముచే తడియు నట్లు చేయగల ఓ సదాచార్యా! అంతమాత్రమే గాక, వారికిని ఆచార్యపదవిని నిర్వహించు ఆళ్వారే! "ప్రపన్నజన కూటస్థం ప్రపద్యే శ్రీపరాఙ్కుశం". వీరు ప్రపన్నులకు మూలపురుషులు గదా! మీ సంబంధమున్నంత మాత్రముచే అందరను భగవత్కృపకు పాత్రులను గావించు సామర్థ్యము గలవారా!

"కేశవన్ తమర్ కీళ్ మేలెమర్ ఏళేళ్ పిఱవిక్కుమ్
మాశదు ఇతు పెత్తు నమ్ముడై వాళ్వు వాయ్ క్కిన్ఱవా"

ఆళ్వార్ల సంబంధ మున్నంత మాత్రమే చాలును భగవత్కృపకు పాత్రులగుటకు. కావుననే మనకు శ్రీనాథమునిపుంగవులు "మాతా పితా యువతయస్తనయా విభూతి స్సర్వం యదేవ………… తద్వకులాభిరామమ్" అను తనియను నిత్యానుసంధేయముగా ప్రసాదించిరి.

మేఘములు వర్షించి తెల్లబారును. వీరు వర్షించనిచో తెల్లబారుదురు.

"శొన్నాల్ విరోధ మిది ఆకిలుమ్ శొల్లువన్ కేణ్మినో" నేను చెప్పిన మీరు నన్ను నిందిం తురు. ఐనను చెప్పక మానను. మీరు వినియే తీరవలెను. అను నిర్బంధముతో భగవత్కథామృత మున నోలలాడించు స్వభావముకలవారు.

ఒన్ఱునీ కై కరవేల్ _ ఆ కథామృత ప్రదానమున సంకోచించవలదు.

ఆళియుళ్ పుక్కు - భగవద్గుణామృతసాగరమున బాగుగా నవగాహించి

ముకన్దు కొడు -

అతని గుణముల నన్నిటిని మీ బుద్ధియం దిముడునటుల అనుభవించి, అనగా - అధికారి యెట్టి యపరాధియైనను మీ యభిమానమునకు పాత్రుడైనచో మీకు విధేయుడగు భగవంతుడు అతని ననుగ్రహించునట్లు చేయగల సామర్థ్యముగల వారా!

ఆర్తు ఏరి - అటోపముతో అచార్యస్థానము నలంకరించి

ఊళిముతల్వన్ ఊఴువమ్పోల్ మెయ్ కరుత్తు -

సృష్టించుటకు ప్రారంభమునందుండు శ్రియఃపతి దివ్యమంగళ విగ్రహమువలెనే భగవంతుని దయావర్షమును సృష్టించుట కుద్యమించిన మీ శరీరమందును మాకొక వైలక్షణ్యము గోచరించవలెను.

పాఴి అమ్ తోళ్ ఉడైయ -

బలిష్ఠములై, సర్వాధారములై, అతి సుందరములై యుండు భుజములుకలవాడైన

పఱ్పనాబన్ -

బ్రహ్మపుట్టుకకు తావళమగు నాభికమలముగల సమష్టిసృష్టిని చేయగల శ్రియఃపతియొక్క

కైయిల్ ఆఴిపోల్ మిన్ని -

చేతియందున్న చక్రమువలె కారుణ్యవర్షమును వర్షింపజేయుట కవతరించబోవు రామానుజులను యోగదృష్టితో దర్శించి దానిచే కలిగిన యానందమంతయును శరీరమున కాంతులీనుచుండగా

వలమ్బురిపోల్ నిన్ఱతిర్న్దు -

ఆ శ్రియఃపతి యెడమ చేతియందున్న శంఖమువలె మధ్యవిరామము లేకుండ ధ్వనించి అనగా, ప్రణవార్థము నందరు నెరుంగునట్లుగా తిరువాయ్మొழி ప్రబంధము ద్వారా ప్రకాశ పరచవలెను.

(ఒళివిల్ కాలమెల్లా ముడనాయ్ మన్ని వళువిలా అడిమై శెయ్యవేణ్డుం-ఇత్యాదులచే)

తాళాదే శార్ఙ్గముదైత్త శరమళై పోల్ -

ప్రణవమునందలి శేషశేషిభావసంబంధము జ్ఞానమువలన లభించు కృపావర్షమును

వా ళ -

లోకులందరును తమ స్వరూపము నెరింగి, అనగా, తాము భగవంతునకే శేషభూతుల మనియు, తమ కా దయామయు డొసంగిన కరణత్రయము నాతని సేవకే వినియోగించవలె ననియు నెఱింగి యనుష్ఠించి యా నారాయణుని యనుగ్రహపాత్రులై సుఖించునట్లు

పెయ్‌దిడాయ్ -

మీ తిరువాయ్‌మొళ్ళి ప్రబంధము ద్వారా భగవద్గుణ కథామృతమును వర్షింపుడు.

నాజ్ఞళుమ్ మార్గళిసీరాడ -

భగవత్కైంకర్యమునే ముఖ్యమైన భోగమునుగా భావించి మేము నోము అను మిషతో భగవంతుని సంశ్లేషమును బడసి

మగిళ్ణ్దు - సుఖింతుముగాక !

అనగా — భగవంతుని కల్యాణగుణానుభవమునకు ఒంటరులము గాక యింతమంది సహకారులున్నారే యని సంతోషించి వారందరితోను కలసి భగవదనుభవమును గావించి ఆనందసాగరమున నోలలాడవలెను.

ఈ పాశురమున వరుణదేవునకై భగవంతు డొసంగిన సహజమైన కార్యమునే తమ కిష్టమగు నట్లాచరింపగోరుటచే ప్రపన్నుడు తనకు విధింపబడిన నిత్యనైమిత్తికాది కర్మల నన్నిటిని భగవద్భాగవతప్రీతికరముగ చేయవలెనను నియమము తెలియబడుచున్నది.

ఈ సందర్భమున నీ క్రింది శ్లోకమును అర్థముతో అనుసంధించవలెను.

లక్ష్మీనాథాఖ్యసింధౌ శఠరిపుజలదః ప్రాప్యకారుణ్యనీరమ్
నాథాద్రావభ్యషిఞ్చ త్తదను జలజదృగ్రాఘువాభ్యాం ఝురాభ్యామ్ ।
గత్వా తాం యామునాఖ్యాం సరిత మథ యతీన్ద్రాఖ్యపద్మాకరేన్ద్రం
సంపూర్య ప్రాణిసస్యం ప్రవహతి నితరాం దేశికేన్ద్రప్రమోఘైః ॥

"ఆచార్య వంశోజ్ఞేయః అసావసావిత్యా భగవత్తః" అను ప్రమాణమును బట్టి అసా = అస్మద్గురుభ్యో నమః, అసా = అస్మత్పరమగురుభ్యో నమః - ఇత్యాది క్రమాను సారముగ, ఆ భగవత్తః = శ్రీధరాయ నమః వరకు, ఆచార్యవంశో జ్ఞేయః = ఆచార్యపరంపర నెరుంగవలెను. అందులకే మన పూర్వాచార్యులు వాక్యగురుపరంపరను, శ్లోకగురు పరంపరను నిత్యానుసంధేయ మొనరించిరి. ఈ శ్లోక మా గురుపరంపరను బోధించుచు నొక చక్కని రూపక విన్యాసముతో చమత్కరించుచున్నది. వినుడు.

భగవానుడు, అమరకోశకారుడు చెప్పిన శరీర పర్యాయపదము లనేకములున్నను "మే మతం" అని తన స్వతంత్ర శ్రీకృష్ణమతానుసారముగ దీనికి 'క్షేత్ర' మని పేరుంచెను. "ఇదం శరీరం కౌన్తేయ! క్షేత్ర మిత్యభిధీయతే" అని, క్షేత్ర మనగా లోకమున వాడుకలో పంటభూమి. ఆ పేరునే దీని కుంచుటచే నిదియును పుణ్యాపాపము లనెడు బీజములు ఫలించుటకై భగవంతుడు కల్పించిన పంటభూమి యని తెలియుచున్నది. అనగా, ఆత్మశరీరము ద్వారా చేసిన పుణ్యాపాపముల ఫలములగు సుఖదుఃఖముల ననుభవింపజేయుటకు సాధనముగా నీ శరీరమును కల్పించుచున్నాడని భావము. "చేతనా ధృతిః" అని గీతలో భగవాను డీయర్థమునే బలపరచెను.

ఇక నీ క్షేత్రములు దైవ మాతృకములనియు, నదీ మాతృకములనియు రెండు విధములు. దైవ మాతృకములనగా భగవంతునిచే పోషింపబడునవి. అనగా, అతని అనుగ్రహమున వానలు కురిసిన పండునవి. నదీ మాతృకములనగా డెల్టాభూములు, ఈ శరీరము లనెడు క్షేత్రములను దైవ మాతృకములనియే పరిగణించవలెను. ఎందువలన ననగా- భగవంతు డొక కృషీవలుడు. అతడే జీవుడను విత్తనమును ఈ శరీరమను క్షేత్రములో నాటును. "అహం బీజప్రదః పితా" యనియు, "మమ యోనిర్మహ ద్బ్రహ్మ, తస్మిన్ గర్భం దధామ్యహమ్" అనియు అతడు తెలిపెను. సకలజగత్కారణమైన మూలప్రకృతి నా కధీనమైనది. దానియందు జీవుడను బీజమును నేనే నాటుచున్నాను. ఇక నీ బీజము మొలకెత్తి పెరిగి పండెడు విధానము నారయుదము.

దైవ మాతృకములగు భూములు పండెడు విధానము నొకింత జ్ఞాపకము తెచ్చుకొందము మేఘములు సముద్ర మధ్యమున కేగి కడుపార నీరు త్రాగి ఆకసముపై కెగసి నల్లని శరీరముతో నంతటను వ్యాపించి, యింద్రధనుస్సును ధరించి, మెరయుచు, గర్జించుచు పోయి పర్వతములపై కురియును. ఆ నీరు ఆ పర్వతముల నుండి సెలయేరులై పారి యొక పెద్ద వాగును చేరును. ఆ నీరు ప్రవహించుచు చిన్న చిన్న కాలువల గుండా ఆయా గ్రామములలోని చెరువులను నింపును. ఆ చెరువుల కుండు తూముల ద్వారా ఆ నీరు సస్యములలో ప్రవహించి ఆ బీజములను పండించును.

ప్రస్తుత శ్లోకమున లక్ష్మీనాథుడు - (శ్రీధరుడు, శ్రీ.) సముద్రము. అందపారమైన కృపానీరము కలదు. నమ్మాళ్వార్లు మేఘము. వీరా సముద్రమధ్యభాగమున ప్రవేశించి ఆ కృపానీరమును కడుపార త్రాగి ఆకసమున కెగసిరి. అనగా, భగవంతుని సంపూర్ణకృపాపాత్రులై ప్రపన్నజన కూటస్థులైరి. కూటస్థు లందరకును పైన గదా యుండును. వారును మెరసి అనగా "క్షణప్రభా" అనునట్లు లోకమున కల్పకాలము మాత్రమే దర్శనభాగ్య మొసంగిరి. గర్జించియనగా- నాలుగు దివ్యప్రబంధములను ఉచ్చైస్స్వరమున వినిపించిరి. నలుపు చల్లదనమును తెలుపునని పూర్వాచార్య సంప్రదాయము. ఆళ్వారులును తాపత్రయోపశామకమైన చల్లని రూపమునే కలవారు. చల్లనిగాలి కా మేఘము కరిగి వర్షించును. నాథమునులు గావించిన కణ్ణినుణ్ శిరుత్తాంబు జపమే ఆళ్వార్లను కరిగించు గాలియైనది. అంత నా మేఘము ఆ కొండపై (నాథమునులపై) భగవత్కారుణ్యమను నీరమును వర్షించెను. ఆ నీరము శ్రీరామ మిశ్రులు, పుండరీకాక్షులు - అను రెండు సెలయేరులై క్రిందికి పారెను. అవి యామునాచార్యులనెడు పెద్ద కాలువయందు జేరి ప్రవహించెను. దాని నుండి రామానుజు లనెడు గ్రామతటాకమున జేరెను. ఈ తటాకము చాల విశాలమై అగాధమైనది. దానికి డెబ్బదిరెండు తూములు గలవు. రామానుజులు ప్రచారమునకై యేర్పరచిన పీఠాధిపతులే యా తూములు. వీని ద్వారా (ఆ పీఠాధిపతుల ద్వారా) ప్రాణి సస్యములకు ఆ కారుణ్యనీరము ప్రవహించి బీజముల నంకురింపజేసి ఫలవంత మొనర్చును.

ఈ వ్యాపారము సంతతము మన వరకు సాగించుడని శ్రీ నమ్మాళ్వార్లను ఈ పాశురము ద్వారా ప్రార్థించుచున్నారు.

ఆళ్వారే! మీరు భగవంతుని కారుణ్యమును వర్ధిల్లజేయ సమర్థులు, మీ సంబంధమున్నంత మాత్రమున నందరను భగవత్కృపకు పాత్రుల నొనరించు సామర్థ్యము మీకున్నది. ఆ కృపను మీ సంబంధ ముండనివారిపైనను వర్షింపజేయుటలో మీ రెంత మాత్రమును సంకోచింపకుడు. మీరు భగవద్గుణానుభవసాగరమున బాగుగా నవగాహించి, యాటోపముతో ఆచార్యపీఠము నధిరోహించి, భగవత్కారుణ్యమును వర్షింపజేయుట కుద్యమించిన మీ శరీరమందొక వైలక్షణ్య ముట్టిపడునట్లు దర్శనమిచ్చి, దూరదృష్టిచే భవిష్యదాచార్యులగు భగవద్రామానుజులను దర్శించిన యానంద మంతయు మీ శరీరము నందంతటను కాంతు లీనుచుండగా ప్రణవార్థముల నెల్ల వెల్లువలుగా ప్రవహింపజేసి ప్రపన్నుల నానందపరచియు, ధనమదాంధులను, మానవులను పాడి మిడిసిపడు కవులను, నింద్యద్రవ్యములతో క్షుద్రదేవతల నారాధించు నీచులను, విషయలాలసులగు సంసారులను గద్దించి గర్జించియు, తిరువాయ్ మొళి ప్రబంధము ద్వారా ప్రపన్నకోటి యంతయు బ్రహ్మానంద భరితులగునట్లును, పండితులు వ్యాఖ్యాన మొనరించి (కాలక్షేపముల ప్రసాదించి) లోకులను ఆనందపరచునట్లును తిరువాయ్ మొళి ప్రబంధమును ప్రసాదింపుడను ప్రార్థన ధ్వనించుచున్నది.

## ఈ పాశురమునందలి పదము లన్నింటికిని ఆచార్యాగ్రేసరులగు శ్రీభాష్యకారపరమగు అన్వయము.

ఇచ్చట మేఘశబ్దమునకు సర్వోజ్జీవనహేతువులగు అర్థముల నుపదేశించు ఆచార్యులగు రామానుజులే యర్థము.

ఆழ்யுள் புக்கு -

శ్రుతిసాగరము, ద్రావిడవేదసాగరము అని చెప్పబడు ఉభయవేదాంతములతో తలస్పర్శిగా నవగాహించి

ముకన్దుకొడు -

చేతనకోటియంతయు నుజ్జీవించుట కుపయోగించు సదర్థరాశిని సంగ్రహించి

ఒన్ఱు నీ కైకరవేల్ -

ఆచార్యుల యౌదార్యము కేవలము శిష్యకోటియందే పర్యవసించక, సర్వేశ్వరుని విషయ మయ్యును సఫలమగును. ఆచార్యులు "మగ్నా నుద్ధరతే లోకాన్ కారుణ్యాత్ శాస్త్రపాణినా" లోకుల చికాకుల జూచి సహించనేరక శాస్త్రప్రదానమును గావించి వారి నుద్ధరించుటయే గాక, అదేవిధముగ పరమాత్మను కూడ ఉద్ధరింతురు. కావుననే దేశికులు యతిరాజ సప్తతిలో

"కుదృష్టికుహనాముఖే నిపతతః పరబ్రహ్మణః
కరగ్రహవిచక్షణో జయతి లక్ష్మణోఽయం మునిః"

మాయావాదుల సందర్భశూన్యప్రసంగములచే భగవంతుడు నామ రూపములను కోల్పోయి నిరావలంబనముగ పడియుండ గీతాభాష్య, సూత్రభాష్య, వేదార్థసంగ్రహముల ద్వారా తిరిగి దివ్య మంగళవిగ్రహమును, అనంతకల్యాణగుణ సంపత్తులను అప్రధృష్యముగ సాధించి సమర్పించుటచే కరగ్రహవిచక్షణులైరి. ఈవిశేషణముచే భగవద్రామానుజుల ఔదార్యము భగవద్భాగవతౌదార్యమును మించినదని తెలియుచున్నది.

"ఓరాణ్ వఴియాయ్ ఉపదేశిత్తార్ మున్నోర్" పూర్వాచార్యులు ఒక్కరి జీవితావధిలో నొక్కరికి మాత్రము గుహ్యతమ మంత్రమంత్రార్థముల నుపదేశించుచు వచ్చిరి.

"ఏరార్ యతిరాశన్ ఇన్నరుళాల్ పొరుళగిల్ అశ్శైయుడై యోర్కెల్లాం అరియర్గాళ్!
కూరుమెన్న పేశివరంబజుత్తార్ పిన్"

"ఓ పండితులారా! అర్థగౌరవమును మాత్రమే చూచి ఉపేక్షింపకుడు. దయతో వారి యనర్థ గౌరవమును గూడ ఒకింతపరికింపు" మని పూర్వనిర్బంధముల సడలించి ఆశగలవారలందరకును భూరి వాన మొనరింపవేసిరి.

అత్తు -

"గమ్భీరేణ పరాత్మ భేదన మహానాదేన నాథేన మే। గుప్తోఽహం యతిరాజసార్వభౌమ హరిణా............" ఆధ్యాత్మికజ్ఞానమునకు ప్రథమసోపానము ఆత్మవివేకము. "కోఽహ మిత్యేవ నిపుణో భూత్వా చిన్తయ పార్థివ" అని జడభరతుడు రహూగణ మహరాజున కుపదేశించిన దిదియే, భగవాను డర్జునునకు మొదట "నత్వేవాహం........" అని యారంభించి యుపదేశించినదియు ఈ ఆత్మ స్వరూపమునే. "ప్రథమ కబళే మక్షికాపాతః" అను రీతి ననుసరించి మాయావాదులు జీవస్వరూప నిరూపణములో వానిని పరమాత్మతో అభిన్నమనిరి. వాని ననేక ప్రమాణములతో ఖండించి శేషశేషి భావమును స్థాపించిరి ఈ రామానుజులు. ఇదియే మహానాదము.

ఏ షే - ఆకాశావకాశమునంతను వ్యాపించి.

"ఏతాని తాని భువన త్రయపావనాని
.... .... .... .... .... .... .... .... .... ....
.... .... .... .... .... .... .... ... .... ....
రామానుజేతి చతురాణ్యమృతాక్షరాణి"

అని లోకత్రయావకాశమును వ్యాపించి పవిత్రత నొసంగు నామాంకితులు భాష్యకారులు. లేక — "తస్మిన్ రామానుజార్యే గురు రితిచ పదం భాతి నాన్యత్ర, తస్మాత్" అనునటుల ఆచార్య శబ్దమునకు ముఖ్యవృత్తి వారొక్కరియందే కలదు.

శింగమేతల్వ నురువప్పోల్ మెయ్ కరుత్తు -

భగవద్రామానుజులు అప్రాకృత పంచోపనిషన్మయ దివ్యవిగ్రహులు గాన గుహలోబులో నుంచిన దీపమువలె వారి హృదయకుహరమున "స్వాఙ్గుష్ఠప్రమితం చ యోగి హృదయే ష్వాసీన మీశం" అనునట్లు వేంచేసియున్న నూతన జలధరరుచియగు సర్వేశ్వరుని కాంతులు వెలుపలకు

చిమ్ముటచే వీరికీ విశేషణ మొప్పును. ఆ శ్రియఃపతి హేతిరాజమగు చక్రము దిక్కులకును, విదిక్కులకును ప్రేరేపింపబడి పోయి శత్రువర్గమునంతను చీల్చి చెండాడి స్వస్థానమునకు చేరునట్లుగా

"శ్రీశైలం కరిశైల మఞ్జనగిరిం.......నిషేవ్య రమతే రామానుజోఽయం మునిః" అనునట్లు యావద్భారతదేశమును మూలమూలల కేగి బాహ్యులను, కుదృష్టులను నిరసించి తిరిగి శ్రీరంగమునకు జేరిరి.

వలమ్బురిపోల్ నిన్ఱతిర్ల్ -

చక్రమువలె శంఖము చేతిని విడువదు. చేతియందే యుండి ఘోషించి శత్రు హృదయములను చీల్చి చెండాడును. అటులనే భాష్యకారులును "ద్వయ మర్థాను సన్ధానేన సదైవం వక్తా యావచ్ఛరీరపాత మత్రైవ శ్రీరఙ్గే సుఖ మాస్వ" అర్థయుక్త ద్వయమంత్రము ననుసంధించుచు ఇచ్చటనే శ్రీరంగమందు చివరవరకు సుఖముగనుండుమని యాదేశించుటచే నాయాజ్ఞను పాలించుచు నచ్చటనే వేంచేసియుండి పరమతముల నిరసించుచు గ్రంథముల వ్రాయుచుండిరి.

శార్ఙ్గముదైత్త శరమశైపోల్ వాళఉలగినిల్ పెయ్దిడాయ్ -

"ప్రణవో ధను శ్శరోహ్యాత్మా" అను శ్రుతిని బట్టి ధనుస్సు అనగా ప్రణవము. శరమనగా ఆత్మ ప్రణవము నుండి యావిర్భవించునట్టియు,. ఆత్మలకు సకాలవృష్టివలె ఆనందకరములగు నట్టియు, అర్థవిశేషములను లోకమంతయు ఆనందించునట్లు పర్షింపు మని శ్రీభాష్యకారుల స్థానమందున్న ప్రస్తుత మన ఆచార్యులను ప్రార్థించుచున్నారు.

తాళాతే -

ఆ యర్థోపన్యాసము లైనను రుచి మారకమునుపే క్షణభంగురమైన శరీరమున్నప్పుడే వెంటనే ప్రసాదించవలెనని ప్రార్థన. విభీషణుడును "నివేదయత మాం క్షిప్రం" అని త్వరపడుట యిందులకే. "యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్" అనునటుల విరక్తి చెందిన వెంటనే సన్యసించవలెను, లేదా, శరణాగతి చేయవలెనని గదా విధి!

ఉలగినిల్ వాழ -

లోకులందరును ఆనందించునటుల. ఆచార్యులు చేతను లందరు నుజ్జీవించవలెననియే సదర్థముల నుపదేశింతురు. అవి కొందరకు బాధను కలిగించుట, వారి కర్మమూలమే గాని, ఆచార్య

దోషము గాని, అర్థదోషము గాని కాదు. వర్షము అన్ని వృక్షములును చిగిర్చి, ఫలించవలెననియే కురియును.కాని జిల్లేడు ఆకులను రాల్చి మోడగుచున్న దన్నచో నది వర్షదోషమా? దీపమందరకును ప్రకాశము నొసంగి పదార్థములు స్ఫుటముగా గోచరించవలెననియే వెలిగింపబడును. మిడుతలు కొన్ని యందు పడి మరణించినచో నది దీపదోషమా?

నాఙ్గళుమ్ మార్గళినీరాడ మగిళ్న్దు -

మార్గళి- అనగా- అంతిమోపాయము. దానియందు మాకు నిష్ఠ దినదినాభివృద్ధిని జెంది అందే మేము సదా మునిగియుండి యుజ్జీవించునటుల సాయించవలెను.

## సందర్భానుసారముగ ననుసంధించుకొన దగిన పాశురములు, శ్లోకములు.

ఈ పాశురావతారికలో -

"ద్రవన్తి దైత్యాః ప్రణమన్తి దేవతాః ।
నశ్యన్తి రక్షాం స్యపయాన్తి చారయః ।
యత్కీర్తనాత్ సోఽద్భుత రూపకేసరీ ।
మమాస్తు మాఙ్గల్య వివృద్ధయే హరిః॥"

(విష్ణుధర్మే - మాఙ్గల్యస్తవే)

తా త్ప ర్య ము

భగవంతుని యొక్క తిరునామములను పాడిన యెడల దైత్యులు పారిపోవుదురు. దేవతలు నమస్కరింతురు. రాక్షసులు రూపుమాసిపోవుదురు. శత్రువులు తొలగిపోవుదురు. అట్టి సర్వాశ్చర్య షుయుడగు దేవదేవుడు నాకు సమస్త సన్మంగళములను ప్రసాదించు గాక!

"స్వపురుష మభివీక్ష్య పాశహస్తం
వదతి యమః కిల తస్య కర్ణమూలే ।
పరిహర మధుసూదనప్రపన్నాన్
ప్రభురహ మన్యనృణాం న వైష్ణవానామ్ ॥"

(శ్రీవిష్ణు పురాణే 3-7-14)

తాత్పర్యము

ప్రాణుల ప్రాణముల నాకర్షించు పాశముల చేబూని సంరంభముతో పయనమగుచున్న తన భటునిగాంచి యమధర్మరాజు వానిని చేరువకు పిలిచి "ఓరీ! శ్రీమన్నారాయణునకు శరణాగతులైన శ్రీవైష్ణవుల చెంతకు చేరకుము, నే నందరిపైనను నిరంకుశుడగు నధికారినే గాని శ్రీవైష్ణవులపై నా యధికారము చెల్లదు సుమా! జాగ్రత్త, భద్రము" అని వాని చెవిలో చెప్పెను.

"తిఱమ్బేల్ మిన్ కణ్డీర్ తిరువడి తన్నామమ్
మఱన్దుమ్ పుఱన్దొళా మాన్దరై । ఇఱైఞ్జియుమ్
శాదువరాయ్ ప్పోదు మిన్గళెన్డాన్, నమనుమ్ తన్
తూదువరై క్కూవి చ్చెవిక్కు."

(4. తిరువన్దాది. 68)

తాత్పర్యము

యమధర్మరాజు తన దూతలను పిలచి "సర్వేశ్వరుని తిరునామమును మరచినను ఇతర దేవతల నమస్కరించని మనుష్యోత్తములను నమ్రులై నమస్కరించియు, అనుకూలురైయుండి వారి చెంతకేగుడు. దీనిని తప్పకుడు సుమండీ" అని వారి చెవిలో చెప్పెను.

విణ్ణీల, మేలాప్పు విరిత్తాఱ్పోల్ మేగజ్గాళ్,
తెణ్ణీర్ పాయ్ వేజ్గడ త్తెన్ తిరుమాలుమ్ పోన్దానే
కణ్ణీర్గళ్ ములైక్కువట్టిల్ తుళిశోర చ్చోర్వేనై,
ప్పెణ్ణీర్మై యీడళిక్కుమిదు తమక్కోర్ పెరుమైయే.

(నా. తి. 8.1)

తాత్పర్యము

ఆకసమున కట్టిన నల్లని చాందినీవంటి మేఘములారా! స్వచ్ఛమైన నీరు ప్రవహించు వేంకటాద్రినాథుడైన శ్రీనివాసుడు మీతోకూడి వచ్చియున్నాడా? స్తనాగ్రములను తడుపుచున్న కన్నీళ్లతో క్రుంగిపోవుచున్న ఆడుదాననగు నన్నీవిధముగ బాధించుచున్నాడు. ఇది యాతనికి ఒక గొప్పయా? ఈ మాట నాతని నడుగుడు.



## ఐదవ పాశురము

# "మాయనై మన్ను"

— అవతారిక —

మొదటి పాశురమున నారాయణ పదముచే ఉభయ విభూతిసంబంధమును చెప్పిరి. 'నార' పదమునకు స్వరూపతః నిత్యములైన నిత్యవిభూతియు, తద్గతపదార్థములున్ను, ప్రవాహతః నిత్యమైన లీలావిభూతియు, తద్గత పదార్థములున్ను అర్థముగా గ్రహించుటచే ఉభయవిభూతి సంబంధము చెప్పబడినట్లులనే గదా! రెండవపాశురమున "పాఱ్కడలుళ్ పైయత్తుయిన్ఱ పరమనడిపాడి" యని సకలావతారకందమైన వ్యూహమనబడు క్షీరాబ్ధినాథునిగూర్చి చెప్పబడినది. మూడవ పాశురమున ఇంద్రుని లోటును తీర్చుటకై అతడు పోగొట్టుకొనిన త్రైలోక్యరాజ్యమును తిరిగి సంపాదించి యిచ్చుటకై వామనుడై యవతరించి లీలావిభూతిలోని చేతనాచేతన పదార్థములలో తారతమ్యమును చూడక అన్నింటిని తన పాదారవిందములతో స్పృశించి యిది యంతయు తనదేయని సాధించుకొనిన రీతి చెప్పబడెను. నాల్గవ పాశురమున "తాళాతే శార్ఙ్గ ముదైత్త శరమళై పోల్" అని యోగ్యులై జ్ఞానానుష్ఠాన సంపన్నులగుటచే సదాచార్య పదవికి తగిన వసిష్ఠాదులు తనను నియమించి పనులను చేయించునట్లు చక్రవర్తి తిరుమగనై (శ్రీరాముడై) అవతరించి తన చక్రవర్తిత్వమునకు భంగము రానీయకుండ పరతంత్రుడై ప్రవర్తించిన శ్రీరామావతార వృత్తాంతము చెప్పబడినది.

ఈ అయిదవ పాశురమున తారతమ్యము లేక అందరకును కట్టుటకును, చివరకు కొట్టుటకును గూడ అలుసు కాగలిగినంత సౌలభ్యపరాకాష్ఠయగు శ్రీకృష్ణావతారము ప్రసంగించబడినది. ఇంక నొకయూదన కంతకును పూర్ణానుభవమునకై తనను స్వాధీన పరచివేసిన భక్తపరాధీనత చెప్పబడినది.

నోమునోచు గోపాంగనలలో వేదాంత పరిచయము లేని యొకతె "శ్రేయాంసి బహువిఘ్నాని భవన్తి మహతా మపి" అను న్యాయమును పురస్కరించుకొని "మన నోమెట్లు సఫలమగు" నని శంకించెను. ఆమె యుద్దేశ్యము సరియైనదే, "మహాత్ములకే విఘ్నపరంపరలచే నభీష్టకార్యములు సిద్ధించలేదే· ఇక మన కేమి గతి?" అని యామె యభిప్రాయము. ఆమెకు శ్రీరామపట్టాభిషేకోద్యమ వైఫల్యకథ హృద్గతమై యుండెను కాబోలు! ఈ పట్టాభిషేకము తలపెట్టినవాడు ఇంద్రాదిదేవతలకును అభేద్యుడగు శంబరుని హతమార్చిన దశరథచక్రవర్తి. "దశసు దిక్షు అప్రతిహతా రథగతిఃయస్య" పది

దిక్కులయందును అడ్డులేని రథసంచారముకలవా డతడు. ముహూర్తము నుంచినవాడు ఒకజన్మలో విశ్వామిత్రుని రాజర్షి పదవినుండి యొక్కమాటతో బ్రహ్మర్షి పట్టమును కట్టించిన వసిష్ఠమహర్షి. కిరీటమును ధరించువాడు "రామో విగ్రహవాన్ ధర్మః" అనునట్లు భాగ్యాధికుడగు శ్రీరామచంద్రుడు. "సహ పత్న్యా విశాలాక్ష్యా నారాయణ ముపాగమత్" అనునట్లు పట్టాభిషేకము నిర్విఘ్నముగా జరుగుటకై శ్రీరామచంద్రుడు సీతాపిరాట్టితో నొక రాత్రియంతయు జాగరణతో, నియమనిష్ఠలతో శ్రీరంగనాథుని సేవించెను. "ఇచ్ఛామో హి మహాబాహుం ........" అని శ్రీరామచంద్రుడు పట్టపుఏనుగుపై శ్వేతఛత్రమును ధరించి వేంచేసి యెప్పుడు దర్శన మిచ్చునా యని మేమందర మెదురు చూచుచున్నామని రాజభవన మంతయు అదిరిపోవునట్లు ఏకకంఠముతో నుత్సహించినది అయోధ్యావాసులు. ఇన్ని పరికరము లన్నియు అనుకూలముగ నున్నను ఈ పట్టాభిషేకము జరుగనే లేదు. ఇక ననాదికాలమునుండియు పాపరాశిలో మునుగుచున్న మనకా యీ వ్రతానుష్ఠానము నిర్విఘ్నముగా సాగునది?" యని ప్రశ్నించెను. దానిని విని వేదాంత విద్యానుభవముగల యొక గోపిక ఆమెతో "అయ్యో! పిల్లా! నీవు సర్వేశ్వరుని స్వభావము నెరుంగవు. హిరణ్యకశిపుడు తన కుమారుడైన ప్రహ్లాదుని "నీ దేవు డెందున్నాడురా? యని ప్రశ్నించగా "............ సర్వత్రాస్తి సదాస్తి కిం బహుగిరా త్వయ్యస్తి మయ్యస్తి చ॥" అని ప్రమాణ బాతమునందలి యాస్తిక్యబుద్ధిచే ప్రమాణమును చేయగా ఎక్కడ ఎప్పుడు చూపుమనునో యను భయముతో భగవంతుడు అంతటను నిండియుండి అతని ప్రతిజ్ఞను కాపాడినవాడా శ్రియఃపతి కాడా? తన భక్తుడగు ప్రహ్లాదుడు నిర్భయముగా గావించిన ప్రతిజ్ఞను, హిరణ్యకశిపుడు తాను చావకుండుటకై కోరి బడసిన వరములకు భంగము రాకుండగా ఆశ్చర్యరూపమును ధరించి సభాస్థలియందున్న స్తంభమునుండి యవతరించ లేదా?

"స్వనిగమ మపహాయ మత్ప్రతిజ్ఞాం ।
ఋత మధికర్తు మవప్లుతో రథస్థః॥"

"ఆయుధమును ధరించ"నను తన ప్రతిజ్ఞ వమ్మైనను "నీచే నాయుధమును పట్టింతు" నను తన భక్తుడగు భీష్ముని ప్రతిజ్ఞను కాపాడుటకై చక్రమును చేబట్టెను.

భగవానుడు గీతలో "న మే భక్తః ప్రణశ్యతి" అని తానే ప్రతిజ్ఞ చేయవలసి యుండగా "కౌన్తేయ! ప్రతి జానీహి న మే భక్తః ప్రణశ్యతి" అర్జునా! నా భక్తుడు చెడడని నీవు ప్రతిజ్ఞ చేయమని యాదేశించెను. తాను ప్రతిజ్ఞ చేసిన నిలబెట్టుకొనజాలనని తన కత్యంత ప్రియ భక్తుడైన యర్జుననిచే దానిని గావింపజేసినచో తానెట్లైనను దానిని కాపాడగలనను సంకల్పము చేతనే గదా!

విభీషణునకు సముద్రమున కీవలి యొడ్డున నుండగనే లక్ష్మణస్వామిచే లంకారాజ్యపట్టాభిషేకమును చేయించెను. దానిలోని రహస్యము నిదియే,

అర్జునుడు "చీకటిపడకమునుపే సైంధవుని చంపనిచో గాండీవముతో అగ్ని ప్రవేశమును గావించి ప్రాణములను విడచెద"నని శపథ మొనర్చియు, దానిని నిర్వహింపలేని పరిస్థితి యేర్పడగా సూర్యునకు చక్రము నడ్డుపెట్టి పగటిని రాత్రిగా చేసి యాతని చంపించుటయును భక్తుని ప్రతిజ్ఞను కాపాడుటకే గదా! కావున మనము చేసిన వ్రతానుష్ఠాన ప్రతిజ్ఞను ఆ కృష్ణుడే కాపాడు కొనును. మనకా చింతయేల?"

"మన మా నారాయణుని సంకీర్తనములో దిగినచో మన వ్రతమునకు విరోధులగు దుష్ట శక్తులన్నియును భగవదనుగ్రహముచే దూరమగును, కావున "శెప్పు" అని వేదాంత విజ్ఞానము కలిగి భగవత్తత్త్వమును కరతలామలకము గావించుకొనిన యా గోపాంగన చెప్పుచున్నది.

## అయిదవ పాశురము

మాయనై మన్ను వడమదురై మైన్దనై ।
త్తూయపెరునీర్ యమునై త్తుఱైవనై ।
ఆయర్ కులత్తినిల్ త్తోన్ఱుమ్ మణివిళక్కై,
త్తాయై క్కుడల్ విళక్కమ్ శెయ్త దామోదరనై,
తూయోమాయ్ వన్దు నామ్ తూమలర్ తూవిత్తొళుదు
వాయినా ల్పాడి మనత్తినా ల్చిన్దిక్క,
పోయ ప్పిళైయుం పుకుతరువా నిన్ఱనవుమ్
తీయినిల్ త్తూశాకుమ్ శెప్పే లోరెమ్బావాయ్.

### — తాత్పర్యము —

ఉత్తరమధురలో సాధుపరిత్రాణమే ముఖ్యోద్దేశముగా నవతరించిన శ్రీకృష్ణుడు అతిమానుషైశ్వర్యకర దివ్య చేష్టలుకలవాడు. భగవత్సంబంధ మెడతెగక యుండునట్టి మధురా ప్రభువు పావనమైన నీటితో నిండియున్న యమునానదియొక్క రేవునందే నిరంతము నుండువాడు. గొల్లవంశమున నవతరించిన మాణిక్యదీపమైనవాడు. తనను కన్నతల్లి కడుపును లోకులు కొనియాడునట్లు చేయు దామోదరుడు. ఇట్టి గుణాభిరాముడగు శ్రీకృష్ణుని మనము ప్రయోజనాంతరములను వేనిని

గాని కోరని శుద్ధిని కలవారమై దగ్గరించి, పరిశుద్ధములగు పుష్పములను అక్రమముగా నైనను చల్లి సేవించి, నోరార అతని కల్యాణగుణములను పాడి, మనసార ధ్యానించిన సంచితపాపసంచయ మంతయును, ఇకపైన ప్రమాదవశమున రాబోవు పాపములును నిప్పులో బడిన దూదివలె నశించి పోవును. కావున నాతని తిరునామమును కీర్తింతము.

## — విశేషార్థము —

### మాయనై -

ఆశ్చర్యకరములైన చేష్టలను, గుణములను కలవాడు.

దీనిచే పరత్వసౌలభ్యములకు చివరిహద్దు చూపబడుచున్నది.

### ఆశ్చర్య చేష్టల కుదాహరణము —

బాల్య చేష్టలలో

"అంతర్గృహే కృష్ణ మవేక్ష్య చోరం।
బధ్వా కవాటం జననీం గతైకా।
ఉలూఖలే దామని బద్ధ మేనం।
తత్రాపి దృష్ట్వా స్థిమితా బభూవ॥"

ఒక గోపాంగన తన యింట నొక చీకటిగదిలో ప్రవేశించి గవ్యమును దొంగిలించుచున్న శ్రీకృష్ణుని చూచి, మెల్లగా తలుపులను మూసి, పైన తాళమును వేసి తల్లియగు యశోదతో చెప్పుటకై పరుగు పరుగున నేగి తలుపును తట్టగా నచ్చట నొక రోటను త్రాటితో కట్టబడి యేడ్చుచున్న కృష్ణుని చూచెను. ఇక నేమి చేయును? సిగ్గుపడి నిశ్చేష్టురాలయ్యెను.

"ఉలూఖలే దామని బద్ధం" అనుటలో అర్థములో నొక స్వారస్యము కలదు.

ఏదైనను కఠినపదార్థమును తినుటకు వీలుగా చేసుకొనవలెననిన దానిని రోటవైచి మెత్తగా దంపిన అది తినుట కుపయోగించును. అటులనే వేదములోని కఠినములైన అర్థములను మన మనుభవించవలెననిన ద్రావిడవేదమున అళ్వార్లు ఆ యర్థముల నన్నిటిని నాలాయిరప్రబంధములలో సుబోధ్యములను గావించి మన కనుభవించుటకు అనుకూలముగ ప్రసాదించిరి. ఆ రోలు చేయు

పనిని వీరి ప్రబంధములే చేయుచుండుటచే రోలు అనగా ద్రావిడ ప్రబంధములని యర్థమును జెప్ప వచ్చును. ఆ ప్రబంధములయందే శ్రీమన్నారాయణుని స్వరూప రూప గుణ విభూతులన్నింటిని సుక రముగా ననుభవించ వచ్చును. ఈ యర్థమునే క్రింది శ్లోకము విశదపరచుచున్నది.

వరమిమ ముపదేశ మాద్రియధ్వం
నిగమవనేషు నితాన్తచారఖిన్నాః ।
విచునుత భవనేషు వల్లవీనాం
ఉపనిష దర్థ ములూఖలే నిబద్ధమ్ ॥

— మరియొక ఆశ్చర్యచేష్ట —

గోప్యః కదాచన పృథక్ పృథ గూహ్య కృష్ణం
ఏత్యైకదైవ గదితుం ప్రసృతా స్తదాగః ।
తస్యా స్తదన్తి తమేవ నిజాంకదృష్ట్వా
సర్వా స్తతో వివవృతా స్స్వగృహాన్ సలజ్జాః ॥

యశోదాదేవి శ్రీకృష్ణు డెల్లవేళల తన చెంతనే యుండుటచే గోపాంగనల ఆరోపణలను నమ్మక శ్రీకృష్ణుని పట్టి చూపు డనెను. అట్టి యదనుకై వారందరును వేచియుండిరి. ఒకనాడు నాలుగు వీధులలోనున్న నలుగురికిని శ్రీకృష్ణుడు ఒకేసారి చిక్కెను. ఈసారి గట్టిగా దండింపజేయ వచ్చునని యొకరికి తెలియక యొకరు అతనిని రెక్క పుచ్చుకొని యీడ్చుకొని వచ్చుచు నాలుగు వీధుల మొగలో కలిసి యాశ్చర్యపడిరి. ఈ విధమగు మాయను గూడ ఆమెకు చూపుదమని గట్టిగా పట్టుకొని యాతని లాగుకొని తలుపు తట్టిరి. యశోద చంకలో శ్రీకృష్ణుని నిరికించుకొని వచ్చి తలుపు తెరచి "ఏల వస్తిరి?" అని అడుగు సరికి వారాశ్చర్యముతో తాము బలవంతముగా లాగుకొని వచ్చిన శ్రీకృష్ణుని జూపబోగా వట్టి చేతులే యుండెను. ఇక నేమి చెప్పెద మని సిగ్గుపడి వేరొక మిషను పుర స్కరించుకొని వెడలిపోయిరి.

ఆంధ్రభాగవతమున పోతనామాత్యుడు ఈ శ్రీకృష్ణుని ఆశ్చర్యచేష్టలను అద్భుతముగా వర్ణిం చెను. వినుడు.

కలకంఠి! మా వాడ గరితలమెల్ల నీ
పట్టి రాగలడని పాలు పెరుగు
లిండ్లలోపలనిడి యే మెల్ల తన త్రోవ
జూచుచో నెప్పుడు జొచ్చినాడొ
తలుపులు ముద్రలు తాళంబులును పెట్టి
యున్న చందంబున నున్నవరయ
నొకయింటిలో పాడు నొకయింటిలో నాడు
నొకయింటిలో నవ్వు నొకటతిట్టు

నొకట వెక్కిరించు నొక్కకచో మృగ
పక్షి ఘోషణములు పరగజేయు
నిట్లు చేసి తుదకు నెక్కడి కేగునో
కానరాడు రిత్త కడవలుండు.

ఇక సౌలభ్యమున కుదాహరణము.

సౌలభ్యమనగా

ఎన్నడునైన యోగివిభు లెవ్వని పాదపరాగమింతయున్
కన్నుల గాన రట్టి హరి కౌగిట జేర్చుచు జెట్టపట్టుచున్
తన్నుచు గ్రుద్దుచున్నగుచు తద్దయు పైబళ్ల గూడియాడుచన్
మన్నన జేయు వల్లవ కుమారుల భాగ్యమదెంత యొప్పునో.

ఇట్టి సౌలభ్యము నితరావతారములలో లోటుపడుటచేతనే భగవంతుడు కృష్ణుడై యవతరించెను. ఇది శ్రీకృష్ణుని దౌత్య, సారధ్యవ్యాపారములలో గానవచ్చును.

"నఖనియమిత కండూన్ పాణ్డవస్యన్దనాశ్వా
ననుదిన మభిషిఞ్చన్నఞ్జలిస్థైః పయోభిః
అవతు వితతగాత్ర స్తోత్ర నిష్యూతమౌళిః
దశన విధృత రశ్మిః దేశకీ పుణ్యరాశిః ॥

తను నడుపుచున్న ఆప్తుని రథాశ్వములకు స్వయముగ మాలీసు చేయునపుడు కొరడాను దంపొగాలోను, పగ్గములను నోటను గిలించి, యొదలు వంచి, దోసిలితో నీటిని చల్లుచు, గోళ్లతో దురదతీరునట్లు గోకుచు సేవకీ పుణ్యరాశి పాటుపడుచుండెను. ఇట్లనేక సందర్భములలో అతని సౌలభ్యమును చూడవచ్చును.

ప: "మా యనై -

అను పదమును పరత్వపరముగను సమన్వయించవచ్చును. శ్రీకృష్ణావతారము సౌలభ్యమునకు పరాకాష్ఠ యగునట్లు పరత్వమునకును పరాకాష్ఠయే. ఆ పరత్వపరమగు అర్థమును గూడ అనుభవింతము. పరత్వమునకు ప్రమాణము "యతో వాచో నివర్తన్తే, అప్రాప్య మనసా సహ" అను వేదవాక్యము, సమస్తకల్యాణ గుణాకరుడై, నిరతిశయానంద పూర్ణుడై, ఉభయవిభూతి నాథుడై, శ్రియః పతియై పరమపదమందు వేంచేసియుండు స్థితి నీ విశేషణము తెలుపుచున్నది. ఇది యొక ఆశ్చర్యకరమగు విషయము.

"యస్యాఽమతం తస్య మతం, మతం యస్య నవేద సః, అవిజ్ఞాతం విజానతాం, విజ్ఞాతమవిజానతామ్" ఈ ఉపనిషద్వాక్య మొక విలక్షణమగు అర్థమును బోధించుచున్నది. "నీవు భగవంతు నెరుగుదువా?" యని ఎవరైన ప్రశ్నించినచో "ఓ, నేను బాగుగా నెరుంగుదు" నని యొకడును, "నే నేమి యెరుంగుదు" నని మరియొకడును సమాధాన మొసంగుదురు. వారిరువురిలో యథార్థముగ భగవంతుని స్వరూపము నెరింగినవా రెవరనగా, ఈ వేదవాక్యము 'బాగుగ నెఱుంగుదు' నన్నవాని కేమియు తెలియదనియు, 'బొత్తుగ నెరుంగ' నన్నవానికి పూర్తిగ తెలియుననియు చెప్పుచున్నది. ఈ వైపరీత్యమున కేమి కారణ మనగా, "నేతి నేతి" యను శ్రుతి వాక్యమునకు కేవలనిషేధములోనే తాత్పర్యము లేదు. మరి భగవత్స్వరూపము నీ వెరింగినంత మాత్రమే కాదు. అది యపరిచ్ఛిన్నమైనది. దానిని నీవే కాదు శ్రుతియు నెరుంగదు. మనస్సుతో బాటు వాక్కున్ను అతని తత్త్వము నెరుంగలేక వెనుకకు మరలిపోవుచున్న దని చెప్పుచున్నది కాబట్టి అపరిచ్ఛిన్న స్వరూప స్వభావములు గల పరమపురుషుని 'నే నెరుంగుదు' నన్న ఈతని పరిచ్ఛిన్నత్వమే తెలియబడుటచే నాతడు బొత్తుగ నెరుంగడనియు, 'నే నెరుంగ' నన్నచో "అపరిచ్ఛిన్నుని నా పరిచ్ఛిన్న శక్తిసామర్థ్యములతో నెరుంగుదునని నే నెట్లు చెప్పగలుగుదు" నని భగవంతుని అపరిచ్ఛిన్నత్వమే చెప్పినట్లగును. కావున నాతనికి భగవత్తత్త్వము తెలిసినట్లు గ్రహింపవలెను.

మరియు, భగవద్గీతయందలి 9, 10 అధ్యాయములలో భగవానుడు తన పరత్వమును శత శాఖలుగా నుపదేశించి 11వ అధ్యాయమున అర్జునునకు దివ్యచక్షుస్సు నిచ్చి దానిని ప్రత్యక్షముగా జూపెను.

ఇట్టి పరత్వము మన ఆండాళ్ తల్లికి మనకు చెప్పునట్లుగా గోచరమైన విషయమును ఈ పదము తెలుపుచున్నది. ఆళ్వార్లు శ్రీకృష్ణావతారమందలి ఉలూఖలబంధన సౌలభ్యమును తలంచుకొని 'ఎత్తిరమ్' "ఆహా! యేమి సౌలభ్య!" మని యీడు పడినట్లే ఆండాళ్ తల్లియు అతని పరత్వమును తలచుకొని 'మాయనై' అనుచున్నారన్నమాట.

తిరువిరుత్తమను దివ్యప్రబంధమున రెండవ పాశురములో "శూట్టు నన్మాలై కళై తూయన వేన్ది" యని కృష్ణావతార రహస్యమును చమత్కరించిరి. పరమపదమున నున్న పరవాసుదేవునకు భూలోకమునందున్న గోకులములోని పాలు, పెరుగు, వెన్న, నెయ్యి మొదలగు గవ్యమును కడుపార మెక్కి రావలెనను సంకల్పము కలిగినదట ! అచ్చట నిత్యసూరులకు మనవలె కార్యాంతరములు, అనుష్ఠానాంతరములు నేవియును లేకుండుటచే 'సదా పశ్యన్తి' యనునటుల రెప్పవేయక యతనినే సేవించుచుందురు. "న కాల స్తత్ర వై ప్రభుః" అనునటుల వారికి కాలకృత్యము లేవియు నచ్చట నుండవు. ఇక "నిత్యసూరుల కన్నులను గప్పి యిచ్చటికి వచ్చుటెట్లు? వానిని ఆరగించుటెట్లు?" అని యాలోచించగా నాతనికి చివర కొక యుపాయము తోచినది. నిత్యసూరు లందరు తలకొక కైంకర్యములో నిమగ్నులై యుందురు గదా! కొందరు స్నానము నాడించుచుందురు. కొందరు వస్త్రములను ధరింపజేయు చుందురు. కొందరు తిలకమును ధరింపజేయుచుందురు. కొందరు ధూపమును సమర్పించుచుందురు. ఆ పొగలో స్వామి యెవ్వరికిని కాన్పించుట లేదు. ఇంతలో నా శ్రీమన్నారాయణుడు చట్టున శ్రీకృష్ణుడుగా గోకులమున నవతరించి తన యింటను, పొరుగిండ్లలోను కావలసినంత గవ్యమును మెక్కి తిరిగి పరమపదమునకు వేంచేసెను. అచ్చట ఆ పొగ తగ్గుసరికి యథాస్థానమున వారికి సేవసాయించెను. దొంగమేతను మేయు గోవు ఆకలిగా నున్నప్పుడు చేనులోపడి గద్దించినను, కొట్టినను, గెంటినను కదలక, మెదలక వడివడిగా కావలసినంత తిని పోవును గదా! అట్లే యితడును. "అయినచో ఆ పొగ యిన్ని సంవత్సరములు నిట్లే యున్నదా?" యని ప్రశ్నించరాదు. కాలమానములో నున్న భేదము నారయవలెను.

## మన్నువడ మదురై -

'మన్ను' అనుటచే భగవత్సంబంధ మొకప్పుడును మారని ఉత్తరమధుర యని యర్థము. ఇది బృందావనసమీపములో నున్నది. దీనికి 'సిద్ధాశ్రమ' మనియు పేరు. కృతయుగమున నారాయణుడు వామనావతారము నెత్తి త్రివిక్రముడై బలినుండి లోకత్రయమును స్వాధీనపరచుకొని దేవేంద్రున కిచ్చెను. ఆ పని కాగానే వామను డిక్కడికి వేంచేసి పెక్కుసంవత్సరము లిచ్చటనే తపస్సు చేసెను. త్రేతాయుగమున శ్రీశత్రుఘ్నుడు ఇచ్చట దుష్టులగు లవణాసురుడు మొదలగు వారిని అణచి రాజధానిని నిర్మించుకొని చాల కాల మేలెను. ద్వాపరయుగమున శ్రీకృష్ణుడై యవతరించెను. 'మధు - రాతీతి = మధురా' (రా = ఆదానే = తీసికొనుట) అనువ్యుత్పత్తినిబట్టి మధురానగరము అవతారకందమగు క్షీరాబ్ధినాథుని క్షీరసాగరమునందు విరక్తుని గావించి తనయం దాసక్తుని గావించి రప్పించుకొనెను. "నాగ పర్యఙ్క ముత్సృజ్య హ్యాగతో మధురాంపురీం"

మన కర్మ మనల ననేకజన్మలలో పుట్టించునట్లు, భగవంతుని కృప యాతని ననేకజన్మలలో నవతరింపజేయును. ఈ యవతారములకు ముఖ్యప్రయోజనము సజ్జన సంరక్షణమే. పాపాత్ముల సంహరించుట కలుపు మొక్కలను తీసివేయుటవలె అప్రధానము.

## మైన్దనై -

ఈ పదమునకు బలవంతుడు, పిల్లవాడు, యువకుడు, రాజు అని నాలుగర్థముల జెప్ప వచ్చును. "తన్దైకాలిల్ పెరు విలఙ్గు త్తాళ్ అవిళ్ర నల్లిరుళ్ కణ్ వన్ద వెన్దై" అనగా తన "తల్లి దండ్రులగు దేవకీ వసుదేవుల కాళ్లకు కంసుడు తగిలించిన సంకెళ్లు విడిపోవునటుల గాఢాంధకారము నందు వచ్చి యవతరించిన నా తండ్రీ!" అని సాయించుటచే నాతని బలాఢ్యత్వము, లేక, చిన్న తనము చెప్పబడినవి. గోపికలతో గావించిన రాసక్రీడలు అతని యవ్వనమును తెలుపును. తన ఆటలు, పాటలు, మాటలు, చేష్టలచే గోగోపీజనమును రంజింపజేయు రాజత్వము చెప్పబడుచున్నది.

## తూయపెరునీర్ యమునైత్తుఱైవనై -

గోదావరి కంటెను యమున పవిత్రమైనది. ఏల యనగా రావణుడు సీతాపిరాట్టిని ఎత్తుకొని పోవుచుండగా సీతమ్మ తల్లి గోదావరిని చూచి నమస్కరించి 'తల్లీ! నన్ను రావణు డెత్తుకొనిపోవుచున్నాడని శ్రీరామునకు విన్నవింపు' మని ప్రార్థించెను శ్రీరాము డామెను వెతుకుకొనుచు వచ్చి గోదావరిని సీతమ్మ జాడను చెప్పుమని ప్రార్థించెను. కాని గోదావరి రావణునకు భయపడి యూరకుండెను.

కాని యీ యమునానది శ్రీకృష్ణుని హృదయము నెఱింగి, తాను కంసుని కోటనీడలో నున్నను భయపడక మోకాలు లోతగునట్లు వట్టిపోయి "మార్గం దదౌ సిన్ధురివ శ్రియఃపతేః" శ్రీరామునకు సముద్రుడు దారినిచ్చినట్లు వసుదేవునకు దారి నిచ్చెను. ఇదియే యీ నదికి శుద్ధి.

శ్రీకృష్ణుడు గోపాంగనలతో జలక్రీడలాడుటకును, ఆ స్త్రీల విరహతాపము శమించుటకును తగునట్లు చల్లని నీటిని కలిగియుండుటయే దీనికి శుద్ధి. మరియు శ్రీకృష్ణుడును, గోపాంగనలును నొకరిపై నొకరు పుక్కిలించి యుమియుటచే వచ్చిన శుద్ధియనియును చెప్పవచ్చును.

"వల్లవీవదనోచ్ఛిష్ట పవిత్రాధర విద్రుమః" అనగా, గోపాంగనల అధరపానముచే పవిత్రమైన యెర్రని అధరము కలవాడని శ్రీకృష్ణుడు స్తుతింపబడెను. ఇట్లు శ్రీకృష్ణుని యధరమునే పవిత్రము గావించిన గోపాంగనల యుచ్ఛిష్ట మీ నదీతీర్థమును పవిత్రము గావించుట యేమి వింత?

"అపి మాం పావయే త్సాధ్వీ స్నాత్వే తీచ్ఛతి జాహ్నవీ" అనునటుల భగవంతుని పాదారవిందములనుండి యుద్భవించి మూడు లోకములను పావనమొనర్చు గంగానదియే పతివ్రతాంగనల స్నానాచరణముచే తనను పవిత్రమొనర్చుకొన గోరుచుండగా, భగవంతుని ప్రాణతుల్యలగు గోపాంగనల నిరంతర స్నానముచే పావనమగుటలో యమునానది కేమి కొరత?

## ఆయర్ కులత్తినిల్ తోన్రుం -

శ్రీకృష్ణు డవతరించినది మధురలో గదా ! గోకులమున నవతరించినట్లు సాయించిరేల ? యనగా మధురలో పుట్టుట పుట్టుక లేని పరమపదస్థితి వంటిదే. పుట్టిన ఊరనగా, ఏడ్చి స్తన్యపానమును జేసిన యూరుగదా ! అది చేసినది మధురలోనా? గోకులములోనా? కాబట్టి గోకులమందే శ్రీకృష్ణుని జన్మ యనబడెను.

భగవంతు డీ కులమునందవతరించుట నప్పిన్నపిరాట్టిని పెండ్లాడుటకే కావచ్చును. వారు ఏడు సింహముల వలె బలసియున్న యెద్లను ఒక్కసారిగా లొంగదీసుకొన్న వానికే యామె నిచ్చి పెండ్లి చేయ నిశ్చయించుకొనిరి. ఆ వీరుడైనను గోపాలుడే కావలెను. అందుచే నా కులమున కృష్ణుడవతరించెను. పరత్వచిహ్నము లెచ్చట భయపడునో యని వాని నణచిపెట్టుకొనుట కెంత ప్రయాసపడెనో ! చివరకు దైనందినాచారములలో గూడ వారికి తీసిపోరాదని తలను ముంచిన మొలను, మొలను ముంచిన తలను ముంచరాదను వారి యాచారమును గూడ పక్కా గొల్లవాడనిపించు కొనుటకై తలను మొలను కూడ ముంచక మన్నుతో మునిగిన దేహముతోనే తిరుగుచుండెనట!

"పూవి త్తోళువినిల్ పుక్కు పొట్టిదియక్కొన్ద పొన్మేని
కాణ ప్పెరుదు ముకప్పన్ ..........................
..........................................................
నప్పినై్ని కాణిల్ శిరుక్కుమ్"

తల్లి తలంటు కొనుటకై యెంత పిలచినను రాడు. పశువులను కట్టుట, విడచుట మొదలగు పనులకై పశువుల కొట్టములలో దూరును. వెన్న దొంగతనమును కప్పిపుచ్చుటకై దేహమున తుడుచు కొనిన ఆ శరీరకాంతి యిక చెప్పనక్కర లేదు. ఐనను స్నానమాడిన గొల్లతనము భంగపడునేమో యని తల్లి దగ్గరకు చేరడు. ఆమె 'నాకేమి? నప్పిన్న నవ్వును లే, నిన్ను పెండ్లాడదు' అన్నచో లొంగుబాటునకు వచ్చును.

మ ణి వి ళ క్కై - గొప్ప కాంతిగల దీపము.

దీపము మరియొక దీపాపేక్షలేకయే ప్రకాశించును. తనతో సంబంధముగల వస్తువుల నన్ని టిని ప్రకాశింప జేయును. అటులనే శ్రీమన్నారాయణుడును ఇతరాపేక్షలేకయే ప్రకాశించును. "న తత్ర సూర్యో భాతి, న చన్ద్రతారకం, నేమా విద్యుతో భాన్తి, కుతోఽయ మగ్నిః" అని శ్రుతి తెలుపును. ప్రకాశకరములైన యే వస్తువులు గాని నారాయణుని ప్రకాశింపజేయ జాలవు. "తస్య భాసా సర్వ మిదం విభాతి" ఆయన దయతో నిచ్చిన కాంతితో నవియన్నియు నే కొద్దిపాటియో వెలుంగును. కాని భగవంతుడు తనతో సంబంధమున్న ప్రతి వస్తువును ప్రకాశింపజేయును.

గీతలోను తానే స్వయముగా

"యదాదిత్యగతం తేజో । జగద్భాసయతేఽఖిలమ్ ।
యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ । తత్తేజో విద్ధి మామకమ్ ॥"

అని సెలవిచ్చెను.

ఆయర్ కులత్తిల్ మణివిళక్కు -

అనుటచే పరమపదమందుండు నిత్యసూరులు గాని, ముక్తులు గాని పరమపురుషునితో పరమ సామ్యమును పొందినవారగుటచే "నారాయణు డెవ్వ" రని యడిగి తెలుసుకొనునట్లుగా నుండుటచే అచ్చట భగవంతుని తేజస్సు దివాదీపమువలె ప్రకాశమును గోల్పోవును గాబోలు! గొల్లపల్లెలో నైనచో కుడియెడమ లెరుంగని జాతియగుటచే నిచ్చట చీకటిలోని దీపమువలె ప్రకాశించుటచే 'మణివిళక్కు'

అనుచున్నారు. పరమపదము నందైనను ఆయన కల్యాణ గుణములు కొన్ని విషయములు లేకుండుటచే కునుకుచుండును. అవి యథేష్టముగా ప్రకాశించుచుండుట కీ భూమండలమే తగియుండును. ఇది "ఇరుళ్ తరు మాజ్ఞాలమ్" కదా! (అజ్ఞానప్రదమగు విశాల భూమి యిది)

## ఆయర్ కులమ్ -

అనగా దేవతాంతరముల నెరుంగని వంశము. వారు గాని, వారి సొత్తగు పశువులు గాని పారతంత్ర్యమునే గాని స్వాతంత్ర్యము నెరుంగని జాతి జీవులు. సాధనాంతరములు గూడ వారికి లేవు. అందుచే నా జాతి శ్రియఃపతికి మిక్కలి ప్రియమైనది. అందువలననే ఆయన యచ్చట యవతరించినదియును.

## తాయై క్కుడల్ విళక్కంశెయ్ద దామోదరనై -

తల్లి కడుపును ప్రకాశింపజేసిన దామోదరుడు. అది యెట్లనగా శ్రీమధుర కవియాళ్వార్లు

"కణ్ణినుణ్ శిఱు త్తామ్బినాల్ కట్టుణ్ణ ప్పణ్ణియ పెరుమాయన్" యని సాయించిరి. ఆ తల్లి కట్టిన త్రాడు సన్ననై పెక్కు ముడులుగలదిగా నున్నది. ఏలయనగా —

> తజ్జనని లోగిటం గల
> రజ్జుపరంపరల నెల్ల దెచ్చి సుతు గట్టన్
> బొజ్జ తిరిగి రావయ్యెను జ
> గ జ్జాలములున్న బొజ్జ కట్ట న్వశమే.

ఒక త్రాడు తెచ్చి కట్టగా రెండంగుళములు తక్కువయ్యెను. దానికి మరియొకటి, అదియును అంతే. దానికి మరియొకటి, యిట్లు త్రాళ్లన్నీ చేర్చుటచే ముడులధికమయ్యెను. కవ్వపు త్రాళ్లగుటచే అరిగి సన్నగిలెను. చాలకపోవుటచే బిగించి కట్టవలసి వచ్చెను. ఆయన దంత పెద్ద బొజ్జయా? అన్నచో, ఎంత పెద్దది గాకున్న లోకములన్నియు దానిలో నెట్లిముడును? ముడులు, సన్నన, బిగించుట వలన కడుపు నెరదీసెను. అది భక్తులను బాధించును.

> "తచ్ఛావిణా ముదితచాక్షుష నిర్ఝరాణాం
> ఆక్రోశకారణమహో! నితరాం బభూవ"

ఈ చేష్టల తలంచుకొని విజ్ఞులందరును "అహా! బ్రహ్మాది పిపీలికా పర్యంతముగల చేతన వర్గమునంతను కర్మానుగుణముగ బంధించుచు, విడిపించుచు నుండు నీ సృష్టి, స్థితి, లయకారకుని బంధించు భాగ్య మీతల్లి బడసినదే! ఈమె జన్మాంతరమున నెట్టి పుణ్యమును చేసినదో గదా! యని శ్రీకృష్ణుని గనిన తల్లి కడుపును శ్లాఘింతురు. ఈవిధముగ "తాయై కుడల్ విళక్కం శెయ్ద దామోదరు" డితడు. "ఎన్ననోమ్బు నోత్తాళ్ గళో యివనై పెత్త వయిరుడైయాళ్" - అనగా - శ్రీకృష్ణుడు గావించిన లోకాతీత బాల్యక్రీడలవైభవము నంతను విన్నవారందరును "అహా! యీ తల్లి యిట్టి బిడ్డను గన్న గర్భమును కలిగియుండుట కేమి నోమును నోచినదో గదా!" యని పొగడుటచే తనను కన్న కడుపునకు పట్టము గట్టెనని తాత్పర్యము.

ఈ పట్టమును ఆంధ్రభాగవతకర్త యెంత చక్కగ వర్ణించెనో యొకింత అనుభవింతము.

కడుపారన్ చను బాలు త్రావని శిశున్ కంజాక్షి పీఠంబుపై
నిడి పొంగారెడు పాలు డించుటకునై యేగంగ తద్బాలు డె
క్కుడు కోపంబున వాడిరాత దధిమత్కుంభంబు వోగొట్టి, తెం
పెడరన్ కుంభములోని వెన్నతిని మిథ్యా సంకుల ద్బాష్పుడై.

దానిని —

కని, చేతన్ సెలగోల బట్టుకొనుచున్ కానిమ్ము కానిమ్ము రా
తనయా! యెవ్వరియందు జిక్కవడ నే దండంబునుం గాన, నే
ననివారంబును బొంద నే వెరపు నే విభ్రాంతియుంజెంద ము
న్ననియో నీవిటు నన్ను గైకొనమి, నేడారీతి సిద్ధించునే ?

యని తనలో

బాలు డీతం డని భావింతు నందునా
యే పెద్దలును నేర రీ క్రమంబు
వెఱపెఱుంగుటకునై వెఱపింతునందునా
కలిగి లేకొక్కడును గాని లేడు
వెఱపుతో నా బుద్ధి వినిపింతు నందునా
తన దానయై బుద్ధి తప్పకుండు
నొండెఱుంగక యింట నుండెడి నందునా
సొచ్చి చూడని దొక్క చోటులేదు

తన్ను నెవ్వరైన తలపోయ బాఱెడి
యోజలేదు భీతి నొకటి యెఱుగ
డెలమి నూరకుండ డెక్కసక్కెములాడు
పట్టి శాస్తిచేయు భంగియెట్టు ?

అని యాలోచించి పట్టుకొనుటకై వెంబడించగా —

స్తంభాదికంబులు తనకు నడ్డంబైన
నిట్టట్టు జని పట్టనీని వాని
నీ తప్పు పైరింపు మింక దొంగిలి బోవ
నేనని మినుముట్ట నేడ్చువాని
కాటుక నెరయంగ కన్నులు నులుముచు
వెడలు కన్నీటితో వెగచువాని
నే దెస వచ్చునో నిదియని పలుమారు
నురుగుచు క్రీగంట చూచువాని

గూడబారి పట్టుకొని వెఱపించుచు
చిన్న వెన్నదొంగ చిక్కెననుచు
నలగి కొట్ట చేతులాడక పూబోడి
కరుణతోడ బాలు గట్ట దలచె.

దామ్నా చైవోదరే బద్ధ్వా
ప్రత్య బధ్నా దులూఖలే
యది శక్నోషి గచ్ఛ త్వ
మతి చఞ్చలచేష్టిత !

ఒక త్రాటికొనతో కడుపును, వేరొక కొనతో రోటికిని గట్టిగా కట్టి "అల్లరి పిల్లవాడా! చేతనైన యీసారి వెళ్లుము. చూతును" అని గద్దించెను. నిజముగ కట్టినది త్రాటితో కాదు. అదెవ్వరికిని శక్యము కాదు.

"ప్రేమ్ణాఽథ దామపరిణామజుషా బబన్ధ" త్రాడుగా మారిన ప్రేమతో గట్టెనట !

మన బంధము కర్మకృతము. ఆయన బంధము అనుగ్రహకృతము. కర్మలను ప్రాయశ్చిత్తములచే బంధించకుండ చేసికొనవచ్చును. కాని కృపకు ప్రాయశ్చిత్తము లేదు. దాని పని నది చేసి తీరవలసినదే. మన బంధమును మన మెట్లు విప్పుకొనజాలమో భగవంతుడును తన కృపాబంధమును తాను విడిపించుకొన జాలడు. మన బంధ మౌపాధికము. ఆయన బంధము స్వాభావికము. ఆతని బంధమును తలచుకొన్నచో సంసారుల బంధము డుల్లిపోవును. ఈ విషయము నొక కవి చమత్కారముగా వర్ణించెను.

బద్ధం తథా భావయతాం ముకుస్త్వం
నిశ్శేష విశ్లేషిణి భావబన్ధే ।
తపస్విని తత్క్రతునీతి రాద్యా
స్వవ్రీడ మారణ్యకథాసు తస్థౌ ॥

ఉపనిషత్తులలో 'తత్క్రతునీతి' యని యొకటి కలదు. అనగా, "యథాక్రతు రస్మిన్ లోకే పురుషో భవతి, తథేతః ప్రేత్య భవతి" అనగా, పురుషుడీ లోకమున తన జీవనదశలో నెట్టి యుపాసన చేయునో వాడు మరణించి యట్టి ఫలమునే బడయును. కాని ప్రకృతమున "శ్రీకృష్ణః మాత్రా బద్ధః" శ్రీకృష్ణుడు తల్లిచే గట్టబడెను - అని మాటి మాటికి తలంచుకొనుచు పురుషుడు తన్మయుడగుచుండును. అపుడీ నీతి వానిని మరణానంతరము గట్టిగ బంధించుటకై కనిపెట్టుకొని యుండును. కాని యా చేతనునకు ఇట్టి అనుసంధానమువలన పాపరాశియంతయు నిప్పున బడిన దూదివలె భస్మమై పోవుటచే "అత్తతు పత్తెనిల్, ఉత్తతు వీడుయిర్" అనునట్లు వీడు ఏకాయెకిగా అర్చిరాది మార్గముగా పరమపదమున కెగసిపోవును. ఈ నీతి వానిని జూచి "అయ్యో! యిది యేమి అన్యాయమని లబలబలాడును. ఏమిలాభము? అతడు పోయి పరమపదమున పరమపురుషుని యొడిలో కూర్చుండును. అంత నా న్యాయము మిక్కిలి సిగ్గుపడి అరణ్యముల బట్టిపోయెను. అనగా ఉపనిషత్తులలోనే యుండిపోయెను. చూచితిరా! భగవంతునకు ప్రియములైన చేష్టలను తలంచుకొన్నంత మాత్రమున నెట్టి ఫలము కరతలామలకమో !

తూయోమాయ్ వన్దు నామ్ - పవిత్రులమై వచ్చిన మనము.

(ఆ శ్రియఃపతికి మనము తగుదుమో తగమో యని చూడక) ఉన్నవారున్నట్లు వచ్చుటయే తప్ప శరణాగతికి వేరొక పారిశుద్ధ్యమును అన్వేషించుకొను నవసరము లేదు. ద్రౌపది, విభీషణాళ్వాన్, గజేంద్రప్రభృతు లిందుకు దృష్టాంతము "శుద్ధ్యశుద్ధిగళిరణ్డుం తేడవేణ్డా, ఇరున్దపడియే అధికారియా మిత్తనై, ద్రౌపది స్నాత్తైయాయన్దే ప్రపత్తి పణ్ణిత్తు" (శ్రీవచన భూషణం).

శ్రీ రామాయణమున యుద్ధకాండలోని శరణాగతి ఘట్టమున మహారాజు (సుగ్రీవుడు) "మమ చాప్య న్తరా త్మాऽసౌ శుద్ధం వేత్తి విభీషణమ్" అని శ్రీరామునితో "నేను మనస్ఫూర్తిగా విభీషణుని పవిత్రునిగా తలంచుచున్నా" ననెను. ఉన్నవాడున్నట్లుగ వచ్చి శరణువేడుటయే ఆ పారిశుద్ధ్యము. సముద్రమున నొక మునుకనైనను వేసి రాలేదు. "యదహ రేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్" అని నటుల రావణునియందును, లంకయందును, తత్సంబంధులైన బంధువులందరి యందును విరక్తి పుట్టిన వెంటనే ఉన్నవాడున్నట్లుగ శ్రీరాముని దగ్గరకు వచ్చివేసెను. "అన్తరిక్ష గత శ్శ్రీమాన్" అను నటుల ఆతనియందు శ్రీరామచంద్రుని కైంకర్యలక్ష్మి పుష్కలముగ నున్నది.

అర్జునుడు యుద్ధరంగమున చరమ శ్లోకమును విన్నది, స్నానము చేసికాదే! రజస్వలయైన ద్రౌపది శరణాగతి చేసినది స్నానము చేసికాదే! కావున శరణాగతికి శుద్ధినిగాని, అశుద్ధినిగాని సంపాదించుకొన నవసరము లేదు. ఎట్లున్నవారట్లు ప్రపత్తి చేయుటయే ముఖ్యము.

సంసారతాపముచే కలుషితమైన మనస్సు తేరుటకై భగవత్కల్యాణగుణము లున్నవి కాని భగవద్గుణములచే కలుషితమైన హృదయము దేనిచే తేరును? విభీషణుని శుద్ధి శరీరమునం దంతటను చిమ్ముచున్నది.

శబరి శ్రీరామచంద్రునితో "చక్షుషా తవ సౌమ్యేన పూతాస్మి రఘు నన్దన!' 'శ్రీరామా! నీ దర్శనముచే నా ఆగామి, సంచిత పాపరాశి మటుమాయమై నేను పవిత్రురాలనైతిని" అనెను.

తూయోమాయ్ -

గొల్లభామలకు శుద్ధి యనగ నేమి? తలను, మొలను ఒక్కసారి ముంచని జాతిగదా యది యన్నచో విష్ణువుతో సంబంధముగలవారందరును వైష్ణవులే యైనను 'పితా చ రక్షక శ్శేషీ....... ....' యను శ్లోకముష చెప్పినట్లు ఆయనతో గల తొమ్మిది సంబంధములను అంగీకరించి అనుష్ఠించు వారే వైష్ణవు లనబడుదురు.

వన్దు నామ్ - మనము వచ్చి.

నారాయణుడే దిక్కని నమ్మియున్న మనము "నమః" అని యనుసంధించితిమి గాన ఎవరైనను తనను రక్షించుమని ప్రార్థింతురా యని యెదురుచూచుచున్న ఆ శ్రియఃపతియే పరుగు పరుగున వచ్చి గజేంద్రుని రక్షించుటకు వేంచేసి యుండగా మనమే ప్రాప్యత్వరచే వచ్చితిమి. ఆత

డట్లు చేయునా యని సంశయింప పనిలేదు. అరణ్యావాసమున ఋషిపుంగవు లందరును శ్రీరామ చంద్రుని సన్నిధి కేతెంచి తమను రాక్షసబాధలనుండి కాపాడుమని ప్రార్థించగా నాతడు "అయ్యో! సిగ్గు, సిగ్గు. సాధుపరిత్రాణము నా కర్తవ్యము. అందులకే వనవాసమును మహెూదయముగా స్వీక రించి వచ్చితిని. కొద్ది క్షణములు ఆలస్యమగుటచే నా యొద్దకు మీరే వేంచేసి నన్ను సిగ్గుపాటు గావించితిరి. "ఉపస్థేయై రుపస్థితః" మీ సన్నిధికి వచ్చి కష్టముల నారయదగు మహాత్ములు నా దగ్గ రకు వేంచేసిరే" యని లబలబ లాడెను. మరియు తనకు సామంతరాజగు గుహప్పెరుమాళ్లు రెండడు గులు వైచి తన చెంతకు వచ్చినంతనే శ్రీరామచంద్రుడు ఆతనితో

"పద్భ్యా మభిగమాచ్చైవ స్నేహసందర్శనేన చ ।
అర్చితాశ్చైవ హృష్టా శ్చ భవతా సర్వథా వయమ్ ॥"

"నాయనా! గుహా! నడచి వేంచేసితివోయి. స్నేహముట్టి పడునట్లు ఆదరోక్తుల వినిపించితివి. ఆహా! నీవు మమ్ముల లెస్సగా నాదరించితివయ్యా. మా కెంతయో ఆనందమైన" దని సవినయముగా విన్నవించెను.

ఐనచో ప్రపన్నులైన యీ గోపాంగనలు "తత్తస్య సదృశం భవేత్" అని సీతమ్మవలె వేచి యుండవలసియుండగా నిట్లు స్వతంత్రించి రానేల? యన్నచో ఉపాయాధ్యవసాయనిష్ఠ అనగా శ్రియఃపతికి సర్వదేశ, సర్వకాల, సర్వావస్థలయందును సమస్తసేవలు గావించవలెనను తొందర. అది క్రమప్రాప్తిని చూడనీయదు.

తూ మ ల ర్ - పవిత్రములైన పువ్వులను

"మిక్క్రశీర్ తొణ్డరిట్ట పూవుమ్ తుళవముమ్" అధికములగు కల్యాణగుణములు గల భక్తులు భక్తితో సమర్పించిన పువ్వులు, తులసి అని యర్థము. అనగా, వేరొకఫలము నుద్దేశించని పువ్వులని యర్థము.

ఇంతగా నింతకాలము విలపించిన గజేంద్రాళ్వాను తీరా పెరుమాళ్లు పరుగు పరుగున తన చెంతకు వేంచేయగా

"నా హం కళేబరస్యాస్య త్రాణార్థం మధుసూదన ।
కరస్థకమలాన్యేవ పాదయో రర్పితుం తవ॥"

శ్రియఃపతీ! నేను నా శరీరమును కాపాడుకొనుటకై నీకి శ్రమను కల్పించలేదు. నా తొండమునందున్న తామరపువ్వులను వాడకమునుపే నీ పాదములయందు సమర్పించుటకే నిన్ను నేనింతగా పిలచితి" ననెను. ఇవియే పరిశుద్ధములగు పువ్వులు.

మ ల ర్ - పువ్వులను.

తగునా? తగదా? యని విమర్శించక కంటికి కాన్పించిన పువ్వుల నని యర్థము. ఆళ్వార్లు "పురివదువుం పుగై పూవే" శ్రియఃపతికి సమర్పించ దగినది పొగయును, పువ్వును అనిరి. దీనికి వ్యాఖ్యానమున అగరుపొగ, సంపెంగపువ్వు పరిమళము అను నియమము లేదు చెక్కపొగ, గొబ్బి పువ్వు అయినను సరియే. "అవను క్కాగాద పుగైయుం పూవు మిల్లై" అతనికి తగని పొగయు, పూవును లేదని సాయించిరి. అయినచో "న కణ్టకారికా పుష్పం దేవాయ వినివేదయేత్" అనగా, "ముళ్లుగల పుష్పముల నారాయణున కర్పించరాదను నియమ మేల శాస్త్రములలో వినబడుచున్న"దని శ్రీ పరాశర భట్టరువారిని శిష్యులు ప్రశ్నించగా "ఆయనకు తగినదని లేదు. కోయునపుడు భక్తుల కా ముళ్లు చేతిలో గ్రుచ్చికొనినచో వారు సహించలేరని యీ శాస్త్రమును కల్పించి"రని వారు సెలవిచ్చిరి.

తూ వి - చల్లి.

"యథా తథా వాపి సకృత్కృతోఽఞ్జలిః" అని శ్రీ ఆళ్వందార్లు సాయించిన పద్ధతిగా శాస్త్రమును పాటించనవసరము లేదు. భక్తి భారావనతగాత్రులైన మహాత్ములకు శాస్త్రము గాని, క్రమము గాని అవసరము లేదు. మనము శ్రమము నెరుంగని భక్తిపారవశ్యముతో సమర్పించు పదార్థములను ఆ నారాయణుడు అనుభవించు క్రమమును మరచి తినదగినవానిని త్రాగుదుననియు, త్రాగదగిన వానిని తిందుననియు సెలవిచ్చెను. చూడుడు.

"పత్రం పుష్పం ఫలం తోయం। యోమే భక్త్యా ప్రయచ్ఛతి।
తదహం భక్త్యుపహృతం। అశ్నామి ప్రయతాత్మనః॥"

అని గీతాశ్లోకమున ప్రేమ - క్రమమును, మర్యాదను మార్చివేయునని చెప్పబడినది.

ఈ శ్లోకమునకు కొందరొక విలక్షణమైన యర్థమును చెప్పెదురు. అది ముఖ్యముగ నెరుంగ దగిన యర్థమగుటచే దాని నిచ్చట నుటంకించుచున్నాను.

పత్రం — గీత 15వ అధ్యాయమున "ఛన్దాంసి యస్య పర్ణాని"అని యుండుటచే వారివారి శాఖకు సంబంధించిన వేదమును భగవంతునకు భక్తితో వినిపించవలెననియు,

పుష్పం — "అహింసా ప్రథమం పుష్పం । పుష్పమిన్ద్రియనిగ్రహః ।
సర్వభూతదయా పుష్పం । క్షమా పుష్పం విశేషతః ।
జ్ఞానపుష్పం తపః పుష్పం । ధ్యానపుష్పం తథైవ చ ।
సత్య మష్టవిధం పుష్పం । విష్ణోః ప్రీతికరం భవేత్॥"

అను నీ యెనిమిది విధములగు పుష్పముల భగవంతునకు ప్రీతికరముగ సమర్పించవలెను. (అనగా- అయనకు ప్రియమగు నట్లాచరించుటయే)

ఫలం — శాస్త్రోక్తకర్మల నాచరించి "యత్కరోషి" యను శ్లోకమున చెప్పినట్లుగ వాని ఫలమును భగవంతునకు సమర్పించవలెను.

తోయం — భగవత్కల్యాణ గుణాను సంధానముచే కలుగు ప్రేమతో

"అహ్లాదశీత నేత్రామ్బుః పులకీకృత గాత్రవాన్" అనునట్లు నేత్రముల నుండి ఆనందబాష్పముల స్రవింపజేయుటయే.

ఇవియే భగవంతునకు ప్రియములగు పత్రపుష్పాదులు.

దుష్యంతుడంతటి చక్రవర్తి అరణ్యమున "మృగశాబైః కిల వర్ధితో జనః" అని లేళ్లతో కలిసి పెరిగిన శకుంతలతో ప్రేమ పారవశ్యమున

"కిం శీతలైః క్లమవినోదిభి రార్ద్రవాతైః
సంవీజయామి నళినీదళతాళవృంతైః ?
అఙ్కే నిధాయ కరభోరు! యథాసుఖం తే
సంవాహయామి చరణా వుత పద్మతామ్రౌ ॥"

"శకుంతలా! చల్లని తామరాకులతో విసురుమందువా? నీ పాదములను నా యొడి యందుంచుకొని పిసుకుమందువా?" అనెను గదా! ఇందు క్రమమేది? మర్యాదయేది? ప్రేమతో నవి మటుమాయ మయ్యెను గదా!

షోడశ ఉపచారములతో సేవించి

ఇట్లు సేవించుటను అతడు తన కెంతయో బరువు వహించినటుల భావించునట! ఈశావాస్యోపనిషత్తులో "అగ్నే! నయ సుపథా రాయేఽస్మాన్ విశ్వాని దేవవయునాని విద్వాన్ । యుయోధ్యస్మ జ్జుహురాణ మేనో । భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ ॥"

అగ్న్యంతర్యామి! అగ్రేసర! నారాయణా! నన్ను. నా సంబంధులను నీ పాదారవిందము లనెడు ధనమును బడయుటకై మంచి మార్గమున (అర్చిరాది మార్గమున) నడిపింపుము. నీ వన్నియు నెరింగినవాడవు. నాకు పాపములున్నవను సాకు చెప్పి తప్పించుకొని పోకుము. ఆ పాపముల నన్నిం టిని నానుండి పరిహరింపుము. అందుకు నీవేమి చేయుదువందువా? నీవు అధికముగా భావించు 'నమః' అని నోటితో పలుకుదును. దీని నీత డింత ఘనముగా భావించునా? యన్నచో "అవన్ దూరస్థ నానాలుమ్ ఇదు కిట్టి నిన్నుతవుమ్. ద్రౌపది క్కాపత్తిలే పుడలై శరన్దతు తిరునామమిఱే." అనునట్లు ద్రౌపదికి వస్త్రములనిచ్చి మానసంరక్షణగావించినది చాలక "ధ్వస్తా భవన్తు ధార్తరాష్ట్రాః" "ధృత రాష్ట్రుని దుష్పుత్రులందరు నొక్కపెట్టున నశింతురు గాక" యని సంకల్పించి దానిని నిర్వహించు టకై ప్రతిభటాగ్రేసరుడగు అర్జునునకు సారథియై "కొల్లా మాక్కోల్ కొలైశెయ్తు భారతప్పోర్। ఎల్లాచ్చేనైయుం ఇరునిల త్తవిత్త వెన్దాయ్" అనునటుల చంపుటకు సాధనముగాని చుబుకుతో కౌరవ సేనలోని ప్రతిపక్షసైన్యము నంతను దుంపతెంపి. పాండవులకు పట్టము గట్టినను ద్రౌపది ఆపదలో 'గోవిందా' యని పిలచిన పిలుపు చక్రవడ్డితో పెరిగిన ఋణమువలె నా హృదయమును బాయకున్న దని సెలవిచ్చెనట. ఆతనిచే సేవింపబడదగిన గోపికలు సుమండీ ఆతనిని సేవించుచున్నారు.

## వాయినా ఱ్పాడి - నోరారపాడి

"జిహ్వే కీర్తయ కేశవమ్" అనునట్లు తిరునామ సంకీర్తన మొనరింతము. 'వాయినాఱ్పాడి' అనుటచే మనస్పూర కాకున్నను నోటితో నన్ననుచాలును.

విభీషణుడు "త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ' అన్నట్లు అన్నిటని విడచి వచ్చినదే పదివేలు. దానికి పైన "ఉవాచ చ మహాప్రాజ్ఞః। స్వరేణ మహతా మహాన్" గొప్ప బుద్ధిమంతుడును, పూజ్యు డును అయిన ఆ విభీషణుడు ఉచ్చైఃస్వరముతో పలికెను కూడ, దీనినే శ్రీరాముడెంతో మెచ్చుకొనెను, అట్లే మన మాతని చెంతకు చేరుటయే గాక యాతని తిరునామసంకీర్తనమును కూడ చేయుదము.

## మనత్తినాల్ శిన్దిక్క -

"చేతో భజ శ్రీధరం" అన్నట్లు మనస్సును ప్రసాదించినందులకు ప్రయోజనము లభింతము.

"యత్పురుషో మన సాధిగచ్ఛతి యద్ధి మనసాధ్యాయతి తద్వాచా వదతి తత్కర్మణా కరోతి' అను తైత్తిరీయ సూక్తివలె మనస్సుతో ముందాలోచించి, దానినే నోటితో పైకి చెప్పి, చెప్పి నట్లే చేయువాడు సజ్జను డన్నట్లు మనస్సు మూలముగా రాదగిన మాటయును, తదనుగుణముగా

జెయ్యబడు వ్యాపారమునను మర్యాదలేకయే సేవింతము. 'వాయినాళ్ళాడి మనత్తినాల్ శీర్దిక్క' అనునట్లు తమ యింద్రియములు ప్రత్యేకించి యతని యందావహించుచున్న వనుటలో తాత్పర్యము (ఒకదాని ప్రేరేపణవలన నొకటి ప్రవర్తించక ప్రత్యేక ప్రత్యేకమే ప్రవర్తించు ఇంద్రియములు.)

పోయ పిళ్ళైయుం పుగుదరువా నిన్ఱనవుం — సంచిత, ఆగామి పాపములన్నియును

తీయినిల్ తూశాగుమ్ - నిప్పున బడిన దూది యగును.

తూశు అనగా దూది, పటికబెల్లము చూర్ణము గలిపిన పాలు త్రాగినచో పైత్యరోగము తనంతనే శమించునట్లు, భగవదనుభవమును మనము గావింతుమేని నిప్పులో బడిన దూది పింజవలె మన పాపము లన్నియు రూపుమాసిపోవును.

"యథేషీక తూల మగ్నౌ ప్రోతం ప్రదూయేత ఏవం హాస్య సర్వేపాప్మానో ప్రదూయన్తే" ఆ దూది వలెనే ఉపాసన వంటి పాపములన్నియు పోవును.

శెప్పు - అనుసంధింపుము.

చెప్పిన చాలును అది నశించును. పూర్వాఘము లనగా అనాదికాలము నుండియును తెలిసి చేసిన పాపములు.

ఉత్తరాఘములనగా భగవంతుని తత్త్వము నెరింగిన పిమ్మట సహజమైన ప్రకృతివాసనచే ప్రమాదము వలన పుట్టిన పాపములు. చేతను డొకింత అనుకూల్యమును జూపి, అభిముఖ్యమును కనబరచెనా భగవంతుడాతని పూర్వకృత పాపముల నన్నింటిని మరచిపోవును. ముందు రాబోవు ప్రామాదికములగు పాపము లాతనికి గోచరించనే గోచరించవు. ఇంక ననుభవించువారెవ్వరు? శ్రీరాముడు మూడుదినములు ప్రాయోపవేశపడి యున్నను సముద్రుడు కాన్పించనేకాన్పించక అతడు కేచి తీవ్రబాణమును ధనుస్సునందు సంధించగనే సముద్రుడు చేతులు జోడించి వచ్చి ప్రార్థించగా "ఈ బాణము నీ కొరకు కాదు, ఇది నీ శత్రువుల దునుముటకే. వారెవ్వరో చెప్పుము, రూపణగింతును" అనెను.

పుణ్యపాపములన్న భగవంతుని నిగ్రహానుగ్రహములే. "యత్త్వత్ప్రియం తదిహపుణ్య, మపుణ్య మన్యత్ । నాన్యత్తయోః లక్షణ మత్ర జాతు । ధూర్తాయితం యదిహ తావకరాస గోష్ఠ్యాం । తత్కీర్తనం పరమపావన మామనన్తి॥"

భగవంతునకు ప్రియమైనచి పుణ్యము, అప్రియమైనది పాపము. పుణ్యపాపముల కింతకు మించిన లక్షణము లేదు. రాసక్రీడలో గావించిన ధూర్తకృత్యముల నుగ్గడించిన పాపరాశియంతయు పటాపంచలై పోవునట. కాబట్టి శ్రియఃపతి యగు నాతడు "క్షమించితి" ననిన తీరునింతియే.

## — వేదాంతార్థము —

ఈ పాశురమంతయు వేదాంతపరమగుటచే ప్రత్యేకించి దీనికి వేదాంతార్థమును వ్రాయలేదు.

### సందర్భానుసారముగ ననుసంధించుకొన దగిన పాశురములు -

1. "మాయనై" అనుచోట —

పత్తుడై యడియవర్క్కెళియవన్ పిఱర్గళుక్కరియ
విత్తగన్, మలర్ మగళ్ విరుమ్బు నమరుమ్బెఱలడిగళ్
మత్తుఱు కడై వెణ్ణెయ్ కళవినిలురవిడై యాప్పుణ్డు
ఎత్తిఱమురలినో డిణైన్దిరున్దేజ్గియ వెళివే.

(తిరువాయ్మొళ్ళి 1-3-1)

సర్వేశ్వరుడు భక్తులకు సేవించుటకు సులభుడు. అది లేనివారికి దుర్లభుడు. లక్ష్మీదేవి కూడ ఆశపడదగిన స్వభావముకలవాడు. అతని తల్లి కష్టపడి చిలికిన వెన్నను దొంగిలించు ప్రయత్నములోనే పట్టుబడి రొమ్మున త్రాటితో రోటికి కట్టబడి వెక్కివెక్కి యేడ్చిన సౌలభ్యమెంత యాశ్చర్యకరమైనదో! అనుచున్నారు. భగవంతుని పరత్వము వర్ణించుట కది "యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ" అనునట్లు అది మన శక్తికి మించినది. సౌలభ్యము నైనను వర్ణింతమని ఆళ్వార్లు ఈ పాశురమున సౌలభ్యమును వర్ణించుటకు ప్రారంభించి అదియును పరత్వమువంటిదే యగుటచే దీనిని ప్రసంగించి వారు ఆరు మాసములు మూర్ఛపడియుండిరి. అందుచే ఆళ్వార్లు దానినే 'మాయనై' అనుచున్నారు, కావుననే ఈ పాశురమును 'ఎత్తిఱమ్' అని ఆశ్చర్యముతో ముగించిరి.

2. మన్ను వడమదురై అనుచోట అనుసంధించవలసినది

శాతు శనత్తై నలియుమ్ కణ్ణనై చ్చాదిప్పతుక్క
ఆదియ జ్జోదియురువై యజ్గువైత్తిజ్గు ప్పిఱన్ద
వేదముదల్వనై ప్పాడి వీదిగళ్ దోఱు మ్తుళ్ళాదార్
ఓదియుణర్న్దవర్మున్నా వెన్శవిప్పార్ మనిశరే.

తిరువాయ్మొళ్ళి (3-5-5)

భగవద్గీత 4వ అధ్యాయమున శ్రీకృష్ణుని అవతార రహస్యము నెరుగగోరి అర్జునుడు, "మేము, నీకున్నట్లే అపహతపాప్మత్వా ద్యప్రాకృత గుణములు సహజముగ నున్నను, మా కర్మవశమున వానిని విడచి పుట్టుచున్నట్లే, నీవును నీ అజత్వ, అవ్యయత్వ, సర్వేశ్వరత్వాది సహజగుణములను విడచి యవతరింతువా? లేక, వానితోనే యవతరింతువా?" అని యడుగగా, "అజోఽపి సన్నవ్యయాత్మా" అను నాలుగవ శ్లోకములో "నేను పారమేశ్వర స్వభావమును విడువకనే యవతరింతు"నని సెలవిచ్చిన యభిప్రాయమునే అళ్వార్లిందు క్రోడీకరించుచున్నారు.

సజ్జనులను బాధించుచున్న కంసుని సాధించుటకై ఆ పరమపదమునందున్న అప్రాకృత తేజోమయమగు దివ్యమంగళ విగ్రహమును ధరించియే యిచ్చట నవతరించిన వేదైకవేద్యుడగు నారాయణుని గానము చేసి వీధివీధిగ నాడనివారు మనుష్యులేనా? యనుచున్నారు.

3. 'మైన్దనై' అనుచోట

తన్దై కాలిల్ పెరువిలఙ్గు తాళవిழ, నళ్లిరిట్కణ్ వన్ద
ఎన్దై పెరుమానార్ మరువినిన్ద వూర్ పోలుమ్,
మున్ది వానమ్మళై పొళియు మ్మావా వురువిల్మళై యాళర్
అన్ది మూన్దు మనలోమ్బు మణియార్ వీదియళున్దూరే,

పెరియతిరుమొழి (7-5-1)

తన తండ్రియగు వసుదేవునకు కంసుడు తగిలించిన సంకెలలు తమంతనే తెగిపోవునటుల చిమ్మచీకటిలో వేంచేసిన, గోకులమునకు తానే ప్రాప్యభూతుడనునట్లు అచ్చటివారందరును నిత్యాగ్ని హోత్రనిష్ఠులై త్రిసంధ్యలయందును నిత్యానుష్ఠానమును గావించుచుందురు. వారు కోరకున్నను ఆ కర్మలకానుషంగిక ఫలముగ అవసరమగు వర్షములు కురియును.

4. తాయైక్కుడల్ విళక్కంశెయ్త — అన్నచోట

...................... ఉన్నైక్కణ్డార్
ఎన్ననోన్బు నోత్తాళ్ గొలో ఇవనై పెత్త వయిఱుడైయాళ్
ఎన్నుమ్ వార్త్తై యెయ్దువిత్త ఇరుడీకేశా! ములై యుణాయే.

(పెరియాళ్వార్ తిరుమొழి 2-2-6)

శ్రీ విల్లిబుత్తూరులో వేంచేసియున్న స్వామీ! నిన్ను చూచినవారందరి ముఖముల నుండియు "ఈ బిడ్డను గన్న తల్లి యేమి నోము నోచినదో గదా! యని నన్ను లోకులు పొగడునట్లుగా జేసిన ఋషీకేశా! పాలు త్రాగుము.

## ఆరవ పాశురము

# "పుళ్ళుం శిలమ్బినగాణ్"

### — అవతారిక —

మొదటి పాశురమున భగవంతునితో కలసియుండుటయే ప్రాప్యము. దానికి సాధనమును అతడే, ఇచ్చట నొక శంక యుదయించుచున్నది. లోకమున నంతటను సాధ్యము వేరుగను దానిని సాధించు సాధనము వేరుగను నుండగా నిచ్చట రెండును ఒక్కడే యనుచున్నారేమి? యని. దీనికొక లౌకికమగు నుదాహరణ కలదు. చంటిబిడ్డను క్రింద ప్రక్కపై పరుండబెట్టి తల్లి యెత్తైన మంచమున కూర్చొని యుండును. బిడ్డ మేల్కొని యామె యొడిలో కూర్చొనవలెనని యేడ్చుట కారంభించును. అంత నా తల్లి క్రిందికి దిగివచ్చి యా బిడ్డ నెత్తుకొని మంచముపై తన యొడిలో కూర్చుండ బెట్టుకొనును. ఇచ్చట తల్లియొడి సాధ్యమును, ఆ తల్లి యే సాధనమును కాలేదా? అటులనే నారాయణుడే సాధ్యము, సాధనము నగుటలో నాక్షేపణ మేమున్నది? ఇట్టి సాధనములో అన్వయించు నధికారులున్ను ఆ ఫలమునందు కోరిక కలవారే యని సాధ్యస్వరూపమునున్ను. నారాయణుడే సాధనమని సాధనస్వరూపమునున్ను తెలిపిరి.

రెండవ పాశురమున ఫలము, సాధనము రెండును భగవంతుడే యని యుండు ఇచ్ఛాధికారులకు ఇచ్ఛామాత్రమే అధికారి లక్షణము. కర్మలను చేయుటకై యేర్పడిన కర్మేంద్రియములకు చేయవలసిన కృత్యములను చూపి ప్రవేశపెట్టవలసి యున్నది గాన కాలమును గడపుటకు రుచిచే ప్రేరేపించబడి చేయదగిన పనులు చెప్పబడినవి.

మూడవ పాశురమున భగవంతు ననుభవించుటకు తోడైనవారిపట్ల వారికి కావలసిన సమృద్ధులన్నియు తెలుపబడినవి.

నాల్గవ పాశురమున ఇతర దేవతల అపేక్ష యెంత మాత్రమును లేక భగవదనుభవములో దిగినవారికి ఇతర దేవతలును వచ్చి కైంకర్యము చేయుదురను విషయము చెప్పబడినది.

అయిదవ పాశురములో భగవదనుభవము నందవగాహించిన వారికి తటస్థించు అనుభవ విరోధులను ఆ యనుభవమే పోగొట్టు నని చెప్పబడినది.

ఇట్లు క్రింది అయిదు పాశురములచే ప్రాప్యమగు శ్రీకృష్ణానుభవమునకు ముఖ్యమైన అసాధారణ పరికరముల జెప్పి, పిమ్మట ముందు పది పాశురములతో ఆ సాధనముల పరిగ్రహించి అనుభవించు వారిని లేపుచున్నారు.

ఇది బ్రాహ్మముహూర్త జాగరణము. ఇది మిక్కిలి ప్రేమగలవారు చేయు కృత్యము. వేయి మంది తల్లిదండ్రుల కన్నను మన హితమును కోరు వేదమాత యీ పనిని చేయుచున్నది. సాత్త్విక సమయమగు బ్రాహ్మముహూర్తమును నిద్రతో గడుపరాదని సూచింప బడుచున్నది. ఆ యుపనిషత్తు "ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్య వరా న్నిబోధత" అనుచున్నది. అది సత్త్వగుణ ముద్రేకించియుండు మంచి సమయమగుటచే దీనిని వ్యర్థపరచకుడు. "జాగరూకులు కండు. మేల్కొనుడు," శ్రేష్ఠులగు సదాచార్యుల సన్నిధికేగుడు. వారినుండి సదర్థములను విని యాచరించి తరించుడని మనకు బోధించుచున్నది ఇట్లే ఆళ్వారులును పెరుమాళ్లను జగద్రక్షణకై ప్రార్థించి లేపిరి. తిరుప్పళ్లి యెళుచ్చితో శ్రీతొండరడిప్పొడియాళ్వార్లు శ్రీరంగనాథుని లేపిరి గదా! శ్రీ విశ్వామిత్రమహర్షి శ్రీ చక్రవర్తి తిరుమగన్ (శ్రీరామచంద్రు) ని

"కౌసల్యాసుప్రజారామ! పూర్వాసన్ధ్యా ప్రవర్తతే।
ఉత్తిష్ఠ నరశార్దూల! కర్తవ్యం దైవమాహ్నికమ్॥"

అని ప్రేమ యుట్టిపడు మధురోక్తులతో లేపిన శ్లోకము మనకు నిత్యాను సంధేయమైనది. ఇప్పటికిని ఆ శ్లోకముతోనే మన తిరువారాధనలోని యర్చామూర్తిని లేపి ఆరాధన సమర్పించు చున్నాము.

మహారాజులు జీతము లిచ్చి తమను లేపుటకు వందిమాగధులను పెట్టుకొని ప్రతి దినము వారిచే వీణావినాయిద్య విశేషములచే లేపబడుచుందురు. అట్టి తరి మన నీ పక్షులు నిర్వ్యాజప్రేమతో "మేలుకొనుడు, భగవత్సుప్రభాతము ననుసంధించుడు ప్రాతర్నిత్యాను సంధేయమును విన్నవింపుడు. అర్చిరాది మార్గచింతనను గావించు" డని మృదు మధుర స్వనములతో వేయి తల్లుల కన్న ప్రియముగ లేపుచున్నవి. "నమః పక్షిభ్యః పరమదయాళుభ్యః".

వేదాంతపరమగు నర్థములోనివి కేవలము పక్షులు గావు. పక్షులు రెండు రెక్కలతో నాకసమున సంచరించునట్లుల జ్ఞానానుష్ఠానములతో పరమాత్మ ననుభవించుచున్న ఆచార్యుల పిలుపులివి. వీరు కృపా మాత్రప్రసన్నాచార్యులు గదా! వీరు అనువృత్తి ప్రసన్నాచార్యులు కారు. పక్షులకు లేపుడని యెవరాదేశించిరి? వేదాంత పరమగు నర్థములో జానశ్రుతి యను మహారాజును ఆత్మవిద్యకై ప్రేరేపించి రైక్వమహర్షి సన్నిధికి పంపించిన పక్షుల వృత్తాంతము నిచ్చట ననుసంధించవలెను. ఇట్టి ఆచార్యవిషయక కృతజ్ఞతతో ప్రారంభింపబడిన యీ పాశుర మెంత ముఖ్యమైనదో గదా!

## ఆరవ పాశురము

పుళ్లుం శిలమ్బినగాణ్ పుళ్లరైయిన్ కోయిలిల్,
వెళ్ళై విళిశజ్గిన్ పేరరవం కేట్టిలైయో,
పిళ్లాయ్! ఎళున్దిరాయ్ పేయ్ములై నఞ్జుణ్డు,
కళ్ళచ్చగడం కలక్కళియ కాలోచ్చి,
వెళ్లత్తరవిల్ తుయిలమర్న్ద విత్తినై,
ఉళ్ళత్తుక్కొణ్డు మునివర్గళుం యోగిగళుమ్
మెళ్ల యెళున్దు అరి యన్ద పేరరవమ్
ఉళ్ళం పుగున్దు కుళిర్న్దేలో రెమ్బావాయ్.

### — తాత్పర్యము —

పక్షులు మేల్కొని మేతకై యొకటి మరియొక దానిని లేపుటకై కూయుచు పోవుచున్నవి. పక్షులకు రాజైన గరుడునకు ప్రభువైన నారాయణుని కోవెలలోని కైంకర్యపరులను పిలుచు తెల్లని శంఖముల యొక్క గొప్పధ్వని నీ చెవులను పడలేదా? భగవద్విషయమున నూతనముగా ప్రవేశించిన దాని వగుటచే భాగవత విషయము చరమావధియని యెరుంగని చిన్నదానా! లేచిరమ్ము. పూతనయొక్క విషమిశ్రమైన చనుబాలను త్రాగినవాడును, వంచనచే చంపనేతెంచిన రాక్షసావేశము గల శకటమును ఆకలిమంటచే నైన కోపముచే కాళ్లను కొట్టుకొనుటలో బండికి తాకించి విరచి ముక్కలు చేసిన వాడును, పాలసముద్రమున శేషతల్పమున పవళించి నిద్రించుచున్న నారాయణుని యోగులును, మునులును మనస్సున నిడుకొని మెల్లగ లేచి "హరి! హరి!" యని వేయు పెద్దకేకలు మా హృదయము లలో ప్రవేశించి చల్లబరచి వణికించినవి. నీ వెట్లు కదలక మెదలక పరుండియున్నావు? లేచిరమ్ము.

పుళ్లుమ్ శిలమ్బినగాణ్ - పక్షులు అరచుచున్నవి.

ఈ గోపికలు వేకువనే వారి యిండ్లకు వెళ్లి లేపదగినదిగా సంకల్పించుకొని "తెల్లవారినను పరుండి నిద్రించుటయేనా?" యని పెద్దలు నిందించినట్లు నిందించగా "లేచుటకు తెల్లవారవలదా?" యని లోనున్న గోపిక యడుగగా పైనున్న వారు తెల్లవారిన దనుటకు గుర్తులను చెప్పుచున్నారు.

## పుళ్లరైయిన్ కోయిలిల్ -

పుళ్ = గరుడాళ్వారు. ఆయనకు 'అరై' నిర్వాహకుడైన 'కో' రాజగు నారాయణుని యొక్క 'ఇల్' భవనము. లేక, పుళ్ = పక్షులు, వానికి 'అరై' రాజైన గరుడాళ్వారు. ఆయనకు 'కో' రాజగు నారాయణుని యొక్క, ఇల్ = భవనము

గరుడాళ్వార్లను పక్షులకు రాజనియు, శ్రీమన్నారాయణునకు నిరూపకుడనియు ప్రశంసించుచున్నారు. పెరుమాళ్లు, శ్రియఃపతి యనియు, లక్ష్మీనారాయణులనియు, సీతాపతి యనియు, గరుడధ్వజుడనియు, లక్ష్మణపూర్వజుడనియు తనకు ప్రియతములనే తనకు నిరూపకులనుగా ముందిడుకొని, ఆ శబ్దములచే తనను పిలుచువారిని కరుణాకటాక్షములతో వీక్షించును. పెరుమాళ్ల నొక్క క్షణములో భక్తుల సన్నిధికి వేంచేపు చేయుటలోను, విరోధులను చీల్చి చెండాడుటలోను గరుడుడు అగ్రేసరుడు గదా! అటులనే శ్రీరామాయణమున చక్రవర్తి తిరుమగన్ రెండు పక్షులను తనకంటె గొప్పవారని ప్రశంసించెను. గుహుడు నావపై సీతారామలక్ష్మణులను గంగను దాటించిన పిమ్మట వారు గుహ, సుమంతులకు సెలవిచ్చి రాత్రికి అరణ్యమున నొక చెట్టు క్రింద చేరిరి. అపుడు శ్రీరామచంద్రుడు రాతి నేలపై పర్ణశయ్యపై నిద్రపట్టక శ్రీ లక్ష్మణునితో కాలక్షేపమునకై ప్రసంగించు సందర్భమున

"మన్యే ప్రీతివిశిష్టా సా మత్తో లక్ష్మణ! శారికా ।
యస్యా స్తచ్ఛ్రూయతే వాక్యం శుక! పాద మరే ర్దశ॥"

"లక్ష్మణా! మన అమ్మగారు పెంచుచున్న చిలకాగోరింకల నెరుంగుదువు గదా! ఆ గోరింకకు మన అమ్మ మీద నెంత ప్రేమ యనుకొంటివి! అందులో అరవీసమైనను నాకు లేదు గదా! ఆమె యంత బాధపడుచుండగా ఆమె ప్రీతికై యొక్క మాటనైనను పలుకనైతిని. ఆ గోరువంక చూడుము. ఒకనాడు నేను అమ్మగారింట నుండగా నీ పక్షులున్న ప్రదేశమున కొక పిల్లి వచ్చెను. దానిని చూచి యీ గోరువంక చిలకతో "ఓ చిలుకా! ఆ శత్రువు కాలు కొరుకు, కొరుకు" అనుచున్నది. ఆ మాట అమ్మ కెంతయో ఆనందము కలిగించినది. అమ్మ ఆ గోరువంకకు దాడిమీరసమును త్రాగించెను, మనకంటె దానికి అమ్మపై ప్రేమ యెంత అధికమో చూడుము" అనెను.

ఇది యుత్తమ కావ్యమగుటచే ధ్వన్యర్థము ప్రధానము.

శ్రీరామచంద్రుడు సీతాలక్ష్మణులతో అయోధ్యను విడచి, గంగను దాటి, అరణ్యమున నొక చెట్టు క్రిందికి చేరెను. తనను తలంచుకొని విలపించుచున్న ప్రజలు జ్ఞాపకమునకు వచ్చిరి. తాను వారి కేమియు ఆనందము కలుగజేయ లేకపోవుటయే గాక దుఃఖమును కలిగించితినని సీతాలక్ష్మణులతో విచారించుచున్నాడు. శ్రియఃపతి అయోధ్యను (వైకుంఠమును) విడచి పిరాట్టి, అనంతులతో గంగను (విరజానదిని) దాటి అరణ్యమున (సంసారారణ్యమున) ప్రవేశించి "ద్వాసుపర్ణా సయుజౌ సఖాయౌ । సమానం వృక్షం పరిషస్వజాతే" అనునట్లు లక్ష్మీనారాయణులను - జీవస్థానమగు లక్ష్మణస్వామితో నొక చెట్టుక్రింద జేరిరి. తమ దుఃఖములను బాపుమని యేడ్చుచున్న సంసారిచేతనుల కేమియు దుఃఖశాంతి చేయలేకపోతినని విచారించి 'నాకన్న వారికి పంచసంస్కారములను ప్రసాదించి, మంత్ర మంత్రార్థములను బోధించి, అర్చిరాధిమార్గము నెరింగించి, ఆ మార్గము లభించు నుపాయము నెరింగించి, వారికి సంసారవర్ధకములైన అహంకార, మమకారములను పోగొట్టి వారిని తన దరికి చేర్చుకొనుమని పరమపురుషుని ప్రార్థింతురు గాన భగవంతుని కన్న వారే (ఆచార్యులే) ప్రజలపై మిక్కిలి ప్రేమగలవారను నీ యర్థము నీ శ్లోకము సూచించుచున్నది.

హే శుక! = పరమాత్మకు చిలుకతో సామ్యముండుటచే భగవంతుని చిలుకతో పోల్చుచు. అందుచే ఓ చిలుకా = ఓ శ్రియఃపతీ!, అరేః = సంసారిచేతనులకు ప్రబలశత్రువైన అవిద్యయొక్క, పాదం=ఆధారములగు అహంకార, మమకారములను, దశ = కరచివేయుము. వానిని పోగొట్టి వారిని నీ సన్నిధికి చేర్చుకొనుము. (అని) "యస్యాః తచ్ఛ్రూయతే వాక్యం" = ఆచార్యముఖతః ఇట్టి వాక్యములు వినవచ్చుచున్నవి.

"కాలత్రయేఽపి కరణత్రయనిర్మితాతి
పాపక్రియస్య శరణం భవగవత్ క్షమైవ ।
సా చ త్వయైవ కమలారమణేఽర్థితా యత్
క్షమ స్సఏవహి యతీన్ద్ర! భవచ్ఛ్రితానామ్ ॥"

మనము సర్వకాల సర్వావస్థలలో విడువక చేయుచున్న పాపములు ఎన్నో ప్రాయశ్చిత్తములు గావించిన గాని, ఎన్నో కష్టముల ననుభవించిన గాని తీరునవి గావు. అవి తరుగవలెననిన భగవత్కృప యొక్కటియే కావలెను. ఆ దయను మనయందు చూపుమని ఆచార్యులగు ఉడైయవరులే శ్రియఃపతిని అంజలి ముద్రచే ప్రార్థించుచున్నారు. అదియే మనకు శ్రేయస్కరమని శ్రీమద్వరవరమునులు యతిరాజ వింశతిలో సాయించిరి.

ఇటులనే విభీషణశరణాగతి షట్టములో శ్రీరాముడు కపోతోపాఖ్యానమును వినిపించి తన కన్నను ఆ కపోతము మేలనెను. అది తన భార్యను చంపిన కిరాతుడు తానున్న చెట్టు క్రిందకు ఆపన్నుడై వచ్చెనని దయతో తానగ్నిలో పడి వాని కాహారమయ్యెనే! విభీషణుడన్ననో భార్య నపహ రించినవాడు కాడు. వానికి తమ్ముడు. "రాఘవం శరణం గతః" అని ఉచ్చైఃస్వరముతో నరచుచు రక్షించునని పరిపూర్ణవిశ్వాసముతో వచ్చినవానిని రక్షించకపోయిన నా కెంత యపకీర్తి! ఆ పక్షి యా కిరాతునకు గావించిన యుపకారములో నేను చేయునది యెంత యని నొచ్చుకొనెను.

ఇట్టి గంభీరములైన భావముల నన్నిటిని గర్భమున నిడుకొని అండాళ్ తల్లి యీ పాశుర ప్రారంభమున 'పుళ్లుం శిలమ్బిన గాణ్' అనుట యెంత భావగర్భితమో యాలోచింపుడు.

## పుళ్లరైయన్ కోయిలిల్ —

శ్రీకృష్ణుని సౌలభ్యము బ్రహ్మ రుద్రేంద్రాదులనే "ఈతడు పరాత్పరుడా" యని భ్రమింప జేయుచుండ నిక అమాయికపు నిరక్షరకుక్షులగు గోపాంగనల విషయమై చెప్పనేల? అందుచే శ్రీకృష్ణుడు సర్వరక్షకుడైన నారాయణు డని యెరుంగక యాతనియందలి ప్రేమచే "స్నేహః పాప మాశఙ్కతే" యనునట్లు ఆయన కెప్పు డేమి యాపద తటస్థించునో యని యింటింటా తమ కభీష్టము లగు భగవంతుని చిత్రముల పెట్టుకొని పూజించుచుండిరట! ఒక ముదుసలి గోపాంగన గోడ కింత పసుపు రాసి, కుంకుమ నద్ది దేవుడని భావించి పూజించుచుండెను. ఒక యేకాదశినా డామె నివేదనకై యింత వెన్నముద్ద నా దేవునిముందుంచి

"నిమీలి తాక్షి నిజదేవతాయై । నివేద్య భక్ష్యం వివృతేక్షణా సా ।
తత్తత్ర నాపైక్షత చిత్రమేతత్ । అదృశ్యతాస్యే బహిరఙ్గణేఽస్య ॥"

కన్నులు మూసికొని "ఓ నా గోడదేవుడా! కడుపార నారగించు దేవుడా" యని చాలసేపు కన్నులు తెరవకనే యుండెను. ఇంతలో నా నాయన సాక్షాత్తుగా వచ్చి యా వెన్నముద్దను దొంగిలించి యింత నోట, ఇంత చేత నుంచుకొని యామెయొక్క గుమ్మములోనే నిలచెను, ఇంతలో నామె కన్నులు తెరచి వెన్నముద్దను గానక "ఓ నా తండ్రీ! నా తండ్రీ! అంతా తిన్నావా? నా భాగ్యం, నా భాగ్యం, ఏనుగు తిన్న వెలక్కాయ జీర్ణం, మాదేవుడు తిన్న వెన్నముద్ద జీర్ణం అని తాను చరితార్థు రాలైనట్లు భావించి యీ వింత నందరకు చెప్పుటకు బైటకు రాగా నీ దేవుడు వెన్నముద్ద నోటితో ప్రత్యక్షమయ్యెనట! అమ్మదొంగ! నీవా యీ పని చేసినది? నా గోడ దేవుడను కొన్నాను" అనగా నాతడు అది యామె యనన్య దైవత్వభావనకు భంగమని శిక్షింపదలంచి,

"వేలుపు లటె నాకంటెను
వేలుపు మఱి యెవ్వడనుచు వికవిక నగి మా
వేలుపుల గోడలపై నో
హేలావతి! నీ తనూజు డెంగిలచేసెన్"

అనుచు నింతయుమిసి పారిపోయెను. చూచితిరా! ఇంటింట గోడదేవుళ్లు. శ్రీకృష్ణు డితర దేవతలపూజను సహించడు.

## పుళ్ళరైయన్ కోయిలిల్ -

1) పుళ్ = పక్షులు, (వానికి) అరైయన్ = రాజైన గరుడుడు (అయనకు) కో=రాజైన భగవంతుడు.

— లేక —

2) పుళ్ళరైయన్ = గరుత్మంతునకు, కో = రాజైన హరియొక్క, ఇల్ = కోవెలలో

ఇచ్చట గరుడాళ్వార్లను పొగడుచున్నారు. ఏలయనగా శ్రియఃపతని భక్తుల దాపునకు చేర్చు వాడుకనుక (ఆచార్యులు) ఆళ్వార్లు "పుళ్ళిన్ పిన్ పోన తని నెఞ్జమే" "గరుత్మంతుని వెన్నంటిపోవు అద్వితీయమైన మనస్సా!" అని సాయించిరి. నాయకుని కన్న ఘటకులే (ఆచార్యులే) ప్రధానులు.

ఈ పాశురములో తెల్లవారినదనుట కిది మొదటి గుర్తు.

## వెళ్లైవిళిశఙ్గిన్ పేరరవమ్ కేట్టిలైయో -

ఇది రెండవగుర్తు.

తెల్లవారుటను మూడు హేతువులతో సాధించుచున్నారు. మొదటిది - ఇయ్యది (పక్షము) తెల్లవారు సమయము (సాధ్యము) వెళ్లై విళిశఙ్గిన్ పేరరవమ్ కేట్ట ప్పడుకైయాలే = తెల్లని శంఖధ్వని పిలుపు వినబడుచున్నది కావున.

ఎప్పుడెప్పుడు తెల్లని శంఖ ధ్వని పిలుపు వినబడుచున్నదో అప్పుడప్పు డెల్లను తెల్లవారుచుం డును. ఇది మన అనుభవమే (వ్యాప్తి జ్ఞానము)

ఇట్లు బైటనున్న గోపికలు అనుమానరచనతో తెల్లవారుటను సాధించిరి. రెండవ పక్షమువారు అనగా, లోపలి గోపిక యీ హేతువునందు దోషమును జూపి త్రోసిపుచ్చుచున్నది. ఈమె మంచి న్యాయశాస్త్రనిపుణురాలు.

హేతుకుక్షిలోని విశేషణములు దోషవారకములుగా నుండవలెను. లేనిచో నది వ్యర్థవిశేషణ మగుటచే వాగాడంబరమే కాని ప్రయోజనముండదు. ఇచ్చట శంఖమునకు 'తెలుపు' విశేషణమున కేమి ప్రయోజనము? కావున నిందు 'వ్యర్థవిషణ' దోష మొకటి కలదు. మరియు, వ్యభిచారదోష మొకటి కలదు. తెల్లవారు సమయము కాకున్నను వంతుదారులను లేపుటకు మధ్యరాత్రియందును శంఖ మూదబడును గాన సాధ్యము లేనిచోట (తెల్లవారు సమయము కాకుండుట) హేతువుండుటచే నిదివ్యభిచార దోషము కలదగును. మూడవ దోషము సాధ్యాప్రసిద్ధి. అందరి అనుభవములో నున్నది సాఖ్యము కావలెను. కాంచన మయాగ్నిని సాధించునట్లు ఇచ్చట సాధ్యాప్రసిద్ధిదోషము కలదు. ఏమనగా, ఆ ధ్వని నాకు వినిపించుట లేదే? ఇట్లందరికిని వినిపించనిది సాధ్య మెట్లగును?

మరియును, దూరపుకొండపై మేఘము దిగినది. అది యొకరికి పొగవలె కాన్పించుచున్నది. దానిచే 'కొండపై నిప్పున్న' దన్నట్లున్నది నీ తెలివి! శంఖధ్వనియు లేదు, ఏమియు లేదు పొండు. అదీ తప్పే అని యీ విధముగ పైనున్న గోపికల అనుమాన రచనను నాలుగు దోషములు చూపి నిషేధించి కప్పుకొని పరున్నది.

పిళ్లాయ్ - అజ్ఞురాలా!

ఏల? భగవద్విషయములో అవగాహించుట కవధి భాగవత సంశ్లేషము. అంతవరకు పోక భగవంతునియందే ఆగిపోయియుండుట అజ్ఞానమే, ఆమాటను విని యామె యూరకున్నదా? "ఏమను చున్నారు? మీ కంఠధ్వనినే ధారకముగా వినుచున్న నన్ను అజ్ఞురాలనుచున్న మీరా అజ్ఞులు, నేనా?" అని యన్నది యామె. ఈ మాటను పడి వారూరకుందురా?

బైటి గోపికలు - అమ్మా! విని యూరకుండుటయేనా కర్తవ్యము? "అడియార్గళ్ దమ్ కూట్టమ్ కణ్డిడక్కూడుమేల్" (భాగవత గోష్ఠిని కనులార సేవించు భాగ్యము నా కబ్బినచో) అనియు, "అడియార్గళ్ కుళాజ్గళై యుడన్ కూడువ తెన్ఱు కోలో" (భాగవత గోష్ఠిలో నన్వయించు రోజులు నాకెన్నడో) అనియు, "పేరాళన్ పేరోదుమ్ పెరియోరై యొరు కాలమ్ పిరిగి లేన్" (పరమపురుషుని తిరునామ సంకీర్తనమును చేయు పెద్దలను ఒక్క క్షణమైనను ఎడబాయలేను) అనియుగదా మన పెద్దలాశపడిరి.

శ్రీభట్టరు "కృష్ణసంశ్లేషలో క్రొత్తవారే లేరు" అని సాయించిరి. పెద్దల నొక్కతియైనను చూచి జంకినదా? కనులున్న గదా చూచుటకు! మరి యవి యేమైనవి? "యయౌ చ కాచిత్ ప్రేమాన్ధా" ప్రేమ కన్నులను మూసివైచి దృష్టిని అడ్డివేసినదట. ఇక ఆమె కెవ్వరు కాన్పింతురు? మరి యామె కృష్ణు నెట్లు చేరినది? ఆ ప్రేమయే యామె నచ్చట చేర్చినది. పైవారెవ్వరైనా "దారిలో పెద్దలున్నారే" అందురా అవెంటనే ఆమె "గురవః కిం కరిష్యన్తి దగ్ధానాం విరహాగ్నినా" అనగా "వారొక్క కుండెడు నీటినైనను పోసి నా విరహాగ్నిని చల్లార్తురా? నాకు దారియైన చూపుదురా? ఉన్నచో నుండనిమ్ము" అనును.

పి ళ్లా య్ - అజ్జులారా!

ఇచ్చ బైటనున్న గోపికలకును, లోపలి గోపికకును పెద్ద వాద మారంభమైనది. వినుడు.

బైటి గోపికలు — పిళ్లాయ్! ఎళున్దిరాయ్ = అజ్జులారా! లేచిరా.

లోపలి గోపిక — నాకేమి పిచ్చి. మీరే పిచ్చివారు.

బై. గో. — ఏమి పిచ్చియా? భగవద్విషయమున భక్తియనగా నది భాగవత పర్యంత ముండవలెను. అట్లుగాక నీ భక్తి శ్రీకృష్ణసంశ్లేషములోనే కూర్చున్నది. తెలిసినదా?

లో. గో. — నా భక్తి యంతవరకే యని మీ కెవ్వరు చెప్పిరి? మీ వాఙ్మాధుర్యమును చెవులతో త్రాగి అదియే ధారకముగా పరుండి అనుసంధించుకొనుచు ఆనందనిర్భరనై యున్న నన్ను మీరు 'పిచ్చిదానా' అనుచున్నారే. ఎవరికి పిచ్చి? చెప్పుడు.

బై. గో. — అదిగో! అదే పిచ్చి. భాగవతుల భాషణలను విని పడుకునే వుంటావా? "అడియార్ కళ్ దమ్ ఈట్టమ్ కణ్డిడ కూ్కడు మేల్" అన్నట్లు ఆగోష్ఠిని సేవించడానికి చటుక్కున బైటికి రావద్దా? మన ఆళ్వార్లు "పొలిగ పొలిగ పొలిగ" అని శ్రీవైష్ణవగోష్ఠికి మంగళాశాసనం చేసి "కణ్డోమ్, కణ్డోమ్, కణ్డోమ్, కణ్ణుక్కినియన కణ్డోమ్, తొణ్డీ రెల్లీరుమ్ వారీర్" (సేవించాం, సేవించాం. సేవించాం, కన్నులకు పండుగగా సేవించాం, భక్తులంతా రండి, సేవించండి) అన్నారు వినలేదా? అలాగే, నీ దివ్యమంగళ విగ్రహాన్ని మేమూ, ఈ భాదవతగోష్ఠిని నువ్వూ సేవించడానికి ఆశపడకుండా పరున్న నీవా పిచ్చిదానివి? మేమా?

లో. గో. — అన్నీ తెలుసు నమ్మా. మీ వాఙ్మాధుర్యమునకు పరవశనై పోయాను. ఏమి చెయ్యమంటారు? మీలాగ భగవన్నామానుసంధానం చేసేవారంటే నా ప్రాణం లేచి వస్తుంది. అందువల్ల కొంచెం వెనుకా, ముందూ అవుతుంది. అంత మాత్రానికే 'పిచ్చిపిల్లా' అనాలామ్మా? అదీ మంచిదే లెండి. భాగవతుల నింద స్తోత్రం, ప్రాకృతుల స్తోత్రం నిందగా భావించాలి కదా! పోనిండు. ధన్యాస్మి. నేనే పిచ్చిదాన్ని. ఒప్పుకుంటాను.

పేయ్ములై నఞ్జుణ్డు - పిశాచమైన పూతన యొక్క విషసం మిశ్రమైన పాలను త్రాగి.

ఇది యెప్పటి మాట? ఇప్పుడేల చెప్పుచున్నారు? అనగా – త్రుళ్లిపడి చటుక్కున లేచి వచ్చునేమో యని చెప్పుచున్నారు. ఆయునను రక్షకుడని నమ్మినవారికి భయముండునా? యన్నచో నది యితరుల మాట. వీరు "అజ్జా కొడుక్కొరు సంతతి". వీరు పెరియాళ్వార్ల సంబంధులు. అడుగడుగునకును భగవంతున కేమి చేటుమూడునో యని భయపడి మాటిమాటికిని మంగళాశాసనము చేయువారు వీరు. మరి యాపె యా మాటను విని తటాలున లేచి వచ్చినదా? లేదు. ఎందుకు వచ్చును? ఆపై కథ యామె యెరుగదా ? ఆ పిశాచి యపుడే చచ్చినది. ఇంకను ఉన్నచా? యని నిశ్చింతగా పరుండియున్నది,

కళ్ళచ్చగడం కలక్కళియ క్కాలోచ్చి -

కపటశకటముయొక్క సంధిబంధములు శిథిలమగునట్లు కాలుజాపి.

పిశాచియైన పూతనయైనచో ఆలోచించి గ్రహించవచ్చును. ఇది 'కళ్ళచ్చగడం' కపటశకటము. తల్లియే రక్షకముగా నుంచిన బండి. అందు అసురు డావేశించెను దానిచే పుట్టిన అపాయమగుటచే 'కళ్ళచ్చగడం' అనుచున్నారు. దాని సంధిబంధములు డుల్లు నట్లుగా కాలుజాచినాడు. శ్రీకృష్ణుని పుట్టిన దినమగుటచే పేరంటమునకు వచ్చినవారి సమ్మానములో నిమగ్నయైన యశోద పాలిచ్చుటకు వచ్చుట అలస్యమైనదని యేడ్చుచు సాగి సాచిన పాదము తగిలి యా బండి విరిగినది, ఈ మాటను విని యా గోపిక త్రుళ్లిపడి లేచివచ్చునని చెప్పుచున్నారు.

కా లో చ్చి -

ఆయన ఆపదకు అడ్డుపడినను, భాగవతుల ఆపద కడ్డుపడినను ఆ శ్రీపాదమే, కావుననే నమ్మాళ్వారు తమ తిరువాయ్ మొళిలో మొదటిపాశురమున 'తుయరఱు శుడరడి తొళుదెళెన్మననే' యని పాడించిరి. ఆయన దుఃఖమును బాపినను, మన దుఃఖమును బాపినను ఆ శ్రీపాదమే యనిరి.

వెళ్ళత్తరవిల్ తుయిలమర్న్ద -

శేషతల్పముపై నిద్రించుచున్న.

నీరు కూడ ఒత్తుకొనకుండుటకై ఆదిశేషుడు ప్రక్క. అది పంచశయనము. మెత్తదనము, చల్లదనము, పరిమళము, వైశాల్యము, తెల్లదనము– అను ఐదు లక్షణములు గల ప్రక్క. ఎంత దేవాధిదేవుడైనను ఎట్లు నిద్రరాకుండును? ఒక కవి ఆ నిద్రకు వేరొక కారణమును చమత్కారముగా చెప్పెను. అది యేమనగా-

"లక్ష్మి! క్షమస్వ వచనీయ మిదం దురుక్తం ।
అన్ధీభవన్తి పురుషా స్త్వదుపాసనేన ।
నోచే త్కథం కమల పత్రవిశాలనేత్రః ।
నారాయణ స్స్వపితి పన్నగ భోగ తల్పే॥"

ఓలక్ష్మి! తల్లీ! లోకమున నొక అపవాదమున్నది. దానిని నీకు చెప్పివేయుచున్నాను. క్షమింపుము. నిన్నే తలంచు పురుషులు ధనమదాంధులై యొడలెరుగక పడియుందురట! కాకున్న పుండరీక దళామలాయతేక్షణుడగు నారాయణుడు శేషతల్పముపై నేల నిద్రించు"నని.

వి త్తి నై - సకల కార్యవర్గములకును ఉపాదానకారణమైనవాడు.

ఇది త్రివిధకారణత్వమునకును ఉపలక్షణము. త్రివిధకారణత్వ మనగా- ఉపాదాన, నిమిత్త, సహకారి కారణత్రయము, ఉపాదానమనగా ప్రకృతి ద్రవ్యము. ఏ ద్రవ్యముతో నే వస్తువు చేయబడునో ఆ ద్రవ్యము. మన్ను, బంగారము, వెండి మొ॥ నిమిత్తమనగా, సంకల్పించువాడు- కుమ్మరి, సాలె మొ॥ సహకారి యనగా- కుమ్మరికి కఱ్ఱ, గుడ్డముక్క, చక్రము, త్రాడు మొ॥

జగద్విషయమై పై మూడు కారణములును నారాయణుడే. తన శరీరములో నొక భాగమైన చేతనా చేతనములతోనే సృష్టించును గాన ఉపాదానకారణము నారాయణుడే. అట్లున్నను తన కే వికారములు నుండవు. దానికి దృష్టాంతము సాలెపురుగు. అది తన శరీరములో నొక యంశమైన జిగురు పదార్థముతో తానే సంకల్పించి తానే గూడును నిర్మించుకొనును. అటులనే ఉపాదాన, నిమిత్త కారణములు ఆ పరమేశ్వరు డొక్కడే. సహకారులు కాలాదులు. అవియును తమలో నారాయణు డుండుటచేతనే ఆతనికి సహకారులును అగుటచే సహకారి కారణమున్ను అతడే.

మునివర్గళుం యోగిగళుం -

భరతలక్ష్మణుల వలె గుణనిష్ఠులును, కైంకర్యనిష్ఠులును. వారును ఈ గోకులములో కలరా? యన్నచో ఆయన యెచ్చట నున్నను వారితోనే యుండును.

"వైకుణ్ఠే తు పరే లోకే శ్రియా సార్ధం జగత్పతిః ।
ఆస్తే విష్ణు రచిన్త్యాత్మా భక్తైర్భాగవతై స్సహ॥"

"నాహం వసామి వైకుణ్ఠే । న యోగిహృదయే రవౌ ।
మద్భక్తా యత్ర గాయన్తి । తత్ర తిష్ఠామి నారద॥"

ఇత్యాదు లూహ్యంబులు.

పాండవులు పడియున్నచోట శ్రీకృష్ణుడే పడిగావులు పడియుండగా గొల్లలున్న గోకులమున పడిగావులు పడియుండరా? అట్లే వారును.

ఉళ్ళత్తుక్కొణ్డు - హృదయమున నుంచుకొని

"పాలసముద్రము తోను, ఆదిశేషుడను పడకతోను, లక్ష్మిదేవితోను గూడి సర్వేశ్వరుడు వేంచేసి నా శరీరమున ప్రవేశించి" యని పెరియాళ్వార్లు పాయించినట్లుగా తమ శరీరములో వేంచేసి యున్నటుల 'మునివర్గళుం, యోగిగళుం' మునులును, యోగులును గోకులమున నిద్రించుచున్న వారివలెను, లేపుచున్నవారివలెను ఉన్నవారు.

మెళ్ల ఎళున్దు - సావధానముగా మేలుకొని.

గర్భిణీస్త్రీలు తమ కడుపులో నున్న బిడ్డలకు నొప్పికలుగకుండునట్లు లేచునటుల "హృదయే నోద్వహన్ హరిం" శ్రీమహావిష్ణువును హృదయమున గట్టిగా పట్టుకొని మెల్లగా లేచి

అరి యన్ఱ - హరి! హరి! యనిన.

ఆయన కేమి బాధకలుగునో యని భయపడి మంగళాశాసనము పాడుచు మేలుకొనుచు హరి! హరి! యనుచున్న. ఇచ్చట హరినామ సంకీర్తనమునకు గొప్ప ఫలము చెప్పబడుచున్నది. ఈ ధ్వని సకలపాతకములను హరించు ముఖ్య నామధేయము.

పేరరవమ్ - పెద్ద ధ్వని

ఉళ్ళం పుగున్దు కుళిర్న్దు - మనస్సులో ప్రవేశించి చల్లనైన.

ప్రక్క క్రింద చల్లని నీరు ప్రవహించునటుల శ్రీనామము చెవులగుండా మనస్సులో ప్రవేశించి వణకించుచున్నది. దాని వలన శ్రీకృష్ణుని యెడబాటువలన బీటలు జారిన మా మనస్సులను పదును చేసినట్లు మమ్మానందింప జేయుచున్నది. లేచి రమ్ము-అనుచున్నారు.

ఇది మూడవ గుర్తు.

## — వేదాంతార్థము —

పుళ్ళుం శిలమ్బినగాణ్ -

ఈ పాశురారంభమున పక్షులుగా చెప్పబడినవారు భగవత్సంబంధఘటకులై, జ్ఞానానుష్ఠాన సంపన్నులైన ఆచార్యులే.

"ఉభాభ్యా మేవ పక్షాభ్యాం యథా ఖే పక్షిణాం గతిః ।
తథైవ జ్ఞాన కర్మభ్యాం ప్రాప్యతే పురుషోత్తమః॥"

రెండు రెక్కల సహాయముస పక్షులు ఆకాశమున సంచరించునట్లు భాగవతులు జ్ఞానానుష్ఠానములచే 'ఆ సమన్తాత్ కాశత ఇతి ఆకాశః' అని చెప్పబడు పరమాత్మయందు సంచరింతురు గాన పక్షులతో వీరికి సామ్యము చెప్పబడినది. శ్రీ మణవాళదేశికులు ఈ ఆచార్యసంబంధమునే భగవత్ప్రాప్తి హేతువుగా అన్వయ, వ్యతిరేకదృష్టాంతములచే బలపరచిరి.

"ఓ మానవులారా! జ్ఞానానుష్ఠానములు బాగుగాగల ఆచార్యుల నాశ్రయించినచో శ్రియఃపతి తనంతనే వారికి పరమపదము నిచ్చును" అని "ఞానానుష్ఠానం" అను ఉపదేశరత్నమాలలోని 61వ పాశురమున అన్వయముఖమునను, "తన్ గురువిన్ తాళిణైగళ్" అను 60వ పాశురమున- "ఆచార్యుల యందొకింతయును ఆదరము లేక నారాయణునియందెంత భక్తి యున్నను పరమపదము నొసంగ"డని వ్యతిరేకముఖమునను సాయించిరి.

దీనిచే సత్త్వగుణ ప్రధానమగు బ్రాహ్మీముహూర్త మాసన్నము కాగానే సాత్త్వికాగ్రేసరులైన భాగవతోత్తములు ప్రాతర్నిత్యాను సంధేయాది శ్లోకముల ననుసంధించుచు, భగవత్కైంకర్య రూపములగు తమతమ వర్ణాశ్రమములకు తగిన యాయా కాలములలో అనుష్ఠించ తగిన కర్మల నాచరించుటకై అన్నిదిక్కులనుండియు మేల్కాంచి బయలు దేరిరి.

పిళ్ళాయ్ ఎళున్దిరాయ్ - భగవదారాధనకాలమైనందున నీవును లేచి రమ్ము.

పుళ్ళరైయన్ కోయిలిల్ వెళ్ళైవిళి శజ్గిన్ పేరరవం కేట్టిలైయో -

నారాయణునియొక్క కోవెల యనదగిన తిరుమంత్రమునందలి అన్యశేషత్వమును ఓడబోసి తీసివైచి పరిశుద్ధాత్మస్వరూపమును తెలియజేయు 'ఉ' కారము మధ్యయందుండుటచే స్వచ్ఛ

మైనవై, ఆత్మలన్నింటికిని భగవత్కైంకర్యమున కుపయుక్తమై భగవంతునితో చేతనునకుగల తొమ్మిది విధములగు సంబంధములను తెలుపునదియై దక్షిణావర్తశంఖముతో సాటియగు ప్రణవముయొక్క మహాధ్వనిని వినలేదా? ఆ ధ్వని యెట్టి దనగా

"ఒళివిల్ కాలమెల్లా ముడనాయ్ మన్ని
వళువిలా వడిమై శెయ్యవేణ్డుమ్ నామ్"

అని ఆళ్వార్లు సాయించినట్లు సర్వదేశ, సర్వకాల, సర్వావస్థలలోను సర్వేశ్వరునకు సర్వ విధకైంకర్యములను చేయవలెననియే.

## పేయ్ములై నఞ్జుణ్డు -

ఇచ్చట 'పేయ్' అనగా పిశాచమువంటి ప్రకృతి. ఇది తనయం దందరకును భోగ్యతాబుద్ధి జనించునటుల వేషమును ధరించి శ్రీకృష్ణుని చంపవలెనను దుష్టచిత్తముతో వచ్చినది. ఈ ప్రకృతిని శ్రీభాష్యకారులు శరణాగతిగద్యలో "విపరీతజ్ఞానజననీం, స్వవిషయాయా శ్చ భోగ్యబుద్ధే ర్జననీం" అని సాయించిరి.

దాని ఉరోజములనగా, అందరను తమయందు సక్తులనుజేయు అహంకార, మమకారములు. ఇవి రెండును ప్రకృతియొక్క రజస్తమోగుణములవలన పుట్టును. ఈ అహంకార, మమకారములు విషతుల్యములు అవి శరీరవినాశకరములే గాక నిత్యములగు నాత్మల నధోగతిపాలొనర్చునవిగూడ. కావున నివి విషముకంటెను ఘోరమైనవి. ఈ క్రూరమగు ప్రకృతిసంబంధముచే తన భక్తులకు దాపురించిన అహంకార. మమకారములను పోగొట్టి "న మే భక్తః ప్రణశ్యతి" "న హి కల్యాణకృ త్కశ్చిత్ దుర్గతిం తాత! గచ్ఛతి" అని తానే శపథమును గావించుటచే వానిని తన భక్తుల దరిజేరనీయడు. ఇచ్చట కేనోపనిషత్తులోని దేవతల అహంకార మమకారముల బోగొట్టిన వృత్తాంతము ననుసంధింప వచ్చును.

అర్జునుడు తానే తనవారిని చంపుదునని భ్రమించి తన కర్తవ్యమగు యుద్ధమును మాని ధర్మసంస్థాపనకై యవతరించిన శ్రీకృష్ణుని యెదుటనే ధనుర్బాణములను విడచి రిక్తుడై యుండగా వది క్షత్రియులకు "అనార్య జుష్టం, అస్వర్గ్యం. అకీర్తికరం" అని బోధించి శ్రీకృష్ణుడు తత్త్వము నెఱింగించి "నష్టో మోహః స్మృతి ర్లబ్ధా । త్వ త్ప్రసాదా న్మయా చ్యుత । స్థితోఽస్మి గత సన్దేహః । కరిష్యే వచనం తవ ॥" అనిపించి అతని అహంకారమును పరిహరించెను.

కళ్ళచ్చగడం కలక్కత్తియ కాలోచ్చి -

దీనికి స్థూలముగా కామక్రోధములను పోగొట్టి యని వేదాంతపరమగు అర్థమును చెప్పుదురు. భగవంతుని పాదస్పర్శచే కపటశకటము యొక్క సంధిబంధములు డుల్లినశించెను.

ఇచ్చట శకటమనగా శరీరము. కఠోపనిషత్తులో —

"ఆత్మానం రథినం విద్ధి। శరీరం రథమేవ తు।
బుద్ధిం తు సారథి విద్ధి। మనః ప్రగ్రహ మేవ చ।
ఇన్ద్రియాణి హయా నాహుః। విషయాం స్తేషు గోచరాన్।"

అని రూపించుటలో అది ప్రకృతి పరిణామమే గదా!

"మహాభూతాన్యహఙ్కారో। బుద్ధి రవ్యక్త మేవ చ।
ఇన్ద్రియాణి దశైకం చ। .... .... .... .... ....
ఏతత్క్షేత్రం సమాసేన। సవికార ముదాహృతమ్॥"

అని భగవంతుడు తెలిపినట్లు శరీరము పాంచభౌతిక మగుటచే కపటశకట మనబడినది. ప్రకృతికి మాయ యని నామాంతరము. "మాయాం తు ప్రకృతిం విద్ధి, మాయినం తు మహేశ్వరమ్" అని శ్రుతి. అట్టి శరీరము శ్రియఃపతి పాదస్పర్శ తగిలినచో నిక నిలువజాలదు. కావున భక్తుల శరీర సంబంధమును తన పాదస్పర్శచే బాపువాడని యర్థము.

"శిలా బాలా జాతా చరణ రజసా యత్కులశిశోః" అనినటులు అనేక సంవత్సరములు పాషాణ శరీరముతో పడియున్న అహల్యాశాపమును తన పాదరజస్సుతో బాపెను గదా!

గుహుడు శ్రీరామచంద్రుడు తన నావ నెక్కబోగా

"క్షాళయామి తవ పాదపఙ్కజే
నాథ! దారుదృషదోః కిమన్తరమ్?
మా నుషీకరణ చూర్ణమ స్తితే
పాదయో రితి కథా ప్రథీయసీ॥"

అతని పాదధూళికి పాపశరీరమును బాపు ప్రసిద్ధి కలదని చెప్పెను.

వెళ్లత్తు అరవిల్ తుయిల్ అమర్న్ద విత్తినై -

పాలసముద్రమున శేషతల్పముపై యోగనిద్రతో జగద్రక్షణచింతను చేయుచుండు జగత్కారణ భూతుడగు సర్వేశ్వరుడు.

ఆళ్వందార్లు సాయించినట్లుగా అనంతులు 'ప్రకృష్ట విజ్ఞాన బలైకధాము' లగుటచే శ్రియఃపతి చేయు ఆలోచనకు ఆయన యెంతయో సహకరించును గాన ఆయనతో నిత్యసంబంధము కలిగి యుండుట యుక్తమే.

"భాష్యే ద్వే శ్రీమహచ్ఛబ్ద భూషితే శేషభాషితే" అనున ట్లా యనంతులు శ్రీభాష్య, మహాభాష్య కర్తయగుట యాయన విజ్ఞానమున కవి నికషములు.

ఉళ్ళత్తు కొణ్డు -

అట్టి భగవంతుని తమ హృదయములం దిడుకొని.

"యథాగ్ని రుద్ధతశిఖః । కక్షం దహతి సానిలః ।
తథా చిత్తస్థితో విష్ణుః । యోగినాం సర్వకిల్బిషమ్॥"

ప్రజ్వలించుచున్న అగ్నికి వాయువుతోడైనచో నది తన చెంత నున్న యెండిన పొదల నెట్లొక్క క్షణములో రూపుమాపి వేయునో, యట్లే భగవంతుడును యోగులహృదయములందుండి వారి పాపరాశి నంతటిని నశింపజేయును.

భగవానుడు భగవద్గీతలో

"తేషా మే వానుకమ్పార్థ । మహ మజ్ఞానజం తమః ।
నాశయా మ్యాత్మ భావస్థో । జ్ఞానదీపేన భాస్వతా ॥"

అని సెలవిచ్చెను. అనగా, నేను నా భక్తులయందుండు దయచే వారి ధ్యానమునకు విషయ భూతుడనై జాజ్వల్యమానముగ ప్రజ్వరిల్లెడు జ్ఞానమను దీపమును వెలిగించి, అజ్ఞానముచే బుట్టిన వారి యంధకారము నంతను నశింపజేతునని. అందువలననే భక్తులు బ్రహ్మ, రుద్రేంద్రాదులను గూడ తబ్బిబ్బు చేయు కాము నెదుర్కొని

"మదన! పరిహర స్థితిం మదీయే
మనసి ముకున్ద పదారావిన్దధామ్ని ।
హర నయన కృశానునా కృశోఽసి
స్మరసి న చక్రపరాక్రమం మురారేః ॥"

"ఓ మన్మథా! నీ విదివరకు రుద్రుని భాలనేత్రాగ్నిప్రభావమునే చవిచూచితివి కాని శ్రీమహావిష్ణుచక్రపరాక్రమమును బొత్తుగా నెరుంగవు. ఆయన నా మనస్సులో స్థావరప్రతిష్ఠగా వేంచేసియున్నాడు. త్వరగా లేచిపొమ్ము". అని యదలింతురు. ఆ భగవంతునకు వారి హృదయమునందలి వాసము క్షీరసాగర, శేషతల్పములయందు కన్నను ప్రీతికరము,

"పని క్కడలిల్ పళ్లికోలై పళ్గగవిట్టోడి వన్దు, ఎన్
మన క్కడలిల్ వాழవల్ల మాయమణాళ నమ్బి!"

చల్లని సముద్రమునందలి నీకు శయ్యయగు శేషుని సర్వథా విడచిపెట్టి పరుగు పరుగున వేంచేసి నా మనస్సనెడు సముద్రమున సుఖించుచున్నావా తండ్రీ!" యని పెరియాళ్వార్లు పాయించిరి.

మునివర్ కళుమ్, యోగికళుమ్ - గుణానుభవపరులును, కైంకర్యపరులును.

భగవంతుని గుణములు కొందరను మాదకద్రవ్యములవలె నొక్క చోటనే పడవేసియుంచి, ఆ గుణముల నొక్కొకదానినే యనుభవింపజేయుచు కదలనీయక కట్టిపడవైచును. మరికొందరి నాతని వెన్నంటియుండి 'తదనుభవజనితప్రీతికారిత కైంకర్య' నిమగ్నులను చేసివేయును. ఇందులకు శ్రీభరతలక్ష్మణులే మనకుదాహరణము.

మెల్ల - సావధానముగః ఎళున్ను - మేల్కొని

అరియెన్న పేరరవమ్ -

హరి హరి యనెడు గొప్ప ధ్వని 'అరి' యనగా శత్రువు. ఎవరికి? దుఃఖనిదానములగు పాపములకు. శత్రువనగా - తానున్నచోట మరియొక దాని నుండనీయకుండుట. కావున భగవంతుడు వేంచేసియున్న భక్తుల హృదయములో పాపములకు తావులేదు.

"ప్రాణ ప్రయాణపాథేయం । సంసారవ్యాధినాశనమ్ ।
దుఃఖాత్యంత పరిత్రాణం । హరి రిత్యక్షర ద్వయమ్ ॥"

చనిపోయిన పిమ్మట ఊర్ధ్వలోకములకు పోవువారికి దారిభత్యము వంటిది, సంసారమనెడు వ్యాధిని పోగొట్టునది. దుఃఖములు తిరిగి తలయెత్తకుండునట్లు చేయునది. దుఃఖనిమిత్తములగు నట్టియు, మోక్షప్రతిబంధకములగునట్టియు పాపము లనేకములుండగా దుఃఖనివృత్తియు. మోక్ష ప్రాప్తియు నెట్లనగా

"హరి ర్హరతి పాపాని । దుష్టచిత్తై రపి స్మృతః ।
అనిచ్ఛయాపి సంస్పృష్టో । దహత్యేవ హి పావకః॥"

నిప్పు, ఇది నిప్పని తెలియక తాకినను, కాలునట్లే 'హరి' యను రెండక్షరములును, ఇవి భగవద్వాచకములని యెరుంగని దుష్టమనుష్యులచే నుచ్చరింపబడినను సమస్త పాపములను పరిహ రించును. పాపము లుండవు. ఇక మోక్షము లభించుట కేమి యాటంకము.

కావున తెల్లవారుటకు ముందు బ్రాహ్మీముహూర్తమున లేచి శ్రీ ప్రహ్లాదుడు ప్రసాదించిన శ్రీ హర్యష్టకమును భక్తు లనుసంధించవలెను, దీనిని లోలోపల ననుసంధించినను చాలును గాని నాస్తికుల చెవుల సోకినచో వారు కూడ పావనులగుదురు గాన పెద్ద స్వరముతో ననుసంధించవలెను. "శ్రుతం హరతి పాపాని" (వినబడినదై పాపముల హరించును). మన పెద్దలు తాము తరించిన చాలు నని తలంచరు. "స్వయం తీర్త్వా, పరాన్ తారయతి" యని కదా వారి యాచారము. ఆ ధ్వని భక్తుల హృదయములలో చల్లగా ప్రవేశించి, వారిని కూడ మేల్కొలిపి ఆ యనుసంధానములో పాల్గొనునట్లు చేయును.

— మరి యొక ముఖ్యార్థము —

ఈ పాశురమున 'పిళ్లాయ్' అని యొక విలక్షణవ్యక్తి లేపబడుచున్నాడు. 'పిళ్ళాయ్' అనగా ఓ బాలికా! యని యర్థము. "గ్రహణ ధారణ పోషణ పటుః బాలః" అని బాలుని లక్షణము. అనగా, చెప్పిన యర్థమును చక్కగా నెరుంగుట, ఎరింగిన యర్థమును లెస్సగా జ్ఞాపకముంచుకొనుట. ఆ జ్ఞాపకముంచుకొనిన యర్థమును అనేక ప్రమాణములతో బాగుగా పోషించుకొనుట. శ్రుతియును "అథ మునిః పాణ్డిత్యం చ నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్" అని చెప్పుచున్నది. అనగా, తన అభిజన, విద్యా, ధన మదములను బైటికి కనబడనీయక నిగురుగప్పిన నిప్పువలె నుండుట. ఈ 'పిళ్ళాయ్' శబ్దము స్త్రీలింగమగుటచే పారతంత్ర్యము కూడ చూపబడుటచే భగవంతునకు వలె వగల భాగవతులకును గూడ పరతంత్రుడై యుండవలెనని శిష్యలక్షణము చెప్పబడుచున్నది. శిష్యలక్షణమే కాదు శ్రీవైష్ణవ లక్షణ మని కూడ చెప్పవచ్చును.

ఈ పాశురమున తెల్లవారు సమయమును తెలుపు మూడు లక్షణములు చెప్పబడుచున్నవి. అందు మొదటిది 'పుళ్ళుం శిలమ్బిన కాణ్' పక్షులు మేల్కొని అరచుచున్నవని. దీనిచే జ్ఞానానుష్ఠాన సంపన్నులగు శ్రీవైష్ణవులు (భక్తులు) మేల్కొనుట తెలుపబడుచున్నది.

"ఉభాభ్యా మేవ పక్షాభ్యాం । ఆకాశే పక్షిణాం గతిః ।
తథైవ జ్ఞానకర్మభ్యాం । ప్రాప్యతే పురుషోత్తమః॥"

అని వారికి పక్షిసామ్యము పెద్దలచే చెప్పబడుచున్నది. పక్షుల కూర్ధ్వగతి సాధనములు రెండు రెక్కలే, వీరికిని పరమపదప్రాప్తి సాధనములు జ్ఞానానుష్ఠానములే. జ్ఞానము లేక కేవలము అనుష్ఠానము మాత్రమే కలవాడు గ్రుడ్డివాని వంటివాడు. అనుష్ఠానము లేక కేవలము జ్ఞానము మాత్రమే కలవాడు కుంటివాని వంటివాడు. రెండును ఉన్నవానికే నిరాఘాటకమైన ఊర్ధ్వగతి సిద్ధించును. ఇట్లు జ్ఞానానుష్ఠానములు రెండును గల మహాత్ములు లేచి భగవంతుని సేవించు సన్నాహముతో కూడియున్నారు. శ్రీనంజీయర్ ఈ పక్షులు చేయునుపకారము కన్న తల్లియైనను చేయదని సాయించిరి. ఆధునిక సమయసూచీ యంత్రములు లేని దినములలో కొడికూతలను, కాకి యరపులను విని వేకువనే మేల్కాంచి మన పూర్వులు ప్రాతఃకాలకృత్యములకు గడంగువారు.

ఉపనిషత్తులలో జానశ్రుతియను పుత్రాయణుని పుత్రునకు రైక్వుడను మహర్షివలన రెండు హంసలు గావించిన యాధ్యాత్మిక విద్యా ప్రవృత్తిని బ్రహ్మ సూత్రములలో "శుగస్య తదనాదరణ శ్రవణాత్ తదా ద్రవణాత్ సూచ్యతే హి" (1-3-33) అను దానికి బ్రహ్మసూత్రభాష్యమున నీ కథ చెప్పబడినది.

— రెండవ ప్రాభాతిక లక్షణము —

గరుడునకు రాజైన భగవంతుని మందిరమునుండి వెలువడుచున్న శంఖధ్వనిని గురించినది.

ఇక్కడ పక్షిరాజమందిర మనగా వేదము. "వేదాత్మా విహగేశ్వరః" "తార్క్ష్యః శ్రుతీనాం నిధిః" అని పెద్దల శ్రీసూక్తులు. ఈ వేదమునుండి యుద్భవించిన శంఖమనగా ప్రణవము. ప్రణవము శంఖాకారమని ప్రసిద్ధము. దాని యొక్క గొప్ప ధ్వని యనగా భాగవతశేషత్వము. ప్రణవము భగవచ్ఛేషత్వమును వాచ్యముగను, భాగవతశేషత్వమును ధ్వనిమర్యాదగను తెలుపుచున్నది. ఉత్తమగ్రంథమునకు వాచ్యార్థమున కన్న ధ్వన్యర్థము ప్రధానము. దీనిచే భాగవతశేషత్వము నెరింగిన పిమ్మట భాగవతగోష్ఠితో కలసి అనుసంధించుటయే చేతన కర్తవ్యమని తెలిసి వెంటనే లేచి రమ్మని చెప్పుచున్నారు.

— మూడవ ప్రాభాతిక లక్షణము —

"హరి హరి" యను ధ్వని యంతటను వ్యాపించుచున్నది. అట్లనుసంధించువారు మును లును, యోగులు నని రెండు విధములుగ నున్నారు. అనగా గుణానుభవనిష్ఠులు, కైంకర్యనిష్ఠులు నని వెనుక చెప్పబడినది గదా! ఇట్టి విభాగము శ్రీవైకుంఠమందును గలదు.

అది ముముక్షువునకు బ్రాహ్మీముహూర్తానుష్ఠానము. ఈ యనుష్ఠానమునకు ప్రమాణము శిష్టాచారము. కావున "హరి, హరి" యని యనుసంధించుచు తమతమ శయనముల నుండి లేచి హర్యష్టకాది ప్రాభాతిక స్తోత్రానుసంధానమును చేయుచున్నారు గాన నీవును లేచి వచ్చి మాతో కలసి సుప్రభాతానుసంధానమును చేయుమని పిలచుచున్నారు. ఈ పిలుపు సర్వజనసాధారణమైనది.

## సందర్భానుసారముగ ననుసంధించుకొన దగిన పాశురములు -

గోపాంగనలకు శ్రీకృష్ణానుభవమునకు కావలసిన పరికరములన్నియు నొకేవిధముగా నుండగా నొకరి నొకరు లేపుకొన నేల? యనగా, పెద్ద ప్రవాహములో దిగువారికి నితరుల చేయూత సహాయ మవసర మగునట్లు భగవదనుభవములో దిగువారికిని

1. పాలాళ్లి నీ కిడక్కుమ్ పణ్బేయామ్ కేట్టేయుమ్,
కాలాళుమ్ నెఞ్జళ్ళియుమ్ కణ శుళ్లులు.........

పెరియతిరువన్దాది. 34

సముద్రవర్ణుడా! సర్వేశ్వరుడా! నీవు పాలసముద్రమునందు పవళించు శోభను విన్నంతచే మా కాళ్లు తడబడును. మనస్సు శిథిలమగును. కన్నులు సుడి తిరుగును — అనుటచే నిట్టి వారికి తోడవసరము కదా!

2 శెజ్జొ ఱ్కవిగాళుయిర్ కాత్తాట్చెయ్మ్మిన్ తిరుమాలిరుఞ్జోలై,
వఞ్జక్కళ్వన్ మామాయన్ మాయక్కవియాయ్ వన్దు, ఎన్
నెఞ్జము ముయిరు ముళ్ కలన్దు నిన్తారఱియా వణ్ణమ్, ఎన్
నెఞ్జము ముయిరు మవై యుణ్డు తానేయాగి నిఱైన్దానే.

తిరువాయ్ మొళ్లి (10-7-1)

తిరుమాలి రుంశోలైయందు వేంచేసియున్న స్వామి కపటకవియై వచ్చి నా మనస్సునం దును, ఆత్మయందును కలసియుండి యిరుప్రక్కలనుండు దేవీమారులైనను ఎరుగకుండునట్లుగా తానే పూర్ణుడై యున్నాడు. ఓ కవీశ్వరులారా! మీ యాత్మల నా శ్రియఃపతినుండి కాపాడుకొని మీరు కవిత్వకైంకర్యమును చేయుడు,

3 కళిప్పు ఙ్కవర్వు మత్తు ప్పిఱప్పుప్పిణిమూ ప్పిఱప్పత్తు
……… ……… అడియార్ గళ్ కుళాఙ్గళైయే యుడన్ కూడవ
దెన్దుకొలో.

(తిరువాయ్మొళ్లి 2-3-10)

సుఖమును, దుఃఖమును, పుట్టుకను, రోగమును, ముసలి తనమును, మరణమును లేని యవస్థను బడసి సర్వేశ్వరుని యొక్క దాసుల సమూహములతో కలసి మెలసి యుండుట యెప్పుడో కదా !

ఇట్లు నిత్యసూరులకును, ముక్తులకును కూడ సహాయ మవసరమై యుండగా నిక గోపికల కది యవసరమని వేరే చెప్పవలెనా?

4. 'తుయిలమర్న్ద వి త్తినై' అనుచోట

పని క్కడలి ల్పళ్ళికోళై ప్పళ్లకవిట్టు, ఓడివన్దెన్
మన క్కడలిల్ వాళ్లవల్ల మాయమణాళ నమ్బి,
తని క్కడలే తనిచ్చుడరే తనియులగే యెన్జెన్టు,
ఉన క్కిడమా యిరుక్క వెన్నై యునక్కురి త్తాక్కినైయే.

పెరియాళ్వార్ తిరుమొళ్లి 5-4-9

పాలసముద్రమునందు పడకను మరచి ఆదరముతో వచ్చి నా హృదయార్ణవమున వేంచేసి యున్న ఓ శ్రియఃపతీ! పాలసముద్రము, సూర్యమండలము, శ్రీవైకుంఠము మొదలగు అనేక స్థలములు నీ కుండియును వాని నన్నిటిని విడచి నిరాధారునివలె నన్ను నీకు నివాసస్థానముగా నేర్పరచు కొంటివా? ఆహా! ఏమి నీ సౌలభ్యము!



# ఏడవ పాశురము

# "కీశు కీశె న్ఱెఙ్గుమ్"

## — అవతారిక —

ఇంతకు ముందు పాశురములో భగవద్విషయములో నూతనముగా నవగాహించిన యొక గోపాంగనను లేపిరి. ఇందు సుపరిచితయైనను నూతనత్వమును భావించుచున్న యొక గోపికను లేపుచున్నారు. కొందరిని మాత్రమే లేపి లేచినవారితో నేగి శ్రీకృష్ణుని పాడుదమని తృప్తిచెందెడువారు కారు వీరు. యథార్థముగు భగవత్సంబంధానుభవమున్నచో తల్లిదండ్రులు తమ కడుపున పుట్టిన బిడ్డ యొక్క సమృద్ధి కెట్లు సంతసింతురో అట్లందరి సమృద్ధికిని సంతసించువారీ గోపాంగనలు. నిజమగు పురుషార్థ మీ భాగవతగోష్ఠియే. ఇదియే భక్తులకు ప్రార్థించి లభించదగినది. మనము పరమపదము నాశించుటయును నచ్చట నిట్టి గోష్ఠితో కలసి నిరంతర నిరవచ్ఛిన్న భగవదనుభవమును బడయ వచ్చుననియే.

ఒక తరి నంజీయరు మరియొక జీయరు స్వామిని సేవించి నిలువగా ఆ జీయరుస్వామి నంజీయరుతో "నంజీయరే! నాకు భగవద్విషయమున వాస్తవమైన రుచి పుట్టలేదు సుమండీ!" అనిరి. దానిని విని నంజీయరు "ఇదేమి స్వామీ! ఆశ్చర్యముగా నున్నదే! మీ వంటి యాచార్యు లెందైన నుందురా? ఏ మిట్లు సాయించుచున్నా" రని ప్రశ్నించిరి. దాని కా జీయరుస్వామి "నిజముగా భగవ ద్విషయరుచి యున్నచో భాగవతోత్తములను సేవించగనే యపరిమితానంద ముండవలెను గదా! నా కది లేదే?" యని సాయించిరి.

ఇట్లే తమకు వలెనే భగవద్భాగవత ప్రతిపత్తి యందరకు నుండవలె ననెడు ఉదారచిత్తు లగుటచే నీ గోపికలు అందరను లేపి కూర్చుకొనుచు ఈ గోపికా గృహమునకు వచ్చి తెల్లవారుటకు కొన్ని గుర్తులను చెప్పి యీమెను లేపుచున్నారు.

ఇక్కడ నొక సంప్రదాయరహస్యమును గుర్తింపుడు. క్రిందటి పాశురములో మునీశ్వరులును యోగీశ్వరులును "హరి హరి" యనుచు నుచ్చైస్స్వరముతో హరినామ సంకీర్తనము చేయుచు లేచు చున్నారని తెల్లవారుటకు గుర్తుగా జెప్పి లేపిరి. ఈ పాశురములో భరద్వాజ పక్షులు (తలక్రిందుగా

(వేలాడుచు నిద్రించు పక్షులు) కీచుకీచుమని ధ్వనిచేయుచున్నవని గుర్తు చెప్పి లేపుచున్నారు. వీరికి భగవత్సంబంధమున్న వన్నియు నుద్దేశ్యములును, ఉపాదేయములున్ను. భగవదనుభవమునకు సమయమును సూచించున దేదియైనను మన కుపాదేయమే. ఇవి 'ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్యవరాన్ని బోధత' యను శ్రుతి చేయుచున్నంత యుపకారమును చేయుచున్నవి గదా!

## ఏడవ పాశురము

కీశుకీశెన్ఱెఙ్గుమానై చ్చాత్తం కలన్దు,
పేశిన పేచ్చరవమ్ కేట్టిలైయో పేయ్ప్పెణ్ణే!
కాశుమ్ పిఱప్పుమ్ కలకలప్ప క్కైపేర్త్తు,
వాశ నఱుఙ్గుళలాయ్చ్చియర్, మత్తినాల్
ఓశై పడత్తు తయిరరవమ్ కేట్టిలైయో,
నాయక పెణ్పిళ్ళాయ్! నారాయణన్ మూర్త్తి,
కేశవనై ప్పాడవుమ్ నీ కేట్టే కిడత్తియో,
తేశముడైయాయ్! తిఱవేలో రెమ్బావాయ్.

## — తాత్పర్యము —

భగవద్విషయానుభవము నెఱింగియు మరచి పరుండియున్న యొక గోపికను లేపుచున్నారు.

"ఏమే! భరద్వాజపక్షు లంతటను కలసి 'కీచుకీచు' మని యరచుచున్న పెద్దధ్వనిని నీవు వినలేదో, ఇంకను పరుండియే యున్నావా? నాలును. ఇక లెమ్ము." అనినను ఆ గోపిక మాట్లాడక పరుండియే యుండగా బైటవారు "ఓ పిచ్చిపిల్లా! పోనీ, మనవారందరును లేచి గట్టిగా తొడుకొనిన నిండుకుండలోని పెరుగును కొప్పులు వీడి లోనున్న పువ్వుల పరిమళము నలుగడల క్రమ్ముకొనియు, మెడలోని యాభరణములు గలగల ధ్వనిచేయుటయు, శ్రీకృష్ణుని కల్యాణగుణములను తాటలలో జేర్చి గట్టిగా పాడుచు కవ్వములతో చిలుకుచున్న చప్పుడుల నైనను నీవు వినలేదో. యనగా ఆ లోగోపిక "పోదురూ, ఈ యూరిలో నెప్పుడును పెరుగు చిలుకుచునే యుందురు. అంతలోనే తెల్లవారునా? యనగా, బయట నున్న గోపికలు "సెబాష్, గొప్పనాయకురాలవయితివిలే! సాక్షాత్తు నారాయణుడు శ్రీకృష్ణుడై మన భాగ్యముచే మన పల్లెలో నవతరించెను. మనము చూచుచుండగను, వినుచుండగనే

కేశి మొదలగు రాక్షసులను జంపి మన వెతలను బాపెను. ఆ కృతజ్ఞతకై మే మాతని గుణగానము చేయుచున్నాము. నీవు వినుచు పరుండియే యున్నావు. పైగా మా పాటలు నీ కానందమును గొలుప మరింత మెరసిపోవుచున్నావు. చాలు చాలు. లెచి తలుపు తెరువుము.

## — వి శే షా ర్థ ము —

### కీచుకీన్నెఙ్గు మానైచ్చ్వాత్తుం కలన్దు పేశిన పేచ్చరవం కేట్టిలైయో -

'కలన్దు పేశిన' అనుటచేత అవి ఉదయమున ఎడబాసిపోయి తిరిగి సాయంకాలమున కలుసుకొను ఆచారము కలదు. అంత కాలము విరహమునకు తగినట్లుగా సంశ్లేషించి యెడబాటును తెలుపు తల్లడబాటు తెలియునట్లుగా గట్టిగా అరచును. దానిని వినలేదా? పిచ్చిపిల్లా! అనుచున్నారు. వీరామెను "వినియును, నిర్లక్ష్యము చేయుచున్నావే? బుద్ధిహీనురాలా!" అనుచున్నారు. వీరికి బుద్ధి యనగా భగవద్విషయము కన్నను భాగవత విషయము మంచిదని యెరుంగుట. దాని నెరింగియు మాటలాడక పరుండియుండుటచే 'పిచ్చి పిల్లా!' యనుచున్నారు.

### కాశుం పిఱప్పుం -

కాశుం = గుద్దించిన చిన్నకాసుల పేరు. పిఱప్పుం = మామిడిపిందెల గొలుసు.)

### కలకలప్ప క్కైపేర్తు -

పెరుగు యొక్క ఆధిక్యముచేతను, తరచుచున్న గోపికల సౌకుమార్యముచేతను కొండను కదల్చునట్లున్నది వారికి.

లేక — శ్రీకృష్ణుడు దగ్గర లేకుండుటచే చేయి సాగకున్న దనవచ్చును.

లేక — శ్రీకృష్ణుడే దగ్గరగ నుండి "తయిర్రై మోరాక్క వొట్టేన్" "పెరుగును చల్ల చేయనీయ" నని చేతిని పట్టుకొని వ్రేలాడుటచే నని చెప్పవచ్చును.

"మోరార్ కుడ మురుట్టి' శిఱి. తిరు.

మజ్జిగకుండ కనబడినచో కృష్ణుడా కుండను దొర్లించివేయును.

### వాశనఱుఙ్కులాయ్చ్చియర్ -

పూర్వకాలపు స్త్రీలు తలవెంట్రుకలకు పరిమళమునకై పూలను బైటికి ధరించక కొప్పులోపలనే యుంచుకొని ముడుచుకొనుచుండరి. పెరుగును తరచు ఆయాసముచే ఆ కొప్పువీడి పరిమళము నలుగడల వ్యాపించుచున్నది.

ష త్తినాల్ ఓశ్శైడు త్త తయి రరవం -

"ఉద్గాయతీనా మరవిన్ద లోచనం
వ్రజాఙ్గనానాం దివ మస్పృశద్ధ్వనిః ।
దధ్న శ్చ నిర్మన్థన శబ్ద మిశ్రితో
నిరస్యతే యేన దిశా మమఙ్గళమ్ ॥"

గోపాంగనలు పెరుగు తరచుచు శ్రీకృష్ణుని గుణములను గట్టిగా పాడుచున్న పాటల ధ్వని పెరుగు తరచు ధ్వనితో కలసి ఆకసము నంటెను. దానిచే దిక్కులయందున్న యమంగళము లన్నియు పోగొట్టబడుచుండెను. ఇట్లు గోపాంగనల కంఠధ్వని, తరచబడుచున్న పెరుగు ధ్వని, మెడ లోని యాభరణముల ధ్వనియు ఆకసము నంటుచున్నను నీ చెవిలో పడలేదా ?

నాయక పెణ్పిళ్లాయ్ -

మాకు నాయకురాలైన ఓ పిల్లా! అమ్మా! మాకందరకును అన్ని పనులను చక్కబెట్టు పద్ధతి యిదేనా? అనుచున్నారు. మేమన్న మాటల కన్నిటికిని బదులు మాటలను జెప్పి పడుకొనియుండుట నీ ధనగర్వముచే ననవచ్చును. పేయ్ పెణ్ణే! నాయక పెణ్పిళ్ళాయ్! అనుటలో హృదయ మందలి భావబంధ మొకటియే యగుటచే తారతమ్యము లేదు. (పొగడవలెనని గాని తిట్టవలె నని గాని వారి మనస్సున లేకపోవుటచే వారామెను తమకు శేషియను సంకల్పముండియే నిష్ఠుర పెట్టుచున్నారు.

నారాయణన్ మూర్తి కేశవనై ప్పాడవుం నీ కేట్టేకిడత్తియో -

శ్రీకృష్ణుడు నారాయణుడే యనియు, నాతడు కేశిని చంపెననియు మేము పాడగా నీవు లేవకపోవుటయేదాక అది నీకు కాళ్లను గ్రుద్దినట్లుకాగా మిక్కిలి సుఖముగ నిద్రించుచున్నావా?

ఇచ్చట "నారాయణ" శబ్దముచే వాత్సల్యముకు్ను 'మూర్తి' శబ్దముచే సౌశీల్యమున్ను 'కేశ వన్' శబ్దముచే ఆశ్రిత విరోధుల దునుముటయున్ను చెప్పబడుచున్నవి. దీనిచే నామెకు మరింత ధైర్యముదయించి పరుండియే యుండెను.

తేశముడైయాయ్తిఱ -

నీ దర్శనము లభించక అంధకారములో వలె పడియున్న మాకు నీవు బైటికి వచ్చి నీ తేజస్సుతో బాహ్యవైశద్యమును కలిగించుము.

## — వేదాంతార్థము —

అ వ తా రి క —

"మమ మద్భక్తభక్తేషు ప్రీతి రభ్యధికా మతా" నాకు నా భక్తులయందుకన్న వారికి భక్తులైన వారియందు అధికమగు భక్తి కలదు. "భక్తి రష్టవిధా హ్యేషా యస్మిన్ మ్లేచ్ఛేఽపి వర్తతే; తస్మై దేయం తతో గ్రాహ్యం। స చ పూజ్యో యథాహ్యహమ్" "ఈ విధముగ ఎనిమిది విధములగు భక్తి మ్లేచ్ఛునియం దున్నను అతడు దానపాత్రుడే. అత డిచ్చునదియును పరిగ్రహించ దగినదే. (ఆతనికి రహస్యార్థముల చెప్పవచ్చును. అతడు చెప్పిన వినవచ్చును") — అని భగవంతుడు తెలిపెను.

"ఆచచక్షేఽథ సద్భావం । లక్ష్మణస్య మహాత్మనః ।
భరతాయా ప్రమేయాయ । గుహో గహనగోచరః॥"

ఆటవికుడై పశుపక్షులను చంపి జీవించు గుహుడు మహాత్ముడగు లక్ష్మణుని చరితమును, అపారమహిమాన్వితుడగు భరతునకు చెప్పెనట!

"ఆళ్‌కై ఎన్నమ్మాన్ నీక్క మిల్లా వడియార్ ।
తమ్మడియా రడియారడి యారెన్ కోక్కళ్॥"
(తిరువాయ్‌మొழி 8-10-10)

"చక్రధరుడగు సర్వేశ్వరునకు విడువరాని దాసులకు దాసులకు దాసులు నాకు ప్రభువు" లని ఆళ్వారులున్ను,

"త్వద్భృత్య భృత్య పరిచారక భృత్య భృత్య
భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ!"

అని కులశేఖరులును,

"సకృత్త్వదాకారవిలోకనాశయా । తృణీకృతానుత్తమ భుక్తి ముక్తిభిః ।
మహాత్మభి ర్మామవలోక్యతాం నయ । క్షణేఽపి తేయద్విరహోఽతి దుస్సహః॥"

"నిన్నొక్కసారి సేవించవలెనను ఆశతో భుక్తిముక్తులను లెక్కచేయని మహాత్ములను నీ వొక్క క్షణకాలమైనను ఎడబాయ జాలనందువు గదా! అట్టివారు నన్నొక్కసారి కటాక్షించు సాభాగ్యమును నాకు ప్రసాదించుము" అని ఆళ్వందారులును

"త్వద్దాస దాస గణనా । చర మావధౌ యః ।
తద్దాసతైకరసతాఽవిరతా మమాస్తు ॥"

అని వరవరముని పుంగవులును ఆశపడి ప్రార్థించి బడసిన దీ భాగవతశేషత్వమునే గదా! దీని నెరింగిన దీ లేపబడు గోపిక. ఐనను "పల్లాణ్డు కుృ అళ్ కిడక్కలామ్, తిరుప్పావై క్కాళ్ కిడ యాడు" అని పాయించినట్లు భగవన్మంగళాసనమునకైనను భక్తులు లభించవచ్చునేమో గాని, భాగవత ప్రావణ్యమును దెలుపు తిరుప్పావునకు భక్తులు లభించరు. అందుచే అప్పుడప్పుడు దీనిని మరచుట సంభవమే.

## కీ శు కీ శె న్ను -

రాత్రి తమోగుణప్రధానము. అది పోయి తెల్లవారుటను తెలపునవి ఈ పక్షులు. ఆ సమయము సత్త్వగుణ ప్రధానము. ఆ విషయ మీ పక్షుల అరపులవలననే తెలియును. అటులనే అహంకార మమకారములకు రజస్తమోగుణములు ప్రధానములైనవి. అవి దూరమగుట సాత్త్వికాహారము వలనను, మహా భాగవతోత్తములు పదేపదే గావించు సదుపదేశముల వలననే. ఆ యుపదేశములచే సత్త్వగుణము తలయెత్తును. దానితో "రజస్తమశ్చాభిభూయ సత్వం భవతి భారత" అను నట్లు రజస్తమస్సు లడంగిపోవును. కారణములేనిచో కార్యముండదు. గదా! ఇంక అహంకార మమకారము లడంగును. "కామ ఏషః క్రోధ ఏషః రజోగుణ సముద్భవః" అని కదా వీని కార్యకారణభావము.

## కలన్దుపేశిన పేచ్చరవమ్ -

ప్రచారార్థముగాని, అధ్యయనోత్సవమునకు గాని యేదోయొక నిమిత్తముగా భాగవతోత్తములందరు నొకచోట సమావేశమై మూడు రోజులో. అయిదు రోజులో, పదిరోజులో కలలి మెలసి

"మచ్చిత్తాః మద్గతప్రాణాః । బోధయన్తః పరస్పరమ్ ।
కథయన్తశ్చ మాం నిత్యం । తుష్యన్తి చ రమన్తి చ ॥"

అనునట్లు కాలక్షేపమును చేసి ఆ దినముల నొక క్షణముగా గడపి యా సమావేశము సమాప్తముకాగానే వారొకరి నొకరు విడువజాలక పరస్పరము గాఢాలింగన మొనర్చి 'తిరిగి యెప్పుడు కలియుదుమో" యనియు, శ్రియఃపతీ!

"అపగతమదయానై ర్నన్తిమోపాయనిష్ఠైః ..............
వరవవముని భృత్యై ర్నస్తు మే నిత్య యోగః" అని

యీ సంశ్లేషమెన్నడును విచ్ఛిన్నము కాని పరమపదములో నన్నుంచి దీనిని నిరవచ్ఛిన్నముగా సాగింపు" మనియును ప్రార్థింతురు.

ఇట్లు సంశ్లేషించి ప్రార్థించుచుండగా దుఃఖపారవశ్యముచే గద్గదస్వరముతో నాడిన మాటలు కూడ స్పష్టముగ తెలియకయే యుండును. తిరిగి మనము సమావేశమగువరకు నీ యాలింగనమే స్మారకముగ నుండుగాక యని గొణుగుడు మాటలతో మాటిమాటికిని అలింగన మొనరింతురు.

కాశం పిరప్పు మిత్యాది -

ఇవి తల్లిదండ్రులు తీయగా గోపాంగనల కెట్లు కంఠాభరణములై యుండునో, అటులనే అనన్య దైవత్వమున్ను పారతంత్ర్యపరాకాష్ఠయున్ను స్వరూపముగా గల భాగవతోత్తములున్ను, తిరుమంత్ర, ద్వయమంత్రములను ఆచార్యుల నుండి లభించి కంఠస్థపరచుకొని (మరువకుండునట్లు బాగుగా వల్లించి) తాము "మన్త్రరత్నాను సన్ధాన సన్తత స్ఫురితా ధరః । తదర్థ తత్త్వని ధ్యాన సన్నద్ధ పులకోద్గమః" అన్నట్లు అర్థాను సంధానముతో వాని ననుసంధించుకొనుచు, తమ నాశ్రయించిన భక్తుల మంత్రములను, అధికారులకు వాని యర్థములను ధ్వనింపజేయుచుందురు. దానిని విని నీవు స్వరూపోపాయ పురుషార్థజ్ఞానమును బడయ లేదా? (భాగవతశేషత్వము స్వరూపము. భాగవతాభి మానము ఉపాయము. భాగపతగోష్ఠితో భగవదనుభవ కైంకర్యములు పురుషార్థమని యెరుంగ లేదా?)

వాశనఱుం కుళ్లల్ -

వాశ = "దూరాద్గన్ధో వాతి" అనునట్లు జ్ఞానానుష్ఠానములచే వారి వైభవమంతటను వ్యాపించును. నఱుం కుళ్లల్ = భగవద్విషయ వ్యామోహము గల, (ఆయ్చ్చియర్) = అనన్యార్హ శేష భూతులైన శ్రీవైష్ణవుల యొక్క.

మత్తినాల్ -

సంకల్పాత్మక జ్ఞానముచే శిక్షితులైన సంసారి చేతనుల యొక్క

ఓశైపడుత్త తయిరరవమ్ -

దివ్య ప్రబంధానుసంధాన ధ్వనిని

కేట్టిలైయో - వినలేదా?

ఇచ్చట 'తయిర్' అనగా అష్టాక్షరీ మహామంత్రములోని "మూన్ఱు తాళ్ళిలే తయిరై నిఱైత్తు కడైన్దు వెణ్ణై తిరట్టు మాప్పోలే, మూన్ఱు వేదత్తిలుమ్ మూన్ఱక్షరత్తైయెడుత్తదు" అని సాయించిరి. ఈ మంత్రార్థము దివ్యప్రబంధములను సారముగా నిష్పన్న మగుచున్నది. ఆ దివ్యప్రబంధములను

మన పూర్వాచార్యులు తమ బుద్ధితో ఎఱింగించి ఈ యర్థము లనెడు వెన్నను ఎత్తివేసినట్లు ఎత్తిలేని వినలేదా? అనగా, విన్నవారని యర్థము. అందుకే వారిని 'నాయక ప్పెణ్పిళ్లాయ్' అని పిలచు చున్నారు. ఇట్టి మంత్ర మంత్రార్థముల నెరింగిన శ్రీవైష్ణవులే మనకు నాయకులు. "పెణ్పిళ్ళాంగ్" అనుటచే నా యాచార్యులు భరతాళ్వారుల వలె పారతంత్ర్యనిరతులని తాత్పర్యము.

నా రా య ణ న్ -

తత్పురుషచే పరత్వమును, బహువ్రీహిచే సౌలభ్యమును తెలియజేయు తిరునామము. బహువ్రీహిచే అంతర్యామిత్వము సిద్ధించుచున్నది. దీనిచే నాతని వాత్సల్యము విశదమగుచున్నది. వాత్సల్య మనగా, దోషములపై దృష్టి నుంచకుండుటయే గాక, భక్తుల దోషములను గుణములవలె ప్రీతితో నాదరించుట. బిడ్డడు పిచ్చివాడై వాడియగు ఖడ్గమును చేబూని బైట పడినచో ఉపేక్షించి ఆత్మహత్య గావించుకొనుననియు, ఎదుట పడినచో తననే చంపుననియు భయముచే నాతనికి గన్పించకయే వెన్నంటి తిరుగు ప్రియమైన తల్లి వంటిదే యీ భంగవంతుని అంతర్యామిత్వమున్ను

మూ ర్తి -

అట్లెప్పుడును ఎవ్వరికిని కాన్పించకయే యున్నచో నాతని భజించు టెట్లు? అందులకే దేవ తిర్యఙ్మనుష్యాది సజాతీయ దేహములను ధరించి సకల మనుజనయన విషయు డగుచుండును. ఆ యా శరీరములకు తగిన ధర్మముల తానాచరించి మనచే నాచరింపజేయును.

కే శ వ నై -

ఈ పదమునకు 1. సౌందర్యము. 2. విరోధినిరసనము. 3. సర్వనిర్వాహకత్వము నను మూడు మంగళగుణము లర్థము. ఆ యర్థము లెట్లు నిష్పన్నములగుచున్న వనగా, అధికము, గొప్పది అని చెప్పుటకు "మతుప్" అను నొక ప్రత్యయము పదమునకు చేర్చబడును. ఇచ్చట 'కేశ' శబ్దము నకు గొప్పది యను నర్థములో 'మతుప్' చేర్చబడినది. 'కేశాద్వోఽన్యతరస్యాం' అను వ్యాకరణ సూత్రము వలన ఆ మతుప్ నకు ఒకప్పుడు 'వ' అను న దాదేశముగ వచ్చును. ఆదేశమనగా ఉన్న దానిని పోగొట్టి దాని స్థానమున తానుండుట. అటులనే యిచ్చట కేశ శబ్దముతో చేరియున్న మతుప్‌ను త్రోసివైచి దానిచోట 'వ' అని వచ్చుటచే 'కేశవ' అయినది. అనగా, మిక్కిలి అందమైన తలవెంట్రు కలు కలవాడని యర్థము. ఇది సమస్త సౌందర్యమునకును ఉపలక్షణము. అనగా సర్వాంగ సుందరుడని యర్థము.

2. విరోధినిరసనము —

"యస్మా త్త్వయైవ దుష్టాత్మా ।  హతః కేశీ జనార్దన ।
తస్మా త్కేశవ నా మాసి  ।  ........................॥"

శ్రీవిష్ణుపురాణ - 60-5.  అధ్యా 24

కేశిన్ — వధ్ అనియుండగా "హ స్త్య గ్రాత్ వధేః అన్యే భ్యోఽపి దృశ్యతే" అను సూత్రము వలన 'కేశిన్' అనుశబ్దమునకు 'చంపుట' యను నర్థముగల 'వధి' ధాతువు చేరినచో అందలి 'ధి' యనుదానికి 'డః' అను నొక్క ప్రత్యయము వచ్చును. అందు 'అ' అని మాత్రము మిగిలి తక్కినది లోపించును. అపుడు 'కేశిన్ + వ్ + అ' అనగా కేశిన్–వ అని మారును. ఆపైన ఈశబ్దము పృషోద రాదిగణములో చేరినది గాన 'శ' కారము మీది 'ఇ' కారము పొయి 'అ' కారము చేరి "న" కారము పోవును. అపుడు కేశ + వ = కేశవ - అగును. దీనిచే "భక్తుల విరోధులను నశింపజేయువాడు" అను నర్థము వచ్చును. 'కేశి' యను నొకరాక్షసుడు గుఱ్ఱము రూపమును ధరించి శ్రీకృష్ణుని చంపుటకు రాగా శ్రీకృష్ణు డా రహస్యము నెరింగి వానిని చంపెను.

3. ఇక సర్వనిర్వాహకత్వమనెడి మూడవ యర్థము.

'క' అనగా బ్రహ్మ. 'ఈ' అనగా రుద్రుడు, క + ఈశ = కేశ అగును. అపుడు కలవాడను అర్థములో వెనుక చెప్పినటుల 'వన్' వచ్చును అపుడు 'కేశవః' అని యేర్పడును. అనగా బ్రహ్మ రుద్రులను కలవాడను యర్థము. దీనికి భారతములో

"క ఇతి బ్రహ్మణో నామ  ।  ఈశోఽహం సర్వదేహినామ్ ।
ఆవాం తవాఙ్గే సమ్భూతౌ  ।  తస్మా త్కేశవనామవాన్ ॥"

'క' అనగా బ్రహ్మ. నాపేరు సమస్తమునకు ఈశుడని, మేమిద్దరమును నీ శరీరమునుండియే పుట్టితిమి కాబట్టి నీవు కేశవుడ వైతివి. అని శివుడు విష్ణువుతో చెప్పినట్లు కలదు. అందుచే బ్రహ్మ, శివులను తన యిష్టము వచ్చినట్లు నడిపించువాడని యర్థము. ఇట్లే మూడు విధములగు వ్యుత్పత్తు ంచే భగవంతుని 1) సౌందర్యము 2) ఆశ్రితవిరోధి నిరసనము 3) సర్వనిర్వాహకత్వము అను ప్రధానములగు మూడు గుణములు ప్రకాశింపజేయబడినవి.

మేమిట్లు భగవత్కల్యాణ గుణములను పాడగా తదేక ధారకులగుటచే నీ భాగవతోత్తములు వినుచున్నట్లే తన్మయులై బాహ్య ప్రపంచాను భవ మొకింతయును లేక యున్నారు. ఆ యనుభవము లోపల నిముడక ఆపాదమస్తకము దివ్యతేజస్సుతో వెలుగ దొడంగెను. అట్టి మిమ్ములను సేవించు టకై తలుపులను తెరువ గోరుచున్నాము.

1. ఆహ్లాద శీత నేత్రామ్బుః । పులకీ కృత గాత్రవాన్ ।
   సదా పరగుణావిష్టః । ద్రష్టవ్య స్సర్వదేహిభిః॥

అని యీ మహాత్ముల సేవించుటయే పరమార్థమని శాస్త్రము లుగ్గడించుచున్నవని కాని,

2. "యత్తే రూపం తత్తే పశ్యామి" అట్టి తమ దివ్యతేజస్సును సందర్శించ వలెనని యాశ యున్నది అని కాని,

3. "హిరణ్మయేన పాత్రేణ । సత్యస్యాపి హితం ముఖమ్ ।"

విషయప్రావణ్య దోషముచే మా మనస్సులు మూతబడి యున్నవి "తత్త్వం పూషన్నపావృణు" ఓ స్వామీ! మీ రా యావరణను తొలగించి మీ దర్శనమును మాకు ప్రసాదింపుడు - అని కాని మూడర్థములను చెప్పవచ్చును.

## — మఱియొక వేదాంతార్థము —

పూర్వము మనుష్యులకు వలెనే పశువులకును పక్షులకును మాటలాడెడు శక్తి యుండెడిది. ఒకప్పుడు అగ్నిహోత్రుని శాపముచే వాని కా శక్తి లోపించినది. అయినను వాని కీచుకీచులో నేదో భావము లేకపోలేదు. అది పుణ్యాత్ము లే కొందరు మాత్రమే గ్రహించ గలుగుదురు. శ్రీరామాయణమం దన కైకేయి తండ్రికి ఆ శక్తియున్నట్లు అయోధ్యకాండలో తెలుపబడినది. ఉపనిషత్తులలోను పక్షులు భాషించినట్లొక కథ కలదు.

అన్నదానముచే స్వర్గము వరకు తన కీర్తి వ్యాపించిన జానశ్రుతి యను రాజు నొక వేసవి కాలమున తన డాబాపై పరుండియుండగా రెండు హంసలు ఆకసమున నెగురుచు ఆ రాజునకు ఆధ్యాత్మికజ్ఞానము లేదని నిందించి రైక్వుని జాడ నాతనికి కెరింగించి యాతని యొద్ద కేగి ఆ జ్ఞానమును బడయవలెనను ప్రవృత్తిని ఆతనికి కలుగజేసినవట.

అటులనే ఈ "ఆనైచ్చాత్తు" = భరద్వాజ పక్షుల కిచుకీచులోని యర్థమును ఈ గోపాంగ లు కనిపెట్టి "భగవంతుని ధ్యానించి, సేవించి, తరించు మంచి సమయ మాసన్నమైనది, ఇంకను పరుండవచ్చునా? లెమ్ము లేమ్మనుచున్నవని యొక గోపాంగనను లేపుచున్నారు. వేదాంత పరమగు వర్థములో పక్షి అనగా ఆచార్యుడు దాని రెక్కలు ఇతనికి జ్ఞానానుష్ఠానములే. అది ఆ రెక్కలతో ఆకసమున నెగురును. ఆచార్యులును జ్ఞానానుష్ఠానములనెడు రెండు సాధనములతో అంతటను

ప్రకాశించుటచే ఆకాశమనబడు శ్రియఃపతియందు సంచరింతురు. ఈ పాశురమున "ఆనైచ్చాత్త" అనగా భరద్వాజపక్షి అని యర్థము. వేదాంతమున భరద్వాజుడను పేరుగల సదాచార్యుడని యర్థము. వారుచ్చరించు కీచుకీచున కేమి యర్థమనగా

"ఆరాధనానా సర్వేషాం । విష్ణో రారాధనం పరమ్ ।
తస్మా త్పరతరం ప్రోక్తం । తదీ యారాధనం నృప ॥"

అనగా - ఇతర దేవతల నారాధించుట కన్నను శ్రీమన్నారాయణు నారాధించుట గొప్పది. కాని యాతని భక్తుల నారాధించుట యంతకంటె గొప్పదని మహానుభావుడగుటచే శ్రీ సీతారామలక్ష్మణులు తన యాశ్రమమునకు వేంచేసినపుడు వారికి కందమూలముల చేతిలో పెట్టి చిత్రకూటమును చూపించెను. కాని శ్రీభరతుడు అయోధ్యనంతను తరలింప జేసికొని శ్రీరామచంద్రు నన్వేషించుచు తన యాశ్రమమునకు వేంచేసినపుడు తన తపస్సు నంతను ధారపోసి యాయనకు వాచామ గోచరమగు తదీయారాధనను గావించెను. ఇపుడు ఆ తత్త్వమునే ఉచ్చైస్స్వరముతో వెలిబుచ్చుచున్నాడు. "ఓ బాలికా! ఒంటరిగా భగవద్విషయాను సంధానమును చేసికొనుచు లోపల పరుండి యుండుట కన్నను చటుక్కున లేచి ఆ గోష్ఠిలో చేరి వారితో కలసి భగవదను భవమును చేయుమని హెచ్చరించుచున్నారు.

## కలన్దు పేశిన పేచ్చరవమ్ -

ఈ వాక్యముచే భగవచ్ఛేషత్వమునకు పరమావధి భాగవతశేషత్వమని యెరింగిన వారందరును ఒకచోట చేరి (సభలను జరిపి) ఈ సిద్ధాంతము నందరకు నెరింగించి వారి నందర నుజ్జీవింప జేయుమని హెచ్చరించుచున్నారని తాత్పర్యము. ఆ ప్రబోధమును పెడచెవిని బెట్టి తమ తమ లౌకిక వ్యాపారములలో నిమగ్నులగువారు నిర్భాగ్యులని దీనివలన సూచింపబడుచున్నది.

ఈ పాశురమున 'పేయ్ ప్పెణ్ణే' 'నాయక ప్పెణ్బిళ్ళాయ్' యను విరుద్ధార్థక సంబోధనలు రెండుగలవు. వీనిలోగల రహస్యార్థమును గుర్తింపుడు. పిచ్చిపిల్ల కనుకనే నాయకత్వము వహించు యోగ్యత కలదని తెలియుచున్నది. లోకములో నొకనికి ఒక వస్తువు నందు దృఢాసక్తి గలిగి దానిని అతడు విడువకుండ పట్టియున్నచో "అది వాని కొక పిచ్చి" యనువాడు కలదు. అటులనే యీ గోపాంగనకు నిరంతరమగు ఏకాంత భగవదనుభవ మొక పిచ్చి. శాస్త్రజ్ఞుల కన్నను స్వానుభవశీలురే శ్రేష్ఠులు. అట్టివారినే భగవంతు డధికముగా ప్రేమించును. వారికి తన నిజరూపమును చూపును. "తస్యైష ఆత్మా వివృణుతే తనూగ్ం స్వామ్" వానికి తన నిజరూపమును చూపును. నమ్మాళ్వారున్ను "శిఱు మామనిశరాయ్ ఎన్నై యాణ్డార్ ఇజ్ఞే తిరియవే! నఱు మావిరై నాన్మలర్ అడిక్కీళ్ పుగుదల్

ఉరుమోపావియేనుక్కు" అని సాయించిరి. "వయస్సుచే చిన్నవారైనను భగవదనుభవమున పెద్దవారగు భాగవతోత్తములు నా కన్నుల ముందు నడయాడుచుండగా పరమపురుషు డెంత యలంకరించుకొని దర్శన మిచ్చినను ఆయన పాదారవిందముల వైపు చేరుట నాకు తగదు" అనిరి.

మరియును, నిరతిశయ పరమాత్మానుభవపుగ్నులగువారు పిచ్చివారి వలె నుండవలెనను విధి కలదు. "బాల్యేన తిష్ఠాసేత్" అని అట్టి పిచ్చిగల వారు "పేయాళ్వారై" మనకు నిత్యానుసంధేయులై నిత్యార్చనా విషయులై అలరారుచున్నారు గదా!

రైక్వు డను మహాజ్ఞాన నిధి యొక బండక్రింద చింకిరి బట్టలను కట్టుకొని, తామరను గోకికొనుచు కూర్చుండియుండెనని యుపనిషత్తు చెప్పుచున్నది గదా!

## — వేదాంతార్థ సంగ్రహము —

మహాత్ముని సదుపదేశములచే సత్త్వగుణమును పెంపొందించుకొని, తన్మూలముగా రజస్తమోగుణముల నడ్డగించి, అహంకార మమకారముల పోగొట్టు మహాభాగవతోత్తములు బ్రహ్మోత్సవము, అధ్యయనోత్సవము, పండితసభల నిమిత్తముగా నందరు నొకచోట సమావేశమై కలసి మెలసి ఉచ్చైస్స్వరముతో దివ్యప్రబంధాధ్యయనముతోను, భగవద్భాగవత కథాప్రసంగములతోను ఆనందముగా సమయమును గడపి అది సమాప్తి కాగానే యెవరిస్థానములకు వారు చేరుకొనుటకు పరస్పరవిశ్లేష వ్యసనమును సహింపజాలక యొకరినొకరు ఆలింగన మొనర్చుకొనుచు గద్గదస్వరముతో మాటలాడు మాటలను గూడ సరిగా నుచ్చరింపజాలక పెద్ద కలవరమును జరుపుదురు. మరియును, వారు తిరుమంత్ర, ద్వయమంత్ర, చరమమంత్రములలోని వివరిణి, వివరణ భావముగా బోధించు స్వరూపోపాయ పురుషార్థజ్ఞానమును తమ యుపన్యాసములతో సంసారిచేతనులకు కలుగజేయుదురు. భగవద్విషయవ్యామోహముగల అనన్యార్హ శేషభూతులగు నా భాగవతోత్తములు దివ్యప్రబంధములను తమ జ్ఞానవైశద్యముతో మథించి సారముగా జేసిన అర్థముల నుపన్యసంచుటచే శిక్షితులైన శిష్యులగు సంసారి చేతనులకు ఆనందపారవశ్యముతో నా రహస్యార్థములను బోధించు దివ్యప్రబంధములను ఉచ్చైస్స్వరముతో అతిశ్రావ్యముగా వినిపించుచుందురు. వానిని విని భగవదనుభవనిష్ఠులై ఆచార్య స్థానమును నిర్వహించుటకు యోగ్యతగల ప్రధానులైన కొందరు మహానుభావులు సంసారి చేతనుల కోలాహలమును చెవిని బెట్టక కర్తవ్యాంశ విముఖులై నిశ్చేష్టులై పడియుందురు. వారి శ్రీసూక్తులను విని జ్ఞానవైశద్యము నార్జించదలచిన ముముక్షువులగు సంసారిచేతనులు వారి సన్నిధి కేతెంచి భగవద్గీతములను పాడి వారిని లేపి "వారు వేంచేసి తమ గోష్ఠికి మంగళాశాసనముచేసి వారి బ్రహ్మతేజస్సును దర్శింపజేసి మమ్ములనుజ్జీవింపజేయు" డని ప్రార్థింతురు.

## సంప్రదాయానుసారముగ ననుసంధించుకొన దగిన పాశురములు -

కాశుమ్ పిరప్పుం — వ్యాఖ్యానములో

1. "ఆదాద వెణ్ణెయ్ విళుజ్గి యరగిరున్ద
మోరార్ కుడ మొరుట్టి మున్ కిడన్ద తానత్తే
ఓరాదవన్ పోల్ కిడన్దానై"

(శిఱియ తిరుమడల్. 33)

— తాత్పర్యము —

("తల్లి బైటకు పోవువరకు నేమియు నెరుంగచివానివలె దొంగనిద్రపోయి కన్నులు తెరచి లేచి మాలలచే నలంకరింపబడిన పొడవైన చేతులను కుండ అడుగు వరకును జాపి") తృప్తి తీరునట్లు వెన్న నారగించి ప్రక్కనే యున్న చల్లకుండను దొర్లించి మొదట పరుండియున్నచోటనే అమాయకుని వలెనే పరున్నవానిని.

"మత్తినాల్ ఓశై పడుత్త" పదవ్యాఖ్యానములో

2. ముప్పోదుమ్ కడైన్దీణ్ణియ వెణ్ణెయి నోడు తయిరుమ్ విళుజ్గి,
కప్పాలాయర్కళ్ కావిల్ కొణర్న్ద కలత్తొడు శాయ్త్తుప్పరుకి,
మెయ్ప్పాలు ణ్డళుపిళ్ళైగళ్ పోల నీ విమ్మివిమ్మియళుగిన్ద,
అప్పా! ఉన్నై యఱిన్దు కొణ్డేన్ ఉనక్కఞ్జువ నమ్మన్దరవే.

(పెరియాళ్వార్ దిరుమొళ్రి 3-1-5)

— తాత్పర్యము —

మూడు సంధ్యలయందును తరచి తీసిన వెన్నతో బాటు పెరుగును మ్రింగివైచి, గొల్లలు మిక్కిలి శ్రమపడి తెచ్చు పాలు మొదలగువానిని కుండలు మాత్రమే మిగులునట్లు త్రాగి, దానితో తృప్తిని చెందక ఆకలి నభినయించుచు నాపాలు త్రాగదలచి వెక్కివెక్కి యేడ్చుచున్న కృష్ణా! నీ నిజస్థితి నెరిందితిని. నీకు పాలీయ భయపడుచున్నాను.

* * * *

## ఎనిమిదవ పాశురము

# "కీళ్ వానమ్"

### — అవతారిక —

ఇంతవరకు లేచిన గోపాలబాలిక లందరును చేరి శ్రీకృష్ణుడు కొనియాడ దగిన భక్తి సంపద సమృద్ధి గల యొక గోపబాలికను పురస్కరించుకొని శ్రీకృష్ణుని సేవించిన తమ యభీష్టము తప్పక సిద్ధించునను నమ్మకముతో అట్టి గోపబాలిక నిందు లేపుచున్నారు. సామాన్యముగా లోకులకు రాత్రి చెడ్డదిగను, పగలు మంచిదిగను భాసించును అందులకు కారణము రాత్రి సమయము కొందరకు పరహింసాదులకును, కొందరకు కేవలము విషయాను భవమునకును, తమోగుణోద్రేక కాలమగుటచే నిద్రకును అనుకూల మగుటచే అది చెడ్డదిగను, తమ యభీష్ట పురుషార్థ సిద్ధికై వ్యాపారములు చేసి కొనుట కనుకూలమైన దగుటచే పగలు మంచిదిగను భావింపబడును. ఈ గోపాంగనల కన్ననో రాత్రి యేకాంతమున స్వేచ్ఛగా శ్రీకృష్ణానుభవమున కత్యంతాను కూలమగుటచే క్షణక్షణమును ఉపాదే యమై యుండును. ఇక పగలన్నచో తమ పెద్ద లా యనుభవము నడ్డివేయుదురుగాన వారి కది చెడ్డగా తోచును. ఇపుడు తెల్లవారు సమయ మగుచున్నది. మన పెద్దలు మనను శ్రీకృష్ణునితో చేరనీ యరు. కావున పగలు మనకు చెడ్డది. ఇపుడింకను రాత్రి శేషించియున్నది. ఇది మన కనుకూలమైన సమయము. కనుక యిపుడు నిద్రింప తగదని చెప్పుచు ఆ గోపికను లేపుచున్నారు.

ఇచ్చట రాత్రింబవళ్ల వైపరీత్యమును గుర్తించవలెను. భగవద్గీత రెండవ అధ్యాయములో చివర

> "యానిశా సర్వభూతానాం । తస్యాం జాగర్తి సంయమీ ।
> యస్యాం జాగ్రతి భూతాని। సానిశా పశ్యతో మునేః॥"

అనగా - రాత్రి యనగా వస్తువులు కనిపించక పోవుట. జాగరణ మనగా సావధాన ప్రవృత్తి. మనకు ఆత్మ, పరమాత్మ తత్వములు రాత్రి, అనగా గోచరించవు. అందు భక్తులు జాగరూకులై యుందురు. అనగా అందు సావధానముగ నుందురు. ప్రాకృత విషయములు భక్తులకు రాత్రి, అనగా గోచరించవు. అందు మనము జాగరూకులమై యుందుము, అనగా మన మెంతయో జాగ్రత్తగా సావ ధానముగా ప్రవర్తింతుము.

## ఎనిమిదవ పాశురము

కీళ్ వానమ్ వెళ్ళెన్రు ఎరుమై శిఱువీడు,
మేయ్‌వాన్ పరన్దనకాణ్ మిక్కుళ్ళ పిళ్ళైకళుమ్,
పోవాన్ పోకిన్ఱారై పోకామల్ కాత్తు, ఉన్నై
క్కూవువాన్ వన్దు నిన్ఱోమ్, కో తుకులముడైయ
పావాయ్! ఎళున్దిరాయ్ పాడి ప్పఱై కొణ్డు
మావాయ్ పిళన్దానై మల్లరై మాట్టియ
తేవాది దేవనై చ్చెన్రునామ్ శేవిత్తాల్
ఆవావెన్ఱారాయ్‌న్దరుళేలో రెమ్బావాయ్.

### — తా త్ప ర్య ము —

తూర్పుదిక్కున ఆకాశము తెల్లబారినది. గేదెలు మంచు మేతకై విడువబడి వ్యాపించి యున్నవి. పోవుటయే ప్రయోజనముగా పోవుచున్న పిల్లల నందరను పోకుండ నాపివైచి నిన్ను లేపుటకై వచ్చితిమి. నీవీ కార్యమున మిక్కిలి వేడుక కలదానవు. పిల్లా! లెమ్ము. అశ్వాసురుని, చాణూర ముష్టికులను చంపిన శ్రీకృష్ణుని సన్నిధికి మనము వెళ్లి నోమునకు కావలసిన పరికరములను తీసికుందము. ఆయన లేచుటకు ముందే మన మాయన యొద్దకు వెళ్లినచో ఆయన "అయ్యో! మీరే వచ్చితిరా!" అని నొచ్చుకొని మన యభీష్టమును వెంటనే నెరవేర్చును.

### — వి శే షా ర్థ ము —

**కీళ్ వానమ్ వెళ్ళెన్రు -**

తూర్పు దిక్కున ఆకాశము తెల్లబారినది.

ఈ మాటను విని లోపలి గోపిక "అది తూర్పు తెల్లవారుట కాదు. మీరు చంద్రుని వంటి ముఖములు కలవారు. శ్రేష్ఠములగు ఆభరణములు కలవారున్ను. మీరు తెల్లవారునో అనుభయముచే మాటిమాటికిని ఆ దిశనే చూచుచుందురు. అందువలన మీ ముఖకాంతియు, అభరణకాంతియు ప్రతిఫలించి మీకు తెల్లవారినట్లు కనిపించుచున్నది. అది భ్రమ, వేరొక అనవాలున్నదా?" అని అడుగుచున్నది.

ఏరుమై శిఱువీడు మెయ్వాన్ పరన్దనకాణ్ -

గేదెలు చిన్నమేత మేయుటకై విడువబడి అంతటను వ్యాపించినవి.

గొల్లలు పశువులను వేకువనే మంచుమేత మేయుటకై బయళ్లలోనికి విడిచివెట్టుదురు. ఆ మేత మేసిన పశువులు పాల నధికముగా నిచ్చును. తొణ్డరడిప్పొడి యాళ్వారు ఏ రీతిగా ప్రథమ పర్వమైన భగవంతుని నేపిరో అటులనే ఆండాళ్ తల్లిగారు భాగవతోత్తములను లేపుచున్నారు. వీరిరువుర కును ఇదియే తారతమ్యము. ఈమె పరుగురాళ్వార్లకు ఒకే సంతతి యగుటచే వారి యందరి జ్ఞాన సంపదయున్ను ఈమెకు సంక్రమించెను. అందుచేత నీమె చరమపర్వమువరకును పోగలిగినది. లోపలిగోపిక "ఇదియును మీ భ్రమయే నమ్మా! మీ ముఖ, ఆభరణకాంతికి వెరచి చీకటి ముద్దలుకట్టి పారిపోవుచున్నది. దానిని మీరు గేదెలని భ్రమించుచున్నారు." అనెను. ఈ సంఘటన నొక కవి యిట్లు చమత్కరించెను.

కాకులు తెల్లవారు ఝామున 'కా, కా' యని యరచుచు సంచరించుచు. దీనికి కారణ మేమనగా --

"తిమిరారి స్తమో హన్తి। శఙ్కయాతఙ్కమానసాః।
వయం కాకా వయం కాకా। కిం రటన్తీవ వాయసాః॥"

సూర్యుడు తన కిరణములతో చీకట్లను తరిమివేయుచున్నాడు. చీకటి సంఘసంఘములుగా దూరమగుచున్నది. దానిని చూచి కాకులు మనము కూడ చీకటివలె నల్లగనే యున్నాము. మనలను కూడ యీ సూర్యుడు చీల్చిచెండాడునో యను భయముతో "మేము కాకులము, మేము కాకులము" (కాకాః) అని అరచుచున్నవట !

ఆండాళ్ తల్లిగారు గొల్లల పరిభాషతో గేదెలను చిన్నమేత విడుపు, పెద్దమేత విడుపు అనుచున్నారు. గేదెల వెంబడి శ్రీకృష్ణుడును తప్పక పోవును. అపపుడు మన గతి యేమగును?

ఆ మాటను విని బైటి గోపికలు "పోనిమ్మా మేము భ్రమపడితిమే యనుము. నీవు తెల్లవార లేదనుటకు గుర్తేమి?" యనగా లోని గోపిక "అయిదు లక్షల గుడిసెలలో నున్నవారింత మందియేనా? మిగిలినవారేరీ? అందుచేతనే తెల్లవారలేదనుచున్నాను" అనెను.

మిక్కుళ్ళ పిళ్ళైగళుమ్ -

నీవు తప్ప మిగిలినవారందరును శ్రీకృష్ణవిరహవ్యథను సహించలేక వెళ్లిపోయినారు. అనగా ఆ లోపలి గోపిక, వారందరును వెళ్లిపోయినచో నాకు భాగవతగోష్ఠి తప్పిపోయినట్లే గదా! నేనిక లేచి చేయవలసినదేమున్నది? అనెను.

పోవాన్ పోకిన్ట్రారై పోకామల్ - "శెయ్యాతన శెయ్యోం"

పెద్దలు ఆచేరించనిదానిని అచరించమని మనము చేసికొనిన యేర్పాటును తెలిపి పోవువారిని పోకుండ ఆపి (ఉన్నైక్కూవువాన్ - వన్దునిన్ఱోమ్) నిన్ను లేపుటకై నీ వాకిలి ముందుకు వచ్చియున్నాము, శ్రీకృష్ణుని తోడి సంబంధము మన కందరకు సమానముగా నుండగా నా పట్ల మీకీ యుపేక్షయేల? అనగా

కోతు కులముడైయ పావాయ్ -

శ్రీకృష్ణుని అనుగ్రహము నీపై అధికముగా నున్నది. అయనకు నీపై ప్రేమ అధికము, అందువలన నిన్ను పురస్కరించుకొని వెళ్లినచో నీ మూలముగ మేమాతని కటాక్షపాత్రుల మగుదుమని ఆశతో నీ కొరకు వచ్చియున్నాము. (పావాయ్) నీవు స్త్రీల యార్తిని బాగుగా నెరింగినదానవు. అయినను శ్రీకృష్ణునివలె కాఠిన్యమును వహించుచున్నావేమి? నీవు స్వాభావికమైన స్త్రీత్వముకలదానవు. నీవు పారతంత్ర్యమునకు చివరి హద్దులోనున్నావు. అదియే శ్రీకృష్ణునకు ప్రియమైన లక్షణము. కావున నీ మూలమున మాకు కార్య సిద్ధి లభించును.

ఎళున్దిరాయ్ - లేచి రమ్ము.

మునుపంతయును మనము లోకులకు తెలియకుండగా మనస్సులోనే శ్రీకృష్ణ ననుభవించిన యనుభవమంతయు నిప్పుడు మనవారలే యంగీకరించుటచే నోటి యడ్డు తీరినది. (పాడి) మనస్సులోని అడ్డుకూడ కొట్టుకొనిపోవునట్లుగా కృష్ణానుభవప్రీతిని మనము నోరార యిష్టము వచ్చినట్లు పాడుదము.

పఱై కొణ్డు -

లోకులకు నోము కాని మన కాతని సేవించుటయే ఫలముగదా!

మనము దేనిని పాడుదమని లోపలి గోపిక అడుగగా

**మావాయ్ పిళన్దానై** -

అశ్వాసురుని నోటిని చీల్చిన వానిని.

ఇది యుభయతారకమైన వ్యాపారము. ఆ యాపదనుండి తనను తప్పించుకొనుట మనలను బ్రతికించుటయే. ఆతని యనుభవమున కడ్డుగనున్న యుపద్రవముల ఛేదించిన వీర పురుషుని పాడుదము.

**మల్లరై మాట్టియ** - మల్లురను చంపిన

కంసుడు శ్రీకృష్ణ బలరాములను చంపుటకై చాణూరముష్టికులను విడువగా మధురలోని స్త్రీలు గుప్పెటలో ప్రాణముల నుంచుకొని చూచుచుండగా ఆ మల్లుర నిద్దరను అవలీలగా చంపి యచ్చటి స్త్రీల కుపకరించెను.

**తేవాదిదేవనై** - నిత్యసూరులకు ప్రభువైన వానిని.

**శెన్ఱు** - వెళ్లి

విరహముచే కృశించి తపించుచున్న మన శరీరమును ఆతడు చూచి పుండుపడునటుల ఆతడున్న స్థలమునకు మనమే వెళ్ళుదము.

ఆ మాటను విని లోపలి గోపిక ఆయన మనపై ప్రేమరసమును విడచి మన కందరా నట్లున్నచో నేమి చేయుదము అనగా- అనాడ రణ్యములో కొలది కాలమాలస్య మగుటచే ఆ ఋషులే తన యొద్దకు రాగా శ్రీరామచంద్రుడు

"ప్రసీదన్తు భవన్తో మే హ్రీరేషా హి మమాఽతులా ।
యదీ దృశై రహం విప్రై రుపస్థేయై రుపస్థితః॥"

నేనే వచ్చి సేవించవలసి యున్న మీరే నా కడకు వేంచేయుట నా కెంతో లజ్జాకరముగ నున్నదనియు, అరణ్యమున తన యొద్దకు నడచి వచ్చిన గుహునితో

"అర్చితా శ్చైవ హృష్టా శ్చ । భవతా సర్వథావయమ్ ।
పద్భ్యా మభి గమాచ్చైవ । స్నేహ సన్దర్శనేన చ॥"

"సఖా! నీవు నడచి వచ్చుటను, ప్రియాలాపముల నాడుటను నేను సేవగనే భావించు చున్నాను. ఇది నాకు చాల ప్రియమైనది" అన్నవాడు మన మాతని సన్నిధి కేగినచో మనల నాదరిం చక యుండ గలడా?

**నామ్ శేవిత్తాల్** - మనము సేవించినచో.

ఆయన యీ పనిని తాను చేయవలసినదిగ భావించును.

**ఆవావెన్ఱా రాయ్న్దు అరుళ్** -

"అయ్యో! వీరు నావలననే పురుషార్థము లభించవలెనని నా కొఱకై యెదురు చూచుచుండు వారు కదా! వారు నా యొద్దకు వచ్చుట వారికి ఉండబట్టకనే గదా!" అని కనికరించి మనకు తప్పక దర్శనమిచ్చును. ప్రణయిత్వము లేకున్నను "ఆ నృశంస్యం పరోధర్మః" అనువాడు ఆర్తరక్షణమును తప్పునా ?

**కోదుకులముడైయ పావాయ్ ఎళున్దిరాయ్** -

నీ కాతని యందును, ఆతనికి నీ యందును వేడుక మిక్కుటము కదా! కావున నిన్ను పురస్కరించుకొని వెళ్లినచో మన పని తప్పక జరుగును కావున లేచిరమ్మా.

## — వేదాంతార్థము —

ఈ పాశురములో భగవచ్ఛేషత్వముయొక్క పరాకాష్ఠ భాగవతశేషత్వపర్యంత మను సంప్ర దాయ సిద్ధాంతము లెరింగినవారగుటచే భగవదభిమానపాత్రులగు వొక భాగవతుని లేపుచున్నారు.

ప్రణవములోని అవధారణార్థకమైన 'ఉ కారము' అన్యశేషత్వమును నిరసించుచున్నను భాగవతశేషత్వము నష్టపడ లేదు. అందులకు కారణము వారియందు అన్యత్వము లేకుండుటయే. అదియు భగవచ్ఛేషత్వములో నేకదేశమే. ఎట్లనగా - భాగవశేషత్వమున్నగాని భగవచ్ఛేషత్వము పూర్తికాకుండుటయే.

ప్రణవములోని అకారమున కర్థమును చెప్పునపుడు అందు లక్ష్మీశేషత్వము వాచ్యముగా లేకపోయినను అర్థాపత్తి ప్రమాణముచే మన పూర్వాచార్యులు అకారార్థమగు రక్షణ సార్థకమగుటకై లక్ష్మీ సంబంధమును కూడ చేర్చుకొనిరి. అందు చేతనే మంత్రార్థములో తిరుమంత్ర ప్రకరణమున "ఇతిలే శ్రీ సమ్బన్ధ మనుసన్ధేయమ్" అని సకల శాస్త్ర విదగ్ధులైన శ్రీ సేనాపతిజీయర్ సాయించి యున్నారు. ఇందులకు మూలము ఒకరినొకరు ఎన్నడును విడువని సంబంధము కలవారగుటయే. అట్లనే ఆళ్వందారు స్తోత్రరత్నమున

"సకృత్త్వదాకారవిలోక నాశయా" అను శ్లోకమున
క్షణేఽపి తే యద్విర హోఽతి దుస్సహః"

భగవంతునకు పిరాట్టిని విడచి యుండుట యెంత దుస్సహమో భాగవతులను విడచుటయు అంత దుస్సహమే అని సాయించిరి.

"అకలకిల్లే నిఱైయుం ........." (తిరువాయ్. 6-10-10) అని పిరాట్టి యొక్క అధ్యవసాయ మెట్టిదో, "న జీవేయం క్షణమపి వినా తాం అసితేక్షణామ్"అను పెరుమాళ్ల అధ్యవసాయమును అట్టిదే. ఇటువంటి అధ్యవసాయమే భాగవతోత్తముల విషయమై పెరుమాళ్లకు కలదు. కావున ఏ పదమునకు నారాయణుడు అర్థమగునో ఆ పదమున శ్రీ దేవియును తోచునటుల భాగవతోత్తములును తోచక మానరు.

అందుచేతనే భాగవతశేషత్వము పైమెట్టుగా పరిగణింపబడుచున్నది. అందువలన మనము భగవంతునకు వలెనే లక్ష్మీదేవికి కూడ శేషభూతుల మగునటుల భాగవతులకును శేషభూతులమే యని తిరుమంత్ర ప్రకరణము 89వ సూత్రమున "ఇతిలే భాగవతశేషత్వ మనుసన్ధేయమ్" అని 'నమః' పదార్థవ్యాఖ్యానమున సాయించియున్నారు. పిరాట్టియందు పురుషకారమున కుండవలసిన కృప, పారతంత్ర్యము, అనన్యార్హత్వము అను మూడు ముఖ్యగుణములు భాగవతుల యందును పుష్కలముగా నుండుటచే శ్రీ దేవి యొక్క పురుషకారము వలెనే భాగవతుల యొక్క పురుషకారమున్ను వెంటనే ఫలించును, కావున నీ పాశురమున వారిని ప్రార్థించుచున్నారు.

సత్త్వగుణ మధికముగా నుండునది వేకువనే. దాని వలన జ్ఞానాభివృద్ధి కలుగును. ఇట్టి కాలమున గావించు ఆచార్యోపదేశములు తలకెక్కి సఫలము లగును. అందుచే పురుషకారమును చేయదగిన భాగవతోత్తముని లేపుచున్నారు. లేపుట యనగా వారికి తమయం దనుగ్రహము కల్గునట్లు చేసికొనుటయే, ఇట్టి మహనీయుల సాన్నిధ్యముచే సంసారిచేతనుల యొక్క అజ్ఞానమున్ను తాత్కాలికముగా సెలవు తీసికొనును. ఈ అజ్ఞానాంధకారమునే గేదెలని సూచించుచున్నారు.

## మిక్కుళ్ళ పిళ్ళైగళుం పోవాన్ పోగిన్ఱార్ -

ఇట్టి భాగవతులలో కొందరు ఆర్త్యతిశయముచే కట్టుబాట్లను కూడ అతిక్రమించి యేక ప్రయోజనాపేక్షతో గాక పోకుండ నుండజాలక పోవుటయే ప్రయోజనముగా పోవుచున్నారు. ఇది ప్రపన్నాగ్రేసరుల దివ్య యాత్రాతుల్యము. వారు ప్రయోజనాపేక్షతో గాక శ్రియఃపతిని సేవించక

యుండలేకపోవు ఆర్తితోనే దివ్యదేశ యాత్రలు చేయుదురు. కాని ప్రపన్ను లెంత యార్తులైనను వారి కేర్పరచిన నియమముల నుల్లంఘించిన వారి యనుష్ఠానముచే లోకము చెడిపోవును. కాబట్టి అట్టి భగవదాశ్రయమును ఈ పాశురములో లేపబడు పురుషకార భూతులగు భాగవతోత్తములను పురస్కరించుకొనియే చేయవలెను. విభీషణాళ్వాను తనను రక్షించు సమర్థుడును, రక్షించితీరునను మహా విశ్వాసముతోను శ్రీరాముని ముఖ పరిచయము లేకున్నను "నివేదయత మాం క్షిప్రం విభీషణ ముప స్థిత" మ్మని సుగ్రీవాదుల పురుషకార పురస్సరము గానే గదా శ్రీరామచంద్రుని ఆశ్రయించినది! ఈ విషయమును మొదటనే వీరు "శెయ్యాదన శెయ్యోం" అని నిశ్చయించుకొనిరి గదా!

## ఉన్నై కూ్కవువాన్ వన్దు నిన్ఱోమ్ -

ఆ ప్రతిజ్ఞను రక్షించుకొనుటకే "పోగామల్ కాత్తు" ఆ పోవువారిని పోకుండా అపుజేసి యీ యాచార్యస్థానము నలంకరించి పురుషకారమును చేయదగిన పరమ భాగవతోత్తములను ఆహ్వానించుటకై యేతెంచిరి.

## కోదుకులముడైయ -

(భగవత్కర్తృక, భగవత్కర్మక, కౌతూహలమ్) అనుటచే వీరు భగవంతుని అభిమాన పాత్రులనియు, వీరి పురుషకారము తప్పక ఫలించుననియు సువ్యక్త మగుచున్నది. "ప్రియో హి జ్ఞాని నోఽత్యర్థ మహం స చ మమ ప్రియః" అనునటుల వీరికి భగవంతుని యందును, భగవంతునకు వీరి యందును ప్రేమ సువ్యక్త మగుచున్న. "యమే వైష వృణుతే తేన లభ్యః, తస్యైష ఆత్మా వివృణుతే తనూగ్ం స్వామ్" ఆ భగవంతు డెవ్వరిని వరించునో వారికే తన దర్శన మిచ్చును. ప్రియతముడే కదా ఆయనచే వరింపబడువాడు.

## పావాయ్ -

ఈ సంబోధన సాభిప్రాయము. దీనికి నిరుపాధిక స్త్రీత్వము కలదని అర్థమును సాయించిరి. ఈ పారతంత్ర్యమునకు విరోధి స్వాతంత్ర్యము. అది యుత్తమ స్త్రీ కుండరాదు. "న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి" కదా! ఇట్టివారు గావించు పురుషకారమే ఫల పర్యవసాయి యగునది. ఈ పారతంత్ర్య ప్రకాశమునకే పిరాట్టి (సీతమ్మతల్లి) యొక్క మధ్యమ విశ్లేష. అనగా, గర్భవతిగా నున్నప్పు డనుభవించిన నిరవధిక విశ్లేష.

"న ఖల్వద్యైవ సౌమిత్రే! । జీవితం జాహ్నవీజలే ।
త్యజేయం రాఘవం వంశే। భర్తు ర్మా పరిహాస్యతి॥"

భర్తుః వంశే రాఘవం మా పరి హాస్యతి ఇతి సౌమిత్రే జీవితం జాహ్నవీ జలే అప్యేవ న త్యజేయమ్ - అని తన శరీరమును కూడ తన యిష్టము వచ్చినట్లు వీడుటకు శక్యము కాని పార తంత్ర్యమును ఋజువు చేసెను.

ఎ ళు న్ది రా య్ -

"స్వామీ! మా కభిముఖులై పురుషకారము చేసి మమ్ము ద్ధరింపుడు"

"శ్రుత్య గ్రవేద్య నిజ దివ్యగుణ స్వరూపః ।
ప్రత్యక్షతా ముపగత స్త్విహ రఙ్గరాజః ।
వశ్య స్సదా భవతితే యతిరాజ! తస్మాత్ ।
శక్త స్స్వకీయజన పాపవిమోచనే త్వమ్॥"
( యతిరాజ వింశతి )

ఓ యతిరాజా! ఉపనిషచ్ఛ్రుతి పాద్యుడగు సకలకల్యాణ గుణస్వరూపుడైన రంగనాథుడు మీకు దర్శన మొసంగును. ఆయన మీకు ఎల్లప్పుడును వంశవదుడై యుండును. కావున మీ శిష్యుల మగు మా పాపములు పోగొట్టుటలో మీరే సమర్థులు.

కాలత్రయేఽపి కరణత్రయ నిర్మితాతి ।
పాపక్రియస్య శరణం భగవత్క్షమైవ ।
సా చ త్వయైవ కమలారమణేఽర్థితా యత్
క్షేమ స్స ఏవ హి యతీన్ద్ర! భవచ్ఛ్రితానామ్.
(యతిరాజవింశతి)

శ్రీరామానుజులు సర్వదా అంజలి ముద్రతో వేంచేసి యుందురు. అది వారు భగవంతునేదో ప్రార్థించుచున్నట్లు సూచించుచున్నది. వారికేమి కావలెను? పరమపదము వారి స్వస్థానమే కదా!

"అశాసీ మహి భిక్షాన్నం । అశావాసో వసేమహి ।
శయా మహి మహీపృష్ఠే। కుర్వీమహి కి మీశ్వరైః?"

అనుసటుల వారికి స్వార్థ మొకింతయును లేదు. ఇక వారు ప్రార్థించునది "మేము రామానుజీయులము" అని తమ సంబంధమును చెప్పకొనువారి యొక్క సకలవిధ పాపజాతమును క్షమింపు మని ప్రార్థించుటయే కదా! అదియే మన కుచితమైనది.

## పాడి ప్పఱై కొళ్లు -

భగవద్గుణ సంకీర్తన మను పురుషార్థమును బడయుదము. "సతతం కీర్తయన్తో మాం" అని కదా మనకు భగవంతు డేర్పరచిన అనుష్ఠాన విశేషము!

"కల్పాదౌ హరిణా స్వయం జనహితం దృష్టేన సర్వాత్మనాం
ప్రోక్తం స్వస్య చ కీర్తనం ప్రపదనం స్వస్మై ప్రసూనార్పణమ్
సర్వేషాం ప్రకటం విధాతు మనిశం శ్రీధన్వినవ్యే పురే
జాతాం వైదికవిష్ణు చిత్త తనయాం గోదా ముదారాం స్తుమః॥"

భగవంతుని గూర్చిన కీర్తన, ప్రపదన, పుష్పార్పణములు అను నీ త్రివిధకరణోచిత కైంకర్య ప్రబోధన కొరకే గదా ఆండాళ్‌తల్లి యొక్క అవతారము! పాడుటయే వీరికి 'పఱై'. అది వేరు కాదు. కావుననే ఈమె చివరకు "ఇత్తైప్పఱైకొళ్వా నన్ఱు కాణ్" అని స్పష్టపరచిన.

## మావాయ్ పిళన్దానై -

తన భక్తుల అహంకారమును పోగొట్టు వానిని. లేక — భక్తుల యింద్రియముల స్వేచ్ఛా విహారమును బాపువానిని. దీనినే ఆచార్య హృదయము నందలి రెండవ ప్రకరణములోని 18వ చూర్ణికలో "పెరు మ్మాళ్తైయిల్" అని మొదలు పెట్టి "పత్తి యుళ్వాన్ కృషి ఫలమితే" అని ముగించుచు మధ్య "పట్టి చ్చేవ తక్క" అని యింద్రియముల యొక్క స్వైరసంచారమును మాన్పి యని సాయించిరి.

## మల్లరై మాట్టియ -

మల్లురనగా చాణూర ముష్టికులను ఇద్దరు బలశాలురు వారిని శ్రీకృష్ణుడు సంహరించెను. వేదాంతార్థమున ఇట్టి విషమజంటలు అనేకములున్నవి.

1. కామ క్రోధములు. 2. సుఖదుఃఖములు. 3. అహంకార మమకారములు. 4. పుణ్య పాపములు. 5. శీతోష్ణములు. 6. క్షుత్పిపాసలు - అనునవి వీనినే ఊర్మిషట్కము అనియు, ద్వంద్వములనియు అందురు. భగవంతుడు తన భక్తులకు వీని నుండనీయడు. ఇవి మోక్షమార్గమున కాటంకములు.

"ద్వన్ద్వమోహేన భారత" (భ. గీ. అధ్యా 7)

"ద్వన్ద్వై ర్విముక్తా స్సుఖదుఃఖ సంజ్ఞైః" (భ. గీ. 6. 15)

"ద్వన్ద్వాతీతో విమత్సరః" (భ. గీ. 6. 4)

"మా త్రా స్పర్శాస్తు కౌన్తేయ! శీతోష్ణ సుఖదుఃఖదాః" (భ. గీ. 6. 2)

అనుచోట వీనిని గమనించవలెను.

## దేవాదిదేవనై -

పరులుగా భావింపబడు బ్రహ్మరుద్రేంద్రాదులు నిజముగ నెవ్వరికంటె తక్కువవారో అతడు పరాత్పరుడు. అతడే దేవాదిదేవుడు. వానిని

## శెన్ఱు నాం శేవిత్తాల్ - నామ్ శెన్ఱు శేవిత్తాల్ -

స్వప్రయత్న నివృత్తికి యోగ్యులమగు మనమే స్వప్రవృత్తి నవలంబించి యాయన సన్నిధి కేగినచో

## ఆ వా వె న్ఱు - అయ్యో! అయ్యో! అని.

అనగా నన్నే ఉపాయముగా నమ్మియుండి నా ప్రవృత్తికి ప్రతిబంధకమైన స్వప్రవృత్తిని వీడి యుండవలసిన అధ్యవసాయము గలవారు నా విలంబము చేతనే గదా! ఆర్తిని అడంచుకొన జాలక పాపము తామే నా యొద్దకు వచ్చిరి. వీరి కెంత ఆర్తి యున్నదో యని జాలిపడి లబలబలాడి

## ఆ రా య్ న్దు - మనము వచ్చిన పనిని విమర్శించి.

## అ రు ళ్ - కృపచేయును.

## — వేదాంతార్థ సారము —

భగవ త్సమాశ్రయణమునకు పురుషకార మావశ్యకము. ఆ పురుషకారము చేయువారినే ఘటకు లందురు. వారు పుష్కల భక్తి కలవారు కావలెను. పౌష్కల్యమనగా అది భాగవత పర్యవసాయి యగుటయే. అట్టివారికి పురుషకారమున కావశ్యకములగు కృప, పారతంత్ర్య, అనన్యార్హత్వము

లుండవలెను. ఈ యోగ్యతగల పరమభాగవతోత్తముల నీ పాశురమున తమ కభిముఖులు కావలెనని కోరుచున్నారు. వారు మేలవిచ్చినది తలకెక్కి ఫలపర్యవసాయి కావలెననిన సత్త్వగుణ మధికముగా నుండవలెను. అది జ్ఞానప్రదము. దానికి తగినది వేకువ సమయమే. అట్టి సమయమున నీ ముముక్షువులు వారిని ప్రార్థించుచున్నారు వారు సత్త్వగుణ ప్రధానులు గాన వారి తెల్లని సత్త్వగుణ మంతటను వ్యాపించి అజ్ఞానాంధకారమును పారద్రోలును. వారి నాశ్రయించిన భక్తుల యొక్క అజ్ఞానమున్ను తాత్కాలికముగ వేరొక స్థానమును చూచుకొనును. ఈ జ్ఞానమును బడయుట భగవత్ప్రాప్తి కొరకే గాన కొందరు లేచి భగవంతుని సందర్శించుటకే తిన్నగా పోవుచున్నారు. పురుషకారము నుపేక్షించి పోరాదని కొందరు వారిని మరలించి, అందరును కలసి యీ భాగవతోత్తముల యొద్ద కేతెంచి వారి పురుషకారము వర్థించిరి. ఆ భాగవతునకు భగవంతునియందును, భగవంతునకు ఆ భాగవతుని యందును అభిమాన మధికము. కావున వారి పురుషకారము తప్పక ఫలించునని వీరి యాశ. వారిని పురస్కరించుకొని భగవత్సన్నిధికి వేంచేసినచో నాతడు వీరి విషయప్రావణ్యము నణచివేయును. రజోగుణము వలన పుట్టు కామక్రోధముల నణచివేయును. అట్టివారి సన్నిధి కేగి యాతని గుణగానమును చేయగా నారాయణుడు చేయుకృత్యమును వారే చేయుటచే భగవంతుడు ఇందులకు కారణము వారి యార్తియే యని తలంచి వారి యపేక్షితము నిచ్చి రక్షించును.

సందర్భానుసారముగ ననుసంధించుకొన దగిన పాశురములు -

కణ్ణై యెన్నుమ్ కరుమ్ దెయ్వమ్ కాట్చి ప్పళ్గి క్కిడప్పేనై,
పుణ్ణిల్పుళి ప్పెయ్దా ఱ్పోల ప్పుఱనిన్ఱళగు పేశాదే,
పెణ్ణిన్ వరుత్త మఱియాద పెరుమా నరైయిల్ పీదగ
వణ్ణవాడై కొణ్డు, ఎన్నై వాట్టమ్ తణియ వీశీరే.

(నా. తి. 13-1. పా)

శ్రీకృష్ణుని విరహ దుఃఖమును సహించలేక అండాళ్ తల్లి తోడి స్త్రీలతో చెప్పుచున్నది-

శ్రీకృష్ణుడను నల్లని పరదైవమును దర్శించవలెనని మిక్కిలి కుతూహలము గల నన్ను గూర్చి ఓ తల్లులారా! మీరును శత్రువులవలె పుండుమీద కారమును జల్లినట్లు కఠినముగా మాట్లాడవలదు. ఇది మీకు తగదు. స్త్రీల దుఃఖము నెరుంగని శ్రీకృష్ణుడు ధరించిన ప్రకాశించు పీతాంబరమును తెచ్చి దానితో నా శ్రమ తీరునట్లు విసురుడు.

❀ ❀ ❀ ❀

తొమ్మిదవ పాశురము

# "తూమణిమాడత్తు"

## — అవతారిక —

శ్రీకృష్ణసంశ్లేషకై ప్రపన్నాచార్యులే కొందరు మట్టలెక్కుట, కొందరు క్షుద్రమైన కామదేవు నారాధించుట, కొందరు కూడనిదైనను పలుమారు ప్రపదన మొనర్చుటయు చేయుచుండగా నీ లేప బడుగోపిక యిట్లు నిర్లక్ష్యముగా హంసతూలికా తల్పముపై పరుండుట భావ్యమా? యన్నచో. ప్రప న్నులే కాదు' వారికి కూటస్థులే యిట్లు సిద్ధాంత విరుద్ధాచారము నాచరించుటయే గాక లోకు లెరుంగు నట్లు గ్రంథస్థపరచుటలో నేదో యొక రహస్య ముండవలెను. దాని నెరుంగుట చాల ముఖ్యము. ప్రపన్నుల యవస్థలు - తోళ్ళి. తాయి, నాయిక - అను మూడు విధములు. ఇందు మొదటిది చాల ముఖ్యమైనది. అది సంబంధజ్ఞానము. భగవంతునియందు భక్తి కలుగవలెనన్నను, కలిగిన భక్తి పెరుగవలెనన్నను ఇది ముఖ్యము. అసలు శ్రీవైష్ణవత్వమును ప్రసాదించు అమృతగుళిక యిది. ఈ నంబంధములు చేతనున కీశ్వరునితో తొమ్మిది కలవు. అవి అష్టాక్షరీమంత్రమునందే బోధించబడినవి. "పితా చ రక్షక శ్శేషీ । భర్తా జ్ఞేయో (రమాపతిః) । స్వామ్యా ధారో మమాత్మా చ । భోక్తా (చాద్యమ నూదితః ॥) (ఆద్యమనువు అనగా - మొదటి మంత్రమగు అష్టాక్షరి.) 1. పితాపుత్రసంబంధము 2. రక్ష్య రక్షక సంబంధము. 3. శేషశేషిభావ సంబంధము. 4. భర్తృ భార్యా సంబంధము. 5. జ్ఞాతృ జ్ఞేయభావసంబంధము. 6. స్వామిస్వత్వ సంబంధము. 7. ఆధారాధేయ భావ సంబం ధము. 8. శరీరాత్మభావ సంబంధము. 9. భోక్తృ భోగ్య సంబంధము.

తాయిమారవస్థయనగా - ఉపాయత్వాధ్యవసాయము. దీనినే ప్రపత్తి యందురు. ఇదియే మన సిద్ధాంతసర్వస్వము. ప్రపత్తి యనగా, భగవంతునే తనకు పరమపురుషార్థము ప్రసాదించు ఉపాయమని నమ్మియుండుట. దీనికి "భగవత్ప్రవృత్తి ప్రతిబంధక స్వప్రవృత్తినివృత్తి" జీవగర్ర. అనగా, భగవంతుని ముఖ్య కర్తవ్యము రక్షణ. ముఖ్య మనగా తాను తానుగా నుండి చేయునది. సృష్టి సంహారములు సద్వారకములు. అనగా, బ్రహ్మకును, రుద్రునకును అంతర్యామిగా నుండి చేయునది. ఈ కర్తవ్యమును నిర్వహించుటలో భగవంతుడెప్పుడును సావధానముగనే యుండును. దాని కొక యడ్డుకలదు. అది మన రక్షణను మనమే చేసికొను ఉద్యమము. దాని నాతడు సహించడు.

అది మాతని నిరపేక్షరక్షణ కర్తృము. దానిని విడచిన గాని తాను మన రక్షణలో నుద్యమించడు. గజేంద్ర, ద్రౌపది, విభీషణ ప్రభృతుల రక్షణలో నిది గాంచనగును. ఆ ప్రవృత్తిని మనము విడుచు టయే ప్రపత్తి. ఇది 'తల్లి యవస్థ'.

ఇక, నాయికావస్థ యనగా, సంబంధజ్ఞాన మూలమున భగవంతుని స్వరూప, రూప, గుణ, విభూతి, చేష్టలను స్పష్టముగా నెరింగిన పిమ్మట భగవంతు నెప్పుడు పొందుదుమా యని యాశ జనించును. ఆ ప్రాప్తి ఆలస్యమైనకొలదియు తహతహ యధికమగును. ఆ యార్తిలో చేయతగినది, చేయరానిది యను జ్ఞానమే యుండదు, దానిచే మట్టలెక్కుట, కామారాధన, మాటి మాటికి ప్రపత్తి చేయుట మొదలగు ప్రవృత్తులు జనించును. అట్టి ప్రవృత్తులను చూచిన కొలది భగవంతుడు తన స్వరూపాదులయందలి విశదతమ జ్ఞానమున్ను, అట్లు తనను పొందవలెననెడు మిక్కుటమైన ఆర్తి యున్ను గదా వీరి నిట్లు చేయుచున్న దని యెంతో సంతోషించుచుండును. ఇట్టి తల్లియవస్థ లేపబడు గోపిక కున్ను, నాయికావస్థ లేపువారికిన్ని గలదని గ్రహించవలెను.

మట్ట లెక్కుట యనగా - తి. వాయ్. 5. 3. అవతారికలో ఇట్లు చెప్పబడినది.

ఒక స్త్రీ తన కిష్టమైన భర్త తన నాదరించక పోవుటచే, ఆ యెడబాటును సహించలేక అతని యాకారము వొక చిత్రపటమున చిత్రించి వేసిన కన్నును తీయక దానినే చూచుచు, ఎడబాసినది మొదలు కాన్పించిన భోగము లెల్లను నిప్పై కాన్పించక ఆహారనిద్రలు లేక, స్నానమును చేయక. ధూళి పట్టిన దేహముతో జుట్టును విరియ బోసికొని, తాటి మట్టను గుఱ్ఱముగా చేసికొని కాళ్లమధ్య నుంచుకొని తిరుగుట. ఇది ద్రావిడుల యాచారమట! ప్రాయశః పురుషులకే యిది నిర్ణయంపబడి నను, స్త్రీలును గూడ చేయవచ్చునని సమర్థించిరి ఇది యొక వ్యాపారము.

ఇంతకన్నను అల్పముననకై అధికసాహసమును చూపుట యనియును చెప్పుదురు. అనగా, పేలములను తినుటకై వరికుప్పను తగులబెట్టుటకు చేయు బెదిరింపే గాని యాచరణలో లేదు. దీని నమలుజరిపినవారు నమ్మాళ్వారును, తిరుమంగైయాళ్వారును. తిరువాయ్మొళ్ళి 5 వ శతకమందలి 3వ దశకమంతయు నీ విషయమునే తెలుపుచున్నది. అందు 10వ పాశురములో "యాం మడలూర్న్దు" అనుచోట తన సఖురాలితో నాయిక చెప్పినట్లు కలదు.

ఆండాళ్ తల్లి నా. తి. లో ప్రారంభముననందే "అనంగదేవా! .......... వేజ్గడ వఱ్ఱ్కెన్నై విది క్కిత్తియే ఉయ్యక్కొళ్ళుదియేల్" ఓ మన్మథా! నన్ను శ్రీనివాసునితో గూర్చుము. అట్లు చేసితివా నేను నీకును, నీ సోదరుడగు సాంబునకును నమస్కరింతునని ప్రార్థించెను.

నమ్మాళ్వార్లు తిరువాయ్ మొ్ఝి ప్రబంధములో అనేక దివ్యదేశములయందు వేంచేసియున్న అర్చామూర్తి విషయమై శరణాగతిని గావించిరి.

భగవంతుడు సర్వజ్ఞుడు, ఆయనకు తెలియనిది లేదు. ఆయన సహజముగా నిరపేక్షరక్షకుడు. అది యాయన స్వరూపము. అనన్యభోగ్యత్వ. అనన్యశరణత్వ, అనన్యశేషత్వములు ఆత్మకు స్వరూపములు. శేషత్వ, పారతంత్ర్యములు జీవునకు సహజాలంకారములు. అందుచే వీరు ప్రపన్నులు. అనగా తమ రక్షణలో తామొకింతయును అన్వయింపరాని వారు. దీనినే 'పరగతస్వీకార' మందురు. భగవత్ప్రాప్తి స్వగత స్వీకారము, పరగతస్వీకారము నని రెండు విధములు. రెండును శాస్త్రసమ్మతములే. స్వగతస్వీకార మనగా, భగవంతుని లభించుటకై తానుచేయు కృషి. పరగత స్వీకార మనగా, చేతనుని బడయుటకు భగవంతుడు చేయు కృషి.

ఇందు మొదటిది "ఆత్మావారే ద్రష్టవ్య శ్రోతవ్యో మన్తవ్యో నిదధ్యాసి తవ్యః" అను శ్రుతి వాక్యముచే విధింపబడు ధ్యానము. ఆ ధ్యానము ప్రత్యక్ష సమానాకారతను పొందవలెనని "యథా ద్రష్టవ్యః (భవతి) తథా నిదధ్యాసితవ్యః" అని విధించుచున్నది. అనగా కంటికి గోచరించునంత స్ఫుటముగా మనస్సుకు గోచరించునట్లు ధ్యానమును చేయవలెను. అది భగవద్గీతలో చెప్పబడిన కర్మ జ్ఞానాంగకమైన ఉపాసన.

రెండవది, "నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన, యమేవైష వృణుతే తేన లభ్య స్తస్యైష ఆత్మా వివృణుతే తనూగ్ం స్వామ్" అని కఠ – ముండక ఉపనిషత్తులలో తెలుపబడినది. అనగా, మనము చేయు శ్రవణ మననాదుల వలన కాదు భగవంతుడు లభించునది. అత డెవనిని వరించునో యాతనికి తానే స్వయముగ తన రూపమును చూపించునని తెలుపు చున్నది. మొదటిది ఉపాసక నిష్ఠ. రెండవది ప్రపన్న నిష్ఠ. ఇందులో రెండవ నిష్ఠలో నున్నది యీ లేపబడు గోపిక; ఇది భగవంతు డేర్పరచిన మర్యాద గదా! సర్వజ్ఞుడు మరచునా! ఇదియే గదా సీతమ్మతల్లిగా నవతరించిన లక్ష్మిదేవి తా నాచరించి మనకు బోధించిన సంప్రదాయ రహస్యము. రావణుని భస్మము చేసి,దాని మూలమున రాకసులను భయభీతులను గావించి తన విమోచన బడయగల్గు శక్తి తనకున్నను దానిని చూపలేదు. "న త్వా కుర్మి దశగ్రీవ! భస్మ భస్మార్హ తేజసా" అనెను. తిరువడి తన నిజరూపమును జూపి "శక్తి రస్తి హి మే వోహం లఙ్కామపి సరావణామ్" అని విన్నవించినను

"బలై స్సమగ్రై ర్యది మాం। రావణం జిత్య సంయుగే ।
విజయీ స్వపురీం యాయాత్। తత్తు మే స్యా ద్యశస్కరమ్॥"

"ఆంజనేయా! నా నాథుడగు శ్రీరాముడు తన సమగ్ర బలముతో లంకకు వేంచేసి యుద్ధమున రావణుని చంపి నన్ను తీసికొని అయోధ్యకు వేంచేసినచో అది నాకు కీర్తిదాయకము.

"శరైస్తు సఙ్కులాం కృత్వా। రామో పరబలార్దనః।
మాం నయే ద్యది కాకుత్థ్సః। తత్తస్య సదృశంభవేత్॥"

"శత్రు బలవినాశకుడగు శ్రీరామచంద్రుడు, లంకనంతను తన శరజాలములతో నింపివేసి శత్రుశేషముంచక నన్ను అయోధ్యకు గొనిపోవు నేని అది యాయనకు కీర్తిదాయకము.

"ఈ విధమైన యుభయుల స్వరూపమును ఎరింగినవాడు గావున భగవంతుడు నా యొద్దకు తానుగా వేంచేసి తాను నన్ననుభవించుట, నాచే తన ననభవింప జేసికొనుట ఆయన పని" అని పరుండియున్న గోపికను లేపుచున్నారు.

"ఐదు లక్షల గుడిసెలలో నున్న ఆడపిల్లలందరును ఇక్కడికే వచ్చియుండగా పరుండి నిద్రించుట నీకు తగునా?" అని నిందోక్తులతో తెలుపుచున్నారు. బైటనున్న గోపాంగనలు లక్ష్మణస్వామి వంటివారును, ముముక్షువుల వంటివారును, లోపల నిద్రించు నామె నిత్య, సిద్ధుల వంటిది. అనగా, లక్ష్మణస్వామి శేషత్వమునకు ప్రతినిధి. కావున, కైంకర్యము చేయనిచో శేషత్వము బ్రతుకదు. ఆ కైంకర్యమైనను లక్ష్మీనారాయణు లిద్దరి గోష్ఠిలో చేయవలెను.

"భవాం స్తు సహ వైదేహ్యా। గిరిసానుషు రంస్యతే।
అహం సర్వం కరిష్యామి। జాగ్రత స్స్వపత శ్చ తే॥"

"అన్నా! శ్రీరామచంద్రా! మీరు సీతాదేవితో కలసి పర్వతచరియలయందు విహరింతురుగాక! నేను మీరు నిద్రించుచున్నప్పుడును, మేల్కొని యున్నప్పుడును మీకు సర్వవిధ కైంకర్యములను చేయుదు"నని "స భ్రాతుశ్చరణౌ గాఢం నిపీడ్య" పాదములను గట్టిగా పట్టుకొని ప్రార్థించెను. అటులనే యీ గోపికలును కైంకర్య నిష్ఠలు. ముముక్షువులును ఇట్టివారే, వారు గావించు కర్మ జ్ఞాన భక్తులు భగవత్కైంకర్య బుద్ధితోనే గావింతురు. ఇక, నిద్రించు గోపిక నిత్యసూరుల వంటిది. అనగా. గుణానుభవముతోనే కాలక్షేపము చేయునది. వారికి భగవత్ప్రాప్తి నిత్యసిద్ధమే యగుటచే దాని కొరకు నేమియు చేయవలసిన యవసరము లేకపోవుటచే నిరంతరము భగవదనుభవముతోనే కాలమును గడుపుచుందురు. ఈ పరుండియున్న గోపికయు నట్టి యోగ్యత గలది గాన తన యింటనే యుండి శ్రీకృష్ణానుభవముతోను, ఆతని కల్యాణగుణానుభవముతోను కాలమును గడపుచున్నదని తాత్పర్యము.

## తొమ్మిదవ పాశురము

తూమణి మాడత్తు శుత్తుం విళక్కెరియ,
తూపంకమ ళ త్తుయిలణై మేల్ కణ్వళరుమ్,
మామాన్మగళే! మణిక్కదవం తాళ్ తిఱవాయ్,
మామీర్! అవళై యెళుప్పీరో, ఉన్ మగళ్దాన్
ఊమైయో? అన్ఱి చ్చెవిడో? అనన్దలో?
ఏమ ప్పెరున్తుయిల్ మన్దిర ప్పట్టాళో?
మా మాయన్ మాదవన్ వైకున్ద నెన్ఱెన్ఱు,
నామం పలవుం నవిన్ఱేలో రెమ్బావాయ్.

### — తాత్పర్యము —

"కావలసిన ఆయనే వచ్చు" నని భగవంతుని సన్నిధికి పోవుట మాని పరుండియున్న యొక గోపికను లేపుచున్నారు. (ఇది ఉపేక్షచే గాని, గర్వముచే గాని కాదు. ఇది పరగతస్వీకారాధ్యవసాయము.)

పరిశుద్ధములగు మాణిక్యములతో నిర్మించబడిన మేడలో చుట్టును దీపములు వెలిగించుకొని అగరు ధూపములు పరిమళించుచుండగా మిక్కిలి మెత్తనైన హంసతూలికా తల్పమున పరుండియున్న యో మేనత్తపుత్రికా! మాణిక్యపు తలుపుల గడియను తీయుము. ఓ అత్తగారూ! ఆమెను లేపుడు. మీ పుత్రిక మూగదా? చెవిటిదా? లేక బద్ధకమా? లేవకుండ నెవ్వరైనను కావలిపెట్టిరా? చాలకాలము నిద్రించునట్లు ఎవ్వరైనను మంత్రించిరా? "గొప్ప ఆశ్చర్యగుణచేష్టలు గలవాడు శ్రియఃపతి పరమపదవాసి" అని యనేక తిరునామముల ననుసంధించితిమి. లేవదేల?

### — విశేషార్థము —

తూమణిమాడత్తు -

దోషములు తొలగించవలసిన యవసరము లేకుండగనే సహజమగు మంచితనముగల మణులతో కట్టబడిన మేడ.

భక్తులకు విరహతాపము నుపశమింపజేయు రెండువిధానము లున్నవి. భగవంతుని స్వరూప రూపగుణ విభూతుల ననుభవించుటగాని, లేక, పరమభాగవతులను, వారికి సంబంధించిన పదార్థము లను, చేష్టలను, మాటలను గాని యనుసంధించుట, కూరత్తాళ్వార్లు "ఒక శ్రీవైష్ణవుని యొక్క గృహ యాత్ర ననుసంధించుట హితమును, ప్రియమును" అని సాయించిరి. శ్రీపరాశరభట్టరువారున్ను "ఈ ముప్పది పాశురముల ననుసంధింపలేకున్నను "నామిరున్ద విరుప్పై నినైప్పతు" అనగా "మేమున్న స్థితిని తలచుకొను" డని సాయించిరట. ఈ ఫలసిద్ధికే దేవరాజగురువులు (ఎరుమ్బియప్పా) శ్రీవరవర మునుల నిత్యానుష్ఠానమును 'పూర్వోత్తర దినచర్య' యను పేరుతో సాయించిరి. ఇది పంక్తి పావన మని శ్రీవైష్ణవులు సాపాటుగోష్ఠికి ముందు దీనిని తప్పక అనుసంధించు ఆచారమున్నది. భగవంతుని స్వరూప రూపగుణవిభూతులను స్మరించుకొని, ఆపాదమస్తకమును పులకరించి, నేత్రములనుండి ఆనందభాష్పములను గార్చు భాగవతోత్తములను సేవించుట పరమపురుషార్థముగ శాస్త్రమున చెప్పబడి యున్నది. అట్టి వైలక్షణ్యము ఈ పరున్నగోపికకు కలదు.

నమ్మాళ్వారు తులై విల్లిమంగళ మనెడు పెరుమాళ్లకోవెలను వర్ణించుచు "తువళిళ్ మామణి మాడమ్" అని సాయించిరి. ఇచ్చట ఆండాళ్ తల్లి గోపాంగన భవనమును "తూమణి మాడమ్" అని వర్ణించుచున్నారు. ఈ రెంటికిని తారతమ్యమును గమనింపుడు. 'తువళిళ్' అనగా-దోషము లున్నవి గాని సాన బెట్టి ఆ దోషములు తీసివేసిన మణులతో కట్టిన మేడ అయనది. అసలు దోషములే లేని మణులతో కట్టిన మేడ యీమెది. అపహతపాప్మత్వము జీవాత్మకును కలదు, పరమాత్మకును కలదు. జీవుని అపహతపాప్మత్వము హేయసంబంధార్హమైనది. పరమాత్మ అపహతపాప్మత్వము హేయసం బంధానర్హమైనది.

అపహతపాప్మా = పాపదూరుడు

విజరః = ముసలి తనము లేనివాడు

విజిఘిత్సః = ఆకలి లేనివాడు

అపిపాసః = దాహము లేనివాడు

విమృత్యుః = చావు లేనివాడు

విశోకః = దుఃఖము లేనివాడు

సత్యకామః = కావలసిన వన్నియు ఏ కొరతయులేక కలవాడు

సత్యసఙ్కల్పః = వ్యర్థము కాని తలంపుకలవాడు.

ఉపనిషత్తులలో "య ఆత్మని తిష్ఠన్, ఆత్మనోऽన్తరో, య మాత్మా న వేద, యస్యాత్మా శరీరమ్" పరమాత్మకు జీవుడు శరీరస్థాన మని కలదు. ఈ శరీరమైన జీవునియొక్క అపహతపాప్మత్వాదులు సంసారదశలో కర్మచే కప్పబడి ప్రకాశించవు. మోక్షదశలో కర్మ లుండవు గాన ఆ గుణములు ప్రకాశించును. దీనినిబట్టి పరమాత్మకోవెల (జంగమ శ్రీ విమానాని హృదయాని మనీషిణాం = భక్తుల హృదయములు పరమాత్మకు సంచరించు కోవెలలు) జీవు డగుచున్నాడు. ఈ జీవునకు గల అపహతపాప్మత్వాదు లెనిమిదియు నెనిమిది మణులవంటివి. ఈ మణులకుండు దోషము లీ మోక్షదశలో తొలగించబడినవి కాబట్టి 'తువళిల్ మామణి' అని దోషములు తొలగించబడిన మాణిక్యములతో ఆయన కోవెల నిర్మించబడినదనిరి.

జీవునకు పరమాత్మతో గల తొమ్మిది సంబంధములలో ఆధారాధేయ భావ సంబంధమొకటి. అనగా జీవుడు ఆధేయము, పరమాత్మ ఆధారము. అపుడు జీవునకు పరమాత్మ శరీరము వంటివాడగును. "ఐశ్వర్యాదికామాః మత్స్వరూపస్యాతిశయహేతవః । జ్ఞానీ తు మమ స్వరూపసత్తాహేతురితి స్వ భక్తస్తుతిపరోऽయం శ్లోకః యస్మాదయం మయా వినా ఆత్మధారణాసమ్భావనయా మామేవానుత్తమం ప్రాప్యమా స్థితః। అతః తేన వినామమా ప్యాత్మధారణం న సమ్భవతి। తతో మమాత్మా హి సః। అయ మర్థః త్రయ్యన్త సిద్ధాన్తో భవతు వా మావా కృష్ణ సిద్ధాన్త స్త్వయ మితి ఘుష్యతామ్ । ఆధారత్వాదివిశేషో హి ఆత్మలక్షణ మితి భావః. (గీత. 7.18 తాత్పర్యచన్ద్రికాయాం) ఆయనకు గల అపహతపాప్మత్వాది మణు లెప్పుడును దోషదూరములై ప్రకాశించుచునే యుండును. ఈ ప్రకాశము వీరికి స్వాభావికము. కాబట్టి జీవుని శరీరము (శరీరస్థానములో నున్న పరమాత్మ) సహజప్రకాశముగల మణులతో నిర్మింపబడిన దనుచున్నారు. గోపాంగన భవన మట్టిదని భగవంతుని భవనముకన్న ఈ భవనమున కొక వైలక్షణ్యము చెప్పబడినది.

ఉపనిషత్తులలో శుద్ధాత్మస్వరూపమును చెప్పునపుడును, పరమాత్మస్వరూపమును చెప్పునపుడును "అపహతపాప్మా" ఇత్యాది వాక్యము చెప్పబడును.

## కణ్వాళరుమ్ -

"లక్ష్మణస్వామివారి వలె నిద్ర లేకుండుటకు మేము, స్వేచ్ఛగా నిద్రించుటకు నీవును తగియున్నాము." ఈ నిద్రించు గోపాంగన "ఫల మత ఉపపత్తేః" (ఆయన వలననే ఫలప్రాప్తి. దాని కెన్నియో ఉపపత్తులు కలవు) అను బ్రహ్మసూత్రమునందు నమ్మకము కలది. "నారాయణనే నమక్కే పఱై తరువాన్ " అను సిద్ధాంత మీమెదే. అనగా, "భక్తులకు అభీష్టము నొసంగువాడు నారా

యణుడే కదా! వీరికీ యారాట మేల?" యని యామె తలంపు. "ఫలము అతడిచ్చునది కాదు. అతడే అయియుండగా నీమె యెట్లు పరుండియున్నది?" అని వీరి యభిప్రాయము. "కణ్వాళరుం" అనునది నిద్రించు పెద్దల విషయమై వాడునట్టి పారిభాషిక పదము,

## మామన్ మగళే -

అర్జునుడు శ్రీకృష్ణుని బావమరది సంబంధమును పురస్కరించుకొని "అతిపరిచయా దవజ్ఞా" అనునట్లు అని అనిపించుకొనుటకు అలవాటుపడి చివరకు విశ్వరూపమును సేవించి "అమ్మో! ఈతనిని నేను సామాన్యప్రాకృత చుట్టమునుగా విభావించి అవమానపరచితినే! ఇపుడేమి దారి? యని

"సఖేతి మత్వా ప్రసభం యదుక్తం ।
హే కృష్ణ! హే యాదవ! హే సఖే తి ।
అజానతా మహిమానం తవేదం ।
మయా ప్రమాదా త్ప్రణయేన వాపి॥
తత్క్షామయే త్వా మహమప్రమేయమ్॥"

అని క్షమాపణ నర్థించెను. అట్లనదగిన సంబంధము నాశించి ఆండాళ్ తల్లి యా గోపికను మేనత్తకూతురునుగా భావించెను. ఆ గోపిక వీరిని మీరే గడియను తెరచుకొని రండని చెప్పగా

## మణిక్కదవం తాళ్ తిరవాయ్ -

"నీవే వచ్చి తలుపు తెరువు" మనుచున్నారు దేశికులే గదా భాగవత దర్శన ప్రతిబంధకమును తొలగించ వలసినవారు! కావున నీవే వచ్చి తలుపు తెరువు మనిరి. ఈ గోపాంగనలు తలుపు తెరచియే యున్నను ఎవరైనను పురుషకారముగా నుండి ప్రవేశబెట్టిన గాని తమంత తాము ప్రవేశించరు.

దుర్యోధనుడు మయసభలో నీటికిని, స్ఫటికమయ మండపమునకును భేదమును గ్రహింపలేక నీరున్నచోట లేదనుకొని జారిపడగా ద్రౌపది చూచి నవ్వెను. అట్లు మేనత్త సంబంధమును బట్టి పరిహసించుటుకా? అనిరి. అది మాణిక్యమయ భవన మగుటచే బైటనున్నవారికి లోపలనున్న వస్తువులు గాన్పించునట్లే, లోపలివారికిని బైటనున్నవి కాన్పడును. గాన తలుపునకును, గడియకును భేదము గ్రహించలేక మేము తడబడుచుండగా మా అజ్ఞత్వమును జూచి నీవు పరిహసింప దలచుచున్నావా? కావున నీవే వచ్చి తెరువుము. అనుచున్నారు.

మామీర్ అవళై యెళుప్పీరో ఉన్ మగళ్ -

అత్తగారూ! మీ అమ్మాయిని లేపండి.

కదలక మెదలక పరుండియున్న గోపాంగనపై నున్న కోపము నంతను ఆమె తల్లిపై చూపుచు 'మీ అమ్మాయి' అనుచు వేర్పాటును చూపుచున్నారు.

ఈ వేర్పాటు అపురుషార్థము, పెద్దలీ వేర్పాటును ఒక శిక్షగా భావింతురు. ఒక భాగవతోత్తములు ఎవనిని 'నావాడ'ని భావింతురో వాడు తరించును. ఒక దుర్మార్గుడు 'నావా'డని యెవనిని భావించునో వాడు నశించును. ఇది భాష్యకారుల సిద్ధాంతము.

"పశు ర్మనుష్యః పక్షివా । యే చ వైష్ణవ సంశ్రయాః ।
తేనైవ తే ప్రయాస్యన్తి । తద్విష్ణోః పరమం పదమ్॥"

కలుషిత హృదయము గల ధృతరాష్ట్రుడు తన బిడ్డలగు దుర్యోధనాదులను "మా మకాః" అని అభిమానించెను. వారందరును నశించిరి. శ్రీకృష్ణుడు పాండవులను "మమ ప్రాణా హి పాణ్డవాః" అని భావించెను. వారందరును ఉజ్జీవించిరి.

ఉన్ మగళ్దా నూమైయో -

"మీ అమ్మాయి మూగిదా? మాటలాడ జాలదా? నాలుక లేదా?" అని దెప్పుచున్నారు.

అన్ఱి చెవిడో? -

మూగివారైనను కనిపెట్టి వచ్చి తలుపు తీయవచ్చును. మీ అమ్మాయి చెవులకు రంధ్రములు లేవా ?

అ న న్ద లో? - లేక పరాకుగా నున్నదా?

ఏమప్పెరున్తుయిల్ మన్దిర ప్పట్టాళో -

ఏమప్పట్టాళో? పెరున్తుయిల్ మన్దిర ప్పట్టాళో? 'ఏమం' అనగా కావలి. లేవకుండుట కెవరైనను కావలి వారున్నారో? (మన్తిర పట్టాళో?) దీర్ఘకాలము నిద్రించుటకు మంత్రించిన వారున్నారా? ఎవరైనను 'అమ్మాన్ పొడి' చల్లిన వారున్నారా? (మనుష్యులను మాయ చేసి దొంగిలించు

కొని పావువారు గోటిలో నొక పాడి నిడుకొని వచ్చి పైన జల్లగనే "అమ్మా! అమ్మా!" అని వారిని వెంబడించి పోవునట్లు చేయును) ఆ మాటలను విని ఆమె తల్లి యామె మేల్కొనుటకు "తిరునామ సంకీర్తనము చేయు" డనెను.

### మామాయన్ -

ఆశ్చర్య కరములైన గుణముల చేతను, చేష్టల చేతను స్త్రీలమగు మమ్ములను స్వాధీన పరచుకొనువాడు.

### మాధవన్ -

దానికి మూల మా శ్రియఃపతి యగుటయే.

### వైకుందన్ -

శ్రియఃపతి యగుటచే వచ్చిన పరత్వమునకు తగిన స్థానవిశేషము కలవాడు. అట్టి గొప్ప మహత్త్వము గల శ్రియఃపతి సుమండీ! స్త్రీలకింత సులభుడైనాడు. అమ్మా! అత్తగారూ! పరత్వమునకు మూలమైన తిరునామములను, సౌలభ్యమునకు మూలమైన తిరునామములను ఆ రెండిటికిని కారణ మగు శ్రియఃపతిత్వమును తెలుపు తిరునామముల నెన్నిటినో చెప్పితిమనుచున్నారు.

## — వేదాంతార్థము —

ఈ లేపబడు గోపిక తదేకోపాయాధ్యవసాయముగల యొక భాగవతోత్తముడు. "మా మేకం శరణం వ్రజ" అనుచో ఏక శబ్దము అవధారణార్థకము. అనగా 'నన్నే' యని యర్థము. ఇదియు నితర యోగమును నిషేధించును. ఆళ్వారులు "నీ స్వీకారము నైనను నీకు ఉపాయమని తలంచకుము. "అదువుం అవన దిన్నరుళే" అది ఆయన కృప చేతనే వచ్చినదని భావింపుము అని సాయించిరి.

### మామాన్ మకళే -

మామాన్, అమ్మాన్ - అను రెండును పర్యాయపదములు. అనగా 'స్వామి' యని యర్థము. అతని పెణ్ణ యనగా పుత్రుని వలె అభిమానించ దగిన వారని యర్థము. అట్టివారెవరు? అనన్యార్హ భాగవతోత్తములు. వారినే తమకు అభిముఖులుగా జేసికొనుచున్నారు. వారెట్టివారనగా-

### తూమణిమాడత్తు -

వారి శరీరము పంచోపనిషణ్మయ అప్రాకృత దివ్యమంగళవిగ్రహము.

ఏత్తుం విళక్కేరియ -

అందు జ్ఞానమను దీపము వెలుగుచుండగా, జ్ఞానమును దీపముతో పోల్చుదురు.

"తేషా మేవానుకమ్పార్థ । మహ మజ్ఞానజం తమః ।
నాశయా మ్యాత్మభావస్థో । జ్ఞానదీపేన భాస్వతా ॥"

అట్టి శరీరమున వీరి జ్ఞానము సర్వతోదిక్కముగా ప్రకాశించుచుండగా

తూపం కమழ -

జ్ఞానము పరిమళించగా. జ్ఞానమునకు పరిమళ మనగా - అది అనుష్ఠానమున కుపకరించుట. జ్ఞానము జ్ఞానముకొరకే కాదు. అది అనుష్ఠానమున కుపయోగపడవలెను. పరిమళముచే పుష్పను తెలిసికొనునటుల అనుష్ఠానముచే జ్ఞానము నెరుంగవచ్చును. కావుననే శాస్త్రమున "అనుష్ఠానేన జ్ఞానవత్తా మనుమాయ శిష్యే నోపసత్తిః కర్తవ్యా" అని చెప్పబడినది. జ్ఞానానుష్ఠానములు పరమపదప్రాప్తికి ప్రధానసాధనములు. జ్ఞానము కన్నువంటిది. అనుష్ఠానము కాలువంటిది. ఆ యనుష్ఠానముచే ఆచార్యులు జ్ఞానవంతులని యెరింగి శిష్యుడు వారి నాశ్రయించవలెను. అట్టి యాచార్యుల వలననే తానును జ్ఞానానుష్ఠాన సంపన్నుడై పరమపురుషుని బడయగలుగును.

"ఞాన మను ట్టాన మివై నన్గాగవే యుడైయ
నాన, గురవై యడైన్దక్కాల్, మానిలత్తీర్
తేనార్ కమల త్తిరుమామగళ్ కొళునన్
తానే వైకున్దం తరుమ్".

"భూలోకవాసులారా! మీరు జ్ఞానానుష్ఠానములు లెస్సగాగల గురువు నాశ్రయించినచో శ్రియఃపతి మీకు స్వయముగ పరమపదము నిచ్చు" నని శ్రీవరవరమునులు ఉపదేశ రత్నమాలలో ఆనతిచ్చిరి.

తుయిలణై మేల్ కణ్వళరుమ్ -

ఇచ్చట నిద్రయనగా పారవశ్యము. అనగా, మోక్షమునకై తన ప్రయత్నము నంతను పూర్తిగా విడచుట. ఇదియే ప్రపత్తి. దీనిని పురస్కరించుకొని భగవంతు డొక్కడే యుపాయమని గట్టి నమ్మకము గల భాగవతులను

మణికప్పుడపం తాళ్ తిఱవాయ్ -

అని ప్రార్థించుచున్నారు.

మాణిక్యమయమైన తలుపులు. వానిని తెరవకుండ అడ్డునట్టి మాణిక్యమయమైన గడియ. దానిని తెరవవలెను. మణిమయములగు తలుపులు - అనగా - దేహము, ఆత్మ యను రెండును ఆకర్ష కములే. వీనియందుండు మమకారమే గడియ. అదియును వైరాగ్యము కలుగువరకు భోగ్యముగానే యుండును. ఆ గడియతో (మమకారముతో) బిగింపబడిన దేహాత్మలు లోపలనున్న పరమాత్మను చూడనీయవు. దేహమునందలి మమకారము ఐహిక సుఖములకై ఆరాటమును చెందుచుండును. ఆత్మయందలి మమకారము కైవల్యమునకై ఆరాటమును చెందుచుండును. కావున ఆ మమకారము లను తొలగించిన (ఆ గడియను తీసిన) తలుపులు తమంతనే తెరచుకొనును. లోపలనున్న పరమాత్మ యందు ప్రీతి కలుగును. అట్టి మమకారమును తొలగించి ఆ తలుపులను తెరచి ఆ ప్రీతి పరమాత్మ పర్యంతమును ప్రవర్తింపజేయుడని భాగవతోత్తములను ప్రార్థించుచున్నారు.

ఇంకను లోతుగా దిగినచో

"హిరణ్మయేన పాత్రేణ సత్యస్యా పిహితం ముఖమ్ ।
తత్తే పూషన్నపావృణు సత్య ధర్మాయ దృష్టయే॥"

అను నీ ఈశావాస్య మంత్రార్థ మీ పదముచే నుపబృంహిత మగుచున్నది.

సత్యస్య = జీవుని, ముఖం = మనస్సు, హిరణ్మయేన పాత్రేణ = భోగలాలసచే, అపి హితం = నిరుద్ధమైనది. (పరమాత్మను చూడనిచ్చుటలేదు.) పూషన్ = శ్రియఃపతీ! తత్ త్వం అపావృణు = నీవు దానిని తొలగింపుము, సత్యధర్మాయ = జీవునకు ప్రాప్తమైన, దృష్టయే = నీ దర్శనము కొరకు.

ఇది భగవంతుని గూర్చిన ప్రార్థన. ఇట్లు వీరు ఆచార్యుని ప్రార్థించుచున్నారు.

భగవద్భక్తియును, భగవత్సౌందర్యమును తలుపులు. వానియందలి మమకారము గడియ. ఇవి నిజముగా మాణిక్యమయములే = అత్యంతా కర్షకములే. ఇవి దేని నడ్డుచున్నవనగా, భాగవతా చార్యానుభవమును అడ్డుచున్నవి. దానిని తొలగించి అంతిమోపాయనిష్ఠను ప్రసాదించుమని ప్రార్థించు చున్నా రనవచ్చును.

మామీరవకై యెళుప్పీరో -

మాకు స్వామినియైన దానా! నీ సొత్తైన యీమెను లేపుమనుట. ఇచ్చట లేపబడు అధికారిని పుట్టించినది అనన్యోపాయత్వ స్వరూపజ్ఞానము. తదేకోపాయత్వాధ్యవసాయ నిష్ఠగల భాగవతోత్తము

లను గదా లేపుచున్నారు. వారి కా యధికారము దేనివలన కలిగినది? అనన్యోపాయత్వ స్వరూప జ్ఞానముచే కలిగినది. అందుచే తదేకోపాయత్వాధ్యవ సాయమునకు అనన్యోపాయత్వాధ్యవసాయనిష్ఠ తల్లివలె జనకము. "ఇతరులు నాకు ఉపాయభూతులు కారు" అను అధ్యవసాయమున్ననే గదా "భగవంతు డొక్కడే యుపాయ" మను గట్టి విశ్వాసము పుట్టునది. అట్టివారి లక్షణమును చెప్పుచున్నారు.

ఊ మై యో - మూగిదా?

ఇతర ప్రసంగములలో మూగవాడై యుండవలెనని తాత్పర్యము.

అన్టి చ్చెవిడో -

లౌకిక శబ్దములను చెవులతో వినరాదు.

అ న న్ద లో -

భగవదనుభవ విరోధములగు లౌకిక వృత్తులలోను, కామ్య కర్మలలోను బద్ధకముండవలెను.

ఏ మప్పట్టాళో - లేవకుండా అడ్డువారున్నారా?

స్వప్రవృత్తి యేమాత్ర మున్నను ఉపాయమునకు (ప్రపత్తికి) విరోధిగాన దానిలో నన్వయించకుండ అడ్డుపెట్టువారు, (నమః పదము - మః న - తనకని యేమియును చేయరాదని కదా దాని కర్థము) ఉన్నారు.

పెరుమ్ తుయిల్ మన్దిర ప్పట్టాళో -

గొప్ప నిద్రపట్టునట్లు మంత్రించిరా?

ఆ మంత్రము ఉపాయ వైలక్షణ్యమును తెలుపు "నారాయణ" పదమే. గాఢనిద్ర ప్రవృత్తుల నరి కట్టునట్లు ఈ వైలక్షణ్యము ఇతర ప్రవృత్తులు వేనియందును అన్వయించనీయదు. "కాలాళుమ్, కణ్శుళ్గలుమ్, నెఞ్జాళ్గియుమ్" పాదములు నిమగ్నములగును, కన్నులు గుంటలు పట్టును, మనస్సు శిథిలమగును.

ఇంకను వీరికి తమ యోగ్యతను తెలిపి చట్టున వేంచేసి యనుగ్రహించునటుల తదేకోపాధ్యవ సాయనిష్ఠకు తగినటుల తన్నామోచ్చారణమును చేయవలెను.

మా మాయన్ - అత్యంత సులభుడు.

"నీ వింత సులభుడ వెందు కైతివి, నీ పరత్వ మెక్కడ? నీ సౌలభ్య మెక్కడ?" అని ప్రశ్నించుటకు వీలులేనివాడు. మా-మాయన్ = "మాయా, వయునం, జ్ఞానమ్" అను కోశానుసారము సంకల్పాత్మక జ్ఞానము కలవాడు. అనగా- "నా యిష్ట" మని సమాధానము నొసంగు మొనగాడు.

మా త వ న్ -

"నీ వంత పరాత్పరుడవై యుండి యీ సౌలభ్య మెచ్చట నేర్చితివయ్యా?" అనిన అతని గురుకులవాసస్థానమును తెలుపుచున్న దీ పదము. అనగా, లక్ష్మీ సమాశ్రయణమువలననే లభించిన దీ సౌలభ్యము.

వై కు న్ద న్ -

ఈ సౌలభ్యము నిట్లు ధూళిదానమును గావించుమన్నావే, మరల "అవజానన్తి మాం మూఢాః" అందువే. మరి యేమగుననుకొని యీ సౌలభ్యమును చూపుచున్నావు? అన్నచో "అయ్యో! ఆ సౌలభ్యమును గుణముగా ప్రకాశింపజేయు పరత్వమున్నదని యీ పదము చెప్పుచున్నది. పరత్వ, సౌలభ్యములున్ననే యా వస్తు వుపాదేయ మగుచున్నది. 'నారాయణ' పదమునకు తత్పురుషచే పరత్వమున్ను, బహువ్రీహిచే సౌలభ్యమున్ను తెలియుచున్నవి కదా!

## సందర్భానుసారముగ ననుసంధించుకొన దగిన పాశురములు -

తూమణిమాడ – అనుచోట

తువళిల్ మామణిమాడ మోఙ్గు తులైవిల్లి మఙ్గలమ్ తొళు
మివళై, నీరినియన్నై మీరుమక్కాశై యిల్లై విడుమినో,
తవళ వొళ్ శఙ్గుశక్కర మెన్రుమ్ తామరై త్తడఙ్గణెన్రుమ్,
కువళై యొణ్ మలర్క్కణ్ గళీర్ మల్క నిన్రు నిన్రు కుమిఱుమే.

(తిరు. మొళ్రి. 6.5.1)

తాత్పర్యము

జ్యోతిష్కులు ఆళ్వార్నాయికను చిన్నతనమున చూచి తులైవిల్లిమంగలములో వేంచేసి యున్న పెరుమాళ్ల నీమె చూడకుండ భద్రపరచుకొనుడు. వారిని సేవించినచో నిక ఈమె మీకు దక్కదని చెప్పిరి. కాని ఆ వంశీయు లెవ్వరును ఆ పెరుమాళ్లను సేవించక యుండజాలరు.

అందుచే నొక్కసారి ఆమెను సేవింపజేసి యింటికి తీసికొని వచ్చిరి. కాని ఆళ్వారునాయకకు మాత్రము ఆ పెరుమాళ్లను విడచుట ప్రాణములను విడచునట్లుండెను. ఆళ్వార్లు అలయమునకు ప్రయాణమగుటను, తల్లిగారు అడ్డుపడుటను జూచి ఆళ్వార్ల సఖి వారి తల్లితో చెప్పుచున్నది.

"ఓ తల్లీ వద్దన్నను వినక ఈమె కా పెరుమాళ్లను సేవింపజేసితివి. ఈ బిడ్డపై మీ రాశను విడచి పెట్టుడు. ఈమె మాటిమాటికి ఆ స్వామియొక్క శంఖమును, చక్రమును, అందములైన నేత్రములను తలంచుకొని యేడ్చుచున్నది. మీరు అడ్డినచో నిక బ్రతుకదు."

తూపం కమ్ముం - అనుచోట,

ఆరుక్కెన్ శొల్లుగేన్ అన్నై మీరుగా ళారుయిరళ వన్ది న్కూర్ తవ్వాడై,
కారొక్కు మేని నజ్కణ్ణన్ కళ్వమ్ కవర్న్ద వత్తనినెజ్జమవన్ కణఃదే
శీరుత్త వగిఱ్పుగైయాళ్ నరమ్బు పజ్జమమ్ తణ్ పశుమ్ శాన్దణైన్దు,
పోరుత్త వాడై తణ్ మల్లిగైప్పూ ప్పొదు మణముగన్దు గొణ్డెతియుమాలో.

(తి, వా. మొ, 9.9.6)

## తాత్పర్యము

శ్రీకృష్ణుడు అడవినుండి సాయంకాలమున ఆవులను, దూడలను తోలుకొని వచ్చుటలో కొంచె మాలస్యమైనచో "నీ వడవిన్ పగల్దిరుగ నీ కుటిలాలక లాలితాస్య మిచ్ఛావిధి జూడకున్న నిమిసంబులు మాకు యుగంబులై చనున్" అనుచు గోపాంగనలెట్లు బాధపడిరో అటులనే ఆళ్వారును ఆ కాలపు చిహ్నలను చూచి దుఃఖపడుచున్నారు.

శ్రీకృష్ణుడు నా హృదయము నపహరించెను. పరిమళముగల ధూపము. వీణాధ్వనివంటి కోకిల పంచమస్వరము, తెల్లని చందనము అను సామగ్రితో నీ యుత్తరవాయువు మల్లిపువ్వుల పరిమళమును తెచ్చి నాపై వీసురుచున్నది. ఓ తల్లులారా! ఈ క్రూరమైన గాలిని నేను భరించజాలను. ఎవరి కేమి చెప్పుకొనగలను ?

ఏమప్పెరుస్తయిల్ మన్దిరప్పట్పాళొ - అనుచోట. నా. తి.

పెయ్యు మాముకిల్పోల్వణ్ణా వున్దన్ పేచ్చుమ్ శెయ్కైయుమ్, ఎజ్ఞై

మైయలేత్తి మయక్క వున్ ముకమ్ మాయమన్దిర న్దాన్కొలో

.... .... .... .... .... .... .... .... .... .... .... .... .... .... ....

.... .... .... .... .... .... .... యెజ్గళ్ శిత్తిల్ వన్దు శిదై యేలే.

## తాత్పర్యము

ఆండాళ్ తల్లి ఫాల్గుణ మాసమున తన సఖురాండ్రతో మన్మథోత్సవపు వేడుకలను చేయుచుండగా శ్రీకృష్ణుడు వారిని ఆ పని మానిపించి తన వైపు త్రిప్పుకొనుటకై వారి పనులను చెడగొట్టుచుండగా అతనితో ఆండాళ్ తల్లి యిట్లనుచున్నారు. (వారు చేయు పని చేతనుని అనన్యభోగ్యత్వమున కాటంకమగుటచే నిట్లు చేసెను.)

కృష్ణా! నీవు వినయోక్తులను పలికి వేలుకొరికి ఒట్టుపెట్టగా నమ్మి మోసపోతిమి. బుద్ధి భ్రమించిపోవుచున్నది. ఇట్లు చేయుటకు నీ ముఖము మచ్చుమందువలె నున్నది. అందువలన మేమూరకొనియున్నాము. మేము కట్టుకొనిన పిచ్చుకల గూళ్లను, బొమ్మరిండ్లను చెడగొట్టకుము.



## పదియవ పాశురము

# "నోత్తుచ్చువర్కమ్"

— అవతారిక —

ఒక పాఠశాలలో అనేకమంది పిల్లలు చదువుచుండగా అందులో నొకడు సమర్థుడైనచో ఆతడే ఆ పిల్లలందరకు నిర్వాహకు డగును. ఈనాడు లేపబడు గోపిక అట్టిది. ఇతర గోపాంగనలు శ్రీకృష్ణు డనిన నెంత పాటుపడుదురో అటులనే ఆతనిని అంతగా త్రాహి త్రాహి యని పించునంతటి సామర్థ్యము గలది. అందుచే గోపికల లీమెను పురస్కరించుకొని శ్రీకృష్ణుని అనుగ్రహమును బడయ గోరుచున్నారు. శ్రీకృష్ణావతారమున నప్పిన్న పిరాట్టి గదా పురుషకారభూతురాలు? మరల నిపుడు వీరీ గోపాంగనను పురుషకారముగ నాశ్రయించినచో పురుషకారమునకు పురుషకారము, దానికి తిరిగి మరియొక పురుషకారమునను అనవస్థాదోషము రాదా? యన్నచో

"సత్సఙ్గాత్ భవ నిస్పృహో గురుముఖా చ్ఛ్రీశం ప్రపద్యాత్మ వాన్"

అని వరదార్యులు సాయించిన శ్లోకమున మొదట సత్సాంగత్యము, దానివలన వైరాగ్యము దాని వలన సదాచార్య సమాశ్రయణము, దాని మూలమున పిరాట్టి పురుషకారముతో భగవచ్ఛరణా గతియు వినిపించుచున్నవి గదా! అటులనే యిచటను గ్రహించవలెను.

సాత్త్వికులగు శ్రీవైష్ణవుల సమాశ్రయణము వలన నిత్యానిత్య వస్తువివేకము కలిగి త్యాజ్యో పాదేయ తత్త్వము (దేనిని విడువవలెనో, దేనిని పట్టవలెనో అను విషయము) స్పష్టముగా గోచరించును. ఆపైన ముముక్షువునకు అవశ్యకములైన తత్త్వహిత పురుషార్థముల నెరుంగుటకై మూడుమంత్రములు, వాని అర్థములు నెరుంగుటకై సదాచార్య సమాశ్రయణము గావించవలెను. దాని ద్వారా లక్ష్మీనారా యణుల శరణాగతిని బడయవలెను. అపు డీతడు లబ్ధసత్తాకుడై (ఉన్నవాడుగా లెక్కింపబడుట) ఆగామి కర్మలంటకుండుటను, సంచితకర్మలు నశించుటను బడయును. ప్రారబ్ధానుభవము తప్పదు గాన దాని ననుభవించి పిమ్మట పరమ పురుషుని యనుగ్రహముచే సుషుమ్నా ద్వారము నెరింగి బ్రహ్మ రంధ్రమును ఛేదించుకొని బైట పడి అర్చిరాది మార్గమున పరమపదము నధిరోహించును.

(ఇది సత్సఙ్గాత్, ముక్తోఽర్చిః అను రెండు శ్లోకముల సారార్థము)

ఆ సత్సంగతి వంటిది యీ గోపికా సంగతి. ఈమె సిద్ధసాధననిష్ఠ కలది. అనగా ప్రపన్నులు, ఇట్టి వారికి అన్ని యజ్ఞముల ఫలములున్ను శతే పంచాశన్న్యాయముగ ఇట్టివారనుభవించు ఫలములో అంతర్భూతములే. కావున వీనిని వారాచరించ నవసరము లేదు. భగవానుడు గీతలో

"యో మామేవ మసమ్మూఢో । జానాతి పురుషోత్తమమ్ ।
స సర్వవి ద్భజతి మాం । సర్వభావేన భారత॥"

నన్ను పురుషోత్తముడని, యెరింగినవానిని, నన్నుగూర్చి యెరుంగవలసిన వన్నియు నెఱింగినవాని నెంత ప్రేమింతునో, నన్ను భజించవలసిన విధము లన్నిటితో భజించిన వాని నెంత ప్రేమింతునో, యంత ప్రేమింతును. కర్మజ్ఞాన భక్తి యోగాదులు సాధ్య సాధనములు, అనగా, మన ప్రయత్నముచే సాధించ దగినవి. భగవంతుడు సిద్ధసాధనము. అనగా, అతడు ఎపుడును సిద్ధముగా నున్నవాడే కావున మనచే నిపుడు క్రొత్తగా సాధింపబడవలసిన యవసరము లేదు. ఈ రెండు విధములైన సాధనములకును ఏనుగు, దోమ కున్నంత తారతమ్యము గలదు. అవి యేవనగా-

| సాధనాంతరములు. | ప్రపత్తి (సిద్ధోపాయము) |
| --- | --- |
| 1. చేతనుని ప్రయత్నము చేతనే తన స్వరూపము సిద్ధించవలెను. | 1. అనాది సిద్ధ ధర్మమగుటచే సిద్ధమైనది. చేతన ప్రకృతితో సంబంధము లేదు. |
| 2. ఇవి యచేతనములగుటచే తామే స్వయముగా ఫలము నీయ జాలవు. పరమాత్మ అనుగ్రహమును కలుగ జేసి యాయన ద్వారా ఫలము నిప్పించును | 2. పరమ చేతనుడగుటచే నితరాపేక్ష లేకయే తానే స్వయముగా ఫలము నొసంగును "ఫల మత ఉపపత్తేః" అని బ్రహ్మ సూత్రము. |
| 3. ఇవి చేతన సాధ్యములగుటచే అనుష్ఠాన మధ్యలో నేవైనను ఆటంకములు రాగల అవకాశముండ వచ్చును. | 3. సిద్ధమగుటచే నా భయముండదు. |
| 4. చేతనుడు పరతంత్రుడు. "నమః" అనుటచే తన కొరకేమియు చేయ దగడు. కావున నిది చేతన స్వరూపాను గుణమైనది కాదు. | 4. చేతనుడు భగవంతునకు పరతంత్రుడు గాన తన రక్షణ భార మాతని యందే యుంచుట యనబడు నీ ప్రపత్తి యాతని స్వరూపమునకు తగినది. |

| సాధనాంతరములు | ప్రపత్తి (సిద్ధోపాయము) |
|---|---|
| 5. ప్రవృత్తి రూపములైన (చేయవలసిన) అంగములు కలవి. | 5. నివృత్తి రూపములైన (విడువవలసిన) అంగములు కలది. |
| 6. ఆలస్యముగా, అనగా, ప్రారబ్ధావసానము నందే ఫలము నొసంగును. | 6. ఇది ప్రారబ్ధమును కూడ త్రోసిపుచ్చి వెంటనే ఫలము నొసంగును. |
| 7. వీనికి త్రైవర్ణికులే, అనగా, వేదమును చదువతగిన అధికారులే అధికారులు. | 7. దీనికి అధికారి నియమము లేదు. ప్రతి వారును చేయవచ్చును. |
| 8. వీనికి దేశ, కాల, ఫల, అధికారి, ప్రకార నియమము లున్నవి. | 8. దీని కివియేవియు లేదు. |

ఇట్లు వీని కెన్నియో భేదములు కలవు.

## పదియవ పాశురము

నోత్తు చ్చువర్కమ్ పుకుకిన్ఱ వమ్మనాయ్,
మాత్తముం తారారో వాశల్ తిఱవాతార్,
నాత్త త్తుళాయ్ ముడి నారాయణన్ నమ్మాల్,
పోత్త ప్పఱై తరుమ్ పుణ్ణియనాల్, పణ్డొరునాళ్
కూత్తత్తిన్ వాయ్ వీళ్న్ద కుమ్బకరణనుమ్,
తోత్తు మునక్కే పెరున్దుయిల్ తాన్ తన్దానో,
ఆత్త వనన్దలుడైయాయ్! అరుఙ్గలమే!
తేత్తమాయ్ వన్దు తిఱవేలో రెమ్బావాయ్.

## — తా త్ప ర్య ము —

నోచి సుఖానుభవమును చేయుచున్న ఓ తల్లీ! తలుపును తెరవకపోయిన మానె గాని నోటి నైనను తెరువరాదా? పరిమళించు తిరుత్తుళాయిచే నలంకరించబడిన కిరీటమును ధరించిన నారాయణుడు మనచే స్తోత్రము చేయబడినవాడై మన వ్రతమునకు కావలసిన పరికరముల నిచ్చును. ధర్మస్వరూపుడగు శ్రీరామచంద్రునిచే పూర్వ మొకనాడు చంపబడిన కుంభకర్ణుడు నిద్రలో నీకు ఓడిపోయి తన సర్వస్వమైన నిద్రను నీకిచ్చి పోయెనా? పెద్ద నిద్రగలదానా? తడబడక చక్కగ సర్దుకొని వచ్చి తలుపును తెఱువుము.

## — వి శే షా ర్థ ము —

నో త్తు -

"కృతకృత్యాః ప్రతీక్షన్తే మృత్యుం ప్రియ మివా తిథిమ్"

చేయవలసిన వన్నియు చేసినవారు మృత్యువును ఇష్టుడైన అతిథి కొరకు నిరీక్షించువారి వలె నిరీక్షింతురను నీ ప్రమాణము చెప్పునట్లు ఈమె సిద్ధ సాధన నిష్ఠురాలు గాన నీమెకు ఉపాయమును గూర్చి యేమియు చికూచింతా లేదు.

సిద్ధసాధన నిష్ఠులకు కర్తవ్యాంశములు లేకుండుటకు కారణ మేమనగా —

1) ఆ భగవంతుని నిరపేక్ష రక్షకత్వము నెరింగిన వారికి తామై యే సాధనానుష్ఠానమును చేయ నవసరము లేదు. మన ప్రవృత్తి నే మాత్రమును అయన అంగీకరించడు. "మా మేకం శరణం వ్రజ" అనుచోట 'ఏకమ్' అను పదమునకు స్థాన ప్రమాణముచే 'ఏవ' అను అవధారణార్థము ను జెప్పి

" 'వ్రజ' ఎన్గిఱ స్వీకారత్తిల్ ఉపాయభావత్తై తవిర్క్కిరదు. అన్ద స్వీకారమ్ అవనాలే వన్దతు. సృష్ట్యవతార ముఖత్తాలే పణ్ణిన కృషిఫలమ్, "అదువు మవన దిన్నరుళే" అని సాయించిరి. అనగా —

ఈ 'వ్రజ' అను పదము భగంతు నుపాయముగా స్వీకరించుటలో గల ఉపాయభావమును నివర్తింపజేయుచున్నది. ఆ స్వీకారమున్ను అయన అనుగ్రహముచేత లభించినదే. అతడు సృష్ట్యాది వ్యాపారములు చేసి గావించిన కృషికి ఫలమే యీనాడు మన మాతని నుపాయమని నమ్మియుండుట. అదియును అయన దయయే యని సాయించిరి.

ఇట్లుండ నిక నాతడు మన ప్రవృత్తి నొక్కదానినైనను సహించడు గదా! గజేంద్రునకు మకరి బారినుండి విడుదలగుటకు వేయి దివ్యవర్షములు గడచినవి. అతని కంతవరకు ఈ స్వప్రవృత్తి నివృత్తి లేకపోవుటయే దీనికి కారణము. (అనగా, తనను తానే రక్షించుకొనగల నను అహంకారము విడువకపోవుట చేతనే.) "అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః" అని భగవంతుడు దేవతలలో నెవ్వరికిని లేని స్వాతంత్ర్యమును ప్రమాణముచేసి తెలిపెను. "మోక్షయిష్యామి" అనుచోట 'ణిచ్' చే "నానుం వేణ్డా, నీయుమ్ వేణ్డా, అవై రాజకుల మాహాత్మ్యత్తాలే తన్నడైయే విట్టుప్పోగ్గొణ్" (నీవునన్ను పొందుటకు అడ్డముగా నున్న పాపముల గూర్చి నీవు గాని, నేను గాని యేమియు చేయనవసరములేదు. అవి రాజసంబంధము కలవాని శత్రువులవలె తమంతనే తప్పించుకొని పోవును) అనెను. అనగా, ఆతని రక్షణము నిరపేక్షము, మన ప్రయత్నము నొకింతయు సహించదు. "నా శరీరమందున్న మురికిని నేనే పోగొట్టుకొననా?" అనును.

2. చేతనునకు తన శేషత్వము లెస్సగా నెరింగినచో కర్తవ్య ముండనేరదు. శేషభూతుల యోగక్షేమములారయు భారము శేషిదే. చేతనున కిక చేయదగిన దేదియు నుండదు. 'నమః' అని కదా స్వరూపము శిక్షింపబడినది. !

3. తన విరోధులగు పాపరాశులను చూచుకొన్నను, వానిని ప్రాయశ్చిత్తాదులచే గాని, అనుభవము చేతను గాని పోగొట్టుకొన దలంచినచో నది సముద్రోదకమును చింతాకుతో తోడి యెండింపజేయ దలంచువాని ప్రయత్నమువంటిదే యగును. ఆది "అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః" అన్న వానికే శక్యమగును. కావున మన కిక కర్తవ్యము లేదు.

4. ఏ యుపాయముల నవలంబించినను నవి యచేతనములగుటచే, భగవంతుని యనుగ్రహము ద్వారానే ఫలము నొసంగవలెను. కావున మన ప్రయత్నము వ్యర్థమే.

అట్లైనచో లేపువారికిని ఇదియే గదా స్వరూపము! వారేల యీ ప్రయాసకు పాలగుచున్నారు? అన్నచో, సిద్ధోపాయనిష్ఠులకు ప్రాప్యత్వర లేనిచో వారు చేతను లెట్లగుదురు? సిద్ధోపాయనిష్ఠులకు ఫలము లభించుటలో ఆలస్యముండవలసిన అవసరమేమి? వీరి విశ్వాస మాంద్యమా? అతని శక్తి మాంద్యమా? రెండును లేక యిక ఫలసిద్ధిలో నాలస్యమేల? అందుచే తహతహ లాడుచున్నారు.

(సిద్ధోపాయనిష్ఠులకును కర్మ జ్ఞాన భక్తులుండవలెను. కాని వానియందు ఉపాయబుద్ధిపే కూడదు.)

శువర్క్కమ్ -

ఇచ్చట స్వర్గ మనునది శ్రీకృష్ణునే. ఏలయనగా - కఠోపనిషత్తులో ప్రారంభముననే అనేకోప పత్తులతో స్వర్గ శబ్దమునకు 'నిరతిశయానంద' మని నిర్ణయించిరి.

1. శ్రీకృష్ణుడు ఆనందస్వరూపుడు. "ఆనందో బ్రహ్మ"

2. అతడు ఆనందగుణకుడు. "ఆనన్దం బ్రహ్మణో విద్వాన్"

3. అతడు ఆనందప్రదుడు. "ఏష హ్యేవానన్దయాతి" (ఆనన్దయతీత్యర్థః)

4. అతడు రసస్వరూపుడు. "రసో వై సః"

5. అతడు లభించుటయే ఆనందము. "రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వాఽఽనన్దీ భవతి"

ఈమె యింతమంది పిలచినను పలుకకుండుట కేమి కారణము?

1. "సంశ్రవే మధురం వాక్యం" అనునట్లు వారి మాటల భోగ్యతానుభవముచే నింకను విండ మను ఆశతోను.

2. "ప్రహర్షేణావరుద్ధా సా" అనునట్లు ఉన్మత్తకానుభవముచే నుక్కిరి బిక్కిరియై నోట మాట రాకపోవుటచేతను.

3. నేను దాసకోటికి చరమావధిలో నుండవలసి యుండగా వీరు నన్ను "అమ్మనాయ్" అను చున్నారే. ఇది నన్ను నిందించుటయే గదా యని తన స్వరూపమును తలంచుకొనుటచేతను.

4. నేను కృష్ణానుభవమును చేయుచున్నానని వీరు చెప్పుచున్నారు. నేనిప్పుడొక్క మాట మాట్లాడిన వారారోపించిన నేరము నొప్పుకొని లక్ష్యపెట్టినట్లుండునని తలంచుటచేతను.

మాత్తముం తారారో వాశల్ తిఱవాదార్ -

వాకిలిని మూసిన నోటిని మూయవలెనా? అనుచున్నారు.

భోగము నడ్డిన అడ్డుదువు గాక సత్తను కూడ అడంతువా? నిన్ను చూడక, నీ మాటలను వినక మేము బ్రతుకగలమా? నీ సరుకును (శ్రీకృష్ణుని) నీవే యుంచుకొనుము (నీ కృష్ణు నీయవద్దులే). మా సరుకునైనను మాకిమ్ము. మా సరుకు నీవే గదా! "ఆశారియన్ శిచ్చ నారుయిరై ప్పేణుమవన్, తేశారుం శిచ్చ నవన్ శీర్ వడివై" (ఉప. రత్న) ఆచార్యుడు శిష్యుని ఆత్మను కాపాడవలెను. శిష్యు డాచార్యుని దివ్యమంగళ విగ్రహమును కాపాడవలెనని సాయించిరిగదా!

నాత్తత్తుళాయ్ ముడి -

పరిమళించుచున్న తులసిమాలికను కిరీటమందు గలవాడు.

నీ శరీరమును శ్రీకృష్ణున కర్పణచేసినను, మాకు మాటనైనను ఈయరాదా? కన్నులను, చెవులను ఒకేమారు ఉపవసింపజేయవలెనా?

ఈ లేపబడు గోపిక "మధురా మధురాలాపా" అనగా, నేత్రములకు ఆనందకరమైన ఆకార ముగలదియు, చెవుల కింపైన మాటలుగలదియు.

"శ్రీకృష్ణు డిచ్చట నున్నాడా?" అనగా, శ్రీరంగచందనమును నీవు దాచగలవా? అనగా, ఇప్పు డాతడుండవలసిన అవసరము లేదు, ఆతడొక్కమారు కౌగిలించి విడచిన ఆ పరిమళము ఐదారు స్నానములవరకును నిలచునుగదా?

"ఆతడు నాయింట నెట్లు ప్రవేశించెనందురు?

నారాయణన్ -

ఆతడు లేనిచోటున్నదా? ఆతడంతటను వ్యాపించియున్నాడు గదా? ప్రహ్లాదుని, ఆతని తండ్రి "నీ విష్ణు వెచ్చట నున్నాడురా?" అని ప్రశ్నించగా "కిం బహుగిరా త్వయ్యస్తి మయ్యస్తి చ" అనెను. ఇట్లు శత్రువులను కూడ విడువనివాడు అయన ప్రీతికి పాత్రురాలవగు నిన్ను విడచునా?

నమ్మాల్ పోత్త ప్పఱై తరుమ్ -

మన మాతని స్తుతించినచో మన కాతడు వ్రతోపకరణముల నిచ్చును.

ప్పణ్ణియనాల్ పణ్ణొరునాళ్ -

"మిత్రభావేన సమ్ప్రాప్తం న త్యజేయమ్" అతనిచే రక్షింపబడుటకు అతనిపై ద్వేషము లేకున్నచాలును. అట్టివారికి సుకృతము తానే, రుచిజనకుడు తానే, ఉపాయమును తానే, ప్రాప్యమును తానే యయియుండువాడు. "సుహృదం సర్వభూతానాం" అనలేదా? ఎంతఔదార్యము! "యది వా రావణ స్స్వయమ్" అంతగా అసహ్యాపచారియైన రావణుడు వచ్చినను రక్షింపసిద్ధపడినాడే! మన భాగ్యముచే వానికా బుద్ధి పుట్టలేదు.

కూత్తత్తిన్ వాయ్‌వీఙ్ద -

రావణుడు చెరలో పెట్టిన మృత్యువు వాతనే పడిన కుంభకర్ణుడు.

కారుణికు డొకడు అందరును మంచినీటిని త్రాగుటకై త్రవ్వించిన బావిలో మునిగి చని పోయిన వానివలె శత్రువులకును ప్రియుడైన శ్రీరామచంద్రుని పట్ల అపరాధము గావించి నశించిన

కుమ్భకరణనుమ్ - కుంభకర్ణుడు.

తోత్తుమునక్కే పెరున్తుయిల్ తాన్ తన్దానో -

శ్రీరామచంద్రుడు పరశురాముని జయించి ఆతని చేతనున్న వింటిని లాగుకొన్నట్లు నీవు నిద్రలో కుంభకర్ణుని జయించి ఆ నిద్రను లాగుకొంటివా? వానిది నిద్ర మాత్రమే. నీది పెద్ద నిద్ర.

ఆత్తవనన్ద ఉడైయాయ్ -

నేను లేచుట కొక యరక్షణ మాలస్యమైనదని నన్ను వీరు కుంభకర్ణునితో పోల్చుచున్నారే యని తాను మేలుకొనియే యున్నట్లు వారెరుంగుటకై ఒళ్లు విరచుకొనుచు "కృష్ణ కృష్ణ" యనెను.

తేత్త మాయ్‌వన్దు తిఱ -

రెండవ అంతస్థులో పడుకొని యున్న దగుటచే తొట్రుపడక తెలివి తెచ్చుకొని వచ్చి తలుపు తెరువు మనుచున్నారు. ఇచ్చట ఊరంతయు గుమికూడి యున్నది. ప్రక్కపై నున్నరీతిగనే సర్దుకొనక రావలదు. తగినట్లు సర్దుకొని వచ్చి తలుపు తెరువుము.

"సా ప్రస్ఖలన్తీ మదవిహ్వలాక్షీ । ప్రలమ్బకాఞ్చీ గుణహేమ సూత్రా ।
సలక్షణా లక్ష్మణ సన్నిధానం । జగామ తారా నమితాఙ్గయష్టిః॥"

మాల్యవంతమున నాలుగు మాసములు క్షణమొక యుగముగ మెరుపులకును, పిడుగుల కును గురియై కాలమును గడిపిన శ్రీరామచంద్రుడు అప్పటి కింకను సుగ్రీవుడు సీతాన్వేషణ ప్రయత్న మొనరించకుండుటకు కినిసి లక్ష్మణస్వామిని పంపగా నాతడతికోపముతో సుగ్రీవగుహద్వార మున ధనుష్టంకారమును గావించెను. సుగ్రీవు డా ధ్వనిని విని భయపడి, రెండు తొడలపై కూర్చొని యున్న యిద్దరు భార్యలతో నెగిరిపడి, మాలలను త్రెంపివైచి శ్రీఆంజనేయుల సలహా ప్రకారము మంటను నీటిధారతో నార్పునటుల లక్ష్మణ క్రోధాగ్నిని తారతో నార్పబంపెను. ఆమె పడకలో సమ్మర్ద మున చెదిరిన చెంగును గాని, దంతక్షత నఖక్షతములను గాని కప్పికొనక, జారుచున్న బంగరు ఒడ్డా ణము నటులనే జారనిచ్చి, స్తన భారముచే నొకింత ముందునకు ఒంగిన శరీరముతో లక్ష్మణుని యెదుట పడెనట. నీవట్లు చేయక చక్కగా సర్దుకొని రమ్మనుచున్నారు. తార యట్లు వచ్చుటలో కొన్ని కారణము లున్నవి. అవి యేవనగా-

1. కామముచే సంశ్లేషించియున్న పక్షిని చంపి కిరాతుడు శాపగ్రస్తు డయ్యెను. ఇక నే బుద్ధి మంతుడును కామగ్రస్తులను చంపడు. ఈ చిహ్నలతో తార తాను కామగ్రస్తురాలనని లక్ష్మణు నకు సూచించెను,

2. "ప్రణిపాత ప్రసన్నా హి మైథిలీ జనకాత్మజా" యన్నటుల శరణాగతిచే లక్ష్మణుని చల్లబరచ గోరి తారయును శరణాగతిని గావించెను. శరణాగతి కే నియమములతోను పనిలేదు. ఉన్న వాడున్నట్లే శరణాగతి చేయవలెను. అందుచే తారయును సర్దుకొనక ఉన్నది యున్నట్లే వచ్చి వేసినది. నీవట్లు రావలసిన అవసరము లేదు, మాది నిజమగు కోపము కాదు. ప్రణయకోపమే-యనుచున్నారు గోపాంగనలు.

## — వేదాంతార్థము —

ఈ పాశురమునకు వేదాంతార్థము లన్నియు విశేషార్థములోనే వ్రాయబడుటచే నిచ్చట సంగ్రహముగా వ్రాయబడుచున్నవి.

ఈ పాశురమున సాధ్యసాధన (కర్మ జ్ఞాన భక్తి) నిష్ఠులను గాక సిద్ధసాధన (ప్రపత్తి) నిష్ఠు లను లేపుచున్నారు.

వారి నొకరు లేప నవసరము లేక నిత్య జాగరూకు లయియే యుందురు. ఇక వారిని లేపుట యనగా వారి యుపదేశముల బడయుటకై వారిని అభిముఖులునుగా జేసికొనుటయే. అట్టివారిని "నేత్తు చ్చువర్కం ……………… అమ్మనాయ్" అని సంబోధించుచున్నారు. అనగా వారు "నేత్తు" సిద్ధ

సాధన నిష్ఠ కలవారు పరమాత్మయే యుపాయమను నమ్మకము కలవారు. అట్టివారు ఫలసిద్ధికై సాధనాంతరములను చేయవలసిన యవసరము లేదు. "రస గ్గ్ంహ్యే వాయం లబ్ధ్వాఽఽనన్దీ భవతి" అని రసస్వరూపుడగు శ్రియఃపతిని పరగత స్వీకార ప్రక్రియగా బడసి ఆనందింతురు. వీరు చేయవలసిన కృషినంతను ఆ నారాయణుడే చేయును.

ఓ ప ర్ కా మ్ -

మోక్షానందమును అని యర్థము. వరాహ చరమ శ్లోకమున

"అహం స్మరామి మద్భక్తం, నయామి పరమాం గతిమ్" అని కలదు నా భక్తుడు తనకు యోగ్యమగు సమయమున గావించిన నా స్మృత్యాదులే చాలును. అతడు కాష్ఠపాషాణ స్థితిలో నన్ను స్మరించలేదను భార మాతని తలపై పెట్టక నేనే వానిని స్మరించి అర్చిరాది మార్గమున నేనే యాతని కాతివాహిక కృత్యమును నిర్వహించి చేరవలసిన చోటునకు చేర్తుననెను.

నృసింహ చరమశ్లోకమునకు

"యో మాం ముకున్ద! నరసింహ! జనార్దనేతి
జీవన్ స్మర న్ననుదినం మరణే ఋణీవ
పాషాణకాష్ఠ సదృశాయ దదామి ముక్తిమ్" అనెను.

గీతా చరమశ్లోకమునందును -

"అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" అనెను. అనగా - తనను పొందుటకు ఆటంకములగు పాపముల నన్నిటిని తానే పోగొట్టెద ననెను. ప్రతిబంధకములు పోయిన ఫలము తనంతనే సిద్ధించును.

వాశల్ తిఱవాదార్ -

భగవదనుభవవిరోధులగు అహంకార మమకారములును తలుపులను తెరవనివారు అని యర్థము.

"హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖమ్ ।
తత్త్వం పూషన్నపావృణు సత్యధర్మాయ దృష్టయే॥"

అనగా, పరమాత్మను సాక్షాత్కరించు జీవుని అంతరింద్రియమగు మనస్సు విషయప్రావణ్యముచే కలుగు అహంకార మమకారములచే నావరింపబడియున్నది.

"అప్రుతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా ।
కామరూపేణ కౌన్తేయ! దుష్పూరేణానలేన చ ॥"

అని భగవాను డానతిచ్చెను. అందుచే చేతనధర్మమైన పరమపురుషసాక్షాత్కారమున్ను, తత్ప్రయుక్తమైన పరమపురుషార్థమగు కైంకర్యమున్ను కుంటుపడినవి. దానిని బడయుటకై యా మూతను (అహంకార మమకారములను) తొలగింపు మని ప్రపన్నుడు భగవంతుని ప్రార్థించు మంత్ర మిది. ఆ భగవంతుడు ఆచార్యుల పురుషకారము ద్వారా వీనిని తొలగించును.

ఇప్పుడీ గోపాంగనలు ఆ యాచార్యుల ఉపదేశము నర్థించుచున్నారు. ఆ యుపదేశజలముచే నవి తమంతనే తొలంగునని వీరి యభిప్రాయము. "ఈ దేవరవారి యుపదేశముతో వానిని తొలగించిన మేము నారాయణుని హార్దికముగ స్తుతింతుము. దానికి సంతుష్టుడై యాతడు మాకు ప్రాప్యమును ప్రసాదించును." ఈ యహంకార మమకారములకు మూలకారణము రజస్తమోగుణముల ప్రాబల్యమే. కుంభకర్ణుని చంపినటుల ఈ భక్తులవిరోధులను నారాయణుడే తొలగించును.

కుంభకర్ణుడు నిద్ర నొసంగుట యనగా —

దేవతాంతర, ఉపాయాంతర, ఫలాంతర ప్రవృత్తికి హేతువైన జాగృతిని హరించి వాని విషయమై స్తబ్ధత నొసంగుట. "ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తో న బాహ్యం కిఞ్చన వేద, నాన్తరమ్ । తస్మిన్నపీతో భవతి । తస్మా త్స్వపితీత్యాచక్షతే" అనినటుల పరమాత్మయందు పరిపూర్ణవిశ్రాంతిని బడసి బాహ్యప్రపంచవిషయానుభవమును మరచియుండును.

"స త్వా సక్తమతిః కృష్ణే । దశ్యమానో మహోరగైః ।
న వివేదాత్మనో గాత్రం । తత్స్మృత్యాహ్లాద సంస్థితః ॥"

శ్రీ ప్రహ్లాదుడు భగవద్ధ్యాననిమగ్నమనస్కుడై ఘోర సర్పములు తన నెంత తీవ్రముగా కరచుచున్నను తన దేహమునే మరచెనట !



పదునొకండవ పాశురము

# "కత్తుక్కఱవై"

## — అవతారిక —

శ్రీకృష్ణుడు ఊరున కంతకును ఏకైక బాలుడై అందరిచేతను కొనియాడబడుచు పెరుగుచున్నట్లు, ఊరికంతకును ఒక బాలికయై, వివాహయోగ్యమైన వయస్సులో నుండి "భగవంతుని బడయుటకు నేనా నోచవలసినది? కావలసినచో ఆయనయే నోచుకొని నా యొద్దకు వచ్చునని పరుండియున్న యొక గోపవనితను లేపుచున్నారు.

పదునొకండవ పాశురము

కత్తుక్కఱవై క్కణఙ్గళ్ పలకఱన్దు,
శెత్తార్ తిఱలழియ చ్చెన్ఱు శెరుచ్చెయ్యుమ్,
కుత్తమొన్ఱిల్లాత కోవలర్ తమ్ పొఱ్కొడియే!
పుత్తరవల్ కుల్ పునమయిలే! పోదరాయ్,
శుత్తత్తు త్తోழிమా రెల్లారుమ్ వన్దు, నిన్
ముత్తమ్ పుగున్దు ముకిల్ వణ్ణన్ పేర్పాడ,
చ్చిత్తాదే పేశాదే శెల్వ ప్పెణ్డాట్టి, నీ
ఎత్తుక్కుఱఙ్గుమ్ పొరుళేలో రెమ్బావాయ్.

## — తాత్పర్యము —

లేతవయస్సుగల పశువులయొక్క అనేకములైన సమూహములను పాలు పితికువారై, శత్రువులయొక్క బలము నశించునట్లు వెళ్లి యుద్ధముచేయువారై, దోషమొక్కటియును లేనివారైన గొల్లల కులములో పుట్టిన బంగారుతీగవలె సుందరమైనదానా! పుట్టలోనున్న పాముయొక్క పడగతో సమానమైన నితంబమున్ను, స్వస్థానమగు అడవిలో స్వేచ్ఛగా తిరుగుచున్న నెమలియొక్క రంగు

వంటి రంగుకలదానా! సంపత్తుగల బాలికా! రమ్మ. నీ చుట్టములున్ను, సఖియలందరున్ను వచ్చి నీ వాకిలిలో ప్రవేశించి, మేఘమును పోలిన రంగుగల నారాయణునియొక్క తిరునామమును పాడు చుండగా నీవు చలించక, మాట్లాడక యెందుకు నిద్రించుచున్నావు? అనుచున్నారు.

## — విశేషార్థము —

కత్తుక్కఱవై -

ముక్తుడు పరమపదమున పరవాసుదేవుని పరత్వానుసంధానముతో క్రింది వయస్సునకు పెరుగుచున్నట్లు ఈ తొలుచూలి పడ్డలున్ను మనుష్యుడుగా నవతరించియు పదే పదే పరత్వమును ప్రకటించుచున్న శ్రీకృష్ణునియొక్క స్పర్శచే క్రిందివయస్సునకు పెరుగుచున్నవి. ఇచ్చట నొక విశేషము కలదు.

"గోధూళి ధూసరిత కోమలగోపవేషం
గోపాలబాలకశతై రనుగమ్యమానమ్ ।
సాయంతనే ప్రతిగృహం పశుబన్ధనార్థం
గచ్ఛన్త మచ్యుతశిశుం ప్రణతోఽస్మి నిత్యమ్ ॥"

(కృ. కర్ణా)

అడవిలోనికి మేతకై వెళ్లిన పశువులు శ్రీకృష్ణుని పిల్లనగ్రోవి శబ్దమును విని "మమతన్ మోములు మీది కెత్తుకొని రోమంథంబు చాలించి హృత్కమలాగ్రంబున కృష్ణు నిల్పి మురళీనాదా మృతశ్రేణి కర్ణములం గ్రోలుచు మేత మాని గళితానందాశ్రులై చిత్రితోపములై గోవులు చూచుచున్న వవిగో కంజాక్షి వీక్షించితే!" అనునటుల కావలసిన మేతను మేయక డొక్కలు దించుకొనిపోయి యిండ్లను జేరుట చూచి శ్రీకృష్ణుడు జాలితో తన పశువులను అన్నగారి కొప్పగించి తాను ప్రతియింటి కిని వెళ్లి వాని నన్నిటిని కట్టి చేతితో ఆపుచ్ఛమస్తకము నిమిరి తన యింటికి పోవు నాచారము కలదు. అట్టి యాతని కరస్పర్శచే నా గోవులు శ్రీరాముని కరస్పర్శచే శత్రుంజయము వలె పునరుక్తపోషములై చతుర్గుణితముగా పాలిచ్చెడివి. ఆ సమృద్ధి యాతని వలననే వచ్చెనని వారికి తెలియదు. చెప్పినను నమ్మరు. అందుచే శ్రీకృష్ణుడే ఆ యధికాంశమగు పాడిని దొంగిలించి యథేష్టముగా వినియోగించు కొనుచుండెను. ఆ సంగతి తెలియక గోపాంగనలు తమ మల్లెనే యెత్తుకొనిపోవుచున్నట్లు తలచి

"ఓయమ్మ నీ కుమారుడు
మాయిండ్లను పాలుపెరుగు మననియడమ్మా !
పోయెద మెక్కడి కైనను"

అనియు, "రాచ బిడ్డడైన రవ్వ పేలె?" అనియు గేలపెట్టసాగిరి. నిజమునకాతని భాగమునే యతడు హరించుచుండెను. అయినను హరించుట దోషము కాదా? యన్నచో

"ఉత్తమం స్వార్జితం విత్తం । మధ్యమం పితురార్జితమ్ ।
అధమం భ్రాతృ విత్తంచ । స్త్రీవిత్త మధమాధమమ్ ॥"

అనునట్లు ఉత్తమమార్గమున సంపాదించుకొనునే గాని అధమాధమమార్గము నవలంబించునా? "బలి యొద్ద భిక్ష చేయలేదా?" యన్నచో

మమ ఖలు బలిగేహే యాచనం జాత మాస్తాం
ఇహపున రబలానా మగ్రతో నైవ కుర్వే ।
ఇతి విహితమతిః కిం? వల్లవీనాం గృహేషు
దధి ఘృత మహర స్త్వం చారుణా చోరణేన॥

బలి చక్రవర్తి గాన "యా ఙ్ఞ్యా మోఘా వర మధిగుణే, నాధమే లబ్ధకామా" అనునట్లు పెద్దవాడు లేదు పొమ్మన్నను మంచిదే, కాని నీచుని యాచించరాదు. కనుక అచ్చట బిచ్చమెత్తినను ఇచ్చట గోకులమున ఆడవాళ్లనా యాచింతును? అని నిశ్చయించుకొని చక్కని మెలుకువతో గొల్లల యిండ్లలో పెరుగును, నేతిని అపహరించితివా? నిత్య ముక్తు లెప్పుడును ముప్పదియేండ్ల వయస్సులో నున్నట్లే యీ యావులును సదా తొలుచూలి పడ్డలవలెనే యుండును.

రాజపుత్రుడు లేబ్రాయపు యువతులు లభించిన యవ్వనము మీరిన స్త్రీలవైపు చూడనటుల శ్రీకృష్ణుడు దూడల మేపుట లభించినచో పశువులను చూడనే చూడడు. ఆళ్వారులు "తివత్తిలుమ్ పశునిరై మేయ్ప్పువత్తే" అని పాయించి, ఆపైన "కన్ఱు మెయ్‌త్తు ఇని దువక్కుమ్" పరమపదము నందుండుటకన్న నాతనికి పశువులను మేపుటలో ఆనందము మెండు అని పాయించి వెంటనే దూడలను మేపుట అంతకుమించి యాతని కానందదాయకమని పాయించిరి. దూడలను మేపుమన్నచో ఆయనకు పశువులు నిత్యసూరిగోష్ఠిలోని వగు నంతియే. ఇందొక సంప్రదాయ రహస్యమున్నది. పశువులు మనుష్యుల కన్నను పరతంత్రమైనవి. మనుష్యులు వానిని నడిపించవలెను. నిత్య సూరులును, ముక్తులును తనతో సామ్యమును బడసినవారగుటచే వారికొరకు తానుచేయవలసిన దేమియు నుండదు. అందుచే తన విజ్ఞానము, శక్తి, యితరగుణములు ప్రకాశము లేక పడియుండును. అందుచే పశువులను రక్షించుటలో ఆయన తత్పరుడు. ఇక దూడలన్నచో సామాన్యప్రాణికి కావలసినే అన్నపానీయములకే యవి పరవశములై యుండును. అందుచే వానియందు శ్రీకృష్ణునకు ప్రేమ యధికము. వాని నన్నిటిని పచ్చిక బయళ్లకు తోలుకొని పోయి నిలబెట్టును. అవి యేమి చేయవలెనో తెలియక నిలచియుండును. అంత తాను మోకరించి గడ్డిపరకలను కొరుకును. దానిని చూచి అవి

యును గడ్డిని కొరికి తిని ఆకలిని తీర్చుకొనును. అపై యమునానదికి నీరు త్రాగుటకై తీసికొని పోవును. అవి యొడ్డున నట్లే నిలచును. శ్రీకృష్ణుడు స్వయముగా మోకాలు లోతునకు దిగును. వాని నచ్చటికి పిలుచును. అవియును దిగి నిలచియుండును, తాను తన రెండు చేతులను వెనుకకు మడచుకొని వంగి నీటిని త్రాగును. అవియు నట్లే చేసి దాహమును తీర్చుకొనును. చూచితిరా అవి యెంత పరవశమైన ప్రాణులో! అట్టి పారతంత్ర్యపరాకాష్ఠతో నున్న ప్రాణులను రక్షించుట అతనికి మిక్కిలి ప్రియము.

కణక్కిల్ పల -

ఒక్కొక్క ఆవునే లెక్కపెట్టలేకపోయినను, ఈ జాతియావులిన్ని, యా జాతి యావులిన్ని యని జాతిచే కూడ లెక్కపెట్టుటకు శక్యము కానన్ని కలవని భావము.

పల కఱన్దు -

అనేకులు కలసి చేయవలసిన పనులను వానిలో నేర్పుగలవాడొక్కడే చేయు నట్లును, ఒకే బ్రాహ్మణుడు వేదమునంతను సొంతముగా నధ్యయనము చేయునట్లును, క్షత్రియు డొక్కడు వయస్సు నిండుటకు ముందుగనే శ్రీరాముడు, అభిమన్యుడు మొదలగు వారివలె యుద్ధ మున పరిచితుడగు నట్లును, ఈశ్వరు డొక్కడే సకలాత్మవర్గము యొక్కయు కర్మానుగుణముగ నామ రూపములను కలుగజేసి వారి నియమనాదులను చేయునట్లును, ఈ గోపాంగన కులస్థుడును ఒక్కడే పశువుల నన్నింటిని పితుకగల సమర్థుడై యుండును.

శెత్తార్ -

అంగదుడు అంతరిక్షమున అల్లాడుచున్న విభీషణాళ్వారును చూచి శ్రీరామునితో రావణుని యొద్దనుండి వచ్చినవా డనక "మనకు శత్రువైన రాక్షసుని గోష్ఠిలో నుండి వచ్చిన వాడ"నినట్టుల ఆండాళ్ తల్లియు ఈ గోకుల సమృద్ధిని సహించలేని వారిని శత్రువు లనుచున్నారు, భగవత్సమృ ద్ధిని సహించలేని వారు భాగవతులకును, భాగవత సమృద్ధిని సహించలేని వారు భగవంతునకును శత్రువులు. భగవద్గీతలో భగవానుడు "అవజానన్తి మాం మూఢాః మానుషీం తను మాశ్రితం। పరం భావ మజానన్తః మమ భూతమహేశ్వరమ్" అనగా "నేను మానవ శరీరముతో నున్నంత మాత్రమున నా మహిమ నెఱుంగలేక నన్నవమానించుచున్నా"రనెను. అదుగో వారే యీ గోపాంగనలకు శత్రువులు. భగవద్భక్తుల నాదరించువారు భగవంతున కత్యంతప్రియులు.

"మమ మద్భక్త భక్తేషు ప్రీతి రభ్యధికా మతా"

అందులకే యీ రహస్యము నెరింగిన పెద్దలు "త్వద్భృత్య భృత్య" యనియు, "త్వద్దాసదాస గణనా చరమావధౌ" యనియు నెంత క్రిందికి దిగిన అంత వేగముగా భగవదభిమానము తమపై పడునని ఆశపడిరి. నీరు పల్లమునకు గదా ప్రవహించును!

కంసున కీ రెండును కలవు. భగవత్సమృద్ధినీ సహించలేడు. భాగవతులగు గోపాలుర సమృద్ధినీ సహించలేడు శ్రీకృష్ణుడు సంధికై హస్తినాపురమున కేగి విదురు నింట భుజించి "యిట్లేల చేసితి" వని యడిగిన దుర్యోధనునితో "ద్విషదన్నం న భోక్తవ్యం, ద్విషం చైవ న భోజయేత్ । పాణ్డవాన్ ద్విషసే రాజన్! మమ ప్రాణా హి పాణ్డవాః॥" అనెను. తనకు దుర్యోధనుడు సాక్షాత్తుగ శత్రువు కాకపోయినను తనకు ప్రాణతుల్యులగు పాండవులకు శత్రువగుటచే తనకు శత్రువని నిర్ధారణ గావించెను.

## శెత్తార్ తిఱల్ అఴియ -

శత్రువుల బలము నశించునటుల.

"రుద్రుడు భస్మమును పూసుకొని తిరుగును. బ్రహ్మ బ్రాహ్మణుని వలె వేదము నధ్యయనము చేయుచు కూర్చొనును. దేవేంద్రు డప్సరసలతో విహరించుచుండును. వీరా మనల నెదుర్కొను శక్తిగలవార"ని గర్వించుచున్న కంసుని బలమంతయు నశించునటుల.

## శెన్ఱు శెరుచ్చెయ్యుమ్ -

శత్రువు లెత్తి వచ్చిన వారితో యుద్ధము చేయుట కాక వారున్న స్థలమున కేగి యుద్ధము చేయుట. అట్టి పరాక్రమము గలవా రీ గోపాంగన వంశీయులు.

## కుత్త మొన్ఱిల్లాత - ఒక్క తప్పును లేని.

యుద్ధ మర్యాదల నెరింగి శత్రువులతో పోరువా రీ గోపాలకులు. దీనితో కూడ వీరికి కృష్ణ సామ్యము కలదు. శ్రీకృష్ణ శ్రీరాములకు భేదము లేదు గదా!

రామ రావణయుద్ధములో నొకసారి రావణుడు ఏకాకియై నిరాయుధుడై రణరంగమున నిలచిపోయెను. అయినను శ్రీరామచంద్రు డాతనిని బాణములతో కొట్టుచునే యుండెను. అంత నా రావణుడు శ్రీరాము డధర్మయుద్ధమును చేయడే! నా చేత నాయుధము లేకున్నను కొట్టుచున్నాడే!

యని పరిశీలించుకొనగా విరిగిన ధనుష్ఖండ మొకటి తన చేతిలో నుండగా జూచి "చచాల చాపం చ ముమోచ వీరః" శ్రీరామబాణ ప్రహారమునకు గడగడ వణకి ఆ చేతనున్న ధనుష్ఖండమును 'ఛీ' యని పారవైచెను. దానిని చూచి రామచంద్రుడు

"గచ్ఛాను జానామి రణార్దిత స్త్వమ్" రావణా! యుద్ధమున చాల డస్సి పోతివి. నీకు సెల విచ్చుచున్నాను, లంకకు పొమ్ము. సేద తీర్చుకొనుము. గట్టి రథమును, గట్టి ధనుస్సును తెచ్చుకొని రమ్మని పంపివైచెను. అదీ యుద్ధమర్యాద. అట్టి మర్యాదను తప్పు నట్టి దోషము లేనివారీ గోపకులు

— లేక —

ఎవరైనను శ్రీకృష్ణునితో ఈ గోపకులపై నేరము నారోపించి చెప్పుకున్నచో శ్రీకృష్ణుడు దానిని విని "వారిట్లెన్నడును చేయరు. చేసిరని ఋజువు చేతురా, అది యట్లే చేయవలసినదే, పొండు" అను టచే శ్రీకృష్ణుని నిగ్రహమునకు పాత్రమగు దోషము లేనివారని తాత్పర్యము.

"య త్త్వ త్ప్రియం తదిహ పుణ్య మపుణ్య మన్యత్ ।
నాన్య త్తయో ర్లక్షణ మస్తి జాతు॥"

అని కూరేశులు సాయించినట్లు ఒకే క్రియ యొకరు చేసిన పాపమగును. మరియొకరు చేసిన పుణ్య మగును. అది భగవంతుని ప్రీత్య ప్రీతులను బట్టి యుండును. ఆయన చేసిన రాస క్రీడను మన మనుసంధించిన మన పాపములన్నియు పోవునట. భగవద్గీత 9వ అధ్యాయమున భగ వానుడు భక్తుల అతిశయమును సెలవిచ్చుచు

"అపి చే త్సుదురాచారో భజతే మా మనన్యభాక్ ।
సాధు రేవ స మన్తవ్య స్సమ్య గ్వ్యవసితో హి సః॥"

అనెను. అనగా చేయవలసిన వానిని మానివేసి, చేయరాని పనిని చేయుచున్న దురాచారు డైనను ఫలాంతర, సాధనాంతరములను విడచి నన్ను భజించక నిలువలేక భజించుటయే ప్రయోజ నముగా భజించువానిని నేను సజ్జనుడుగనే భావింతును. ఎందుకనగా, వాడు నన్ను అన్నివిధములగు బంధువుగాను నమ్మి యున్నాడు- అనెను. అట్టివారీ గోపాంగన వంశీయులు.

## కోవలర్ తమ్ పొఱ్కొడియే -

గోపాలవంశమున బంగరు తీగ వంటిదానా!

ఆ కృష్ణుని విడచినను మిమ్ములను విడువజాలనంటివే! అది మాట మాత్రమేనా? చేతలో చూపవలదా? మమ్ములను కూడ నీతో చేర్చుకొని మాతో కలసి శ్రీకృష్ణు ననుభవింపుము. "అడియార్ కళ్ కుళాఙ్గళుడన్ కూడువ తెన్రుకొలో" అని యుండుట మన వంశమర్యాద. ఇచ్చట నున్నంతకాలము "భాగవతగోష్ఠిలో చేరు కాల మెన్నడో యనియు, పరమపదమున నిత్యసూరుల గోష్ఠిలో చేరు కాల మెన్నడో కదా!" యనియు కదా యుండవలెను. స్వయంపాక భోజనముకన్న తదీయారాధన భోజన మానందదాయకము గదా!

పుత్తర వల్ కుల్ -

పుట్టలో నున్న పామువలె మెత్తనైన విశాలములైన పిరుదులుగలదానా!

పునమయిలే - అడవిలో నున్న నెమలి.

ఆ నెమలి పింఛము వ్యామోహమును కలిగించునటుల శ్రీకృష్ణునకును, మాకును వ్యామోహమును కలిగించు కొప్పు కలదానా;

పోదరాయ్ - రమ్ము.

నీవు ముందు నడచుచు నీ నడకసౌందర్యముతో మమ్ముల నానందపరచుము. శ్రీలక్ష్మణ స్వామి అడవికి శ్రీరాము ననుగమించుటకై తల్లి సెలవును బడయవలెనని వెళ్లి నమస్కరించగా ఆ సుమిత్రాదేవి శ్రీరామతత్త్వము నెరింగిన రామాయణ రమణులకు శిరోభూషణ మగుటచే

"సృష్ట స్త్వం వనవాసాయ । స్వనురక్త స్సుహృజ్జనే ।
రామే ప్రమాదం మా కార్షీః । పుత్ర! భ్రాతరి గచ్ఛతి ॥"

"నాయనా! లక్ష్మణా! నిన్ను నేను కన్న దీ వన వాసమునకే. నీకు బాల్యమిత్రుడును, సోదరుడును, మిక్కిలి ప్రియుడును నగు శ్రీరామచంద్రుడు ముందు నడచుచుండగా వెన్నంటి యుండి, ఆయన కేవిధమైన ప్రమాదమును చేయకుమా" అని గంభీరముగా నానతిచ్చెను. ఇందు వనవాసమునకై సృష్టింపబడితివనియు, మిక్కిలి ప్రియుడవనియు అనుచు ఆతనికి ప్రమాదము చేయకుమని ప్రబోధించుట విచిత్రముగా కాన్పించుచున్నది, వినుడు.

"వనవాసాయ సృష్టః" అనుటలో నీతడు శేషుని యవతారమగుటచే నీతని కరణ్యవాస ముచితమే. దీనిచే నీ రహస్యము సూచింపబడుచున్నది.

మరియు కేనోపనిషత్తులో "తద్ధి తద్వనం నామ, తద్వన మి త్యుపాసితవ్యమ్" అని భగవంతునకు వన మని పేరుంచబడినది, వన నీయం = ప్రార్థనీయం - అనగా పురుషార్థప్రాప్తికై ప్రార్థించ దగినవాడు. వనస్య = నారాయణస్య, వాసః, సృష్టః = శ్రియఃపతికి నివాసముగా నీవు సృష్టింప బడితివి.

"ప్రమాదం మా కార్షీః" అనుటలోని రహస్యమేమనగా - అయన ముందు నడచుచుండగా నీవు వెనుక నడచుచుందువు గదా! శ్రీరామచంద్రుడు నడక చక్రవర్తి. గజగమన, సింహగమన, శార్దూలగమన, వృషభగమనములనెడు సహజముగనే నాల్గు నడకలతో నడచుచుండును. నీవా సౌందర్యములో మునిగిపోయి అతని కైంకర్యమున నేమరకుము సుమా అని శిక్షించి పంపెను. (ప్రమాదోఽన వధానతా - అని కోశము).

అటులనే మేము నీ నడక సౌందర్యమును సేవించుచు నీ వెనుక నడచి శ్రీకృష్ణ గృహమున కేగుదుము నడచిరమ్ము.

ఘుత్తత్తు త్తోళీమార్ -

ఇట్టి యోగ్యులైన భాగవతోత్తములకు ఊరే కాదు ప్రపంచమంతయును బంధువులే. "ఉదార చరితానాం తు వసుధైవ కుటుమ్బకమ్" విశాలమైన హృదయము కలవారికి ప్రపంచమంతయు బంధువు లగుదురు.

నిన్ ముత్తం పుగున్దు -

మాకు ప్రాప్యమైన స్థలమును ప్రవేశించితి మనుచున్నారు. ఈ గోపాంగనల కీమె ముంగిలి ప్రాప్యమెట్లైన దనగా ఈమె ముంగిలి శ్రియఃపతికే ప్రాప్యమైనపుడు శేషభూతులగు గోపాంగనలకు ప్రాప్యమగునని వేరే చెప్పవలెనా?

"శ్రుతి మపరే స్మృతి మపరే । భారత మపరే భజన్తు భవభీతాః ।
అహ మిహ నన్దం వన్దే । యస్యాలిన్దే పరం బ్రహ్మ॥"

సంసారపు బెబ్బులి బారినుండి తప్పించుకొనగోరు వారిలో కొందరు శ్రుతిని (అష్టాక్షరీ మహామంత్రమును) మరి కొందరు స్మృతిని (భగవద్గీతను), ఇక కొందరు భారతమును (శ్రీ విష్ణు సహస్రనామమును) శరణుజొత్తురు ఎవరి యిష్టము వారిది నేను మాత్రము నందునే శరణుజొత్తును. ఎందువలన ననగా అతని వాకిట పరమాత్మ పడి పొరలాడుచుండును గదా!

ఈ విశేషముగా భాగవతుల కుపాదేయమైనది సంసారులకును ఉపాదేయమగును.

"సా కాశీతి న చాకశీతి భువి సాఽయోధ్యేతి నాధ్యాస్యతే ।
సా వన్తీతి న కల్మషాదవతి సా కాఞ్చీతి నో దఞ్చతి ।
ధత్తే సా మధురేతి నాగ్రిమధురం నాన్యాపి మాన్యా పురీ ।
యా గోవిన్ద కథాసుధారసముచాం రోచేత నో చేతసే॥"

శ్రియఃపతి కథా ప్రసంగ రసాస్వాద దక్షులైన భాగవతులకు హృదయంగమము కానిచో కాశియైన నేమి, అయోధ్యయైన నేమి, అవంతియైన నేమి, కాంచీపురమైన నేమి, మధురయైన నేమి అనాద రణీయమే.

## ముకిల్ వణ్ణన్ పేర్పాచ -

మేఘముయొక్క రంగువంటి నల్లని, చల్లని రంగుకలవాడు, లేక, మేఘముయొక్క స్వభావము వంటి స్వభావము కలవాడు.

"దృష్ట ఏవ హి నశ్శోక మపనేష్యతి రాఘవః"

శ్రీ భరతునితో కలసి చిత్రకూటమునకు వెళ్లుచున్న అయోధ్యావాసులు రామవిరహవ్యథతో కృశించి దుఃఖించుచు ఆయన దర్శనమైన తోడనే మన దుఃఖములు గట్టెక్కునని తలంచుచుండిరి. అటులనే సంసారతాప సంతప్తులైనవారి కందరకును భగవంతుని దర్శనము వేసవికాలమున తీవ్ర తాపమునకు గురియైన వారికి నల్లని మేఘముయొక్క సందర్శన సౌఖ్యము నొసంగును.

## శిత్తాదే పేశాదే -

కదలక, మెదలక, మాటలాడక యాతని శరీర సౌందర్యమును తలంచుకొని యీ లోపలి గోపాంగన పరవశురాలై తన కర్తవ్యమును మరచి పరుండెను. ఇదొక వింతయా? సంసారమున రోత పుట్టి సర్వాత్మనా విషయవిరక్తులై అరణ్యమున నివసించుచు వ్రతములతోను, హోమములతోను, జపములతోను, వేదాధ్యయనముతోను, కాలక్షేపము చేయుచున్న మును లందరును తమ పర్ణకుటీరముల పొడుగున పోవుచున్న శ్రీకృష్ణుని

"మణివిదమ్బిని తస్య మనోహరే ।  వపుషి సక్తమనా మునిమణ్డలీ ।
వ్రత మముఞ్చత హోమ మముఞ్చత ।  జప మముఞ్చత వేద మముఞ్చత॥"

శ్రీకృష్ణుని యొక్క ఇంద్రనీల మాణిక్యమును ధిక్కరించునట్టి మనోహరమైన కాంతిగల శరీరమును సందర్శించి మునులు నియమములతో నాచరించుచున్న వ్రతములను, హోమములను, జపమును, వేదములను విడచి నిశ్చేష్టులై నిలచిపోయిరట! ఇక నీమె మాట చెప్పవలెనా?

శెల్వ ప్పెణ్డాట్టి నీ - సంపన్నురాలగు నీవు.

ఈమెకు గల సంపత్తు శ్రీకృష్ణ గుణానుభవమే.

"కృష్ణేతి త్యక్షరయోరయం మధురిమో ద్గారః క్వచిల్లక్షితః?"

ద్రాక్ష, ఖండశర్కర, చిక్కనిపాలు, అమృతము మొదలగు మధుర పదార్థములలో నెచ్చట నైనను కృష్ణనామాను సంధాన రసాస్వాదము కలదా? యని జగన్నాథ పండితుడు శపథము చేయుచున్నాడు. ఆ రసమునే యీమె సంపదగా అనుభవించుచున్నది.

ఎత్తుక్కు ఉఱజ్గుం పొరుళ్ -

"భాగవత గోష్ఠితో కలసి మెలసి యుండు భాగ్యమెన్నడో?" యని ఆళ్వార్లు పాయించినటుల మా గోష్ఠితో కలసి అనుభవించవలసిన అనుభవమును విడచి కైవల్యానుభవమునవలె పడియుండుట యేమి సుఖము?

కైవల్యమనగా- భగవదుపాసన చేసి అర్చిరాది మార్గమున పరమపదమున కేగియు భగవదనుభవము లేకుండగా నేకాంతముగా నొక మూల స్వాత్మానుభవమును మాత్రమే చేయుచు, దాని తోనే తృప్తిచెంది "రమణ త్యక్త పత్నివత్ క్వచిత్కోణేఽవ తిష్ఠతి" అనునట్లు భర్తచే విడువబడిన భార్యవలె నుండుట.

ఎత్తుక్కు ఉఱజ్గుం పొరుళ్ -

నీ ప్రాప్యమును పరిశీలించక, మా విశ్లేషవ్యసనమును విచారించక శ్రీకృష్ణుని నిరతిశభోగ్యతను విస్మరించి యెందులకమ్మా పడియున్నావు?

## — వేదాంతార్థము —

ఈ పాశురములో ముముక్షువులకు ముఖ్యప్రాప్యుడును, ప్రాపకుడును సర్వేశ్వరుడే యని నమ్మియున్న ప్రపన్నాగ్రేసరుని లేపుచున్నారు. నిద్రించువారినిగదా లేపుట! వీరికి నిద్ర యనగానేమి? వీరిది తామసనిద్ర కాదు ఇక సకలేంద్రియవ్యాపారనివృత్తిని నిద్రయందురు. అనగా, విషయాంతర

ములనుండి యింద్రియములను మరలించి ప్రాప్యమైన భగవంతుని కల్యాణగుణములయందు లగింపజేయుట. "నైవ దంశా న్న మశకాన్....... రాఘవోఽపనయేత్ తద్గతే నాంతరాత్మనా" అని తిరువడి సీతాపిరాట్టితో చెప్పినటుల తన రక్షణచింతను సుతరాం విడచి భగవదనుభవమున మగ్నులై యుండుట. వీరే శ్రియఃపతికి "జ్ఞానీ త్వాత్మైవ మే మత" మ్మని ఆత్మవలె ధారకులు. వీరినే భగవానుడు "ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం, స చ మమ ప్రియః" నాకాతడు సర్వజ్ఞుడను, సర్వశక్తి కలవాడనునైన నేనే చెప్పజాలనంత ప్రియుడని సెలవిచ్చెను. "భక్తా స్తేఽతీవ మే ప్రియాః" అ ప్రేమకు అవధిని చెప్పలేక 'అతీవ' అనివైచెను. ఇట్టివారే ఆచార్య పదవికి తగినవారు. వారిని లేపుట యనగా, వారికి సేవలు చేసి, వారి సదుపదేశములను విని, సదనుష్ఠానమును బడసి భగనంతుని కృపకు పాత్రులగుటకై వారి నభిముఖులనుగా చేసికొనుట.

ఇచ్చట నొక ముఖ్యవిషయమును గమనించవలసియున్నది. ఒకే వ్యక్తి తానే ఉపాయము, తానే ఉపేయమునగుట లోకానుభవ విరుద్ధము కాదా? యని యొక సందేహము కలుగవచ్చును. దానిని మన పూర్వాచార్యులు ఒక చక్కని యుదాహరణతో సమర్థించిరి. వినుడు.

తల్లి యొక యెత్తైన మంచముపై పరుండియుండును. ప్రాకులాడు వయస్సుగల చంటిబిడ్డ తల్లి యొడిలో కూర్చుండవలెనని ప్రాకుచు నా మంచము క్రిందికి వచ్చి యేడ్చును. ఆ బిడ్డ డామంచము నెక్కజాలదు గదా! యేమి చేయవలెను? తల్లి దిగి వచ్చి యా బిడ్డ నెత్తుకొని కూర్చొన బెట్టుకొనవలెను. ఇచ్చట కావలసిన దీ తల్లియే, పొందించినదియూ తల్లియే గదా? ఇచ్చట ఉపాయమును, ఉపేయమును ఒకటియే కాలేదా? ఇటుల లోకమున నెన్నియో యుదాహరణము లున్నవి. భగవంతునకీ యుపాయత్వోపేయత్వములు రెండును స్వాభావిక ధర్మములు. ఇట్టి అధ్యవసాయముకలవారే ఆచార్యపీఠాధికారులు.

ఇట్టి యాచార్యుల దివ్యమంగళ విగ్రహదర్శనమే మన కొక మోక్షసాధనము. "ద్రష్టవ్య స్స్పృష్టవ్యోదేహిభిః" కదా! అదియే మనకు నిరంతరము సేవించదగినది. ఉడయవరుల కత్యంత ప్రియ శిష్యు లొకరు మూగివారు, దానితో పాటు చెముడును సహజమే గదా! ఉడయవరులకు మేల్కొనినది మొదలు పవళించువరకు కావలసిన సేవలన్నియు నితరుల కవకాశమీయక తామే చేయుచుందురు. వీరిపై ఉడయవరులకు ప్రీతిమెండు. ఈ స్వామి, యనేకులు ఉడయవరుల యొద్ద అనేకరహస్యార్థముల నధిగమించుట నిత్యము సందర్శించుచున్నారు. ఒకనాడు వీరికి "అయ్యో! నాకు వినబడదే! నేనెట్లు తరింతును?" అని విచారము కలిగెను. ఉడయవరులు వారి పరితాపవిధానము నారసి వారి చేతిని పట్టుకొని యొక్క గదిలోనికి తీసికొనిపోయి తమ యుత్తరీయశాటీని తొలగించి తమ దివ్య మంగళ విగ్రహము నాపాదమస్తకము దర్శింపజేసి సంజ్ఞతోనే "దీనినే యెల్లప్పుడును అనుసంధించు

కొను" డని యాదేశించిరి. తలుపు యొక్క రంధ్రములో నుండి దీనిని పరికించిన కూరేశులు "అయ్యో! ఇంత సుకరమైన మోక్షోపాయముండగా మనకీ పాడు శాస్త్రాధ్యయనమును చేయుటవలన గదా ఆచార్యులు దీని నుపదేశించక

"విశ్వాసా యాసభూమ్నా న్యసన భజనయోః గౌరవే కో విశేషః?"

అనునట్లు అవిచలిత, గురుతమ విశ్వాసగర్భితమైన ప్రపత్తిని, కర్మజ్ఞానాంగకమై, యవిచ్ఛిన్న స్మృతి సంతానాత్మకమై, ఆప్రయాణా దనుష్ఠేయమై యున్న యీ భక్తిని, పర్వతముల వలె మన నెత్తిని పెట్టిరని పశ్చాత్తాప పడిరట.

ఇట్టివారి విశ్లేషను సచ్ఛిష్య్య లొక క్షణకాలమైనను సహించలేరు. శ్రీ తిరుమలనంబిగారి సన్నిధిలో శ్రీభాష్యకారులు శ్రీరామాయణ రహస్యార్థముల సేవించి విరమించగా ఆచార్యులే వారిని "మీకేమి కావలయు" నని ప్రశ్నించిరి. అందులకు శ్రీభాష్యకారులు వారి సన్నిధిలో నిరతిశయప్రేమతో కైంకర్యమును గావించుచున్న అనంతార్యులను నొక శిష్యుని తమకు ప్రసాదింపుడని ప్రార్థించిరి. ఆచార్యు లటులనే అచేతన పదార్థమును ప్రసాదించినటులవారిని ఉడయవరులకు దత్తమొనరించిరి. ఆస్వామి ఉడయవరులతో వేంచేయుచురెండవ దివసమున ఆచార్య విశ్లేషమూలమున చిక్కిపాలిపోవ జొచ్చిరి. దానిని జూచి శ్రీభాష్యకారులు భయపడి వారిని తిరిగి ఆచార్య సన్నిధికి పంపివేసిరి. అనం తార్యులానందముతో ఆచార్య తిరుమాళిగకు వేంచేసిరిగాని యా యాచార్యులు వారిని స్వీకరించలేదట!

ఇట్టి యారాటముతో నీ కైంకర్యనిష్ఠులగు ప్రపన్నశిఖామణులు ఈ యాచార్యవిశ్లేషమును సహించజాలక వారి దర్శన,స్పర్శన, శ్రీసూక్తి శ్రవణాదుల నపేక్షించి వారిని తమ కళిముఖులు కావలె నని ప్రార్థించుచున్నారు.

## కత్తు క్కణవై క్కణజ్గళ్ పల -

అనుటచే అనేక బాలశిష్యబృందము కలవారీ యాచార్యులని తోచుచున్నది. ఆచార్యుల యొద్ద నధిగమించిన యాధ్యాత్మికవిద్య నెంతమందికి గఱపి యెంత ప్రచారమును గావించిన యాచార్యు లంత సంతసింతురు. ఇదియే "ఆచార్యాయ ప్రియం ధన మాహృత్య" అను శ్రుత్యుపదేశ సారము బాలశిష్యు లనుటలో దీర్ఘకాలము ప్రచారపాటవముకలవారై యుండవలెనని తోచుచున్నది. ఆ యవస్థలో చెప్పినది బాగుగా తలకెక్కి మంచి ప్రచారోత్సాహమును పుట్టించును.

పల కఱన్దు -

ఇచ్చట పవిత్రమైనవి గోవులు. వానిని పితుకుట అనుటలో

"సర్వోపనిషదో గావః, దోగ్ధా గోపాలనన్దనః ।
పార్థో వత్స స్సుధీర్భోక్తా, దుగ్ధం గీతామృతం మహత్ ॥"

ఆధ్యాత్మిక బహుశాస్త్రగ్రంథముల చదివి పాలవంటి సాత్త్వికా పూర్వార్థగ్రహణమును గావించి యాచార్యులు శిష్యులకు గావించు వివరణము సూచింపబడుచున్నది.

శెత్తార్ - వేదమును ప్రమాణముగా నంగీకరించనివారు.

భగవంతు నస్తిత్వము నంగీకరించక అసత్ప్రియులైన వేదబాహ్యులును, వేదములో ననేక స్థలములలో శ్రియఃపతికి అప్రాకృత దివ్యమంగళవిగ్రహమున్ను' అనంతకల్యాణగుణరాశియున్న, పెక్కు శుభనామములున్ను కలవని యుండగా వాని నంగీకరించక ఆ శ్రుతివాక్యముల కపార్థములు కల్పించు కుదృష్టులును మనకు శత్రువు లనుచున్నారు.

తిఱల్ - కుదృష్టివాదకౌశలమే వారికి బలము.

అఴియ - నశించునట్లుగా.

ఇచ్చట నశింపజేయుట యనగా మీమాంసా న్యాయములతోను, ఉపబృంహణసహకృత వేదాంతార్థ నిర్ధారణపాటవముతోను, తదనుగుణ సమీచీన తర్కయుక్తులతోను వారి వాదము నణగింప జేయుట

శెన్ఱు -

పిను సేగుచున్న కుక్కలు మొరుగును మన కెందుకని విరక్తితో నుపేక్షించక స్వయముగ వారున్నచోటున కేగి వారితో వాదించి వారి పెడదారిని మాన్పి తమకు శిష్యులనుగా జేసికొనుట. ఇందులకు శ్రీభట్టరువారు వేదాంతిని దిద్దుబాటుగావించిన విషయమే దృష్టాంతము.

శ్రీరఙ్గం కరిశైల మఞ్జనగిరిం తార్క్ష్యాద్రి సింహాచలౌ ।
శ్రీకూర్మం పురుషోత్తమం చ బదరీనారాయణం నైమిశం
శ్రీమద్ద్వారవతీ ప్రయాగ మధురాఽయోధ్యా గయా పుష్కరం
సాలగ్రామగిరిం నిషేవ్య రమతే రామానుజోఽయం మునిః ॥

శ్రీరామానుజులు గావించిన తీర్థయాత్రకు ఫలము పుణ్యార్జన మాత్రమే కాదు. 'ఏకక్రియా ద్వ్యర్థకరీ బభూవ" అనునటుల ఆ వ్యాజముతో నితరమత నిరసనపూర్వక స్వమతస్థాపనయే యని గ్రహింపవలెను.

కుత్త మొన్నిల్లాత -

ఇచ్చట దోషము లనగా దేహాత్మభ్రాంతి, స్వాతంత్ర్యభ్రాంతి, ఇతరశేషత్వభ్రాంతి, స్వరక్షణే స్వాన్వయభ్రాంతి, బంధువులను రక్షకులనుగా భావించుభ్రాంతి, విషయచాపల్యము అనునవియే. ఇవి ఆత్మవినాశనకరమగు ముఖ్య దోషములు. అవి లేనివారు ప్రపన్నకులశేఖరులు.

కోవలర్ తమ్ -

'కృష్ణుని మించిన దేవుడు లే'డను నమ్మకము గల ప్రపన్నులు. "కణ్ణ నల్లాల్ దైవ మిల్లై" "కణ్ణన్ కళ్ళలిణై నణ్ణుం మనముడైయార్" అను వంశమునకు చెందిన

పొ ఱ్కొ డి యే -

'కొడి' యనగా తీగె. ఇది యితరాలంబనము లేక నిలువలేదు. ఇదియే పారతంత్ర్యము. ఇది ఆత్మాలంకారములలో ముఖ్యమైనది. "శేషత్వ భోక్తృత్వఙ్గళ్ పోలే యన్రే పారతన్త్ర్య భోగ్యత్వఙ్గళ్" అను ఆచార్య హృదయమున శేషత్వము కన్న పారతంత్ర్యమున్ను, భోక్తృత్వము కన్న భోగ్యత్వము మిన్న యని సెలవిచ్చిరి. దానినే "పొఱ్కొడి" యనుచున్నారు.

పొన్ + కొడియే -

స్పృహణీయమైన, వాంఛనీయమైన.

శేషత్వమనగా కైంకర్యమే అయినను అది పారతంత్ర్య గర్భితమై యుండవలెను. అది లక్ష్మణస్వామి కైంకర్యములో కొంత కొరతపడిన దనియే పంచవటిలో పర్ణశాలను నిర్మించు సమయమున శ్రీరామచంద్రు డొక్కసారి ఓడబోసిరి. ఆ కొరత ఆయన కన్నీటితో కడిగివేయబడినది.

పుత్త ర వల్ కుల్ -

కవులు స్త్రీలను వర్ణించునపుడు ఇతరావయవ సౌందర్యమున కన్నను స్తననితంబ సౌందర్యములకు ప్రాధాన్య మొసంగుదురు. నడుము లేనే లేదన్నంత సన్నమైనదని వర్ణింతురు, దీనికి వేదాంతములో వైరాగ్యమని యర్థము.

అ ల్ కు ల్ -

నితంబము. స్త్రీకి నితంబ సౌందర్య మెట్టిదో భక్తునకు భక్తి యంత ముఖ్యమైనది పార తంత్ర్యము ఈ భక్తికి ప్రాణమువంటిది. అట్టి పారతంత్ర్యముతో గూడిన భక్తినే "పాల్ శోఱు మూడ నెయ్ పెయ్తు" అని 'కూడారై' పాశురమున గోపాంగనలు పెరుమాళ్లను ప్రార్థింతురు. పాలు + అన్నము = పరమాన్నము. పరమాన్న మనగా అంతకు మించిన అన్నము మరియొకటి లేదన్నమాట. (పరం మా యస్మాదన్నాత్ తత్ పరమాన్నం) ఆ పరమాన్నము 'మూడ నెయ్ పెయ్దు' అనగా 'మునుగునట్లు నేతిని చేర్చి' అనిరి. అనగా ఆ కైంకర్యము పారతంత్ర్యముతో మునిగి యుండవలెనని భావము. ఉపాయములలో భక్తికి మించినది లేదు (శరణాగతి ఉపాయము కాదు గదా!) అందులకే 'పరమాన్న' మను విశేషణము భక్తిని తెలుపుచున్నది. ఆచార్యుల కది కొరత లేనిది.

పు న మ యి లే -

స్వస్థానములో నుండు నెమలి రంగుగల దానా ! అడవిలోనున్న నెమలియొక్క పింఛ మెంతయో ఇంపుగా నుండును. అది అనేక వర్ణములతో నిండియుండును. దానిని భగవానుడు శిరసా వహించును. అటులనే యిచ్చట చెప్పబడిన భక్తి నెమలిపింఛమువలె అనేక వర్ణముల కలిగి యుండును. అవి పరభక్తి, పరజ్ఞాన, పరమ భక్తులు.

"దర్శనం పరభక్తి స్స్యాత్ పరజ్ఞానం తు సఙ్గమః ।
పున ర్విశ్లేష భీరుత్వం పరమా భక్తి రుచ్యతే॥"

ఇందు మూడవది యగు పరమభక్తి ముఖ్యము. అట్టిది యీ భక్తి. ఇచ్చట 'నెమలి' యను పదమునకు ఏకదేశమైన ప్రధానమగు పింఛమును గ్రహించవలెను. ఈ పరమభక్తి భోజనమునకు ఆకలివంటిది. అది భోజనమును వెన్నంటియే యుండును. ముందుగ పరభక్తి, పిమ్మట పరజ్ఞానము, ఆపైన పరమభక్తి, ఆపైన బడయునదియే మోక్షము.

పో ద రా య్ -

నా భాగ్యము వలన నిట్టి లక్షణములు కలిగిన దేవరవారు మాకాచార్యులుగా లభించిరి. "స గురుమేవాభి గచ్ఛేత్" అను శ్రుతి మెడబట్టి త్రోయగా వచ్చితిమి. దయ చేసి మాకు దర్శనమిచ్చి మమ్ముల నుద్ధరింపుడు.

## ఘత్తత్తు త్తోళ్ళీమార్ ఎల్లారుమ్ వన్దు -

ఇట్టి యాచార్యులకు తోళ్ళీమార్ = నాయికకు చెలికత్తెల వంటివారు, భగవదనన్యార్హ శేష భూతులగు భాగవతోత్తములు. భాగవతోత్తములు మిత్రులనియు, సుహృత్తులనియు, స్నేహితులనియు మూడు విధములుగా నుందురు. సమాన వయస్కులై, పరస్పరహితైషులు మిత్రులు. భిన్న వయస్కులై పరస్పరహితైషులు సుహృత్తులు. ఇక స్నేహితులనగా - స్నేహమనగా- విడివిడిగా నుండు పిండి మొదలగు వానిని ముద్దుగా చేయు జిడ్డు పదార్థము. (చూర్ణాది పిండీ భావహేతుః స్నేహః- అని తార్కికులు చెప్పుదురు.) అంటక ముట్టక తిరుగుచున్న సంసారుల నెందరనో ఆళ్వార్లు తమ యుపదేశము మూలముగా శ్రీవైష్ణవులను గావించి, వారంతటను సిద్ధాంత ప్రచారమునకై సంఘసంఘములుగా తిరుగుచుండగా సేవించి ప్రీతిపారవశ్యమున "పొలిగ పొలిగ పొలిగ" యని మంగళాశాసనమొనరించి "కణ్డోమ్ కణ్డోమ్ కణ్డోమ్ కణ్ణుక్కినియన కణ్డోమ్" అని కన్నులున్నందుకు సార్థకముగా కన్నుల కరువు తీడునట్లుగా "సేవించితిమి సేవించితిమి సేవించితిమి"అని త్రుళ్ళ దొడంగిరి. ఇట్టివారు "స్వయం తీర్త్వా పరాన్ తారయన్తి" అనునటుల తాము తరించుటలో తృప్తి జెందక "ఊరుం ఉలగుం తమ్మైప్పోల" అనునట్లు దిద్దుబాటు గావింతురు. సంసారులు పెడముఖము పెట్టి వినకున్నను విడువక "శొన్నాల్ విరోదమితు - ఆకిలుమ్ శొల్లువన్, కేణ్మినో" అని హితపరురాలగు తల్లి బిడ్డను మందు త్రాగించినట్లు నిర్బంధించి వినిపింతురు ఇట్టివారినే "శుత్తమ్" అనియు "తోళ్ళీమార్" అనియు అనుచున్నారు.

## నిన్ ముత్తమ్ పుగున్దు -

"వక్తవ్య మాచార్యసన్నిధౌ" అనునట్లు మీ కటాక్షపాత్రులగుటకు వేంచేసిరి. దీనినే ఆళ్వారం దార్ పెరుమాళ్లను వరముగా ప్రార్థించిరి.

"సకృత్త్వదాకారవిలోకనాశయా, తృణీకృతానుత్తమ భుక్తిముక్తిభిః ।
మహాత్మభి ర్మామవలోక్యతాం నయ, క్షణేఽపి తే యద్విరహోఽతి దుస్సహః ॥"

ఒక్కసారి కనులార సర్వేశ్వరుని దివ్యమంగళవిగ్రహ సందర్శనేచ్ఛతో భుక్తిముక్తులను గడ్డిపరకవలె నిరాకరించు మహాత్ముల యెడబాటును భగవంతు డొక్క క్షణమైనను సహించలేడు. పిరాట్టి పెరుమాళ్లకొరకై "అగలగిల్లే నిఱైయుమ్" అనునటుల భగవంతుడు వీరికొరకై అనును. అట్టి

మహాత్ముల కటాక్షమునకు నన్ను పాత్రుని గావింపుమని ప్రార్థించిరి. అట్టి భాగ్యము నభిలషించి అనన్యార్హ భాగవతోత్తములందరున్ను నీ వాకిట పడియున్నారు. స్వామీ! తమ దర్శనమే గదా మాబోంట్లకు (భాగవతులకు) పురుషార్థము.

"ఆహ్లాదశీతనేత్రామ్బుః । పులకీకృత గాత్రవాన్ ।
సదా పరగుణావిష్టః । ద్రష్టవ్య స్సర్వదేహిభిః ॥"

నిరంతరభగవత్కల్యాణగుణాదులను తలంచుకొని ఆనందపారవశ్యమున నేత్రములనుండి చల్లని ఆనందాశ్రువులు జలజల రాలుచున్నట్టియు, ఆపాదమస్తకము పులకాంకురములతో నిండియున్నట్టి భాగవతుని సకలదేహధారులును సేవించవలెను అని శాస్త్రవిధి కదా! యని ప్రార్థించుచున్నారు.

"యం హి రామో న పశ్యేత్తు య శ్చ రామం న పశ్యతి ।
నిన్దిత స్స వసే ల్లోకే స్వాత్మాఽప్యేనం విగర్హతే ॥"

అనునది మాకు ప్రథమపర్వములో కాదు చరమపర్వములోనే.

## ముకిల్ వణ్ణన్ పేర్పాడ -

మీతో కలసి ఆ మేఘవర్ణుడైన నారాయణుని తిరునామ సంకీర్తనము చేయుటకై (లేచియున్నాము.)

ముకల్ వణ్ణన్ — రంగులోనే కాదు ఆయనకు మేఘముతో పోలిక, కింతు, స్వభావముతోనున్ను కలదు. ఎట్లనగా —

| మేఘము | భగవంతుడు |
|---|---|
| 1. గర్భమున నీరుండుటచే నల్లగనుండును. | 1. ఈతనికి తన భక్తులయందలి వ్యామోహము లోపల నిండియుండుటచే అది పైకి యుబికి నల్లగ కాన్పించును. |
| 2. ఎంతకు తపించిన వారలు చూడగనే వారి కన్నులు, హృదయము చల్లగిలి క్లేశము లారును. | 2. "దృష్ట ఏవ హి నశ్శోక మపనేష్యతి రాఘవః" శ్రీరామచంద్రుని దర్శించిన తోడనే మనము శోకాబ్ధినుండి బైటపడుదుము అని అయోధ్యపురవాసులు తలంచిరి. |

| | |
|---|---|
| 3. పక్షపాతము లేక దీన ధనాఢ్యుల పట్ల సమముగా వర్షించును. | 3. "సమోఽహం సర్వ భూతేషు, నమే ద్వేష్యోఽస్తి న ప్రియః" భ. గీ. |
| 4. నదీ నద సముద్రములనుండి నీటి నాకర్షించినదాని కంటె అనేక మడుగులధికముగా వర్షించును. | 4. "గోవిన్దేతి యదాక్రన్దత్ కృష్ణా మాం దూరవాసినమ్ । ఋణం ప్రవృద్ధ మివ మే హృదయా న్నాప సర్పతి॥" "భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ" ఈ. శా. ఉప. |
| 5. నీటిని తీసికొని నీటినే యిచ్చును. | 5. అటుకులను తిని అఖండైశ్వర్యము నిచ్చెను. |
| 6. ఇచ్చి (కురిసి) వెలవెల బోవును. (తెల్లబారును.) | 6. "ఉదారా స్సర్వ ఏవైతే" అని పాత్రలను (తీసుకొనువారిని) ప్రశంసించును. |
| 7. ధూమ జ్యోతి స్సలిల మరుత్తులు అను నాలుగు కలసిన గాని పనిచేయదు. | 7. నిరపేక్ష రక్షకుడు. |
| 8. ఆకసమునుండి (కొండలు మొ॥) భూమికి దిగును. | 8. పరమపదము నుండి వచ్చి భూమిపై దిగును. |
| 9. మెరుపుతో కూడియుండును. | 9. లక్ష్మీదేవితో కూడియుండును. "నీల తోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా" |
| 10. గుండెలవియునట్లు గర్జించును. | 10. "స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్" |
| 11. యజ్ఞములచే స్వరూపము లభించి వర్షించును. "అగ్నౌ ప్రాస్తా హుతి స్సమ్యక్ ఆదిత్య ముపతిష్ఠతే । ఆదిత్యా జ్జాయతే వృష్టిః" | 11. యజ్ఞములచే ప్రసన్నుడై సకలాభీష్టముల నిచ్చును. "అహం చ సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభు రేవ చ" |
| 12. నద నదీ వాపీ కూపముల నీటితో నిండించును. | 12. చతుర్విధ భక్తులను అభీష్టములతో నింపును. "చతుర్విధా భజన్తే మాం" |

ఇట్లెన్నియో సారూప్య వైరూప్యములు కలవు.

పేర్ పాడ -

"నా హం వసామి వైకుణ్ఠే । న యోగి హృదయే రవౌ ।
మద్భక్తా యత్ర గాయన్తే । తత్ర తిష్ఠామి నారద!"

ఆయన సామగాన లోలుడు. "సతతం కీర్తయన్తో మాం" అను భగవంతుని యాదేశమును బట్టి మనకిది ముఖ్య కర్తవ్యమున్ను.

శిత్తాదే పేశాదే - కదలక మాటలాడక.

"ఆచార్యా! దేవరవారి ప్రతిచేష్టయును, ప్రతి మాటయును మాకుపాదేయములని యెంతయో ఆశపడుచుండగా మా కన్నులను, చెవులను పస్తు పెట్టుట మీకు ధర్మమా?" అనుచున్నారు.

శెల్వ ప్పెణ్డాట్టి -

సంపన్నురాలవగు వనితామతల్లీ! ఇచ్చట "పెణ్డాట్టి" యనుటచే స్వాతంత్రమునకు ప్రతికోటి యగు పారతంత్ర్యము కలవారని యర్థము.

"అసందేశాత్తు రామస్య । తపస శ్చానుపాలనాత్ ।
న త్వా కుర్మి దశగ్రీవ ! భస్మ భస్మార్హతేజసా ॥"

సీతా పిరాట్టి రావణునితో "ఓరీ రావణా! నిన్ను బూడిద గావించగల తేజస్సు నాలో నున్నను శ్రీరాముని యాజ్ఞ లేకుండుటవలనను, నేను తపస్సులో నుండుటవలనను ఆ పనిని చేయజాలకున్నాను" అనెను.

రాముని యాజ్ఞ యనగా, ప్రపన్నుడు తన రక్షణను తానే చేసికొనవచ్చుననను భగవంతుని ఆజ్ఞ. అది లేదు. తపస్సనగా ప్రపత్తి. నేను ప్రపత్తినిష్ఠలో నుండుట వలనను అని తాత్పర్యము.

ఆళ్వారులును "మాయుమ్ వగై అఱిన్దేన్, పెణ్ పిఱన్దేన్" ఆడదాననై పుట్టుటచే చనిపోవుట కైనను పెట్టిపుట్టి లేదనియును, 'న ఖల్వద్యైవ సౌమిత్రే! జీవితం జాహ్నవీజలే" అని సీతాపిరాట్టి ప్రాణములను విడచుటకైనను తన కధికారము లేదని తన పారతంత్ర్యమును పురస్కరించుకొనెను.

ఇట్లు పరతంత్రుడైన చేతనునకు

శెల్వ మ్ - కైంకర్యము.

ఆదియును భరతాళ్వానులవలె భగవంతునకు ప్రియమైనదియే కావలెను. శ్రీవైష్ణవ సంప్రదాయమున 'సంపద' యనగా కైంకర్యమే. "అన్తరిక్షగతశ్శ్రీమాన్" అని విభీషణాళ్వారుల శ్రీయన్నను, 'లక్ష్మణో లక్ష్మిసమ్పన్నః" అని లక్ష్మణుని లక్ష్మియన్నను, కైంకర్యమే. ఇట్టి పరమపురుషార్థమైన కైంకర్యనిష్ఠలోనున్న పారతంత్ర్యమే ప్రధాననిరూపముగా గల యాచార్యా! అని సంబోధన.

ఎత్తుక్కు ఉఱజ్గుమ్ పొరుళ్ -

"నీ ఎన్ పొరుళుక్కు ఉఱజ్గుమ్" మీరు ఏమి ప్రయోజనమునకై నిద్రించుచున్నారు? మీ నిద్ర మా రక్షణచింతయా? అయినచో మేము లేచియే యున్నాము గదా! మీరును లెండు. సకల చేతన రక్షణ చింతయా? ఐనచో దానికి మీ దర్శన, స్పర్శన, ఉపదేశములే చాలును. అందులకైనను లెండు. భగవంతుడే మీ యొద్దకు రావలె ననియా? ఆయన వేంచేసినను "య ఇదం పరమం గుహ్యం మద్భక్తే ష్వభి ధాస్యతి" అని పరతత్త్వప్రబోధమునే ఆయన యపేక్షించును. అందుకైనను లెండు.

సందర్భానుసారముగ ననుసంధించుకొన దగిన పాశురములు -

1. కుత్త మొన్నిల్లాత - అనుచోట.

తన్నడియార్ తిఱత్తు కత్తు త్తామరైయాళాకిలుమ్ శితకురైక్కుమేల్,
ఎన్నడి యారదు శెయ్యార్ శెయ్ తారేల్ నన్రు శెయ్దార్ ఎన్బర్ .........
(పెరియాళ్వార్ తిరుమొழி 4-9-2)

తాత్పర్యము.

తన భక్తులకు పురుషకార భూతురాలగు తల్లియైన లక్ష్మీదేవి యొకప్పుడు విసిగి వారిపై నేవైనను నేరములు పెరుమాళ్లతో చెప్పినను ఆయన "నా భక్తు లెన్నడును అట్లు చేయరు" అనును. ఋజువుపరచినను "మంచి పనులే చేసిరి" అనును.

2. .... .... .... .... .... .... .... .... .... .... ....

.... .... .... .... .... .... .... .... .... .... ....

ముత్త ము్పకున్దు ముఱువల్ శెయ్దు నిన్తిర్

ఎత్తు క్కదు వెన్నిదు వెన్నిదు వెన్నో.
(పెరియ తిరుమొழி 10-8-5)

తాత్పర్యము.

అనేకములగు ఆభరణముల నలంకరించుకొని వచ్చి, మా వాకిట ప్రవేశించి చిరునవ్వు నవ్వుచు నిలచినావే, ఇందుల కేమి లాభము? మమ్ములను గూడ ఓడించిన గదా నీ కిది విజయ మగునది ? ఇంత మాత్రమునకే ఆయుధమును ధరించి రావలెనా ? నీ విజయ పతాకము నెగుర వేయుచు నిలువవలెనా?

3. సిన్ ముత్తమ్ పుగున్దు - అనుచోట.

ముత్తు క్తూడు పుగున్దు సిన్ ముగన్గాట్టి ప్పున్ ముఱువల్ శెయ్‌దు
శిత్తిలో డెజ్గళ్ శిన్దైయుమ్ శిదైక్క క్కడవైయో కోవిన్దా!
ముత్త మణ్ణిడన్దావి విణ్ణుఱ నీణ్డళన్దు కొణ్డాయ్, ఎమ్మై
ప్పత్తి మెయ్‌ప్పిణ క్కిట్టక్కాలిన్ద ప్పక్కమ్ నిన్ఱవ రెన్ శొల్లార్.

(నా. తి 2-9)

తాత్పర్యము.

మాకు పొందదగిన వాకిలిని ప్రవేశించితిమి- అది వీరికి పొందదగిన దెట్లనగా?-

శ్రీకృష్ణా! నీవు మేము ఆడుకొనుచున్న వాకిలి లోనికి చేరి చిరునగవు తళుకొత్తు నెమ్మొగ ముతో మా బొమ్మరిండ్లతో బాటు మా మనస్సులను గూడ శిథిలపరచుట నీకు తగునా?

.................. మాపై చేయివైచి మా శరీరముల నిట్లు నలుగ గొట్టితివే, దీనిని చూచిన యిరుగు పొరుగు లేమనుకొందురు? (తమ కిష్టమే గాని పైవారేమను కొందురో యని భయము)

❀ ❀ ❀ ❀

# పంద్రెండవ పాశురము

# "కనైత్తు"

## — అవతారిక —

క్రిందటి పాశురములో ప్రపన్నులయ్యును భగవత్ప్రీతికై కర్తవ్యబుద్ధితో వర్ణాశ్రమధర్మ ముల ననుష్ఠించు ప్రపన్నుని సోదరిని లేపిరి. "సర్వధర్మాన్ పరిత్యజ్య" అని భగవాను డాదేశించిన కర్మయోగాద్యుపాయత్యాగము స్వరూపత్యాగము కాదు. కాని, వాని యందుపాయబుద్ధిని విడచు టయే. ఈ విడచుటను భగవానుడు 18వ అధ్యాయమున "త్యాగో హి పురుషవ్యాఘ్ర! త్రివిధ సమ్ప్రకీర్తితః" అను శ్లోకమున ఫలసంగకర్తృత్వత్యాగమే త్యాగమని వివరించెను.

ఫలత్యాగమనగా - తాను శ్రియఃపతికి శేషభూతుడు. శేషభూతు డనగా "పరగతాతిశయాధాయ"కుడు, అనగా తన శేషికి ముఖవికాసము కలిగించువాడు. "దాసభూతా స్స్వత స్సర్వే హ్యాత్మానః పరమాత్మనః" అను దాసభూతా. అనగా - "దాసా శ్చ తే భూతాశ్చ = దాసభూతాః, యతో దాసాః అతో భూతాః, 'భూ సత్తాయాం' = ఉండుట. చేతనుని సత్త్వాసత్త్వములు దాస్యమును బట్టియే యుండును, దాసులైననే ఉన్నవారుగా లెక్కింపబడుదు రని తాత్పర్యము. కావున తన స్వరూపమునకు తగిన ఫలము 'శ్రియఃపతి ముఖవికాసమే' అని తలంచుట ఫలత్యాగము,

సంగత్యాగమనగా, మమతాత్యాగము. ఆ కర్మ తనదని తలంచకుండుట. ఇక ఎవరిదని తలంచవలె ననగా, నౌకరు చేయు వ్యాపారమంతయు నెవరిదగును? యజమానిదే కదా? అటులనే సర్వశేషియగు సర్వేశ్వరునిదే యని తలంచుట.

ఇక, కర్తృత్వత్యాగమనగా, తాను స్వాభావికముగా తానుచేయు సాంసారికకర్మలకు కర్త కాడు. అగ్ని సంపర్కముగల గిన్నెతో సంబంధముండుటచే ఆ గిన్నెయందలి నీటికి సలసల మను శబ్దము వచ్చుచున్నట్లు నాకీ కర్మవలన వచ్చిన ప్రాకృతిక దేహసంబంధ ముండుటవలననే యీ కర్మలయందలి కర్తృత్వ మాత్మదని తోచుచున్నది. నిజముగ సాంసారిక కర్మలయందలి కర్తృత్వ మాత్మకు స్వాభావికము కాదు, అగంతుకమే. ఆ కర్తృత్వము ప్రకృతిదే యని గాని భగవంతునిదే యని గాని తలంచవలెను. కాబట్టి శ్రీవైష్ణవసిద్ధాంతమున నే విధమైన త్యాగ మాదేశించబడినను అది వానియందలి 'నాది' యను బుద్ధిని విడచి, 'భగవంతునిదే' యను బుద్ధినుంచుమని యాదేశించు చున్నట్లు భావించవలెను. ఇట్టి త్రివిధత్యాగముతో గావింపబడిన కర్మలనే చేయవలెను. "హత్వా పి స

ఇమాన్ లోకాన్ నాయం హన్తి న హన్యతే". క్షత్రియునకు అట్టి బుద్ధితో చేయబడిన సకలలోకసంహార మైనను అతని కది బంధకము కాదని గీతలో భగవాను డానతిచ్చెను. మరియు నీ రహస్యమును భగవద్గీత నాల్గవ అధ్యాయములో "చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః । తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్" అది యెటుల? అని అశ్చర్యముగా ప్రశ్నించగా "న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా" అని చెప్పెను. అనగా నేను చేయు సృష్ట్యాదివ్యాపారము లన్నియును చేతనుని కర్మాధీనుడనై చేతును గాని నాకు దానివలన నొక ఫలమును గోరి కాదు. ఇది నాకే కాదు. ఎవరట్లు చేసినను వారి కా కర్మసంబంధముండదనెను.

అట్టి సిద్ధాంతిసోదరిని క్రిందటి పాశురములో లేపిరి. అంతకు పై మెట్టునందున్న ప్రప న్నుని సోదరిని ఈ పాశురములో లేపుచున్నారు.

"సన్ధ్యా వన్దన! భద్ర మస్తు భవతే, భోస్నాన! తుభ్యం నమః ।
భో దేవాః పితర శ్చ! తర్పణ విధౌ నాహం క్షమః క్షమ్యతామ్॥"

ఓ సంధ్యావందన మా! నీకు మంగళమగు గాక! దయచేయుము (పొమ్ము). నేను నిన్నాద రించలేను. స్నానమా! నీకును అంతే. నమస్కారము. ఓ దేవతలారా! ఓ నా పితరులారా! నా నుండి తర్పణాదుల నాశించకుడు. దయతో నన్ను మన్నింపుడు.

అయిన నీవు తరించుట యెట్లు అధోగతి పాలగుదువు సుమా! అన్నచో,

"యత్ర క్వాపి నిషద్య యాదవకులోత్తంసస్య కంసద్విషః ।
స్మారం స్మార మఘం హరామి, తదలం మన్యే కి మన్యేన మే॥"

ఏదో యొక మూల కూర్చొని శ్రీకృష్ణపరమాత్మను ధ్యానించుచు నా పాతకములను బాపు కొందును అది నాకు చాలును. దానికి మించిన దానితో నాకేమి పని?

"మత్కర్మకుర్వతాం లోకే । కర్మలోపో భవేద్యది ।
తత్కర్మాణి ప్రవర్తన్తే । తిస్రః కోట్యో మహర్షయః॥"

భగవంతుని సేవలో త్రికరణములతో మగ్నమైయున్న వానికి వైదికకర్మలు లోపించినను దోషము లేదు. అతని కొరకై మూడు కోట్ల ఋషిపుంగవు లా కర్మల నాచరించి యా ఫలము నాతని కొసంగుదురట. ఇది మన లక్ష్మణస్వామి యనుష్ఠానము. అతడు వనమునకు బయలుదేరుటలోనే "అహం సర్వం కరిష్యామి జాగ్రత స్స్వపత శ్చ తే" అని బయలుదేరెను. "అన్నా! నీవు నిద్రించి యున్నప్పుడును, మేల్కొని యున్నప్పుడును చేయవలసిన సేవల నన్నింటిని నేనే చేయుదు" నని యాతని దీక్ష. ఇక నాతనికి తన నిత్యకర్మల కవకాశ మెక్కడిది?

దీని సారమేమనగా, మన అనుష్ఠానము గాని, అననుష్ఠానము గాని మోక్షసాధనములు కావు. ప్రధాన పురుషార్థమైన పరమపురుషుని ప్రాప్తికి కారణమైనవియే యుపాయములు. శాస్త్రము విడువు మన్నవి గాని, చేయుమన్నవి గాని యుపాయములు కానేరవు. అట్లు విడుచుట, పట్టుట యెవ్వని యాదేశమో ఆతడే యా ఫలమున కుపాయము. "మామేకం శరణం వ్రజ, అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః" నన్నే ఉపాయమని గట్టి నమ్మకముతో నుండుము, నీవు నన్ను పొందుట కాటంకముగానున్న పాపముల నన్నిటిని నేనే పోగొట్టుదును. ఇంతయేల? అసలు 'నానుం వేణ్డా నీయుం వేణ్డా, రాజకుల మాహాత్మ్య త్తాలే అవైయే విట్టుప్పోం కాణ్" నేనూ పనిలేదు, నీవూ పనిలేదు నీకు గల రాజ సంబంధ ప్రభావము చేతనే ఆ పాపములే భయపడి తమంత తామే ('ఛుప్ ఛాప్' అనక) పోయినజాడ కూడ తెలియకుండునట్లే పోవును.

రాజకుల సంబంధమనగా, అనేక కాలము నుండియు తీవ్రముగా కలహించు వారిరువురిలో నొకడు సభ్యములగు దుస్తులతో రాజభవనమున కేగి నిరీక్షణ గృహమున నొక గంట కూర్చొని వచ్చు చుండెను. దీని నాతని శత్రువు చూచి వీనికి రాజుతో నేదో సన్నిహితసంబంధ మున్నట్లున్నది. ఆతనితో నాపై నేరములు చెప్పి యేదో యొక మిషతో దండింపజేయు నేమో యని భయపడి యొక దిన మాతని యొద్దకు వినయముతో వచ్చి వివాదమును తనంతనే పరిహరించుకొని పోవును. ఇదియే రాజ కులమాహాత్మ్యము.

శ్రీరామచంద్రుని రక్షణ విషయమై మన లక్ష్మణస్వామి కెంత దీక్షయో శ్రీకృష్ణుని రక్షణలో నీమె సోదరున కంత ప్రేమయు, రక్షణదీక్షయు కలదు.

ఈ రక్షణదీక్షకు ఏ యోగములును సరికావు. ఏ పుణ్యములును పోలవు. దీనివలననే మన సంప్రదాయములో లక్ష్మణస్వామి కిన్ని, గుహునకును 'పెరుమాళ్' అను పెద్ద పేరు వచ్చినది. 'పెరు మాళ్' అనగా "పెరుం + ఆళ్" ఉత్తమ పురుషుడని యర్థము. గీతలో భగవానుడు ఈ బిరుదము తన కొక్కనికే కలదని సెలవిచ్చెను "ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః" అనెను. అంత గొప్ప బిరుదమును ఈ యిద్దరికిని మనవారేల యొసంగిరో ఆ రహస్యము నెరుంగ వలసి యున్నది. ఆళ్వారులలో శ్రీ విష్ణుచిత్తులకు 'పెరియాళ్వార్' అని తిరునామము కలదు.

"పాణ్డుం పరివాలే విల్లిబుత్తూర్ పట్టర్ పిరాన్ పెత్తాన్
పెరియాళ్వా రెన్నుం పెయర్"

పొర్లి ప్రవహించుచున్న ప్రేమచే వీరికీ పేరు వచ్చినదని శ్రీవరవరమునులు ఉపదేశరత్న మాలలో సాయించిరి. పెరుమాళ్ల రక్షణదీక్షలో వీరికి వారిపై గల ప్రేమాతిశయముచే మంగళా శాస నము చేయుటలో వీరికి గల దీక్షయే దానికి కారణము. అంతవా డీ గోపాంగన సోదరుడు.

## పంద్రెండవ పాశురము

కనైత్తు ఇళఙ్గత్తెరుమై కన్ఱుక్కిరఙ్గి,
నినైత్తు ములై వழியే నిన్ఱు పాల్ శోర,
ననైత్తిల్లమ్ శేఱాక్కుమ్ నఱ్చెల్వన్ తఙ్గాయ్!
పని త్తలై వీழ నిన్ వాశఱ్కడై ప్పత్తి,
శిన త్తినా త్తెన్నిలఙ్గై క్కోమానై చ్చెత్త,
మనత్తుక్కినియానై ప్పాడవుమ్ నీవాయ్ తిఱవాయ్,
ఇనిత్తా నెళున్దిరాయ్ ఈదెన్న పేరుఱక్కమ్,
అనై త్తిల్లత్తారు మఱిన్దేలో రెమ్బావాయ్.

### — తాత్పర్యము —

లేగదూడలు గల బర్రెలు (గేదెలు) తమ దూడలపై గల ప్రేమచే నిజముగ నెవరును పాలను పితుక కున్నను అవి వచ్చి తమ పొదుగులలో మూతిని పెట్టి త్రాగుచున్నట్లు తలంచును. ఆ భావనాతిశయముచే పాలుచేపి ధారధారలుగా విడువక కారుచుండుటచే నిల్లంతయు నానిపోయి, ఆ బర్రెల త్రొక్కుడుచే బురద బురద అయిపోవునంతటి పాడిగల గోపాలకుని సోదరీ! అవరణ లేని నీ వాకిట నిలచిన మా తలలపై మంచువాన కురియుచుండగా నీ గుమ్మపు గ్రంథిని పట్టుకొని నిలచి యుండి సీతమ్మ నపహరించిన కోపాగ్నిచే సుందరమైన నిర్మాణ చాతుర్యము గల లంకాపురికి రాజైన రావణాసురుని చంపిన, మన మనస్సుల కానంద జనకుడగు శ్రీరామచంద్రుని గూర్చి పాడుచున్నను నీవు నోరైనను తెరువకున్నావే! ఇది యేమి పెద్దనిద్రమ్మా! ఇంకనైనను మేల్కొనుము. ఊరిలో నున్న పిల్లలందరును నీ యింటికి వచ్చి నిన్ను లేపుచున్నారను నీ అతిశయము అందరకును తెలిసినదిలే.

## — విశేషార్థము —

కనైత్తు - ఇళం కన్ఱు ఎరుమై కన్ఱుక్కు ఇరఙ్గి నినైత్తు కనైత్తు.

పాలు చేపునకు వచ్చి పొదుగులు నిండుటచే త్రాగునట్టి దూడలు గాని, పితుకునట్టి గోపాలకులు గాని రాకపోవుటచే పొదుగుల పీడచే బర్రెలు అరచుచున్నవి. ఈ విషయమున నివి శ్రీకృష్ణునితో పోల్చదగినవి, ఉదారు లనగా ఇతరుల కివ్వక ఉండలేనివారు. అది వారికి సహజమైన ధర్మము. కొందరు కొన్ని నోములను నోచి యా ప్రసాదమును వినియోగించుటకు మనుష్యులు దొరకక కనబడిన వారి నందరను ప్రార్థించి యా ప్రసాదము నిచ్చి ఖర్చుచేసికొందురు. అది మిగిలిన వ్రతభంగమగునని వారి భయము. అటులనే శ్రీకృష్ణ పరమాత్మ పాత్రలను 'ఉదారు' లని ప్రశంసించును. లోకములో నిచ్చువారి నుదారులందురు. శ్రీకృష్ణుడు తీసికొనువారినే యుదారులనును. తననుండి తీసికొనువారే తన కిచ్చువారని యాతని తలంపు "మత్తో యత్కిఞ్చిన గృహ్ణన్తి తే హి మమ సర్వస్వదాయినః" నానుండి తృణమునో ఫణమునో తీసికొనువారు నాకు సర్వస్వమును సమర్పించినట్లే. అది యెట్లనగా, నా సర్వస్వము 'అడిగినవారికి లేదనకుండ నిచ్చుటయే' అది యడుగువారున్ననే కదా ప్రకాశించును! దానిని ప్రకాశింపజేయువారు గావున నీ యర్థులు నాకు సర్వస్వము నిచ్చునట్లే. భగవంతునకు తనకెంత చేసినను తనవి తీరదు. ద్రౌపది తనకు మహత్తరమైన మానభంగ ఆపత్తి రాగా

"శఙ్ఖ చక్రగదాపాణే ! ద్వారకానిలయా చ్యుత !
గోవిన్ద! పుణ్డరీకాక్ష ! రక్ష మాం శరణాగతామ్ ॥"

అని శరణు వేడగా నామెకు మానసంరక్షణను గావించుటయే గాక, మహత్తర భారతసమరమున ఆమె భర్తలను తలపూవు వాడకుండ కాపాడి రాజ్య మొసంగినను అతనికి చాలక అవతారమును చాలించు సమయమున చెమర్చుచున్న కన్నులను జూచి కారణ మేమని యడిగిన యుద్ధవునితో

"గోవిన్దేతి యదాక్రన్దత్ । కృష్ణా మాం దూరవాసినమ్ ।
ఋణం ప్రవృద్ధమివ మే । హృదయా న్నాపసర్పతి ॥"

ద్రౌపది శరణాగతయై దూరముననున్న నన్ను రక్షింపుమని ప్రార్థించిన పిలుపు చక్రవృద్ధితో పెరిగిన ఋణమువలె నా హృదయమున పేరుకొని పోయి యామె కెన్ని యుపకారముల జేసినను పీడించుచునే యున్నదనెను. అటులనే యీ బర్రెలును తమ పాలను పితుకుకొనువారు లేక తహతహలాడిపోవుచున్నవి. ఇట్లే యీ గోపాలుడు "కృషి గోరక్ష వాణిజ్యం వైశ్యం కర్మస్వభావజమ్" అనునట్లు పశువులను కాపాడుట తనకు సహజమై యుండగా పాలను పితుకుటయను తన కులధర్మమును

విడచి యుండనేల? "స్వ కర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః" తన వర్ణమునకు, ఆశ్రమము నకు భగవంతుడు విధించిన కర్మలను భగవదారాధన బుద్ధితో నాచరించిన పరమపురుషార్థమును బడయవచ్చును గదా! ఇట్టి తన సహజకృత్యమగు పాలను పితుకుట నీత డేల మానెను? ధర్మసంస్థాపనకై యవతరించిన శ్రీకృష్ణుని ముందె యర్జునుడు

'విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః ।
న యోత్స్య ఇతి గోవిన్ద ముక్త్వా తూష్ణీం బభూవ హ ॥"

ధనుర్బాణములను విడచి దుఃఖాక్రాంతస్వాంతుడై "నేనీ యుద్ధమును చేయనని రథముపై చతికిల బడగా", "అయ్యో! నా కన్నెదుటనే స్వధర్మమగు యుద్ధమును చేయననుచున్నాడే యిక నేనేమి ధర్మసంస్థాపనము చేతు" నని భయపడి గదా శ్రీకృష్ణు డంత దీర్ఘోపన్యాసమును గావించి "కరిష్యే వచనం తవ" అనిపించెను. అట్టి శ్రీకృష్ణు డీ గోపకుడు పాలుపితుకక తన మ్రోల సంచరించుట సహించునా? అన్నచో శ్రీవైష్ణవ సంప్రదాయస్థు లేపని చేసినను

"భగవతో బలేన భగవతో వీర్యేణ భగవతస్తేజసా
భగవదనుజ్ఞయా భగవత్కర్మ కరిష్యే"

అని చేయుదురు. మన మాతని యవతారసమకాలీనులముకాము. మనకు శ్రుతి స్మృతులు భగవదాజ్ఞయను నమ్మకము కలదు కనుక ఇట్లనుసంధించి కర్మలను చేయుదుము. ఈ విధి సామాన్యము ముముక్షువులకే. శ్రీరామావతారములో లక్ష్మణస్వామియు, శ్రీకృష్ణావతారమున ఈ గోపాలుడును ఆచరించునది అపరోక్షాజ్ఞారూపమైనది. సమకాలీనులు చేయునది అనుజ్ఞాకైంకర్యము. "శ్రుతి స్మృతిర్మమైవాజ్ఞా" అనుటచే మనకిది ఆజ్ఞాకైంకర్యము. మన కీ విధినతిక్రమించుట స్వరూపహాని, కాని, వారికా దోషము లేదు.

భగవంతుని సమకాలీనులై యాతని నొక క్షణకాలమైనను విడువజాలక అనువర్తించు గోపాలుడు ఏపని చేసినను శ్రీకృష్ణుని ప్రీతికయియే చేయును. ఆతడేది యానతిచ్చిన దానిని ప్రీతితో చేయుచు వెన్నంటి తిరుగుచుండుటచే నీతడు చేయు ప్రతికర్మయు శాస్త్రీయమే యగును, ప్రత్యేకించి పాలు పితుకుట యొక భగవన్ముఖోల్లాసకరమనియే చేయవలసిన పనిలేదు, అందుచే నిది దోషము కాదు. శ్రీలక్ష్మణస్వామి శ్రీరామునితో నరణ్యవాస మొనరించుతరి అగ్నిహోత్రాది స్వకర్మల విడచుటకును ఇదియే న్యాయ మనువర్తించును. శ్రీరాము డాతని "నేను శాస్త్రమున విధించిన పనిని నీవేల చేయలే" దని కోపగించి దండించునా? సోమరితనముచే విడిచిననే యిది దోషముగా పరిగణింపబడునంతియే గాని యాతని నొక క్షణము విడిచినను "జలా న్మత్స్యా వివో ధృతౌ" అనునట్లుండు వారి కది దోషము కాదు. ఈ గోపాలుడు నట్టివాడే.

ఇళంక త్తె ఱు మై -

అవి లేతవయస్సు పడ్డలని కాని, చిన్న వయస్సు దూడలు కలవని కాని చెప్పవచ్చును. అట్టి వానికే పాలు అధికముగా నుండును. అందువలననే పాలు చేపునకు వచ్చి పితుకనిచో బాధ అధికముగా నుండును. ఆ దూడలకు తల్లిపాలు మాత్రమే ఆహారము. గడ్డి గాద తినలేవు. అందుచే తల్లులకు వానిపై ప్రేమ అధికమగుటచే వానికి పాలిచ్చుటలో నాలస్యమును సహించజాలక పితుకు వారు వచ్చువరకును కర్ణకఠోరముగా నరచుచునేయుండును.

కన్ఱుక్కు ఇరఙ్గి -

ఈ పశువుల ఆరాటము తన పాలచేపుచే కలుగుచున్న బాధచే గాక తన బిడ్డ ఆకలితో నల మటించుచున్నదనియే. ఇది భగవంతునకు తన భక్తుల పట్ల నుండు ఆరాటమునకు నిదర్శనము. గజేంద్రుడు "నీవే తప్ప నితః పరంబెరుగ మన్నింపు" మని ప్రార్థించిన పిమ్మట యొక్క క్షణవిలంబ మునైనను సహించ గలిగెనా ? అటులనే యీ గోపాంగనలును ఈమెను లేపుటకై అంత ఆర్తితో వచ్చియు ఆమె లేచుటకు చేయు ఆలస్యమును సహింపలేక యున్నారు. తమ స్థితికి దయతలచి లెమ్మనుచున్నారు. ఇదియే యీ వర్ణనలోని తాత్పర్యము.

నినైత్తు ములై వఴియే -

దూడ దూరముగా కట్టబడియున్నను భావనాతిశయముచే నా దూడ వచ్చి తన పొదుగున మూతినుంచి త్రాగుచున్నట్లు భావించి పాలను చేపి చనికట్ల ద్వారా కార్చివేయుచున్నవి. భావనా ప్రకర్షవలన ప్రత్యక్షకార్యము పుట్టుటలో నిదర్శనముగా నొక కథను మన పెద్దజీయరుస్వామివారు చెప్పెడివారు.

భోజన ప్రియుడగు నొక విప్రుడు ఆ గ్రామమున జరుగు శ్రాద్ధము లన్నిటికి భోక్తగా నాహ్వా నింపబడి పోవునలవాటు కలదు. కాని ఒక వారమైనను ముందు ఆకట్టుకొనవలెను. అత డా వారము రోజులును తాను భుజించు క్రమమును తలంచుకొని యువ్విళ్లూరు చుండును. ఒకనా డొక యువారు లగు భాగ్యవంతుల యింట భోక్తగా నియమింపబడి ఊణాధ్యాయమును (భుజించు క్రమాను సంధా నమును) తలంచుకొనుటలో వడలలోని పచ్చిమిరపకాయను కొరికినట్లు కలిగిన భావనలో నోరంతయు

మండిపోయి గంతులిడ దొడంగెనట. ఒక బుద్ధిమంతు డాతని పాటును గాంచి యుపాయముగా "ఓ పిచ్చి బ్రాహ్మణుడా! మిరపకాయ కారమును పెట్టినచో ఆ ప్రక్కనున్న అప్పమును తినరాదా? అను నరికి ఆతడా యపూపభక్షణమును గావించి స్వస్థుడయ్యెనట! చూచితిరా, భావనాబలమెంత చేసినదో ?

పాలు ఎక్కువగా నున్నచో పితికెడి చేతి వెంబడినో, దూడ నోటివెంబడినో కారవలెను. ఆ రెండును లేకుండుటచే పొదుగు వెంబడినే కారుచున్నవి. భావనాప్రకర్ష వలన మారీచుడు చెట్టులో, పుట్టలో గూడ చాప ధారియైన శ్రీరామచంద్రుని జూచి గడగడ వణంక దొడంగెను. గడ్డిపరక కదిలి నను కంసునకు శ్రీకృష్ణుడే వచ్చుచున్నట్లు కనిపించ దొడంగెను.

నిన్ఱు పాల్ శోర - విడువకుండగా పాలు కారుచుండగా.

మేఘములు వర్షించవలెననిన సముద్రమున కేగి యచ్చట కడుపునిండుగ నీరు త్రాగి వచ్చి వర్షించవలెను. ఈ పశువుల కా పాటులేదు. తలంచుకున్నంతనే పాలు కారును. ఆ తలంపు మారిననే ఆ ధార మారును. కావుననే 'నిన్ఱు' అనుచున్నారు. తిరుపతి, సింహాచలము, బదరి మార్గములలోని పర్వతముల నుండి నీటి ధారలు కారుచున్నట్లే యీ పశువుల పొదుగుల నుండి పాలు కారుచున్నవి. ఆ సమృద్ధి మేతవలన కాదు. శ్రీకృష్ణుని పాలనవలననే.

పా ల్ శో ర -

భగవద్విషయమును విననిచో నిలువజాలక "శొన్నాల్ విరోద మిదు ఆకిలుం శొల్లువన్ కేణ్మినో" ఆళ్వార్లు మనతో నేను చెప్పిన మీకు అప్రియమని నాకు తెలియును. అయినను తల్లి పిల్ల వానికి మందు బలవంతముగా పోసినట్లు నేను మీకు హితమును చెప్పక మానను. మీరు వినకుండు టకు వీలులేదని చెప్పినట్లును, అర్జునుడు విన్నదానితో విసుగుజెంది, కొంచెము బద్ధకించుచున్నట్లు తోచగనే శ్రీకృష్ణుడు,

"భూయ ఏవ మహాబాహో । శృణు మే పరమం వచః ।
ఇష్టోఽసి మే సుఖాచేతి । రహస్యం హ్యేతదుత్తమమ్ ॥"

"అర్జునా! నీవు నాకు ప్రియమైన మిత్రుడవు గాన నీకు ఉత్తమమైన రహస్యార్థము నొకదానిని చెప్పెదను. ఇంతకు మించిన మాట మరియొకటి లేదు. నీవు చాల గొప్పవాడవు, వీరుడవు" అని పొగడి ముందు గ్రంథమును వినుటకు అభిముఖుని గావించుకొని వినిపించెను.

ఇట్లు చెప్పక ఉండబట్టక చెప్పినటుల ఈ పశువులు పాలనీయక ఉండజాలక ధారలను కురిపించుచునే యున్నవి. ఇది మన హితైషులగు అచార్యుల లక్షణము. శ్రీశుకుడు పరీక్షిన్మహారాజునకు

"శ్రుణుష్వావహితో రాజన్ । అ పి గుహ్యం వదామి తే ।
బ్రూయుః శిష్యస్య స్నిగ్ధస్య । గురవో గుహ్య ముత్తమమ్ ॥"

రాజా! నీ వడుగకున్నను నేను శ్రీకృష్ణావతారములోని యొక రహస్యార్థమును చెప్పెదను. అడుగక నుడువరాదను విషయము సామాన్యులగు శిష్యుల విషయముననే. నీవంటి తగిన శిష్యులకు, నావంటి ప్రియులగు నాచార్యులు ఎంతగొప్ప రహస్యమునైనను ప్రేమతో నుపదేశింతురు. ఆ యుప దేశములోనైనను విసుగుజెందరు. "శేషం కోపేన పూరయేత్" శిష్యుని చక్కని ప్రశ్నకు సదుత్తరము తోచక గద్దించి కోపముతో పొమ్మనరు. అర్జునుడు భ్రష్టకర్మయోగిని గూర్చి చేసిన కఠినప్రశ్నత్రయ మునకు సమాధాన మొసంగుచు శ్రీకృష్ణుడు "న హి కల్యాణకృత్కశ్చిత్ దుర్గతిం తాత! గచ్ఛతి" "తాత = నాయనా!" అని సంబోధించి "భగవత్ప్రీతికరమగు ధర్మము నాచరించు కర్మయోగి యెన్న డును నరకమునకు పాల్పడడు" అని ప్రీతితో సెలవిచ్చెను. ఇది సదాచార్యు లెరుంగవలసిన ముఖ్యధర్మము.

ఈ పాలుకార్చు పశువులు మన కా ధర్మమును బోధించుచున్నవి. తనకు ప్రియమైన దూడ త్రాగిననే యా పాలట్లు స్రవించును. దీనిని గీతాప్రభావపరమగు నొక శ్లోకమున

"సర్వోపనిషదో గావః । దోగ్ధా గోపాలనన్దనః ।
పార్థో వత్స స్సుధీ ర్భోక్తా । దుగ్ధం గీతామృతం మహత్ ॥"

అని రూపించిరి. అనగా - ఉపనిషత్తు లన్నియును గోవులు. వానిని నేర్పుతో పితుకువాడు శ్రీకృష్ణుడు, మొదట త్రాగి చేపును తెప్పించు దూడవంటివా డర్జునుడు. పాలు సక్రమముగా కడుపు నిండునట్లు ప్రసరించవలెనని దూడ తన మూతితో పొదుగును పొడుచును. అటులనే ఉపదేశప్రసార మునకై మధ్యమధ్య దూడయైన అర్జునుడు ప్రశ్నించును. అట్లు చేయగా శ్రీకృష్ణుడు పితికిన పాలను జ్ఞాను లారగింతురు. ఆ పాలు ఆ దూడ కెంత భోగ్యములై బలావహము లగునో శ్రీకృష్ణుని యుప దేశము లట్లే జ్ఞానుల కగును. అందులకే అర్జునుడు పదియవ యధ్యాయప్రారంభమున

"భూయః కథయ తృప్తిర్హి । శ్రుణ్వతో నాస్తి మేఽమృతమ్॥"

"నేను నా చెవులతో అమృతమును త్రాగుచున్నాను. నా కడుపు నిండలేదు. ఇంకను చెప్పు" మని ప్రార్థించెను. ఆతడు ఉపదేశించుటలోను

"భూయ ఏవ మహాబాహో! శృణు మే పరమం వచః" అని ప్రలోభపెట్టి ఉపదేశించెను. ఈ విషయము ఈ ప్రకరణమున సూచింపబడినది.

ననైత్తిల్లం శేఱాక్కుం - తడిపి యింటిని బురద చేయును.

ఆ పాలప్రవాహమునకు మెరక, పల్లమను తారతమ్యము లేదు. అంతటకును ప్రవహించగల ఆధిక్యము గలదు. అందుచే నేల అంతయును తడిసినది ఆ పైన పాలను దూడ త్రాగుటచేత గాని, పితుకుటచే గాని పొదుగు తేలిక యగువరకు ఆ బర్రె యిటునటు కట్టురాట చుట్టును నిర్విరామముగా తిరుగుచునే యుండుటచే ఆ ప్రదేశమంతయు త్రొక్కబడి బురదయగును. ఆచార్యుల యుపదేశ నైపుణ్యముచే ఎంత మొద్దు బుద్ధికలవానికైనను ఆ విషయములు మనస్సున కెక్కి పదునుగావించును. లోకమున విత్తనముల జల్లుటకు భూమిని నీటితో పదును గావించునటుల ఆధ్యాత్మ బీజన్యాసమునకై శిష్యుని హృదయ మనుకూలబడుట సూచింపబడుచున్నది. అందులకే భగవానుడు గీతలో అనేక స్థలములలో అర్జునుడు హృదయము మెత్తబడి వినుటకు ప్రవణుడగునటుల 7వ అధ్యాయ ప్రారంభమున "అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు" అనియు, తొమ్మిదవ అధ్యాయ ప్రారంభమున "ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యన సూయవే" అనియు నుపదేశము గావించుచున్నది. అట్టి స్థితిని ఈ 'నినైత్తు' అను పదము సూచించుచు. ఈ అర్థములో 'ఇల్లం' అనగా హృదయమే.

నఱ్ఱెల్వన్ తఙ్గాయ్ - మంచి సంపదగలవాని సోదరీ!

ఈతని సంపద కర్మానుష్ఠానము చేతగాని, దేవతాంత రానుగ్రహముచేత గాని వచ్చినది కాదు. అట్టివి "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి" అనునట్లు తరిగిపోవును. నచికేతునకు యమధర్మ రాజు "కామానాం త్వా కామభాజం కరోమి" నిన్ను సమస్త కామ్యములతో ముంచెత్తివేతునని యెన్ని విధములుగనో లోభపెట్టినను అతడు "శ్వోఽభావా మర్త్యస్య య దన్తకైతత్ తవైవ వాహాః తవనృత్య గీతే" "యమధర్మరాజా! నన్ను యస్థిర తుచ్ఛఫలముల కేల లోభపెట్టెదవు ? "అపి సర్వం జీవిత మల్ప మేవ" స్థిరముగా నుండు వాడెవ్వడు? కావున నీ సంపదల నీవే యుంచుకొనుము. నాకు వల" దనెను. శ్రీరామచంద్రునకు "అహం సర్వం కరిష్యామి జాగ్రత స్స్వపత శ్చతే" అని వెన్నంటియుండు లక్ష్మణస్వామి సేవల నొనర్చినటుల నీ గోపాలుడును శ్రీకృష్ణు నట్లనువర్తించి యట్టి సేవలు చేయుటయే సంపత్తుగా తలంచువాడు. ఇదియే స్థిరమైన యాస్తి. "పరమాత్మని యో రక్తో, విరక్తోఽపర మాత్మని" యనునటుల యా శేషి యందలి ప్రీతి యితరముల నన్నింటిని కాలదన్నించును. శ్రీరామ చంద్రుడు వనవాసమున రెండవనాటి రాత్రియందు లక్ష్మణుని అయోధ్య కేగుమని యాదేశించగా లక్ష్మణస్వామి

"న దేవలోకా క్రమణం । నా మరత్వ మహం వృణే ।
ఐశ్వర్యం త్రిషు లోకేషు । కామయే న త్వయా వినా॥"

"అన్నా! రామచంద్రా! నాకు నిన్ను విడచి ముల్లోకైశ్వర్యము లభించినను కోరను" అనెను. ఆళ్వారులను ఆశ్రయించిన వారందరును అజ్ఞ, విజ్ఞ తారతమ్యము లేకుండగ "కేశవన్ తమర్" నారాయణ కైంకర్యనిష్ఠులైరి, ఆ సమృద్ధిని సేవించుటకై నిత్యసూరులు భూమి పైకి వేంచేసిరి, వారికి దృష్టి దోషపరిహారార్థమై ఆళ్వారులు "పొలిగ పొలిగ పొలిగ" అని మంగళా శాసనమును గావించిరి. అటులనే యీ గోపాలుర శ్రీవైష్ణవ కైంకర్య లక్ష్మియు ఆ యూరంతయు వ్యాపించెను.

"వైష్ణవో నః కులే జాతః, స న స్సన్తారయిష్యతి"

అనునటుల తన వంశమునంతను తరింపజేయ గల కైంకర్య లక్ష్మి కలవాడు.

తజ్గాయ్ - సోదరీ!

ఆ యన్నకు తగిన చెల్లెలివే దొరికితివమ్మా! ఆతడు తనచే కాపాడబడు బ్రరెల బాధను కానడు. నీవును నీచేత కాపాడబడ వలసిన మా బాధలను కానవు. ఒకరి కొకరు బాగుగనే జత పడిరి. అమ్మా! నీవు భక్తుని భగినివి. నీ కేమి లోటు? కాని అమ్మా! ఒక్క మాట. నీవట్టి మహాను భావుని సోదరి వైనందుకు ఆతని యంశలో కొంతయైనను ఉండవలదా? విభీషణుని సోదరిని చూడుము సీతమ్మ కెంత సేవను చేసినదో! సీతమ్మను విమానముపై గొనిపోయి రణరంగమున నాగ పాశబద్ధులై పడియున్న రామలక్ష్మణులను చూపుమని పంపగా సీతతో విభీషణుని సోదరియగు త్రిజటయును వెళ్లెను. సీతమ్మ రామలక్ష్మణులను జూచి చనిపోయిరని విలపించుచుండగా త్రిజట యామెతో "అమ్మా! వారు చనిపోలేదు. మూర్ఛాక్రాంతులై యున్నారు. కొంత సేపటిలో లేచెద" రని చెప్పి యోదార్చెను. ఆమె నమ్మకమునకై "అమ్మా! నీ నాథుడు పరమపదించినచో నిన్నీ విమాన మిట్లు ధరించునా? ఇది అపవిత్రుల నొక్క క్షణమైనను తనపై నిలువనీయదు" అని సయుక్తికముగా నామె నోదార్చెను. నీవును మమ్ముల నటులనే యోదార్చవలదా? నీ సోదరునకు శ్రీకృష్ణుడు రక్ష్య వర్గములోని వాడైనచో నాతనిని బట్టి మేము కూడ నీ రక్ష్యవర్గములోని వారమే గదా! మేము శ్రీకృష్ణుని వర్గములోని వారమే గదా!

పని త్తలై వీழ - మంచు తలపై కురియగా

అమ్మా, తలలపై మంచువర్ష ప్రవాహము, క్రింద పాలధార ప్రవాహము, హృదయములలో శ్రీకృష్ణుని విషయమైన వ్యామోహ ప్రవాహము. ఈ మూడు ప్రవాహముల మధ్య నిలువలేక అల్లాడి పోవుచున్నాము.

నిన్ వాశల్ కడై పత్తి -

నీ గుమ్మపు కమ్మిని పట్టుకొని (ఎటులనో తట్టుకొని నిలచియున్నాము)

ప్రవాహములో కొట్టుకొని పోవువాడు తెప్పనవలంబించి నట్లున్నది మా స్థితి.

వీరు వరుణదేవున కంతర్యామియగు నారాయణుని ప్రార్థించినది.

"త్వదీక్షణ సుధా సిన్ధు వీచి విక్షేప శీకరైః
కారుణ్యమారుతానీతై శ్శీతలై రభిషిఞ్చ మామ్"

"స్వామీ! నీ కటాక్షామృతసాగరతరంగముల యాఘాతముచే చిమ్మబడుచున్న చల్లని తుంపురులు నీ దయచే మాయందు ప్రసరింపజేసి మమ్ముల నభిషేకింపజేయు" మని ప్రార్థించిన భగవత్కృపావర్షము.

వీరు తమ యారాటము నిట్లు ప్రదర్శించినను ఆమె లేచిరాలేదు. కారణ మేమనగా, భగవంతుడు ప్రార్థించిన వారికందరకును బాహ్యదర్శనమును గాని, అంతరదర్శనముగాని ప్రసాదించడు. "విల్కై విల్లామై విరుమ్బి యుళ్ కలన్దా ర్కొరముతమాయ్" అన్నట్లు వారి వైముఖ్య, అభిముఖ్యములను లోతుగా పరిశీలించి వాస్తవాభిముఖ్యము కలవారికే యమృతమయమైన దర్శనము నొసంగునట్లే యీ గోపాంగనయు వీరి యభినివేశము నెరుంగగోరి మౌనము నవలంబించెను. బైట నున్న అంగనలు ఆ రహస్యము నెరుంగజాలక తమ యార్తినే వెలిబుచ్చుచు పలుకుచున్నారు.

శిన త్తినాల్ - కోపముచే.

రామ కృష్ణావతారములకు ధర్మి యొక్కడే యగుటచే వస్తుతః భేదము లేకున్నను, ఆ యా యవతారప్రయోజనములు వేరువేరగుటచే వారివారి చేష్టలును భిన్న భిన్నములుగా కాన్పించును.

శ్రీకృష్ణుడు తన బాల్యమున స్త్రీలకు తన విషయమైన కూలంకషవ్యామోహమును కలుగజేసి అప్పుడప్పు డా వ్యామోహము అనర్థదాయకమగునను భయముచే అంతర్థానమై వారి నేడ్పించును. శ్రీరామచంద్రు డట్లు గాక సీతాదేవివిరహమును సహింపజాలక నిద్రాహారములను విడచి శరీరము నుపేక్షించి యామెకొరకై

"అధిశయితవా నబ్ధిం నాథో మమష్ట బబన్ధ తమ్
హరధను రసౌ వల్లీభఙ్గం బభఙ్జ చ మైథిలి !
అపి దశముఖీం లూత్వా రక్షఃకబన్ధ మనర్తయత్
కి మివ న పతిః కర్తా త్వచ్చాటుచఞ్చు మనోరథః ॥"

అఘటితములగు సముద్రసేతుబంధనము, శివధనుర్భంగము, రావణసంహారము, రాక్షసుల మొండెముల తాండవింపజేయుట మొదలగు అతిమానుషక్రియలను ఘటింపజేసెను. ఈ గోపాంగనలు శ్రీరామవృత్తాంతము ననుసంధించినచో దానిని విని సంతోషించి యామె లేచివచ్చునని వీరియాశ.

## శినత్తినా త్తెన్నిలజ్గై క్కోమానై చ్చెత్త -

కోపముచే దర్శనీయమైన లంకకు రాజైన రావణుని సంహరించి.

శ్రీరాముడు రావణుని సంహరించుట, తననే దిక్కని నమ్మియున్న సీతమ్మను దొంగిలించి తెచ్చి బాధించినందుకు కాదట! కాని తన కోపమును తీర్చుకొనుటకును, తనపై లోకులు అప్రయోజకుడను అపకీర్తి నాపాదింపకుండుటకునని యాతడే సెలవిచ్చెను. రావణవధానంతరము అమ్మని రప్పించి యామెకు వినిపించిన మాటలివి. శీతలహ్రదమువలె చల్లనైన హృదయముగల శ్రీరామునకు కోపము కలదా? అనగా, అతడు జితక్రోధుడు. ఆ కోపమును అస్త్రమును వలె అవసరము వచ్చినపుడు "క్రోధ మాహారయత్తీవ్ర" మ్మని పిలిచి తెచ్చుకొని వాడుకొనును. అన్యత్ర, దానిని వెతికి తెచ్చుకొని వాడుకొనవలసినదే. అది యెచ్చట నుండునో? శ్రీరాముడు శ్రీఆంజనేయుని భుజస్కంధములపై విరాజిల్లి రథస్థుడైన రావణునితో యుద్ధము చేయునపుడు ఈర్ష్యాకలుషితహృదయుడగు నా రక్కస పిశాచము హనుమంతుని బాణప్రహారములచే పూచిన తంగేడుపొదవలె గావించెను.

"తతో రామో మహాతేజాః । రావణేన కృతవ్రణమ్ ।
దృష్ట్వా ప్లవగశార్దూలం । కోపస్య వశమేయివాన్ ॥"

శ్రీరాముడు రావణునిచే వ్రణితుడైన ఆంజనేయులను జూచి యింతవరకు తన వశమం దున్న కోపమునకు తాను వశుడై రావణుని లంకకు తరలించెను.

శ్రీరామచంద్రునకు తన కార్యమనియు, తన భక్తుల కార్యమనియు భేదములేదు. సుగ్రీవుడు వాలిపై శతించి యాతనిని చంపుమనిన వాలిని చంపెను. అన్న చనిపోయెనే యని సుగ్రీవుడు కన్నీరు కార్చగా శ్రీరాముడు ఒక్క క్షణకాలము చింతాక్రాంతస్వాంతుడయ్యెను. చూచితిరా యాతని యాశ్రిత పక్షపాతము !

"దురుక్తాని చ మే సహే" తనను తిట్టినను సహించునట గాని

"మద్భక్తం శ్వపచం వాపి । నిన్దాం కుర్వన్తి యే నరాః ।
పద్మకోటిశతే నాపి । న క్షమామి వసున్ధరే! ॥"

తన భక్తుడు నీచాతినీచుడైనను సరియే, ఆతని నెవ్వరైనను ఒక్క నిందావాక్యము పలికి నచో నాతని కోపము కాలావధి శిక్షించినను తీరదట.

తెన్నిలఙ్గై కోమాన్ -

సుందరమైన లంకాధిపతిని, ఆ లంకాపట్టణ సన్నివేశమును, ఆ రాక్షస రాజగు రావణుని రీతిని గాంచి జితేంద్రియాగ్రేసరుడగు మన హనుమంతుడే

"అహో! వీర్యం అహో! ధైర్యం । అహో! సర్వమహాద్యుతిః ।
అహో! రాక్షస రాజస్య । సర్వలక్షణ లక్షితా ॥"

ఆహా! యేమి యాతని పరాభిభవనసామర్థ్యము, ఆహా! ఏమి ధైర్యము! ఆహా! సమస్తతేజస్సు లను ధిక్కరించు నెంత తేజస్సు! ఉండవలసిన లక్షణము లొక్కటియును కొరతబడక యాతని యందు నిశ్చలముగా నున్నవే!

"యద్యధర్మో న బలవాన్ । స్యాదయం రాక్షసేశ్వరః ।
స్యాదయం సర్వలోకస్య । స శక్రస్యాపి రక్షితా ॥"

"వీని యధర్మ ప్రవృత్తి వీనికి మించిన బలవంతమై వీనిని త్రొక్కిబెట్టి తన చెప్పుచేతలలో నుంచుకొని కూడని పనుల నన్నింటిని అవశముగా చేయించుచున్నది. కాని లేనిచో వీడు దేవేంద్రు నితో బాటు దేవలోకము నంతను ఏలుకొనదగిన ప్రభువు కాకపోవునా?" యని ప్రశంసించెను. అట్టి లంకను, అట్టి రావణుని కూడ శ్రీరాముడు చిత్రవధ గావించెను. శ్రీరామచంద్రుడు దయతో విడచి పెట్టగా లంకకు పోయి తిరిగి యుద్ధమున కేతెంచి నిలచియుండగా నొక్క బాణముతో చంపివేయక యొక్కొక్క తలను, ఒక్కొక్క చేతిని రాలగొట్టుచు, రథమును ముక్కలు జేసి, సారథిని జంపి,

స్కరములను దునిమి, సేన నంతను చీల్చి చెండాడి తన యవస్థను చెప్పుకొనుటకైనను దిక్కు లేకుండ నందరను చంపివైచి, వాని గర్వము నంతను అణచివైచి "అయ్యో ఆర్తుల యుపదేశమును పెడచెవిని బెట్టి "యీ వీరునితో వైర మేల తెచ్చిపెట్టుకొంటినా" యని పశ్చాత్తప్తుని గావించి చంపి వైచెను.

మనత్తు క్కినియానై -

మనస్సునకు భోగ్యభూతుడైన శ్రీరామచంద్రుని.

"ఇతః పరం మృత సఞ్జీవనం రామవృత్తాన్త" మ్మని శ్రీరామచంద్రుని తిరునామ వ్యాఖ్యా నారంభమున శ్రీభట్టరువారు శ్రీ విష్ణు సహస్రనామ భాష్యములో సాయించిరి. ఆ వృత్తాంతము శ్రీకృష్ణుని విరహవ్యథచే బీటలు బారిన హృదయమును చల్లబరచి పదను గావించును దానిని మేము

పా ద ప్పుం - పాడినను

నీ వాయ్ తిఱవాయ్ - నీవు నోరు తెరువవు.

మా కొరకు గాకున్నను నీ యానందపారవశ్యము నైనను మాకు ప్రదర్శింప వలదా? యను చున్నారు.

ఇనిత్తా నెళున్దిరాయ్ - ఇక నైనను లేచి రమ్ము.

భగవంతుడు పాలసముద్రమున పవళించినను ఆర్తుల ఆలాపములను విని లేచి యవత రించి వారి యిక్కట్టులను బాపును. నీవు లేచినను చాలును. మా యార్తిని చూచియైనను లేవ వచ్చునే !

ఈదెన్న పేరుఱక్కమ్ - ఇది యేమి పెద్ద నిద్ర.

నీ నిద్ర భక్తుల ఆర్తికి మేల్కొను భగవంతుని నిద్రవంటిది కాదు. పగలనుభవించిన చిత్త క్లేశశాంతించుటకై విశ్రమించు నిద్రిందు సంసారుల నిద్రవంటిదిని కాదు. ఇదేమి విచిత్రమైన నిద్దు రమ్మా, నీది వైదిక నిద్రయును కాదు, లౌకిక నిద్రయును కాదు. భగవంతుని నిద్రవంటి యోగ నిద్రయు కాదు. యోగుల నిద్రవలె ప్రాకృత విషయములలో స్తబ్ధతయు కాదు. ఇది యొక అపూర్వ నిద్రవలె నున్నదే !

అనై త్తిలత్తారుమ్ అఱీన్దు -

చుట్టు పట్ల నున్న వారందరును తెలిసికొనిరి.

పర సమృద్ధినే నీ సమృద్ధిగా భావించుదానవగుటచే అందరును లేచి రావలెనని వేచి యున్నావా? చక్రవర్తిని వందిమాగధులు లేపునటుల ఊరివారందరును వచ్చి నీ వాకిట నిలచి నిన్ను లేపవలయునను గౌరమును పొందవలెనని పరుండియున్నావా? అదియును జరిగినది, ఇక మేల్కొని పైటకు వేంచేయుము. నీ గౌరవము నందరు నెరింగిరిలే. భగవద్విషయమును సదస్య మొనరించ రాదని పరుండియున్నావా? మనకు మనవా రీయవకాశమును కల్పించుటచే మన భగవద్విషయము సదస్య మైపోయినది. ఇకనైనను లేచిరమ్ము.

## — వేదాంతార్థము —

అ వ తా రి క —

ఈ పాశురమున భాగవతాభిమాన నిష్ఠులను లేపుచున్నారు.

మన సంప్రదాయమున భగవదభిమాన నిష్ఠకలవారిని ప్రథమ పర్వనిష్ఠులనియు, భాగవతాభిమాన నిష్ఠ కలవారిని చరమపర్వ నిష్ఠులనియు పేర్కొందురు. భగవంతుడును

"మమ మద్భక్తభక్తేషు ప్రీతి రభ్యధికా మతా"

"నాకు నా భక్తుల పట్ల కన్నను, నా భక్తభక్తుల పట్ల ప్రీతి అధిక" మని సెలవిచ్చెను. ఆళ్వార్లు మూడవ పత్తు, 7వ తిరువాయ్‌మొళ్ళి యంతయు భాగవతనిష్ఠ గల మహాత్ముల పట్ల తమకు గల ఆదరమును తెలుపుచు తొమ్మిదవ పాశురమును

కులం తాఙ్గు శాతిగళ్ నాలిలుం కీళిళున్దు, ఎత్తనై
నలన్దానిలాద శణ్డాల శణ్డాల ర్గళాగిలుమ్
కులన్దాఙ్గు శక్కరత్తణ్ణల్ మణివణ్ణ ర్కాళెన్నుళ్
కలన్దార్, అడియార్ తమ్మడియార్ ఎమ్మడిగళే.

జాతిని బట్టి యెంత నీచులైనను చక్రధారియగు శ్రీమన్నారాయణునకు దాసులైన వారికి దాసులైనవారు మనకు పరమప్రాప్యులని సాయించిరి.

పదియవ పాశురము పట్టినంత క్రిందికి దిగి "అడియా రడియార్ దమ్ అడియారడి యార్ తమక్కు, అడియా రడియార్ తమ్మడియా రడి యొాఙ్గళే" "దాస దాసులకు దాసులైనవారికి మనము దాసుల" మని సాయించిరి.

ఆళ్వందారులును స్తోత్ర రత్నమున

"సకృత్త్వదాకారవిలోకనాశయా
తృణీకృతానుత్తమ భుక్తి ముక్తిభిః ।
మహాత్మభి ర్మా మవలోక్యతాం నయ
క్షణేఽపి యద్విరహోఽతి దుస్సహః॥"

స్వామీ! మిమ్ములను సేవించు నాశతో భుక్తి ముక్తులను కూడ నిరసించు భాగవతుల విశ్లేష మును మీ రొక్క క్షణమైనను సహించలేరు కదా! అట్టి భాగవతుల కటాక్షమునకు నన్ను పాత్రుడను గావించు" డని యీ భాగవత నిష్ఠనే ప్రార్థించిరి.

కులశేఖరులు ముకుందమాలలో

"త్వ ద్భృత్య భృత్య పరిచారక భృత్య భృత్య
భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ !

పెరుమాళ్ల కటాక్షము నర్థించుచు భాగవత భృత్యులలో చివరివానినిగ తమను తలంచుమని యీ భాగవతనిష్ఠనే తమకు గల యోగ్యతగా పురస్కరించుకొనిరి.

శ్రీవరవరమునిపుంగవులు యతిరాజవింపతిలో

"శబ్దాది భోగ విషయా" అను శ్లోక ఉత్తరార్థమున

"త్వద్దాసదాసగణనా చరమావధౌ యః
తద్దాసతైకనిరతాఽవిరతా మమాఽస్తు"

భాగవతచరమావధినిష్ఠను తమకు నిరవచ్ఛిన్నముగా సాగునటుల ప్రసాదించు మని ప్రార్థించిరి.

తొండరడిప్పొడి యాళ్వార్లు తిరుప్పళ్లియెళుచ్చి చివరిపాశురములో చితర "తొణ్డరడి ప్పొడి యెన్ఱు మడియనై అళియనెన్ఱరుళి ఉన్నడియార్క్కాళ్ పడుత్తాయ్ పళ్లియెళున్దరుళాయే" "తొండరడి

ప్పాడి యను నీ దాసుని అనాథుతని కృపజేసి నీ దాసులకు దాసుని గావించుటకై ప్రక్కనుండి లేచి దయచూపు" మని యీ భాగవతనిష్ఠనే తమకు ప్రసాదించుటకై రంగనాథుని మేల్కొలిపిరి.

తిరుమంత్రార్థవ్యాఖ్యానములో "నమః" పద వ్యాఖ్యానావసరమున "ఇతిలే భాగవతశేషత్వ మనుసన్ధేయమ్, ఇదు అకారత్తిలే ఎన్జుం శొల్లువర్‌కళ్, ఉకారత్తిలే ఎన్జుం శొల్లువర్‌కళ్" అని సాయించిరి. అనగా, "ఈ 'నమః' పదార్థములో కేవల భగవచ్ఛేషత్వము మాత్రమే జీవాత్మస్వరూపము కాదు, భాగవతులకు శేషభూతుడనియు తెలిసికొనవలెను. ఈ భాగవతశేషత్వము 'నమః' పదము నందే గాక 'అ' కారార్థములోను, 'ఉ' కారార్థములోను కలదందురు" అని సాయించిరి. అనగా, అష్టాక్షరీమంత్రమున అంతటను ఈ భాగవతనిష్ఠ ప్రధానముగా బోధింపబడుచున్నదని దీని వైభవము తెలుపబడినది,

శ్రీరామాయణపాత్రలలో నుత్కృష్టపాత్ర యెవ్వరని ప్రశ్నించినచో శత్రుఘ్నుడు, శబరి యని సంప్రదాయవేత్తలు చెప్పుదురు. వారిరువురిలో శత్రుఘ్నుని కన్న శబరి మిన్నయని నేను వ్రాసిన 24 రామాయణ జంటల విమర్శలో 'భాగవతనిష్ఠ' అను జంట విమర్శనమున (శ్రీరామాయణ రత్నాకరము) చూడగలరు. ఈ భాగవతనిష్ఠ కలవారిపై భగవంతునకు గల యాదరాతిశయము నొక్క విషయమున నారయుడు.

గుహుడు శ్రీరామచంద్రు నర్చించుటకై సకలసన్నాహములను గావించుకొని వారిని తన గుడిసెకు రమ్మని ప్రార్థించగా శ్రీరాము డాతనితో

"అర్చితా శ్చైవ హృష్టా శ్చ । భవతా సర్వథా వయమ్ ।
పద్భ్యా మభిగమాచ్చైవ । స్నేహసన్దర్శనేన చ ॥"

"నాయనా! గుహ! నీవు నాకడకు నడచి చేరుట, ప్రీతివచనముల పలుకుటవలననే మాకు పూజ పూర్తియై అపరిమితానందము కలిగిన" దనెను. గుహు డింకను నిర్బంధించగా "మే ముత్తమ క్షత్రియుల మసుటచే నిచ్చువారలమే గాని తీసికొనుట మా కులధర్మమునకు విరుద్ధ" మని త్రోసి పుచ్చెను.

కాని శబరి యొసంగిన పండ్ల నత్యంతప్రీతితో చేయి జాపి తీసికొని ప్రేమతో నారగించెను. ఈ తారతమ్యమునకు నిదానము గుహుడు భగవద్భక్తుడు, శబరి భాగవతభక్తురాలును నగుట యంతియే. చూచితిరా, భాగవతభక్తిప్రభావము !

"తస్మై దేయం తతో గ్రాహ్యం । స చ పూజ్యో యథాహ్యహమ్" అని భగవానుని యాదేశము (ఆతనికి సమర్పింపుడు. ఆత డొసంగినదానిని శిరసా గ్రహింపుడు. నన్ను పూజించునట్లాతని పూజించుడు.)

అట్టి విలక్షణమైన భక్తికి చరమసీమ నధిరోహించిన భాగవతాగ్రేసరు లీ పాటలో మేల్కొలుపు చున్నారు. ఇట్టి భాగవతోత్తములు తమ సంతానమైన శిష్యులకు వేదాంత విజ్ఞానము లేదను విచారముతో "మా మాయన్తు బ్రహ్మ చారిణః" అను నటుల వారి రాకకై యెదురుచూచుచుందురు. వారి కావిచారము ప్రబలమై వారు వచ్చినచో వారికి 'సంస్కృత వేదాంతము నిట్లు బోధింతుము, ద్రావిడవేదాంత గ్రథముల నిట్లు బోధింతు' మని యెల్లవేళల మనస్సులో భావించుచునే యుందురు. నిజముగ నట్టి శిష్యులు లభించినచో వారికి వేదాంతవిజ్ఞాన ప్రాప్తికై త్వరను బుట్టించి వారి హృదయములను పదునుబరచి యాధ్యాత్మ బీజములను నాటుదురు. ఆచార్యాభిమానముచె నా బీజము లంకురించి, పల్లవించి, పుష్పించి, ఫలించి లోకులకు మధురాతిమధుర రసాస్వాదమును ప్రసాదించును. అట్టివారే యీ లేపబడువారు. వారి కీ యధ్యాత్మవిద్యయే సంపద. అట్టి యధ్యవసాయము కలవారు వీరికి సబ్రహ్మచారులు, సతీర్థులు, సహాధ్యాయులు, సోదరులవంటివారు. లోకమున నైశ్వర్యవంతుల నందరను ఏదో యొక సంబంధమును వారితో కలుపుకొని యాశ్రయించి పోషింపబడు చుందురు. అటులనే యీ భాగవతోత్తముల నాశ్రయించి యాధ్యాత్మికవిద్యను బడసి యుజ్జీవింతురు. వీరి కాచార్యాను గ్రహముచే వేదాంతవిజ్ఞానము హృదయములో పొంగిపొరలుచుండును. దానిని భగవంతుని కటాక్షామృతసాగర తరంగముల తుంపురులు ఆచార్యానుగ్రహ వాయువుచే కొనిరాబడి ముంచెత్తించును. వీరు ఈ యుభయవిధజ్ఞాన, భగవత్కృపా ప్రవాహములలో నిమగ్నులై యీ రెండిటి వలన కలుగు ఆనందమునందు 'నమః' పదార్థావలంబనముచే పొగొట్టబడిన స్వార్థతాబుద్ధి కలవారై ఓడబోసిన భగవత్కైంకర్య నిష్ఠులగుదురు భగవత్స్వరూప రూప గుణ విభూతి చేష్టాదులను వర్ణించు దివ్య ప్రబంధాధ్యయనానందాబ్ధిలో నోలలాడు చుందురు. అంతటితో నూరకొనక అవివేక ఘనాన్ధదిఙ్ముఖులై బహుధా సంతతదుఃఖవర్షియగు సంసారదుర్దినమందు మార్గ భ్రష్టులై జారుచు, పడుచు, లేచుచు, క్లేశపడుచున్న సంసారిచేతనులను కూడ తమ వలె విజ్ఞానులను చేయు తలంపుతో "ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్యవరాన్ని బోధత" అని లేపుచుందురు.

ఈ విధమగు గంభీరమైన వేందాతార్థ మీ పాశురమున ధ్వనించుచున్నది.

## — సందర్భానుసారముగ ననుసంధించుకొన దగిన శ్లోకములు —

అత స్త్రిత చ మూపతి ప్రహితహ స్త మస్వీకృత
ప్రణీతమణిపాదుకం కిమితి చా కులా న్తఃపురమ్
అవాహన పరిష్కృతం పతగరాజ మారోహతః
కరిప్రవర బృంహితే భగవత స్త్వరాయై నమః

(రంగ. స్త. ఉ. శ. 57 శ్లో.)

### తాత్పర్యము

పరమపదమున శ్రియఃపతి ప్రయాణ సంకల్పముతో శేషతల్పమునుండి లేచుసరికి శ్రీవిష్వక్సేనులు పరుగుపరుగున వేంచేసి చేయూత నొసగుట ఆచారము. ఆ తొందరలో సర్వేశ్వరు డాయన చేతిని పట్టుకొనలేదు. ఒకరు మణిపాదుకలను తెచ్చి యెదుట నుంచు మర్యాద కలదు. ఆ నాడట్లుంచిన పాదుకలను తొడగనే లేదు. పిరాట్టిమారులతో తన ప్రయాణోదంతమును జెప్పి వెళ్లు ఆచారము కలదు. అట్లు చెప్పకయే బయలుదేరుటచే "అయ్యో! ఎవరికేమియాపద తటస్థించెనో" యని అంతఃపుర కాంతలందరును తల్లడిల్లబోవుచున్నారు. గరుడుని జీను, కళ్లెము మొదలగు పరికరములతో నలంకరించి పైన కూర్చొని వెళ్లు ఆచారము కలదు. అనాడట్లలంకరించకనే పైనెక్కికూర్చుండిరి. ఇట్లు గజేంద్రుడు మొరలిడుచుండ వేంచేసిన నారాయణుని యా తొందరపాటునకు నమస్కారమని శ్రీ పరాశరభట్టరువారు సాయించిరి.

* * * *

## పదమూడవ పాశురము

# "పుళ్ళిన్ వాయ్"

### — అవతారిక —

ఈ పాశురమున గోపికను లేపుటలో "పోతరిక్కణ్ణినాయ్" అని యామె లోకవిలక్షణమైన నేత్రసౌందర్యముకలదని సూచించుచు సంబోధించిరి. దీనిని బట్టి యీమెకు తన నేత్రసౌందర్యాభిమానము పూర్తిగ నున్నట్లు తోచుచున్నది. శ్రియఃపతికి సకలావయవములును లోకవిలక్షణమైనవే యైనను కళ్లలో నాతని సిరి తాండవించుచుండును. అందుచే రాజసూయయాగమున అగ్రపూజార్హతను నిర్ణయించుటలో పెద్దగా నెన్నుకొనబడిన భీష్మపితామహుడు "ఏష తే పృథు తామ్రాక్ష స్సమ్బన్ధీ తే జనార్దనః" అనగా - "ఇదుగో! నీ బంధువు, విశాలమైన తామరపువ్వును బోలిన నేత్రసౌందర్యము గల శ్రీకృష్ణుడు. ఆ కన్నులే యాతని యగ్రపూజార్హతను చాటుచున్న" వని నేత్రసౌందర్యమును బట్టియే శ్రీకృష్ణుని అగ్రపూజార్హతను నిర్ణయించెను.

ద్రౌపది

"శంఖ చక్రగదాపాణే । ద్వారకానిలయా చ్యుత ।"

అని మొరపెట్టినను వినిపించుకొనని శ్రీకృష్ణుడు "పుణ్డరీకాక్ష" అను పేరు వినగనే కనులు తెరచెను. ఛాన్దోగ్య దహరవిద్యలో హృదయపుండరీకమున భగవంతుని ధ్యానించుటలో ఆతని సకలావయవములను విడచి "కప్యాసం పుణ్డరీక మేవ మక్షిణీ" అని కప్యాసవిశేషణముతో పుండరీకము నలంకరించి నేత్రముల సౌందర్యమును సూచించి ఉపాస్యప్రాధాన్య మాకన్నుల కొసంగెను. దానికి శ్రీభాష్యకారులు "గమ్భీరామ్భ స్సముద్భూత, సుమృష్టనాళ, రవికరనికరవికసిత, పుణ్డరీకదళామలాయ తే క్షణః" అని శాస్త్రీయార్థమును నిర్ణయించిరి. దీనిని బట్టి భగవంతు డాదరించునది నేత్రసౌందర్యమునే యని తెలియుచున్నది. ఆ సౌందర్య మీనాడు లేపబడు గోపాంగనకు పుష్కలముగా నున్నది.దీనిని భగవంతుడు అధికముగ నాదరించి తానే తన యొద్దకు రాగలడను నమ్మక మీమె కధికముగ నుండుటచే లేవక పరున్నది.

విశ్వామిత్రమహర్షి శ్రీరామచంద్రుని

"కౌసల్యాసుప్రజా రామ । పూర్వాసన్ధ్యా ప్రవర్తతే ।
ఉత్తిష్ఠ నరశార్దూల । కర్తవ్యం దైవమాహ్నికమ్ ॥"

అని లేపినటుల

"నిర్జిత శ్రీపుణ్డరీక హరిణ్యాయతలోచనే ।
ఉత్తిష్ఠ మే కౌతుకాయ నేత్రసౌన్దర్య కామినః ॥"

అని శ్రీకృష్ణుడే వేంచేసి తనను లేపునని యామె నమ్మకము. ఇది సత్యమే. భగవంతునకు నేత్రసౌందర్యవతులన్న ప్రీతి మెండు. నేత్ర మనగా జ్ఞానము. దానికి సౌందర్యమనగా శ్రీమన్నారాయణుని గూర్చిన దగుట. అదికల చేతనుడు స్త్రీ కావలెను. అనగా, ఆత్మగుణములలోని పారతంత్ర్యము ప్రధానముగా నుండవలెను. అది యున్నవారి నాత డధికముగ నాదరించును.

"ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమ ప్రియః"

" స చ మమ ప్రియః". ఎంత? అత్యర్థం. అతడు నాకు ప్రియుడు. ఆ ప్రీతి హద్దును నేనే చెప్పజాలను. అనెను వారి యొద్దకు తానే వేంచేయును. పాండవుల నొక్క క్షణమైనను విడువక వెన్నంటెను గదా! శ్రీరాముడు తండ్రిగారి యాజ్ఞ యను నెపముతో ఋషిపుంగవులు, తదితర భక్తుల యొద్దకు తానే స్వయముగ నేగెను. తన కెవరిపై నాదర ముండునో వారి కట్టి జ్ఞానము లేకున్నను తానే ప్రసాదించును.

"తేషాం సతతయుక్తానాం । భజతాం, ప్రీతిపూర్వకమ్
దదామి బుద్ధియోగం తం । యేన మా ముపయాన్తి తే ॥"

"తేషా మేవానుకమ్పార్థం । అహ మజ్ఞానజం తమః ।
నాశయా మ్యాత్మభావస్థో । జ్ఞానదీపేన భాస్వతా ॥"

నన్ను పొందుటకు తగిన జ్ఞానమును నేనే వారికి ప్రీతితో నొసంగి నన్ను పొందింతును. వారివారి హృదయములందుండి జ్ఞానదీపమును వెలుగొందించి వారి యజ్ఞానాంధకారమును పారద్రోలుదును - అనెను. అందులకే ఆయనకు వేయి నామధేయములలో 'తత్' అను నొక నామధేయము ముఖ్యముగా కలదు. దానికి శ్రీభట్టరువారు "స్వజ్ఞాన భక్తిం భక్తానాం తనోతీతి తదుచ్యతే" అనగా - తన భక్తులకు తనను గురించిన భక్తిరూపాపన్నమైన జ్ఞానమును తానే ప్రసాదించి విస్తరింపజేయును

(తను - విస్తారే). అని సాయించిరి. ఇట్టి జ్ఞానమును ఆళ్వారులకు "మయర్వఱ మతినల మరుళినన్" అని వారే సాయించుటను విని మన భాష్యకారులు గూడ శ్రీభాష్య మంగళాచరణ శ్లోకమున "దానిని నా కివ్వవా" అని ప్రార్థించిరి. తనకు ప్రియులైన వారికి తానే ఆ జ్ఞానము నిచ్చి తనతో చేర్చుకొనువాడు సహజముగ నా జ్ఞానమున్నవారిని విడచునా? ఆ జ్ఞానమున్న అందమైనది అనగా, శ్రియఃపతియే తనకు దిక్కనెడి నిశ్చలమైన అధ్యవసాయము. అదికలవారు తమ రక్షణమును తాము చేసికొనక ఆతని చేతికై చూచుచుందురు. అదియే కదా మన సీతమ్మ సిద్ధాంతము.

"న త్వా కుర్మి దశగ్రీవ! భస్మ"

అని తన శక్తిని గాని, "శక్తిరస్తి హి మే వోఢుం లఙ్కామపి సరావణాం"అని చెప్పుటయే గాక ప్రత్యక్షముగా చూపినను ఆతని శక్తిని గాని తన విమోచనోపాయముగా నవలంబించక "శరైస్తు సఙ్కులాం కృత్వా । రామో పరబలార్దనః । మాం నయే ద్యది కాకుత్స్థః । తత్తస్య సదృశం భవేత్" ఆ శ్రీరాముడే వేంచేసి నా యాటంకములను తొలగించి నన్ను తీసికొని వేంచేసినచో నది యాతని నిరపేక్ష రక్షకత్వ స్వరూపమునకు తగు ననెను. ఇట్టి యధ్యవసాయమున్న వారి యొద్దకు భగవంతుడు తానే వేంచేసి వారి నుద్ధరించును. ఈనాడు లేపబడు గోపికకు అట్టి యోగ్యత కలదు.

## పదమూడవ పాశురము

పుళ్ళిన్వాయ్ కీణ్డానై పొల్లావరక్కనై,
క్కిళ్ళిక్కళైన్దానై కీర్తిమై పాడిప్పోయ్,
పిళ్ళైకళెల్లారుం పావైక్కళం పుక్కార్,
వెళ్ళి యెళున్దు వియాழముఱఙ్గిత్తు ।
పుళ్ళుం శిలుమ్బినకాణ్, పోతరిక్కణ్ణినాయ్ ।
కుళ్ళ క్కుళిర క్కుడైన్దు నీరాడాతే ।
పళ్ళి క్కిడత్తియో పావాయ్, నీ నన్నాళాల్,
కళ్ళం తవిర్న్దు కలన్దేలో రెమ్బావాయ్.

— తాత్పర్యము —

నాకు నేత్రసౌందర్య ముండుటవలన ఆ కృష్ణుడే రావలెనని పరుండియున్న యొక గోపాంగ నను లేపుచున్నారు.

బకాసురుని చంపిన శ్రీకృష్ణుని యొక్కయు, సీతాదేవిని తన నుండి యెడబాటుచేసిన దుర్మార్గుడగు రావణుని అనాయాసముగా సంహరించినట్టి శ్రీరామచంద్రునియొక్కయు కీర్తిని ఆనందముగా పాడుకొనుచు గొల్లపిల్లలు శ్రీకృష్ణుడును, తామును కూడవలెనని సంకేతము గావించు కొనిన స్థలమునకు పోయి చేరిరి. తెల్లవారు సమయమైనది. శుక్రోదయమైనది. బృహస్పతినక్షత్ర మస్తమించినది. పక్షులరచుచు ఆహారమునకై పోవుచున్నవి. తామరపువ్వునందు తుమ్మెదవాలినట్లున్న అందమైన నేత్రములు కలదానా! మృదువైన స్వభావముకలదానా! బొమ్మవంటి అందముకలదానా! శ్రీకృష్ణునితో నిర్భయముగా విహరించుట కేర్పడిన యీ మంచి శుభావసరమున చల్లని నీటిలో చల్లగ స్నానమాచరించక ప్రక్కనుపట్టుకొని ప్రాకులాడుచున్నావా? మా అందరితో కలసి శ్రీకృష్ణు ననుభ వించుటకై లేచిరమ్ము.

— విశేషార్థము —

పాడుగింటి గోపికను లేపుటలో "మనత్తు క్కనియానైప్పాడవుం" అను మాట యీ గోపాంగన చెవిని సోకినది. తన యింటికి వారు వచ్చి లేపగా "ముందుగ లేవని నా యపరాధము తీరునటుల వీరితో నేనే ప్రసంగింతు"నని "తల్లులారా! మీలో శ్రీరామచరిత్రను పాడువారున్నారా?" యని ప్రశ్నిం చెను. దానికి వారు "తల్లీ! మేము రామ వృత్తాంతమునూ పాడితిమి, శ్రీకృష్ణ వృత్తాంతమునూ పాడితిమి. రామాయణమైనది, భారతమైనది, భాగవతమైనది, శ్రీ పాంచరాత్రమైనది, నీవు లేచుటకు" అనిరి.

శ్రీరామ వృత్తాంతము సరే సరి, భారత, భాగవతములు శ్రీకృష్ణ వృత్తాంతమునకు ప్రధాన గ్రంథములు గదా! "శ్రీమహాభారతత్తాల్ దూతు పోనవన్ ఏత్తం శొల్లుగిఱదు" భారతసారము శ్రీకృష్ణ వృత్తాంతమే యని సాయించిరి. ఇక పాంచరాత్రము- ఆరవ పాశురమున "పుళ్లరైయన్ కోయిలిల్ వెళ్ళైవిళి శజ్గమ్ పేరరవమ్" గరుడధ్వజుని కోవెలలోని ఆరాధనా పరికరమగు శంఖధ్వని అనుటయు, "శజ్గజ్ఞొడి కణ్ణైక్కై వెణ్పల్ తవత్తవర్। తజ్గళ్ తిరుక్కోయిల్ శజ్గిడువాన్ పోకిన్ఱార్" "ఎఱ్ఱని కన్నులును, కాషాయ వస్త్రములును, తెల్లని దంతములును గల సత్త్వనిష్ఠులగు సన్న్యాసులు (ప్రప న్నులు) బ్రాహ్మీ ముహూర్తమున మేల్కొని కాల్యకృత్యముల దీర్చుకొని తమ దేవాలయములకు

ఆరాధన చేయుటకై ఆరాధనోపకరణముల దీసికొని వేంచేయుచున్నా"రని చెప్పుటచే పాంచరాత్రాగమమును గూడ వినిపించితి మనుచున్నారు. (ఇందులకు తిరుమలపై వేంచేసియున్న జీయరుస్వామి వారి యనుష్ఠానమే ప్రమాణము). ఇట్టి యధికారికి ఇతరోపాయత్యాగము, ఇతర ఫలత్యాగము, ఇతర దేవతాత్యాగము నుండవలెను గదా! నమ్మాళ్వారు, ఆండాళ్ తల్లి మొదలగు ప్రకృష్టజ్ఞానులే మడల్ గ్రహణము, కామారాధనము మొదలగు వ్యాపారముల జేసినట్లు వారి ప్రబంధములలోనే కాన్పించుచున్నదే! అది దోషముకాదా? అన్నచో "జ్ఞాన విపాకకార్యమాన అజ్ఞానత్తాలే వరుమత్తై యెల్లామ్ అడిక్కళ్లుక్కు పెఱుమ్" (శ్రీవచ. ప్ర. 1. సూ॥ 91) అనగా-కర్మవలన కలుగు అజ్ఞానముచే చేయబడునవి దోషావహములే కాని, భక్తి పారవశ్యముచే వచ్చునట్టి ప్రవృత్తు లన్నియును అత్యంతశ్లాఘ్యములైనవని చెప్పబడెను. దీనిచే భగవంతుని పొందుటలో త్వరాతిశయము సూచింపబడుచున్నది.

## పుళ్ళిన్‌వాయ్ కీణ్డానై -

ఒక నీళ్లమడుగు సమీపమునుండి యొక కొంగ మేయుచుండగా నొక రాక్షసు డా కొంగలో ప్రవేశించి శ్రీకృష్ణుని, ఆతని యనుయాయులను హింసింపదొడంగెను. దానిని గ్రహించి శ్రీకృష్ణుడు దానిని చీల్చివైచెను. ఈ సంఘటనవలన భగవద్గీతలోని క్రింది విషయము సూచింపబడుచున్నది.

"కర్మేంద్రియాణి సంయమ్య । య ఆస్తే మనసా స్మరన్ ।
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా । మిథ్యాచార స్స ఉచ్యతే॥"

(3-6)

ఆత్మజ్ఞానమును సంపాదించవలెనని కర్మేంద్రియములను బలవంతముగా బిగబట్టుకొని యుండియు నెవ్వడు విషయలంపటుడగుటచే మనస్సుతో విషయములను తలంచుచుండునో వాడు మిథ్యాచారి ( = మోసగాడు ) ఇచ్చట చేపలను సంపాదించవలెనని యొక కొంగ తన కన్నులను, ముక్కును మూసికొని, రెక్కలను, కాళ్లను కదల్పనీయక బిగించియుంచి, మనస్సుతో చేపనే తలంచుచుండుటచే పైన చెప్పబడిన మిథ్యాచారిని పోలియున్నది. ఈ కొంగను చీల్చి పారవైచుటచే ఆ మిథ్యాచారికిని యిదే ఫలమని భగవంతుడు సూచించెను. ఈ గోపికల కీ కొంగను చంపుట రావణ సంహారమువలె తోచుచున్నది.

## పొల్లావరక్కనై క్కిళ్ళిక్కళైన్దానై -

'పుళ్ళిన్‌వాయ్ కీణ్డానై' యని తమకు పరిపాటియగు శ్రీకృష్ణవృత్తాంతమును జెప్పి 'పొల్లావరక్కనై' యని శ్రీరామ వృత్తాంతము నెత్తుకొని రేల? యనగా తమకు సజాతీయురాలైన సీతాపిరాట్టి యొక్క విశ్లేషమును సహించలేక అతిమానుషచేష్టలను చేసినవాడగుటచేతనే.

రావణుడు, లోకమాతయని చెప్పబడు లక్ష్మీదేవి యవతారమైన తల్లియగు సీతామాతను, "పితాహ మస్మి జగతః" ఈ లోకములకు నేనే తండ్రినని చెప్పిన లోకపితను ఎడబాటుచేసిన క్రూరుడు, ఆ తల్లి సాన్నిధ్యముచేతనే గదా కాకాసురునకు తల దక్కినది.

రాక్షసు డన్ననే దుష్టుడని తెలియుచుండగా, 'పొల్లా' (దుష్టుడు) అను విశేషించనేల? యన్నచో రాక్షసులలో విభీషణుడు, ప్రహ్లాదుడు మొదలగు మంచి రాక్షసులును కలరు గాన రావణున కా విశేషణము తగియున్నది. రావణుడు గావించిన మోసముల నన్నింటిని ఆమోదించి ప్రశంసించి నవా రా రాక్షసులు, ఇట్లా జాతియంతయును ఘోరకృత్యములను స్వయముగా జేసియు, చేసినవారి నాదరించుటయు చేయుటచే నీచమైనదే, ఆట్టి జాతికి రాజైన వాడీ రావణాసురుడు.

కిళ్ళిక్కళైన్దానై -

వరబల, భుజబలములు కలిగి ముల్లోకములను పీడించుచున్న నీచుడైన రావణుని అనాయాసముగ చంపిపారవైచిన శ్రీరామచంద్రుని

కీర్త్తిమై -

రావణాసురుడు శ్రీరామచంద్రుని పరాక్రమమును "రక్షణీయస్య విక్రమైః" అని ప్రశంసించి పరాక్రమమునకు గురియైనాడు. అతని చెల్లెలగు శూర్పణఖ "తరుణౌ రూపసమ్పన్నౌ సుకుమారౌ మహాబలౌ" అని యాతని సౌందర్యమునకు గురియైనది. ఈతని తమ్ముడగు విభీషణు డీతని సౌశీల్యమునకు గురియయ్యెను.

పాడిప్పోయ్ -

ఈ గోపాంగనల కిదియే దారిబత్తెము. "పాథేయం పుణ్డరీకాక్ష నామ సంకీర్తనామృతమ్" కదా! అర్చిరాదిమార్గమున పరమపదమున కేగు ముక్తపురుషుడును ద్వయ మంత్రమును సార్థముగా ననుసంధించుచు, ఆనందించుచు పరమపదమును చేరును.

పిళ్ళైకళెల్లారుం పావై క్కళం పుక్కార్ -

గోపికలందరును శ్రీకృష్ణుడును, తామును కూడవలెనని సంకేతించుకొనిన స్థలమును చేరిరి.

వీరికి భగవంతుని దివ్యాత్మ స్వరూపము, తద్గుణములు, దివ్యమంగళవిగ్రహము, తద్గుణ ములు, విభూతులు మొదలగు వాటిని ప్రశాంతముగ విని యానందించు సంకేతస్థలము కాలక్షేప కూటమే. సంసారులకు అత్తవారిల్లువలె వేదాంతుల కీ కాలక్షేపకూటమే ఆనందశాంత్యాది ప్రదము. కాలక్షేపకూటమనగా, కాలస్య = యమస్య, క్షేపః = దూరముగా పరిగెత్తింపజేయు, కూటః=సంఘ ముండుచోటు.

"ఐనచో తెల్లవారిన దందురా? అని లోనున్న గోపాంగన ప్రశ్నించగా

వెళ్లియెళున్దు, వియాழ ముఱజ్గిత్తు -

శుక్రనక్షత్రము తలపై కుదయించెను. బృహస్పతి నక్షత్ర మస్తమించినది. తరచుగా శుక్రో దయమగుట. తెల్లవారుటకు సూచకముగా పెద్దలు చెప్పుటను వినియున్న వారగుటచే శుక్రుడుదయిం చెను, బృహస్పతి యస్తమించె ననుచున్నారు. శుక్రుడు రాక్షసులకును, బృహస్పతి దేవతలకును గురువులు. దేవదానవులకు జన్మవిరోధము, సవతిపిల్లలు గదా! కశ్యపప్రజాపతికి దితివలన పుట్టినవారు దైత్యులు, అదితివలన పుట్టినవారు ఆదిత్యులు, వీరికి కలసి యొక చోటనుండుట లేనట్లే వీరి గురు వులకును. కాబట్టి శుక్రుడుదయించిన, బృహస్పతి అస్తమించునని లోకపరిపాటిని బట్టి చెప్పు చున్నారే గాని నక్షత్ర జ్ఞానముండి కాదు.

దీనిని విని లోపలనున్న గోపాంగన "భీతస్య సర్వం భయకారి నూనం" అను నట్లుల, "కామీ స్వతాం పశ్యతి" (ఎవడు దేనిని మిక్కలి ప్రేమించునో వాని కన్నియు నవియే యని తోచును) అను నట్లును ఉన్నది, దుర్యోధనునకు పాండవసేన యంతయు భీమార్జునులవలెనే కాన్పించినది. శ్రీరామ చంద్రునకు సీతమ్మయొక్క ఏకైకావయవమును పోలిన ప్రతివస్తువును సీతమ్మగనే కనుపట్టెను. అటులనే మన గోపాంగనలకు శ్రీకృష్ణ సంశ్లేష త్వరాతిశయముచే నక్షత్రము లన్నియు శుక్ర నక్ష త్రము, బృహస్పతి నక్షత్రము వలెనే కనిపించియుండునని తలంచి లోనున్న గోపాంగన పరుండియే యుండెను. అంత బైట నున్న గోపికలు "అమ్మా! భాగవతగోష్ఠిని పరమ పురుషార్థమునుగా ఆళ్వారులు "అడియార్ గళ్ కుళాజ్గళుడన్ కూడువ తెన్నుగొలో" యని భాగవతగోష్ఠిలో నన్వయించు భాగ్యము నా కెన్నడో గదా యని తలంచి నిర్విణ్ణులైరి. భాగ్యవశమున నట్టిగోష్ఠి సందర్శనము లభించగా "పొలిగ పొలిగ" యని యా గోష్ఠికి మంగళాశాసనము గావించిరి. "కణ్డోమ్ కణ్డోమ్ కణ్డోమ్" యని గంతు లిడిరి. ఆ శబ్దావృత్తిలో వారికి గల యానందాతిశయ మెట్లు గాన్పించుచున్నదో గాంచుము. "సిరిగా

మోకా లొడ్డువారుండురా?" ఇందరు భాగవతోత్తములు నీవు కోరకున్నను నీ భాగ్యముచే నీ వాకిట నింతకాలము నిలచియున్నను వారిని సేవించుటకైనను లేచి రావచ్చునే? ఏమమ్మా నీ స్వయం పాకము ?

పుళ్లుం శిలుమ్బిన కాణ్ -

ఆ పక్షుల అరపులను వినుము. అవి పాపజన్మములయ్యును తాము సకాలమున లేచి తమ కర్తవ్యమగు స్వోదర, సంతానోదర పూరణార్థము పోవుచు నన్నిపక్షుల నెట్లు పిలుచుచున్నావో గాంచుము.

పోతరిక్కణ్ణినాయ్ -

అవునులే. నల్లని కళ్లున్న నీవు ఎర్రని కళ్లవాని యొద్దకు పోవుదువా?

1) పోతు = పుష్పము. అరి = లేడి
పువ్వువలెను, లేడివలెను నున్న కన్నులుగల దానా.
2) పోతు = పుష్పము. అరి = తుమ్మెద
పువ్వుమీద వ్రాలిన తుమ్మెదవంటి కన్నులుగలదానా.
3) అరి = పువ్వును హరించుచున్న (జయించుచున్న)

కన్ను అనవచ్చును, అనగా- పువ్వుతో పోటీ చేయుచున్న కన్ను అని యర్థము,

ఇట్టి కన్నులుగల నీవా యాయన సన్నిధికి చేరుదానవు? చాలునులే, నీ నేత్రసంపద దురభిమానము. లేచి రమ్ము.

పావాయ్ నీ -

మృదుస్వభావము కలిగి బొమ్మవలె అందముగా నున్న నీవు ఒంటరిగా పడకపై పరుండదగిన దానవా ?

నన్నాళాల్ -

"కృష్ణుడు సుమండీ! ఆడపిల్లలు సుమండీ!" అనుచున్న గ్రామస్థులు అంగీకరించగా ఆతనితో జలక్రీడలాడి ఆతని యొడిలో పరుండదగిన కాలమును లభించి పరుండుటయేనా? ముందు వచ్చెడి రోజులు రావణాదుల వలె మనలను ఎడబాటుచేయు రోజులే గదా!

కుళ్ళ క్కుళిర క్కుడైన్దు నీరాడాతే పళ్ళిక్కిడత్తియో -

మాతో కలసి గడగడ వణకించునట్లుగా మునిగి స్నానము చేయక పరుండియున్నావా? లేచిరమ్ము. మన మీ శీతోదకస్నానము నభిలషించునది యింత కాలము మనలను తపింపజేయుచున్న విరహతాప మారుటకే గదా! ఆలసించిన సూర్యుడుదయించి నీటిని వెచ్చబరచును. ఆ వేడి నీరా మన తాపము నార్చునది? మన యీ స్నానము విరహము నార్చుటకే గాక యిక నెన్నడును నిట్టి విశ్లేషవ్యసనమును రానీయక రక్షించును.

ఈ స్నానమున కంతరార్థము శ్రీకృష్ణ కల్యాణ గుణావగాహనము. దానిని మాతో కలసి చేయక పరుండియున్నావా?

కళ్ళం తవిర్న్దు కలన్దు -

స్వయంపాకుల వలె నీవు ఒంటరిగా శ్రీకృష్ణకల్యాణగుణముల ననుభవించుట యను కపటమును విడువుము. అది తగదు. లేచి మాతో కలసి ప్రత్యక్ష కృష్ణానుభవమునకు సహకరింపుము. లెమ్ము, లెమ్ము.

## — వేదాంతార్థము —

పుళ్ళిన్వాయ్ కీణ్డానై -

"శ్రేయాంసి బహువిఘ్నాని" మంచి పనులకు అన్నియు అంటకములే. ఆ పనులలో ఉత్తమోత్తమమైనది భగవత్ప్రాప్తి. దానికి సాధనము భగవంతుని సందర్శనము. "భిద్యతే హృదయ గ్రన్థిః..............తస్మిన్ దృష్టే పరావరే." పరులని లోకులు భావించు బ్రహ్మరుద్రేంద్రాదులను అవరులను (తక్కువవారిని) గా జేయు శ్రియఃపతిని దర్శించినచో జీవుని ప్రకృతిబంధము డుల్లిపోవును. ఆ దర్శనమున కాటంకము విషయప్రావణ్యమున్ను. దానివలన పుట్టునట్టి అహంకారమమకారములున్ను. అవి మన ప్రయత్నముచే తొలగవు. మరింత బలపడును. భగవంతుడే తన ప్రయత్నముచే తొలగించవలెను. దానికొరకై యాతని ప్రార్థించవలెను. దానికి ఈశావాస్యోపనిషత్తులో నొక మంత్రము కలదు. దాని నెరింగి మన మనుసంధించవలెను అది

"హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖమ్ ।
తత్త్వం పూష న్నపావృణు సత్యధర్మాయ దృష్టయే ॥"

"శ్రియఃపతీ! నా మనస్సు విషయప్రావణ్యముతో నావరించబడియున్నది. దానిచే నా ధర్మ మైన నీ దర్శనమును చేయజాలకున్నాను. కావున నీవా విషయప్రావణ్యమును తొలగింపుము" అను నది. దానిని భగవంతుడే పోగొట్టును. ఎవరికి? ఆయననే ఉపాయముగా నమ్మినవారికి. "మామేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే" "మా మేకం శరణం వ్రజ అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" "అహం స్మరామి మద్భక్తం నయామి పరమాం గతిమ్". వేయేల? ఆ భక్తుని భారమంతయు భగవంతునిదే యని "సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే" అని ప్రమాణము చేసి చెప్పెను. ప్రస్తుతపాశురములోని బకాసురనిరసనవృత్తాంతము ఈ యర్థమునే సమర్థించుచున్నది. ఆ బకాసురుడే అహంకారమమకారములు. అది యా గోపాంగనల కుండెడివి, వాని నాతడే తొలగించి వైచెను.

దేవాసురయుద్ధవిజయానంతరము దేవతలకు జనించిన అహంకారమమకారములను. అర్జును నకు భావియుద్ధములో తనచే చంపబడు బంధువులపై గల అహంకార మమకారములను తన విలక్షణ చర్యవలనను తొలగించిన ఘట్టము లీ విషయమును ఋజువుచేయుచున్నవి.

పొల్లావరక్కనై -

రాక్షసు డనగా రావణుడు. అనగా, కామక్రోధములు. ఇవి పొల్లా = చెడ్డవి. ఇవి చేయించని పాపము లేదు. రావణుడు కామము క్రోధముల వలన చేయని పాపము లేదు. "కామార్తా హి ప్రకృతి కృపణా శ్చేతనాచేతనేషు" అవి వివేకమును హరించును. రౌతి = అసత్ప్రలాపాన్ కారయతీతి రావణః = అవివేక మని అర్థము. ఇక కోపము. ఇది పెద్ద పిన్న యని చూడనీయదు. అర్జునుడు కోపముతో ధర్మరాజును చంప నుద్యమించెను. ఇది మిక్కిలి అపకారి ఒక కవి

"అపకారిణి చే త్కోపః కోపః కోపే కుతో నతే ?"

అనెను. నీ కపకారము చేసెనని గదా వానిపై నంత కక్షను సాధించుచున్నావు. ఐనచో కోప మును మించిన అపకారి లోకమున లేడే! దానిపై నీకు కోపము లేదేమి? దానిపై నీ కక్షను సాధించ రాదా? యనెను. భగవద్గీత తృతీయాధ్యాయావసానమున శ్రీకృష్ణుని

"అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః ।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః ॥'

"శ్రీకృష్ణా! ప్రాజ్ఞుడైనను, కూడదని తెలిసినను లోపలనుండు నొక శక్తి బలముచే ప్రేరేపింప బడి పాపమును చేయుచున్నాడే, ఆ శక్తి దేనిది?" అని అర్జునుడు ప్రశ్నింపగా శ్రీకృష్ణుడు

"కామ ఏషః క్రోధ ఏషః రజోగుణ సముద్భవః ।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్॥"

అది రజోగుణమువలన పుట్టిన కామముయొక్క శక్తి. అది ప్రేమించిన విషయమును పొందువరకు ప్రాణిని తికమకలు పెట్టి చంపును. అతని కా విషయము లభించనిచో నిరుగు పొరుగులపై "వీరే నాకు దానిని లభించనీయక అడ్డుపడుచున్నా" రని వారిపై క్రోధముగా మారును. ఇందు కామము మహాశనము = తిండిపోతు. ఎంత అనుభవించినను తృప్తి తీరదు. కుంభకర్ణుడే అనుకొనుము. ఇక క్రోధము మహాపాప్మా. అంతకు మించిన పాపము మరియొకటి లేదనెను. అని కామ దౌర్జన్యమును బహుముఖముగా వినిపించి చివరకు "జహి శత్రుం మహాబాహో! కామరూపం దురాసదమ్" అని యుపదేశించెను.

ఈ విధమగు విషయప్రావణ్య జనితాహంకార మమకారములను, కామ క్రోధములను తన భక్తుల కుండనీయక భగవానుడు తొలగించివేయును. కావుననే

"సర్వేషా మేవ ధర్మాణా ముత్తమో వైష్ణవో విధిః ।
రక్షతే భగవాన్ విష్ణుః భక్తా నాత్మశరీరవత్॥"

"భగవంతుడు తన భక్తులను తన శరీరమునువలెనే రక్షించును. కావున అందరును వైష్ణవులు కండు. అనగా, విష్ణుచిహ్నలను ధరించి, విష్ణుమంత్రము ననుసంధించి, విష్ణ్వారాధనను చేసి, వైష్ణవ మార్గమును, విష్ణుసాయుజ్యమును బడయుడు" అని తెలుపుచున్నది.

ఇచ్చట, "పొల్లావరక్కనై" అని కేవల రాకసుడనక "పొల్లా = దుష్టుడైన" అని విశేషణమును చేర్చెను. దీనిచే వేదాంతార్థములో "చెడ్డ క్రామ క్రోధములు" అను నర్థము సిద్ధించుచున్నది. అయినచో మంచి కామక్రోధములు కూడ ఉన్నట్లు తోచుచున్నది. నిజమే. కామమున మంచి చెడ్డలున్నవి. ప్రాకృత పదార్థముల యందలి కామము చెడ్డది. భగవంతుని యందును, భగవద్భక్తుల యందును గల కామము మంచిది. ఇది ఉపనిషత్తులో "నిదిధ్యాసితవ్యః" అని విధించబడుచున్నది. "యథా ద్రష్టవ్యః తథా నిదిధ్యాసితవ్యః" కంటికి గోచరించు నంతటి విశదముగా మనస్సునకు గోచరించు నట్లు ధ్యానింపుమని శాస్త్రము చెప్పుచున్నది, ఇదియే భగవత్కామము. ఇది శ్రేష్ఠమైనది. అటులనే క్రోధమున్ను మంచిది, చెడ్డది అని రెండు విధములుగా నుండును. ఇది భగవంతుని యందును, భగవద్భక్తుల యందును, ఆచార్యుల యందును ఉన్నచో చెడ్డది, వారి శత్రువుల పట్ల ప్రవర్తించినచో మంచిది.

ఈ రహస్యమును ఈ 'పొల్లా' అను విశేషణము తెలుపుచున్నది.

కీర్తిమై పాడిప్పోయ్ -

ఇట్టి మహోపకారకుని కీర్తించువాడు కృతజ్ఞుడు, లేనివాడు కృతఘ్నుడు. చిన్న ఉపకారము చేసిన లౌకికవ్యక్తి నెంతయో కొనియాడుదుము. అట్టితరి

"పితా హ మస్యజగతో మాతా ధాతా పితామహః"

(భ. గీ 9.17.)

నేను లోకమునకంతకును తండ్రిని, తాతను, ముత్తాతను అని స్వయముగ జెప్పుచున్న మహోపకారిని కీర్తించవలదా? తానే సృష్టికర్త. అందుచే తండ్రి. బ్రహ్మద్వారా సృష్టించును. అందుచే తాత, ప్రజాపతుల ద్వారా సృష్టించును. అందుచే ముత్తాత. ఈతడు తద్దినములు, తర్పణములు చేయవలసిన వర్గత్రయములోని వాడు కాడు. స్తుతించవలసిన వర్గములోని వాడు. ఇక నేమి? కీర్తింపుడు, స్మరింపుడు.

"ఆయాసః స్మరణే కోస్య । స్మృతో యచ్ఛతి శోభవమ్ ।
పాపక్షయశ్చ భవతి । స్మరతాం త మహర్నిశమ్ ॥"

అని ప్రహ్లాదాళ్వాను నుపదేశము.

"ఎమ్మానై చ్చొల్లిప్పాడి యెళువ్దుం పరవ్దుం తుళ్ళాదార్
తమ్మాల్ కరుమ మెన్ శొల్లీర్.............................."

మన స్వామిని అనుసంధించి, పాడి, యాడనివారు పుట్టనేల? బ్రతుకనేల? యని ఆళ్వార్లు ఎంతగనో నిందించిరి. భగవానుడు భగవద్గీతలో

"సతతం కీర్తయన్తో మాం" అని తన భక్తుల కరణత్రయ కృత్యముల బేర్కొనుచు వాగింద్రియకర్తవ్యము నిరంతర సంకీర్తనమే యని సెలవిచ్చెను. "జిహ్వే! కీర్తయ కేశవం" అని కులశేఖరులు తమ నాలుక నాదేశించిరి.

"ప్రావర్తయ ప్రాఞ్జలి రస్మి జిహ్వే! నామాని నారాయణ గోచరాణి" అని కులశేఖరులు తమ నాలుకకు ప్రణామము నొనరించి ప్రార్థించిరి. ఈ విషయములన్నింటిని స్మరించి "కీర్తిమై పాడిప్పోయ్" అను చున్నారు. ఇట్లు భగవత్కృపకు పాత్రులై యాయన కృపచే విషయప్రావణ్యమును, దానివలన పుట్టునట్టి అహంకార మమకారములను, రజోగుణము వలన జనించు కామక్రోధములను పోగొట్టుకొని కృతజ్ఞతా సూచకముగా నాతని కల్యాణగుణములను పాడుకొనుచు

## పిళ్ళైగళెల్లారుంపో వైక్కుళం పుక్కార్ -

పిల్లలందరు సంకేతస్థలమునకు జేరిరి.

గోపాంగన లందరును తెల్లవారు సమయమున సమావేశము కావలసిన స్థలము నొకదానిని శ్రీకృష్ణుడు నిర్ణయించియుంచెను. అటులనే భక్తులందరును కలసి భగవద్గుణాను సంధానము చేసి కొనుటకై యొక కాలక్షేపకూటము నేర్పరచుకొనవలెను. కాలక్షేపమనగా, భగవద్గుణ ప్రతిపాదక గ్రంథప్రవచనస్థానమని వాడుకలోనున్న యర్థము. కాని దీని కొక విశేషార్థము కలదు. "యముని దూరముగా నెగురగొట్టు స్థానము."

"స్వ పురుష మభివీక్ష్య పాశహస్తం
వదతి యమః కిల తస్య కర్ణమూలే.
పరిహర మధుసూదన ప్రపన్నాన్
ప్రభురహ మన్యనృణాం న వైష్ణవానామ్ ॥"

"ఓ భటులారా! శ్రీవైష్ణవులు చేరియున్న చోటునకు పోవుటకు నేనే భయపడుదును. మీ రెరుంగక వారి దరి జేరబోకుడు.

"వైష్ణవకుల గుణ దూషణచిన్తాం
మా కురు నిజకుల శీలా హన్త్రీం ।
యతిపతి రేవ హి గురు రేతేషాం
ఇతి జానీహి మహత్త్వం తేషామ్ ॥"

వైష్ణవులను దూషించినవాని కులశీలములు చెడును. ఎందుల కనగా, వారి మహిమ యట్టిది. అది వారి కెట్లు వచ్చినది? వారికి రక్షకులు శ్రీరామానుజులే కాదా! ఒక్క తల పామునకే జనులు భయపడుదురే! అందులో వేయి తలలు గల దివ్యసర్పమిది. అది శత్రువులను తనవారి దరికి జేర నీయదు. భటులారా! నే నితరుల కందరకును దండనాథుడనే, కాని శ్రీవైష్ణవులకు మాత్రము కాను" అనెను. ఇదియే కాలక్షేపములోని ప్రభావము.

## పిళ్ళైగళ్ -

ఒక్కడే భగవత్కల్యాణ గుణానుభవముచేయుట స్వయంపాకభోజనము వంటిది. అందరును కలసిచేయుట తదీయారాధనభోజనము వంటిది. అందులకే వీరి స్థానమునకు చేరిరి. 'పిళ్ళైగళ్' అనుటచే నిచ్చట ప్రకరణమును బట్టి ఆడపిల్లలు. పిల్లలనుటచే పరతంత్రులు. ఆత్మ

గుణములలో ప్రధానమైనవి శేషత్వపారతంత్ర్యములు. తిరుమంత్రములో ప్రణవముచే శేషత్వమున్ను, 'నమః' పదముచే పారతంత్ర్యమున్ను తెలుపబడుచున్నవి. శాస్త్రమున పూర్వముకన్నను పరము ప్రధానము. అందుచే శేషత్వము కన్నను పారతంత్ర్యము ప్రధానము. అట్టి పారతంత్ర్యము ప్రధానముగాగలవారు ఆడపిల్లలు. అనగా, ఆత్మయాథాత్మ్య జ్ఞానముగల ముముక్షువులని యర్థము.

"స ఏవ వాసుదేవోఽసౌ సాక్షా త్పురుష ఉచ్యతే ।
స్త్రీప్రాయమితరత్ సర్వం జగత్ బ్రహ్మ పురస్సరమ్ ॥"

శ్రియఃపతి యొక్కడే పురుషుడు. మిగిలిన చేతనులందరును స్త్రీప్రాయులే. 'ప్రాయులే' అనుటచే పతివ్రతయగు స్త్రీధర్మములును, ప్రపన్నుని ధర్మములు నొక్కరీతివే. ఆ సామ్యమును పురస్కరించుకొని "స్త్రీప్రాయం" అనిరి.

వెళ్ళి యెళున్దు -

శుక్రుడు తేజిష్ఠమైన నక్షత్రము. అర్థచంద్ర ప్రకాశమై వెలుగొందును. దీనిని బట్టి పరిశుద్ధమైన జ్ఞాన మభివృద్ధి చెందినదని యర్థము,

వియాழ ముఱఙ్గిత్తు -

గురుగ్రహ మస్తమించినది. అనగా, జ్ఞానము వృద్ధియైనచో అస్తమించునది అజ్ఞానమే గదా! కాలక్షేపకూటములో నన్వయించిన వారికి పాపములు పోయి దేహాత్మభ్రాంతి మొదలగు ఆత్మవ్యాధులారును తొలగి ఆత్మయాథాత్మ్యజ్ఞాన ముదయించును. ఇదియే శుక్రోదయము.

పుళ్ళుమ్ శిలమ్బినగాణ్ -

అట్టివారే పక్షులుగా చెప్పబడుచున్నారు.

పక్షులు రెండు రెక్కలతో ఆకాశమందు సంచరించునట్లు వీరును జ్ఞానానుష్ఠానములతో భగవంతునియందు ప్రవర్తించుచుందురు. వారు "ఊరుం నాడుం ఉలగుం తమ్మైప్పోల" అనునట్లు సంసారులను దిద్దుబాటు చేయుటకై ప్రవచనలను చేయుచు సంచరించుచుందురు.

పోతరి కణ్ణినాయ్ -

సాధారణముగా స్త్రీల నేత్రములను, పుష్పములతోను, లేడి కన్నులతోను పోల్చు ఆచారము కలదు. ఇచ్చట వేదాంతమున నేత్ర మనగా జ్ఞానమని యర్థము. ఆ జ్ఞానము పూవువంటిది.

అనగా, పూవు సహజముగా త్రిగను, లేక, చెట్టును పట్టియున్నప్పుడే శోభస్కరముగా నుండును. చేతితో ముట్టినను, కోసినను, వాసన చూచినను వాడిపోవును. అటులనే జ్ఞానియొక్క జ్ఞానము సహజముగా భగవదవగాహియై యుండును. అది దేవతాంతర, సాధనాంతర, ఫలాంతర విషయమైనచో వాడిపోవును, అనగా, భగవంతునకు మనము ఉపయోగించిన పూవువలె అనర్హమై యుండుము.

మరియు, ఆడలేడి కన్నులు అతిచంచలముగా నుండును. అవి దాని కాతరస్వభావమును సూచించును. అటులనే భక్తుడు భౌతిక శరీరములో నుండగా "వర్తతే మే మహద్భయమ్" అనునట్లు ఎప్పు డేకూడని పనులలో ప్రవర్తింపజేయునో యని భయపడుటచే ఆతడును కాతరస్వభావముతోనే యుండును. ఆ భయ మాతని కన్నులలో గోచరించును. అందుచే భక్తుని జ్ఞానము పువ్వుతోను, లేడి కన్నుతోను పోల్చబడినది. ఈతని కీ జ్ఞానము కాలక్షేపగోష్ఠిలో నన్వయించుట చేతను, అజ్ఞాన మస్తమించి, జ్ఞానోదయ మగుటచేతను కలిగినది.

పోదరి క్కణ్ణినాయ్ -

పుష్పము నందవగాహించిన తుమ్మెదను పోలిన కన్నులు గలదానా!

ఇచ్చట పుష్పమనగా భగవద్భాగవతపాదపద్మములు. అందవగాహించిన తుమ్మెద తుమ్మెద పుష్పము నం: రి సారమును గ్రహించును. భగవత్పాదపద్మములోని సారము, ఆ చరణారవిందముల నుండి స్రవించు మకరందము. "విష్ణోఃపదే పరమే మధ్వ ఉత్సః", అందువలనచే భక్తభృంగము లాపాదపద్మములను విడువజాలవు.

"విహాయ పీయూషరసం మునీశ్వరాః
మ మాంఘ్రిరాజీవరసం పిబన్తి కిమ్?"

భగవంతున కొక సందేహ ముదయించెను. "నా భక్తులు అమృతపానమును విడచి నా పాద పద్మరసాస్వాదమునందు తత్పరు లగుట కేమి కారణము? అని. అది అనుభవైకవేద్యము. ఆ యను భవ మాతని కెట్లు ఘటించును? లోకముల నన్నింటిని కడుపున నిడుకొని ఎవ్వరును చూడకుండగా నొక లేతనైన మర్రిచిగురు నడ్డుపెట్టుకొని

"కరారవిన్దేన పదారవిన్దం। ముఖారవిన్దే వినివేశయన్తమ్" అనునటుల చేతితో తన పాద మును పట్టుకొని నోట బెట్టుకొని పరిశీలించుచున్నాడు.

ఇట్టి జ్ఞాన మీ లేపబడు గోపికకు కలదు.

కుళ్ళక్కుళిర కుడైన్దు నీరాడాదే -

ఇట్టి జ్ఞాన మున్నందుకు ఫలము భగవద్గుణానుభవమే, అది సంసారతాపసంతప్తులకు చల్లని మడుగున అవగాహనస్నానమాచరించునటుల సుఖోత్తరముగా నుండును. అది భక్తు లందరితో కలసి కాలక్షేపగోష్ఠిలో జేరి అధ్యయనోత్సవమున భాగవతోత్తముల దివ్యప్రబంధాను సంధానమువలె నుండవలదా?

ప ళ్ళి క్కి డ త్తి యో -

ఒంటరిగా చేయు అనుభవమున కేమి యానందమున్న దమ్మా? మన మందరము కలసి ఆ యనుభవము చేయుదము.

పావాయ్ నీ - మృదు స్వభావముగల మీరు.

మార్దవ మనగా నెడబాటును సహింపజాలకుండుట. మీరు భాగవత విరహమును సహించని స్వభావము కలవారై యుండి యొంటరిగా భగవద్గుణానుభవమును చేయదగునా? భగవద్విరహము నైనను సహించగలము గాని భాగవతవిరహమును మేము సహించగలమా? భాగవతవిరహమును భగవంతుడే సహించలేడే! ఒకనాడు నారదుడు శ్రీమన్నారాయణుని సేవించుటకై వైకుంఠమున కేగెను. అచ్చట ఆయన కాన్పించలేదు. యోగీశ్వరుల గోష్ఠికేగెను. అచ్చటను ఆయన దర్శనము కాలేదు. సూర్యమండలమున కేగెను. అచ్చటను ఆయన కనిపించలేదు. ఎక్కడనో యొక చోట మాత్రము వీణ, మృదంగము మొదలగు వాయిద్య పరికరములతో ఉన్మత్తకానంద పరవశులై కొందరు భగవద్భజన గావించుచుండిరి. అచ్చట భగవానుడు నిశ్చింతగా వేంచేసియుండెను. అపుడు నారదు డాతని సేవించి "అబ్బా! ఎంత విసిగిపోతినయ్యా" అని తాను తిరిగిన స్థానముల నన్నిటిని పేర్కొనెను. అపుడు భగవంతు డాతనితో

"నా హం వసామి వైకుణ్ఠే। న యోగిహృదయే రవౌ।
మద్భక్తా యత్ర గాయన్తే। తత్ర తిష్ఠామి నారద!॥"

నా భక్తులు జేయు నా గుణాను సంధానమును విడువజాలక యచ్చట స్థావరప్రతిష్ఠగ (తిష్ఠామి, ష్ఠా = గతినివృత్తౌ) నుందు ననెను.

ముదలాళ్వార్లు ముగ్గురు నొక్కచోట చేరి యుండగా వారి ముగ్గురి మధ్యను ఇరుకుకొని దర్శన మిచ్చెను గదా!

లక్ష్మణస్వామి అవతారమును చాలించిన వెంటనే "లక్ష్మణేన గతాం గతిమ్" అని పెరుమాళ్లును అవతారమును చాలించిరి గదా! మీరీ భాగవతగోష్ఠిలో చేరకుండగ నొంటరిగా నెట్లు పవ్వళించగలరు? భగవద్గుణాను సంధానములో మైమరచిరో?

నన్నా ళాల్ - అహా! మన కిది యెంత మంచిరోజు!

"అద్య మే సఫలం జన్మ । సుప్రభాతా చ మే నిశా ।
యదు న్నిద్రాబ్జ పత్రాక్షం । విష్ణో ర్ద్రక్ష్యామ్యహం ముఖమ్॥"

మన మందరమును కలసి పెరుమాళ్లకు సుప్రభాతమును విన్నవించి వారి తిరుముఖమండలము సేవించిన మన కెంత యానందము కలుగునో! మన జీవితమున కదియే సుప్రభాతము.

కళ్లమ్ తవిర్న్దు -

వైష్ణవులకు ఒంటరి తనము తగదు. "అడియార్గళ్ కుళాఙ్గళ్ ఉడన్ కూడువ తెన్నుకొలో" భాగవత గోష్ఠిలో చేరి భగవదనుభవము జేయున దెన్నడో గదా! యని మనకు మన కూటస్థులగు నమ్మాళ్వార్లు నేర్పిన యనుష్ఠానము.

పెరియనంబిగారు, క్రిమికంఠుడను దుర్మార్గుడు పెట్టిన బాధను సహించలేక కూరత్తాళ్వార్ల యొడిలో తలనుంచుకొని పరమపదించినపుడు అనాథ ప్రేత సంస్కార సంఘసభ్యులు వచ్చి చూచి "ఈయన అనాథ కాదురా. ఈయన కొక ఆప్తులున్నారురా" అని విడచిపోవుచుండగా కూరత్తాళ్వార్లు వారితో "ఓరీ! మూర్ఖులారా! శ్రీవైష్ణవు లెన్నడును అనాథులు కారు. వారివెంట భగవాను డెప్పుడును పంచాయుధ సమన్వితుడై యుండి వారిని తన శరీరమువలె కాపాడుచుండు" ననిరి.

"అందుచే తల్లీ! నీవు ఒంటరిగా భగవద్గుణాను సంధానమును వీడి మా గోష్ఠిలో జేరి నీ వానందించి, మమ్మానందింపజేయు" మనుచున్నారు.

— సందర్భానుసారముగ ననుసంధించుకొన దగిన శ్లోకములు —

పుళ్ళిన్వాయ్ - అనుచోట.

1. పళ్ళత్తిల్ మేయుం పఱవై యురుకొణ్డు,
కళ్ళ వసురన్ వరువానై త్తాన్ కణ్డు,
పుళ్ళిదువెన్ఱు పాదుకొ వాయ్ కీణ్డిట్ట,
పిళ్ళైయై వన్దు కుழల్ వారాయ కాక్కాయ్
పేయ్ములై యుణ్డాన్ కుழల్ వారాయ కాక్కాయ్.
(పెరియా. తి. 2-5-4)

తాత్పర్యము

యశోదాదేవి శ్రీకృష్ణునకు తలను దువ్వుటను వర్ణించు దశకములోని దిది.

నీటియొడ్డున మేయుచున్న కొంగ రూపమును ధరించి యొక రాక్షసుడు శ్రీకృష్ణుని చంపుటకు వచ్చి నీటి యొడ్డున నుండెను. దానిని కృష్ణుడు కనిబెట్టెను. దాని ముక్కు పట్టుకొని చీల్చివైచెను. ఓ కాకీ! మా పిల్లవాని తలను దువ్వుము. ఇత డెంతవాడు అనుకొనుచున్నావు? పూతన పాలు త్రావి చంపినవాడీ తడు. రా, రా ఈతని తలను దువ్వుము,

2. మున్నొలా విరావణన్తన్ ముదు మదిళిలఙ్గై వేవిత్తు,
అన్నినాలను మన్ వన్ఞా ఙడియిణై పణియనిన్గారక్కు,
ఎన్నొలాముఱిగి యుక్కిట్టెన్నుడై నెఞ్జ మెన్నుమ్,
అన్నినాల్ ఞాననీర్ కొణ్డాట్టువ నడియ నేనే.

(తిరుక్కుఱున్దాణ్డకమ్. 15)

తాత్పర్యము

పూర్వము సీతాదేవి లంకలోని అశోకవృక్షము క్రింద నుండు కాలమునందు రావణుని యొక్క దుష్ప్రవేశమైన లంకను శ్రీ ఆంజనేయులు తన తోకయందు మండుచున్న మంటతో బూడిద గావించి సీతాపిరాట్టిని దర్శించిన ప్రీతితో కిష్కింధకేతెంచి, శ్రీరామచంద్రుని సేవించి యచ్చట జరిగిన వృత్తాంతము నంతయు వినిపించగా వారు స్తబ్ధులైపోయిరి. దానిని తలంచుకొని తిరుమంగై యాళ్వార్లు శిథిల మనస్కులగుచు నా మనస్సులోనున్న భక్తియనెడి నీటితో తిరుమంజన స్నానమును చేయుదునని సాయించిరి.

3. నిఱైక్కిలేన్ తెయ్వఙ్గాళ్ నెడుఙ్గణిళ మానినిప్పోయ్,
అఱైత్తులగుముడైయ వరవిన్దలోశననై,
తిఱైత్తఱైయుమ్ విడాళవన్శేర్ తిరుక్కోళూర్క్కే,
మఱైక్కువాన్ పుక్కియుమ్ నివైయాళ్ శెల్లవైత్తనళే.

(తిరువాయ్. 6-7-10)

## తాత్పర్యము

ఆళ్వార్లు నాయికావస్థలో పెరుమాళ్లవిరహమును సహించలేక మూర్ఛపడిరి, బంధువులంద రును వచ్చి ఆళ్వార్ల అవస్థను చూచి భగవద్గుణచేష్టలను వినిపించి వారును మూర్ఛపోయిరి. ఆ గుణ గానమును విని ఆళ్వార్లు మేల్కొని ఒంటరిగా తిరుక్కోవళూరు వేంచేసిరి. ఆ యవస్థ నిపుడు తల్లిగా రీ పాశురమున ననుసంధించుచున్నారు.

ఓ దేవతలారా! ఈ దుఃఖావస్థను నేను తలంచలేను. విశాలమైన నేత్రములుగల నా బాలిక సకలలోకములను తన యధీనమందుంచుకొన్న శ్రీపుండరీకాక్షు నొక్క క్షణము కూడ విడువదు. ఆయన వేంచేసియున్న తిరుక్కోవళూరుకే వెళ్లదలంచినది. ఈ కులమునకు వచ్చిన గొప్ప అప వాదును లక్ష్యపెట్టదు.



# పదునాల్గవ పాశురము

## "ఉజ్గళ్"

— అవతారిక —

ఈ వ్రతమునకు అవసరమగు సామగ్రినంతను సిద్ధపరచగలదై, అందరను తానే లేపగల దాననని చెప్పియుండి దానిని చేయక నిద్రించుచున్న గోపాంగనను లేపుచున్నారు.

## పదునాల్గవ పాశురము

ఉజ్గళ్ పుళైక్కడై త్తోట్టత్తు వావియుళ్
శెజ్గళునీర్ వాయ్‌నెకిళ్ న్దామ్బల్ వాయ్ కూమ్బినకాణ్,
శెజ్గఱ్పొడి క్కూఱై వెణ్బల్ తవత్తవర్,
తజ్గళ్ తిరుక్కోయిల్ శజ్గిడువాన్ పోకిన్ఱార్,
ఎజ్గళై మున్నమ్ ఎళుప్పువాన్ వాయ్‌పేశుమ్,
నజ్గాయ్! ఎళున్దిరాయ్, నాణాతాయ్! నావుడైయాయ్!
శజ్గొడు శక్కర మేన్దుమ్ తడక్కైయన్,
పజ్గయ క్కణ్ణానై ప్పాడేలో రెమ్బావాయ్.

— తాత్పర్యము —

మీ దొడ్డిలోనున్న తోటలోని బావిలోనున్న ఎఱ్ఱకలువలు వికసించినవి. నల్లకలువలు ముకుళించినవి. కాషాయవస్త్రములు ధరించిన, తెల్లని దంతములుగల తపోవేషధారులగు సన్న్యాసులు తమ తమ దేవళములలో ఆరాధన చేయుటకై పరికరములతో నేగుచున్నారు. నీవు ముందుగా లేచి మమ్ము లను లేపుటకై మాట ఇచ్చియు చేయకయున్న ఓ పూర్ణులారా! లేచిరమ్ము సిగ్గులేనిదానా! నీ మధు రములైన మాటలను వినుటకై వచ్చితిమి. శంఖమును, చక్రమును ధరించు విశాలములగు చేతులు కలవాడును, పుండరీకాక్షుడును నైన నారాయణుని గూర్చి పాడవలెను. లేచిరమ్ము

## — వి శే షా ర్థ ము —

ఉజ్గళ్ పుళైక్కడై -

ఒక విధమైన తామర పువ్వులు వికసించి, కలువ పూవులు ముకుళించునంత ప్రొద్దెక్కినది.

లోపల గోపిక - మీరు పొలములలోనికి పోతిరా?

బైట గోపికలు - లేదు. పుళైక్కడై = పెరటిలోని తోటలోనున్న దిగుడుబావిలోనివి.

లో. గో. - వానిని మీరు బలవంతముగా వికసింపజేసియుందురు.

బై. గో. - ఉజ్గళ్ - మాకు చొరశక్యము కానిదై, సూర్య కిరణములు కూడ పడుటకువీలులేని మీ పెరటిలోని బావిలో నున్న వేనమ్మా! ఎండపడి కాక అందులకు తగిన కాలపాకము చేతనే అట్లైనవి.

శెజ్గళునీర్ వాయ్ నెకిళ్న్దు ఆమ్బల్ వాయ్ కూమ్బినకాణ్ -

స్త్రీల నేత్రములను కలువపూవులతో పోల్చుట కలదు.

లో. గో. - ఇచ్చట వికసించినవి ఎఱ్ఱకలువలు కాదు. మీ నేత్రములే. మీకు నాయందుగల ఆదరాభిమానములచే మీరు నా వాకిటకు చేరిన ఆనందాతిశయముచే మీ నేత్రములే వికసించినవి. ముకుళించినవి, నల్లకలువలు కావు. మీ నేత్రములే, ఎందుల కనగా- నేను మాట్లాడక పరుండి యుండుటచే మీకు కోపము, సిగ్గు, అసహ్యము పెనగొని అవి ముడుచుకొనినవి.

ఈ గోపాంగనలు ఆమె దొడ్డిలోనికి పోలేదే! వాకిటనే నిలచియున్నారు గదా! ఈమె దొడ్డిలోని దిగుడుబావిలో నున్న యీ పువ్వుల వార్త వీరి కెట్లు తెలిసినది? అనగా- "అనుమిత్తు చ్చొల్లుకిరార్" ఊహించి తెలుపుచున్నారు అని సాయించిరి. కాన్పించని దానిని తగిన హేతువులచే నూహించి తెలుసు కొనుట అనుమాన మనబడును. పొగ యున్నచోట నిప్పుండునని అనేకమారులు వంట యింటను, పశువుల శాలలోను, మరి యితర స్థలములలోను చూచి పొగయున్నచోట తప్పక నిప్పుండునని నిర్ణ యించుకొనును. ఒక తరి స్నేహితునితో దారిన పోవుచు నొక కొండపై పొగను చూచి తానిదివరలో నిశ్చయించుకొన్న ధూమాగ్నుల సంబంధ జ్ఞానము జ్ఞాపకమునకు వచ్చి ఆ పర్వతముపై నిప్పు తప్పక యున్నదని ప్రతిజ్ఞచేయును. ఎవరైనను "ఎందు వలన" అని అడిగినచో "పొగ కాన్పించుచున్నందు

వలన" అని చెప్పును. "పొగయున్నచో నిప్పుండవలెనా?" అని వారడిగినచో "ఔను, పొగయున్నచోట వెల్లెడలను నిప్పు ననేకమారులు చూచి యా రెండింటికిని అవినాభావము నెఱంగితి" ననును. తన వంటయింటిలో వలె నిచ్చటను పొగయుండుటచే నిప్పుండునని చెప్పును, ఇటులనే యిచ్చట లేపఁబడుచున్న గోపిక పెరడ్డిలోని బావిలో నున్న పువ్వుల సంకోచ వికాసముల జూచి నిర్ధారణగా చెప్ప గలుగుచున్నారు.

"ఈమె దొడ్డితోటలోని నూతియందున్న ఎఱ్ఱకలువలు వికసించి, నల్లకలువలు ముకుళించు కొనినవి" ఇది ప్రతిజ్ఞావాక్యము, "ఎందుకనగా — అందులకు తగిన కాల మాసన్నమైనందుననే" ఇది హేతువాక్యము. "తత్సజాతీయములగు బాహ్యమునందలి ఎఱ్ఱ కలువలు వికసించి నల్లకలువలు ముకుళించుకున్నవి గనుకనే" - ఉదాహరణ వాక్యము. "ఎచ్చట అట్టి కారణ మాసన్నమైనదో అచ్చట నవి యట్లుండును." అని యిట్లూహించి తెలుసుకొనిరి.

ఉ ద్గ క్ - నీ.

ఈమె లేవని అసంతృప్తిచే 'నీ' యని యామెను తమ గోష్ఠినుండి బహిష్కరించుచున్నారు. "ద్వ్యక్షరస్తు భవేన్మృత్యుః త్ర్యక్షరో మోక్షదాయకః" 'మమ' అను రెండక్షరములు సంసారవర్ధకములు. 'న మమ' అను మూడక్షరములు మోక్షప్రదములు దీనినే ఆళ్వార్లు తిరువాయ్మొழி ప్రబంధములో "నీర్ నుమదెన్ఱివై వేర్ముదల్ మాయ్త్తు" "మీరు మీవి" యను నీ త్వంకార, తవకారములను సమూలవినాశ మొనర్చు" డని పాయించిరి. "నేను", "నాది" యని సామాన్యముగా లోకమున అహం కార, మమకారముల కవలంబన పదములు. ఆళ్వార్లట్లనక "మీరు "మీవి" యనుటకు తాత్పర్యమేమ నగా - నేను, నాది - యన్నచో నవి తమనే పట్టుకొనునని వారి భయము. ఐనచో నీ లేపుగోపికలు అహంకార, మమకారములు విడువదగినవని యెరుంగుదురు కదా! అట్టివారు "మీ" "మా" అన వచ్చునా? అట్లనుట విరుద్ధము కాదా? యన్నచో దేహాత్మాభిమానమువలన వచ్చు అహంకార, మమ కారములు త్యాజ్యములుగాని, భగవత్సంబంధముచే వచ్చునవి యుద్దేశ్యములే కావుననే "అచ్యుతాహం తవాస్మి" నారాయణా! నేను నీవాడను. "అబిమాన తుఙ్గన్ శెల్వనై ప్పోల" "ఎన్నుడైయ పందుం కழలుమ్" (నా బంతిని, నా గచ్చకాయలను) అని ఆళ్వారులును పాయించిరి.

అహంకారము మూడు విధములు. 1) దేహాత్మాభిమానము 2) గర్వము 3) ప్రకృతి వికారములలో నొకటియగు అహంకార తత్త్వము. ఈ మూడును మోక్షవిరోధులే. కాని జ్ఞానుల అహం కార మట్టిది కాదు, వారి అహంకారమునకు విషయము పరమాత్మఆత్మగాగల ఆత్మస్వరూపమే. ఇట్టి అహంకారము శుక, వామదేవ, ప్రహ్లాదులకును గలదు. పరమాత్మకును ఇట్టి అహంకారము కలదు. దానిలో విషయము చేతనాచేతనాత్మకప్రపంచ మంతయును. వారి మమకారమును ఇట్టిదే. భగవంతుని

యొక్కయు, భాగవతులయొక్కయు మమకారము మన కుపాదేయమే. తదితరుల మమకారము సతరాం త్యాజ్యము. ధృతరాష్ట్రుని మమకారము కౌరవులను సమూలముగా నిర్మూలించెను. శ్రీకృష్ణుని మమకారము పాండవులను కంటికి రెప్పవలె కాపాడునట్లు గావించెను.

## శెజ్జప్పొడి కూర్రైై వెణ్బల్ తవత్తవర్ -

రాత్రి యంతయు తమ కభిమతలగు వేశ్యాదులతో గడపి అభక్ష్య భక్షణ, అపేయపానముల గావించి యా వాసన గాన్పించకుండుటకై తాంబూలమును నమలి పరుండియుండి తెల్లవారి బైట పడు సమయమున తమ బ్రహ్మచర్యమును, విరక్తియు బైటపడునట్లు పండ్లు తోముకొని "అయ్యో! వీరు సభ్యు"లని పెద్దలనుకొనునట్లుగా నటించు తపోవేషధారులగు శివార్చకులు కూడ "అయ్యో! అలస్యమైనదే! ప్రొద్దెక్కిపోయినదే!" యని భయపడి మేల్కొని తమ తమ దేవతల నారాధించు కాలమైనది.

ఇది ఎంబారు నిర్వాహము.

**తిరుమల నంబిగారు**

"యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్"

విరక్తికలిగిన వెంటనే సన్యసించవలెను. "పరమాత్మని యో రక్తో విరక్తోఽపరమాత్మని" పరమపురుషునియందాసక్తిగలవానికి తదిరములందు విరక్తియుండును. అట్టివారు కాషాయవస్త్రము లను ధరించి, భోగ్యవస్తువులయందు విరక్తులై సాత్త్వికులైయుండు సన్న్యాసులు (జీయరులు) సంధ్యా వందనాదు లాచరించి తమ తిరుమాళిగలలో తిరువారాధనచేయు కాలమైనది- అని పాయించిరి.

అనగా, ఆ లోపల గోపిక "సతతం కీర్తయన్తో మాం" అని చెప్పుటచే వారెప్పుడును అట్లే యుందురు. ఇది తెల్లవారుటకు గుర్తు కానేరదనెను.

## ఎజ్జై మున్న మెళుప్పువాన్ -

"ధర్మజ్ఞ సమయః ప్రమాణం వేదాశ్చ" వేదోక్తధర్మములన్నిటిని కరతలామలకములె గాంచు మహాత్ములయొక్క ఆచారము ముఖ్యప్రమాణము. దానికి వ్యతిరేకము కాని వేదములున్ను "యద్య దాచరతి శ్రేష్ఠ స్తత్తదే వేతరో జనః । స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే ॥" (గీ. 3.21) లోకమున గొప్పవాడని లెక్కింపబడువాడు ఏ కర్మను ఏ అంగముతో అనుష్ఠించునో పామరుడును ఆ

కర్మను ఆ జంగముతోనే చేయును. "అథ యది తే కర్మవిచికిత్సా వా వృత్తవిచికిత్సా వా స్యాత్, యే తత్ర బ్రాహ్మణా స్సమ్మర్శినః....యథా తే తత్ర వర్తేరన్,తథా తత్ర వర్తేథాః(తైత్తిరీయ శిక్షావల్లి)విద్యను పూర్తిచేసికొని,స్నాతకవ్రతమును గావించుకొని గృహస్థాశ్రమమున ప్రవేశించుచున్న శిష్యునకాచార్యులు "నాయనా! నీ భావిజీవయాత్రలో నే కర్మ నాచరించుటలో గాని సందేహ ముదయించినచో అచ్చట నున్న శిష్టాగ్రేసరులుగా పరిగణింపబడువారు ఆ కర్మల నెట్లు చేయుదురో చూచి నీవును ఆ కర్మల నట్లే ఆచరింపుము" అని యుపదేశింతురు. "మేలైయార్ శెయ్వనగళ్" "పెద్దలాచరించిన పనులనే మేమును చేయుదుము' అనియును ప్రమాణమునుబట్టి తెలియుచున్నది. నీవట్టి సాత్త్వికాగ్రేసరశిఖా మణివి. నీ అనుష్ఠానమును, నీ సూక్తిని మే మక్లే ప్రబలప్రమాణముగా నమ్మియున్నాము. దానిని సత్య మొనర్పవలదా?

అయినచో నేనేమి చెప్పితిని? ఏమి చేయలేదు? అని లోనున్న గోపిక యడుగగా

## ఎజ్ఞైౖ మున్న మెళుప్పువాన్ వాయ్ పేశుమ్ -

నిన్న మన మందరము కలసి కార్యక్రమమును నిర్ణయించుకొని మనము సమయమున మేల్కొని ఒకరి నొకరు లేపుకొని యొకచోట చేరుట యెట్లా యని విచారించుచుండగా నీవు లేచి నీ గుండెలపై చేతి నుంచుకొని "నే నున్నాను. మీకా చింత యేల? నేను లేచి మిమ్ముల నందరను లేపుదు" నని ప్రతిజ్ఞను గావించి మా కభయ మొసంగితివి గదా! అది నిజమైన గదా యీ ప్రమాణోప న్యాస మాదరించదగినది! "లోక సజ్గ్రహ మేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి" లోకశిక్షకైనను నీ ప్రతిజ్ఞను నీవు కాపాడుకొనవలదా? "న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసజ్గినామ్" అని భగవాను డానతిచ్చి నట్లు నీ యాచారమును ప్రమాణముగా గొని ప్రవర్తించు మావంటి పామరులకు ఆస్తిక్యమును జని పరచవలెను గాని మందగింపజేయరాదు. "యన్మనసా ధ్యాయతి త ద్వాచా వదతి, యద్వాచా వదతి తత్కర్మణా కరోతి" యనునది సత్పురుషుల లక్షణము. ఔనులే! ఆరు నెలలు సహవాసము చేసిన వారు వీరగుదు రనువటుల మనోవాక్కాయముల వైపరీత్యముచే ప్రత్యవాయము లేని శ్రీకృష్ణపరిచ యము నీకు మెండు.

వదనే నవనీత గన్ధవాహం । వచనే తస్కరచాతురీధురీణం
నయనే కుహనాశ్రు మాశ్రయేథాః । చరణే కోమలతాణ్డవం కుమారమ్ ॥"

శ్రీకృష్ణుడు పొరుగింటిలోని వెన్న ముద్దను మ్రింగివేసి ఆ యింటి గోపిక పట్టుకొనుటకు రాగా ఆమెకు దొరకకుండ తన యింట జేరెను. ఆమె యీ మాటను తల్లితో చెప్పినది. తల్లి కృష్ణుని నోరు తెరువుమన్నది. ఏమున్నది? వెన్నవాసన గప్పున కొట్టినది. ఇంకేమి! వారు చెప్పినమాట నిజ

మన్నది యశోద "కావమ్మా, నిన్న నువ్వు పెట్టిన వెన్న ముద్దను దాచుకొని యిపుడే తింటి నమ్మా" యని కృష్ణుడు దబాయించెను. అపుడు యశోద "నీకు దాచుట కూడ తెలియునా? ఎప్పటి దప్పుడు తగులవేయుటయే గాని" యనుచు కొట్టబోయినది. కృష్ణుడు కన్నులు నులుముకొనుచు కాటుక మంటచే కారుచున్న కన్నీటితో దుఃఖము నభినయించెను. "నీ దొంగయేడుపు తెలియునులే" యని కొట్టబోగా "ఇంకెప్పుడును చేయనమ్మా" యని చిందులు త్రొక్కెను. ఇట్టి శ్రీకృష్ణుని అబద్ధములు నీకును వచ్చినవి. శ్రీకృష్ణావతారములో చెప్పినదాని నాచరించుటయు, శ్రీరామావతారములో నాత డాచరించిన ట్లాచరించుటయు మన కర్తవ్యము. లేచిరమ్ము. నీ ప్రతిజ్ఞను కాపాడుకొని ఆదర్శ మహిళవు కమ్ము.

## న ఙ్గా య్ - పూర్ణురాలా!

ఇది వ్యంగ్యోక్తి. మనస్సు వాక్కును రెండును కలసిన వారికి గదా పూర్తి యుండునది. అది లేనివారికి పూర్తి యేది? ఇది ఔపచారికమే గాని ముఖ్యవృత్తి కాదు.

## నాణాదాయ్, నావుడైయాయ్ -

సిగ్గుమాలిన వారికి నాలుక బలము మెండు. నీ కాభాగ్య మబ్బినది.

— లేక —

నావుడైయాయ్- అనగా, నాలుక లేనివారుందురా? మరి దీని కర్థమేమి? నాలుకకు తగిన ఉపయోగ మున్న వారని అర్థము. అది యేది? "జిహ్వే కీర్తయ కేశవం" అనునట్టుల భగవన్నామ సంకీర్తనమున కుపయోగపడు నాలుకయే నాలుక. ఆ సంకీర్తనము చేయువారికి సిగ్గుండదు. "పేర్ పల శొల్లి పిత్తరెన్నే పిరర్ కూర" శ్రియఃపతియొక్క అసంఖ్యాకములగు తిరునామములను అక్రమముగాజల్పించి పామరులు పిచ్చివాడని చెప్పునటుల "అమ్మానై చ్చొల్లిప్పాడి యెళుస్దుం పరన్దుం తుళ్ళాదార్" "స్వామిని పాడని వారు ఈ లోకమున జన్మించి లభించిన ప్రయోజన మేమి?" అని ఆళ్వార్లు సాయించిరి.

## శఙ్గొడు శక్కర మేన్దుమ్ తడక్కైయన్ -

"పాతు ప్రణతరక్షాయాం । విలమ్బ మసహన్నివ ।
సదా పఞ్చాయుధీం బిభ్రత్ । స న శ్శ్రీరఙ్గనాయకః॥"

ద్రౌపది, ప్రహ్లాదుడు, గజేంద్రుడు మొదలగు ఆపన్నుల ఆర్తిని తీర్చుటకై పయనించు తరి ఆయుధములను వెతుకుకొనుచు ఆలసించుట తగదని "రక్ష్యాపేక్షాం ప్రతీక్షతే" అనునటుల ఎవరెప్పుడు రక్షింపుమని మొరలిడుదురో యని సర్వదా తన చేతులతో శంఖ చక్రాద్యాయుధములను ధరించియే యుండుటచే ఆతని చేతులు సాగి పెరిగి పెద్దవయ్యెనట!

పఙ్కజ కణ్ణానై - పుండరీకాక్షుని

ఇది నారాయణునకు మాత్రమే అసాధారణలక్షణము.

పాడ -

పాడదలంచినవారు శ్రీమన్నారాయణునే పాడవలెను. ఆయన గురించినదే పాట యగును. ఆయన నాలుకను ప్రసాదించినందుకు ఆ పాటయే సార్థకము. ఆ పాట పాడిననే నోరూరునది. ఇతరములగు పాటలు నోటి నార్చివేయును. "కృష్ణే త్యేకరయో రయం మధురిమో ద్గారః క్వచి ల్లక్షితః?" ప్రపంచమున నేపదార్థమునకును లేని మాధుర్యరసనిష్యందన మీ నారాయణ పదమునకే కలదు.

"హరి ర్హరతి పాపాని దుష్టచిత్తై రపి స్మృతః"

సకలపాపపరిహారసామర్థ్యము హరి నామమున కొక్కదానికే కలదని ప్రహ్లాదు డనుభవించి లోకమునకు ఋజువుచేసి చూపెను.

రామనామప్రభావ మంతకన్నను ఆశ్చర్యకరమైనది.

"రాశబ్దోచ్చారణే నైవ । ముఖా న్నిర్యాన్తి పాతకాః ।
పునః ప్రవేశభీత్యా చ । మకారస్తు కవాటవత్ ॥"

కుక్క యింటిలోనికి దూరినచో గద్దించి బైటికి వెళ్లగొట్టి మరల రాకుండుటకై తలుపు మూసివేయునటుల ముఖమును బాగుగా తెరచి 'రా' యనవలెను. దాని ద్వారా లోనున్న పాపము లన్నియు గాలి రూపముగా బైటికి పోవునట. 'మ' అనుటకు రెండు పెదవులను దగ్గరగా చేర్చవలెను. ఆహా! ఈ రామనామోచ్చారణలో నెంత మహిమ కలదు. మన మిట్లు పాడినచో మనకు శ్రీకృష్ణ వియోగ వ్యసన ముండబోదు. కావున లేచి రమ్ము. మాతో కలసి గుణ సంకీర్తన మొనర్పుము.

శఙ్గొడు శక్కర మేన్దుం తడక్కైయన్ -

శ్రీకృష్ణుడు చతుర్భుజములతో వేంచేసియున్నాడా? అన్నచో ఆయన అవతరించుటలోనే

త మద్భుతం బాలకం ............ చతుర్భుజం శంఖగదాద్యుదాయుధం ............ వసుదేవ ఐక్షత" అని భాగవతమున శ్రీవ్యాసమహర్షి చతుర్విధాయుధములను ధరించి నాలుగు భుజములతో నవతరించినట్లు దేవకీ వసుదేవులు సందర్శించిరనియు. వారు కంసునకు భయపడి "ఉపసంహర విశ్వాత్మన్! రూప మేతం చతుర్భుజమ్" అని ప్రార్థించగా వానిని మరుగుపరచినట్లును కలదు. ఆపైన మిక్కిలి భక్తికలవారలకు మాత్రము ఆ భుజములతో నప్పుడప్పుడు దర్శన మొసంగును. దీనిని లీలాశుకుడు శ్రీకృష్ణకర్ణామృతమున నీ క్రింది శ్లోకమున చమత్కరించెను.

"పీఠే పీఠ నిషణ్ణ బాలక గళే తిష్ఠన్ సగోపాలకో
యన్త్రాన్తస్సిత దుగ్ధభాణ్డ మవకృష్యాచ్ఛాద్య ఘణ్టారవమ్
వక్త్రే పాణ్ణి కృతాఞ్జలిః కృతశిరః కమ్పం పిబన్ యః పయః
పాయా దాగతగోపికానయనయోః గణ్డూష ఫూత్కారకృత్॥"

గ్రామస్థుల మొరలను విని యశోద "తల్లులారా! పిల్లులు, కుక్కలు త్రాగకుండగా దాచుకొనునట్లే మావాని కందకుండగా ఎత్తైన ఉట్లలో పెట్టి దాచుకొనరాదా?" అనగా వారట్లే చేసిరి. శ్రీకృష్ణు డొక యింట ప్రవేశించి పరిచితస్థానములలో పాలు పెరుగు కుండలను గానక యేమైనదో యని ఆలోచించుచు పైకి చూడగా ఎత్తైన ఉట్లలో భద్రపరచబడి యుండుటను చూచెను. అంతట అచ్చట నున్న పీటల నొకదానిపై నొకటి పెట్టి అప్పటికిని అందకపోవుటచే బలాఢ్యుడైన యొక బాలు నా పీటపై నుంచుండ బెట్టి వాని రెండు భుజములపై రెండు కాళ్లనుంచి నిలబడి యుట్టినందుకొని ఒక చేతితో పాలకుండను వంచెను. ఇంతలో నా గడును గోపిక ఆ యుట్టికి కట్టిన గంట గణగణ వాగ జొచ్చెను. పెరుమాళ్లారగించుచుండగా ఘంటానాద మాచారమే కదా! అంత శ్రీకృష్ణుడు వేరొకచేత నా గంటను వాగకుండ పట్టుకొని మిగిలిన రెండు చేతులను నోటియొద్ద అంజలిగా పట్టి పాల రుచిని ప్రశంసించుచు తల నూపుచు త్రాగుచుండెను. ఇంతలో ఆ చిన్న చప్పుడును విన్నంతనే యా యింటి గోపాంగన "ఆఁ ఆఁ" అనుచు పరుగిడి వచ్చి పట్టుకొన బోగా నా కృష్ణస్వామి నోట నిండ పాలను పట్టి యామె కండ్లలో నుమ్మి యామె కన్నులు నులుము చుండగా తప్పించుకొని పారిపోయెనట! చూచితిరా నాలుగు చేతుల యవతారము!

## — వేదాంతార్థము —

ఈ పాశురమున శ్రీనాథమునుల వలె జ్ఞాన భక్తి వైరాగ్యములచే పూర్ణులైన భాగవతుల నొకరిని లేపుచున్నారు.

"నమోఽచిన్త్యా ద్భుతా క్లిష్ట జ్ఞాన వైరాగ్యరాశయే ।
నాథాయ మునయేఽగాధ భగవద్భక్తి సిన్ధవే॥"

ఉఙ్గళ్ పుళ్ళైక్కడై తోట్టత్తు వావియుళ్ శెఙ్గళునీర్ వాయ్ నెకిళ్న్దు ఆమ్బల్ వాయ్ కూమ్బిన గాణ్ -

ఉ ఙ్గ ళ్ - ఆకారత్రయ విశిష్టులగు మీయొక్క

పుళ్ళైక్కడై తోట్టత్తు - విహారస్థానమైన తిరుమంత్రము యొక్క

వా వి యు ళ్ - మధ్య యందున్న 'నమః' పదమున

శెఙ్గళునీర్ వాయ్ నెకిళ్న్దు - పారతంత్ర్యము ప్రకాశించి

ఆమ్బల్ వాయ్ కూమ్బిన కాణ్ - స్వాతంత్ర్యము ముకుళించినది.

ఈ భాగవతులు ఆకారత్రయవిశిష్టులు. ఆకారత్రయమనగా - తదేకరక్ష్యత్వ, తదేకభోగ్యత్వ, తదేకశేషత్వములు. ఇవి ఆత్మకు ముఖ్యధర్మములు. ఇవి చేతనసామాన్యధర్మములు. భగవంతు డొక్కడే గాని తదితరులు రక్షకులు కారు. భగవంతుని (కృప) కన్న యితరములేవియు భోగ్యములు (అనుభవించతగినవి) కావు. ఈచేతనుడు భగవంతునకు మాత్రమే నియామ్యుడు, ధార్యుడు, శేష భూతుడున్ను. శేషభూతు డనగా తన దేహేంద్రియాదులన్నియును అయన ముఖవికాసమునకు మాత్రమే అయనచే యథేష్టవినియోగార్హముగా కలవాడు. ఇట్టివాడే నిజమైన వైష్ణవుడు.

తో ట్ట త్తు -

తోట - ఆరామము - విహారస్థలము. అది తనయందున్న వృక్షములయొక్క నీడ, చిగుళ్ళు, పువ్వులు, కాయలు, పండ్లు, పరిమళము, ఆ చెట్లపై వ్రాలిన పక్షుల అరువులు మొదలగు వానిచే పరవశము గావించి అనంతరము విశ్రాంతి నొసంగును. తిరుమంత్రమును అటులనే తన అర్థశక్తిచేత చేతనుల రక్షించుచు వారి కానందదాయకమై పరమపురుషార్థమును, తాత్కాలికానందమును, తాత్కాలిక విశ్రాంతిని, శాశ్వతానందమును, శాశ్వతవిశ్రాంతని కలిగించును.

## బావి యుళ్ -

ఆ తోట మధ్యనున్న బావివలె. ఆ బావిలో చల్లని, రుచికరమైన, లోతైన నీరుండును. అట్టిది అష్టాక్షరీమంత్రమధ్యమందున్న 'నమః' పదము. ఇదియును గంభీరమై జీవన (నీరు) ప్రదము. (మః = మృత్యువు నమః = ముక్తి.) ఇందలి అర్థములు రుచిజనకములు. శాంతిప్రదములు. అందు ముకుళించి వికసించు కలువలున్నవి. ఈ నమః పదార్థము నెరింగిన స్వాతంత్ర్య మణగి, పారతంత్ర్యము ప్రకాశించును.

మన్త్రబ్రహ్మణి మధ్యమేన నమసా........ .. ........ స్వాతంత్ర్యం, నిజరక్షణం, సముచితావృత్తి శ్చ నాన్యోచితా, తస్యైవేతి హరే ర్వివిచ్య కథితం స్వస్యాపినార్హం తతః ॥"

## శఙ్గఙ్వొడి క్కూఱై వెణ్బల్ తవత్తవర్ -

శఙ్గఙ్వొడి = రాగము - ప్రేమ - భక్తి.

కూఱై = శేషత్వము.

"వస్త్రముఖ్యా స్త్వలఙ్కారాః" అన్నట్లు అలంకారమునకు వస్త్ర మెంత ముఖ్యమో ఆత్మకు శేషత్వ మంత ముఖ్యము. ఎన్ని యలంకారము లున్నను మంచి వస్త్రము లేనిచో నవి రాణించనట్లే యెన్ని యాత్మగుణములున్నను శేషత్వజ్ఞానము లేనిచో ఆత్మ ప్రకాశించదు. ఆ శేషత్వజ్ఞానము విధిప్రయుక్తము కాకుండ రాగప్రయుక్తము కావలెను. అనగా భక్తితోగూడిన శేషత్వముండవలెనని యర్థము.

## వెణ్బల్ తవత్తవర్ -

ఆ జ్ఞానముకలిగి మందస్మితముతో గూడియున్న ప్రపన్నాధికారులు. ఇచ్చట తపస్సనగా "న్యాస ఏషాం తపసాం వరిష్ఠ మాహుః" తపసాం వరిష్ఠం అని చెప్పబడిన ప్రపత్తి, సీతాపిరాట్టి రావణునితో

"న త్వా కుర్మి దశగ్రీవ భస్మ భస్మార్హతేజసా ।
అసందేశాత్తు రామస్య తపస శ్చాను పాలనాత్ ॥"

"రావణా! నేను వట్టి యబలను కాను, నిన్నొక్క పెట్టున భస్మముగావించి విముక్తిని పొందగలను, కాని తపోనిష్ఠలో నుండుటచే ఆ పనిని చేయజాలననెను, ఇచ్చట తపోనిష్ఠ యనగా ప్రపత్తి.

ఆ నిష్కలవారు తమ రక్షణను తాము చేసికొనరాదు. అదియున్నచో స్వామి రక్షింపడు. ప్రపత్తి యనగా భగవత్ప్రవృత్తి నడ్డునట్టి తన ప్రవృత్తిని విడుచుటయే. ఆ ప్రపన్ను డెప్పుడును సౌలభ్యమును సూచించు చిరునగవు తళుకొత్తు ముఖకాంతితో ప్రకాశించును.

## తజ్గళ్ తిరుక్కోయిల్ శజ్గిడువాన్ పోగిన్టార్ -

వారు తిరువారాధనను నియతముగా నాచరింతురు. వారు పంచ సంస్కారసంపన్నులు గదా! పంచ సంస్కారములనగా- తాపము, పుండ్రము, దాసనామము, తిరువారాధన, మంత్రత్రయోపదేశము.

(తాపః పుణ్డ్రస్తథా నామ యాగో మన్త్రశ్చ పఞ్చమః)

ఇచ్చట యాగమనగా దేవపూజ. "యజ దేవపూజాయామ్" భగవానుడు గీతలో 4వ అధ్యాయమున "ద్రవ్యయజ్ఞాః తపోయజ్ఞాః" అను శ్లోక వ్యాఖ్యానములో ద్రవ్యయజ్ఞము లనగా "న్యాయతో ద్రవ్యాణ్యు పాదాయ దేవతార్చనే ప్రయతన్తే" అని గీతాభాష్యము. అది వారికి నిత్యయజ్ఞము దానిని దీక్షతో నిర్వహింతురు.

## ఎజ్గళై మున్న మెళుప్పువాన్ వాయ్ పేశుమ్ -

లేపుట యనగా అజ్ఞానాంధకారములో మునిగి పరవశులైయున్న సంసారి చేతనులను "ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్యవరాన్ని బోధత" అని హెచ్చరించుట. శ్రేష్ఠులగు సదాచార్యుల నాశ్రయించి, వారి నుండి తెలియదగు అర్థముల నెరింగి యుజ్జీవింపుడు. అది మీకు విధి

"పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ .............. స గురు మేవాభిగ చ్ఛేత్ .............. తస్మై స విద్వాన్ ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్. ప్రోవాచ = ప్రబ్రూయాత్ = చెప్పవలెను. దేనిని? తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్ = బ్రహ్మవిద్యను. ఇట్టి బాధ్యత మీకుండుటచే మేమపేక్షించుటకు ముందే మమ్ములను జ్ఞానులనుగా నొనర్చుటకు తగిన శ్రీసూక్తులను ప్రసాదించు పూర్తిగల భాగవతోత్తమా లేచిరండు. మా కభిముఖులు కండు.

## నా ణా దా య్ -

భగవద్విషయమును పాడుచు, ఆడుచు గంతులిడుటలో సిగ్గుపడని దీక్షగలవారు.

నా వు డై యా య్ - సార్థకమైన నాలుకగల స్వామీ!

"జిహ్వే కీర్తయ కేశవం" "సతతం కీర్తయన్తో మాం" "మన్త్రరత్నాను సన్ధాన సన్తత స్ఫురి తాధరః" "ప్రావర్తయ ప్రాఞ్జలి రస్మి జిహ్వే నామాని నారాయణ గోచరాణి"

"శ్రీమన్నామ ప్రోచ్య నారాయణాఖ్యం కే న ప్రాపుః వాఞ్ఛితం పాపినోఽపి ।
హా! నః పూర్వం వాక్ప్రవృత్తా న తస్మిన్॥"

స్వామీ! మీరు మనస్ఫూర్తిగా చెప్పకున్నను "యోయో జల్పః" అనునట్లు దాని మాధుర్యమును చవిచూచిన స్వతః సర్వజ్ఞుడైన సర్వేశ్వరునకును "ఇదం సహృదయం, అవశ్యం కర్తవ్యమ్" అనునట్లుండును. వీరు సహృదయముగనే చెప్పచున్నారు. దీనిని తప్పక పాటించవలెనని భగవంతునకు తోచును.

"అనిచ్ఛ న్నప్యేవం యది పున రితీచ్ఛన్నివ రజః-
తమ శ్ఛన్న ఛద్మ ప్రతివచన భఙ్గీ మరచయమ్ ।
తథా పీత్థం రూపం వచన మవలమ్బ్యాపి కృపయా
త్వ మే వైవంభూతం ధరణిధర! మే శిక్షయ మనః॥"

ఆళ్వా . స్తో. 59.

ఓ స్వామీ! నేను రజస్తమోగుణములచే నావరింపబడిన మనోవాక్కాయములు కలవాడను. అందుచే నిన్ననుభవించుటకు తగిన నిజమైన కోరిక లేకున్నను ఉన్నవానివలె నటించుచు నీచుడనై స్తోత్రము చేయుచున్నాను. అయినను నీవు దయామయుడవు గాన యీ నా కపటపు మాటలను పుచ్చుకొనియైనను నీ నిర్హేతుక దయతో నా మనస్సును దిద్దుబాటు చేసి నిజముగా ధ్యానము నపేక్షించు నటుల శిక్షింపుము." అని ప్రార్థించిరి.

వరవరమునులు యతిరాజవింశతిలో చివర

"శ్రుత్యగ్రవేద్య నిజ దివ్య గుణస్వరూపః
ప్రత్యక్షతా ముపగత స్త్విహ రఙ్గరాజః ।
వశ్య స్సదా భవతి తే యతిరాజ తస్మాత్
శక్త స్స్వకీయ జనపాపవిమోచనే త్వమ్ ॥"

శ్రీభాష్యకారా! వేదాంతములచే నెరుంగదగిన స్వరూప రూపగుణవిభూతులుగల శ్రీరంగ నాథుడు మీ కెల్లప్పుడును వశంవదుడై యుండును. కావున దేవరవారు మీ పాదదాసుల పాపరాశులను పారద్రోలుటలో సమర్థులు. అందుచే మేము నిర్భరులమై నిర్భయముగా నున్నాము. మేము

"కాలత్రయేఽపి కరణత్రయనిర్మితాతి -
పాపక్రియస్య శరణం భగవత్ క్షమైవ ।
సా చ త్వయైవ కమలారమణేఽర్థితా యత్
క్షేమ స్స ఏవ యతిరాజ! భవచ్ఛ్రితానామ్ ॥"

భూతభవిష్యద్వర్తమానకాలములలో మనోవాక్కాయములతో కొల్లలుగా నార్జించిన పాపరాశులు కలవారము. వానిని ప్రాయశ్చిత్తములచే గాని, అనుభవముచే గాని మేము పోగొట్టుకొనజాలము. అవి భగవంతుడు "క్షమించితి" నననే తరుగును. ఆ క్షమ నార్జించుట మాకు శక్యము కాదు. మీ పాదదాసులమగు మా పాపముల హరించుమని మీరే భగవంతుని ప్రార్థింపుడు. అదియే మాకు శ్రీరామరక్ష.

అటులనే ఓ ఆచార్యా! మీరు లేచి, అనగా, మాకభిముఖులై మా పాపములను పారద్రోలి మాకు పురుషార్థమును ప్రసాదింపుడు అని ఆచార్యస్థానీయులగు భాగవతోత్తములను లేపుచున్నారు.

## — సందర్భానుసారముగ ననుసంధించుకొన దగిన పాశురములు, శ్లోకములు —

(నావృత్తైయాయ్ అనుచోట)

నాఽనృగ్వేదవినీతస్య నాఽయజుర్వేదధారిణః ।
నాఽసామవేదవిదుషః శక్యమేవం ప్రభాషితుమ్ ॥

నూనం వ్యాకరణం కృత్స్నం అనేన బహుధా శ్రుతమ్ ।
బహువ్యాహరతానేన న కిఞ్చి దపశబ్దితమ్ ॥

రామా. కిష్కిం. 3 సర్గ. 28, 29 శ్లో.

## తాత్పర్యము

ఆంజనేయుని సుందరకాండలో ఆచార్యునిగా వర్ణింతురు. ఆచార్యుల కుండవలసిన లక్షణము లిచ్చట చెప్పబడుచున్నవి. "ఆచార్యో వేదసమ్పన్నః" అనునది ప్రథమలక్షణము. అనగా, సాంగచతుర్వేదముల నధ్యయనము చేసినవాడే ముఖ్య ఆచార్య శబ్దమునకు తగినవాడు. ఈ శ్లోకమున ఆంజనేయుల కాలక్షణములు శ్రీరామునిచే సూచింపబడుచున్నవి.

నాఽనృగ్వేదవినీతస్య - ఋగ్వేదమున స్వర మధికముగా నుండును. మనస్సును దాని యందు బాగుగా లగింపజేయవలసియుండుటచే ఋగ్వేదవినీతుడు కానివాడు ఇట్లు మాట్లాడ జాలడనెను.

ఈ వేదమున ఐతరీయోపనిషత్తులో "బ్రహ్మవా ఇద మేక అగ్ర ఆసీత్" అని భగవంతుని సృష్టిస్థితి సంహార కర్తృత్వము చెప్పబడినది. ఆంజనేయులున్ను "ఉభౌ యోగ్యావహం మన్యే రక్షితుం పృథివీం మిమామ్" అనెను.

నాఽయజుర్వేదధారిణః - ఈ వేదమున నొక్కొక్క అనువాకమునందును కొళ్లు అధికముగా నుండును. (కొళ్లు అనగా ఒకే వర్ణక్రమము గల వాక్యములు) అందుచే సాంకర్యము లేకుండ అనుసంధించుటకు గొప్పధారణ యుండవలెను. కావున 'ధారిణః' అని చెప్పబడెను. అట్టి ధారణశక్తి లేనివాడు ఈ వేదమునననుసంధించలేడు. ఈవేదమున 'అజాయమానో బహుధా విజాయతే' ఇత్యాదులలో అవతారరహస్య ప్రసంగము కలదు. అంజనేయులును "మానుషౌ దేవ రూపిణౌ" అని యీ రహస్యమును సూచించెను. కావున యజుర్వేదమున ధారణ ఆవశ్యకమని చెప్పబడినది. అది కలవాడీ హనుమంతుడు,

నాఽసామవేదవిదుషః - సామవేదమున గాన విశేషములధికముగా నుండును. వాని నెరుంగుట చాల కష్టము. అందువలననే 'విదుష' శబ్దము ప్రయోగింపబడినది. ఈ వేదమున 'అథ య ఏషోఽన్తరాదిత్యే....... .... అని మొదలు పెట్టి "తస్య యథా కప్యాసం పుణ్డరీక మేవ మక్షిణీ" అని కలదు ఆంజనేయులు "సువర్ణాభే పద్మపత్ర నిభేక్షణౌ" అని వీరిద్దరిని వర్ణించెను. శ్రీరాముడు సకల విద్యాపారంగతుడగుటచే ఈతని స్వల్పభాషణముచేతనే యీతని విద్యాయోగ్యతను గుర్తించి యిట్లు ప్రశంసించెను.

మరియు, ఈతని వ్యాకరణశాస్త్రపారంగతత్వమును శ్రీరాముడు ప్రశంసించెను. వ్యాకరణమును గురుముఖతః వినినవాడితడు. కాబట్టి మాటలలో అపశబ్ద మొక్కటియును లేదు. వ్యాకరణముల నన్నిటిని సమగ్రముగా చదివినవాడు కాబట్టి ప్రకృతి, ప్రత్యయ, సంధి, సమాసాదులలో నొక తప్పును వినబడలేదు. ఇంతసేపు సంస్కృతములో మాట్లాడినను ఎక్కడను ఒక్కపొరపాటైనను లేకపోవుటచే వ్యాకరణమును సమగ్రముగ అనేకసార్లు చదివెనని గ్రహించెను.

విడువేనో వెన్విళక్కై ఎన్నావియై
నడువే వన్దు య్యక్కొళ్గిన్ఱ నాతనై
తొడువే శెయ్ దిళవాయ్చ్చియర్ కన్నినుళ్
విడువే శెయ్తు విళుక్కుమ్ పిరానైయే.

### తాత్పర్యము

నాకు దీపమువంటివాడు. నాకు ప్రాణమైనవాడు. నా జీవితములో మధ్యగా ప్రవేశించి నన్ను జీవింపజేయుచున్న నాయతుడు. విటవ్యాపారముల జేసి గొల్లయువతుల కండ్లలో సాంకేతిక దృష్టితో వారిని కటాక్షించువాడు. అట్టి యుపకారకుడగు సర్వేశ్వరుని నేను విడతునా?



# పదునైదవ పాశురము

# "ఎల్లే"

## — అవతారిక —

స్త్రీలందరును చేరియుండు గోష్ఠిని సేవించవలెనని లేవక పరుండియున్న యొక గోపాంగనను లేపుచున్నారు. ఇంత వరకు జరిగిన పాశురములలో వ్యాఖ్యాన కర్తలు కల్పించిన ప్రశ్నోత్తరములే గాని కంఠోక్తములైన ప్రశ్నోత్తరము లున్నది యీ పాశురములోనే. తిరుప్పావై యనదగిన దీ పాశురమే. ఇందులకు కారణ మేమనగా ఈ పాశురమున మనము భాగవతుల విషయమై పాటించవలసిన నడువడిక తెలుపబడుచున్నది. భగవద్విషయమున నుండవలసిన మన నడువడిక "శిత్తం శిఱుకాలే" పాశురమున తెలుపబడును. శ్రీ భాష్యకారులు తమ చరమోపదేశములో నీ విషయమును నిధిని బైట పెట్టినట్లు ఆప్తులగు శిష్యుల కుపదేశించిరి.

> శ్రీమద్భాగవతార్చనం భగవతః పూజావిధే రుత్తమం
> శ్రీవిష్ణో రవమాననా ద్గురుతరం శ్రీవైష్ణవోల్లఙ్ఘనమ్ ।
> తీర్థా దచ్యుతపాదజా ద్గురుతరం తీర్థం తదీయాఙ్ఘ్రిజం
> తస్మా న్నిత్య మతన్ద్రితో భవ సతాం తేషాం సమారాధనే ॥

భగవంతు నర్చించుటకన్నను భాగవతుల నర్చించుట శ్రేష్ఠమైనది. శ్రీమహావిష్ణువు యొక్క ఆజ్ఞయైన శాస్త్రము నుల్లంఘించుటకన్న భాగవతాజ్ఞ నతిక్రమించుట మిక్కిలి పాపావహము. భగవత్పాద తీర్థముకన్న భాగవతపాదతీర్థము ప్రబలపాపహరము. అనేకపాపముల కిది ప్రాయశ్చిత్తము. కాబట్టి భాగవతారాధన విషయమై యేమరుపాటులేక ప్రవర్తించుమని యుపదేశించిరి.

ధర్మరాజు రాజసూయయాగమున వారి వారి కుచితములగు కర్మలను విధించి శ్రీకృష్ణుని "నీ వేమి చేయుదు" వని యడుగగా

"చరణక్షాళనే కృష్ణః బ్రాహ్మణానాం స్వయం హ్యభూత్"

యజ్ఞమునకు విచ్చేయు విప్రోత్తముల పాదారవిందములను కడుగు కైంకర్యమును నేను చేయుదునని సెలవిచ్చెను. "స్వయ మేవ హరి ర్వవ్రే విప్రపాదావనేజనమ్" దాని విశేషమేమనగా, "విప్రేషుః ఫలముత్తమమ్" తక్కిన కైంకర్యము లన్నింటికంటెను ఉత్తమఫలమును బడయగోరియే యని చెప్పబడెను.

మరియు, సుదాముడు (కుచేలుడు) తన దర్శనార్థియై విచ్చేయుచున్నాడని విని శ్రీకృష్ణుడు

"సహసోత్థాయ పర్యంకాత్
దోర్భ్యాం పర్యగ్రహీన్ముదా
అథోపవేశ్య పర్యంకే
స్వయం సఖ్యుస్సమర్హణమ్ ॥"

ఉపహృత్యావనిజ్యాస్య
పాదౌ పాదావనేజనీః
అగ్రహీత్ శిరసా రాజన్
భగవాన్ లోకపావనః ॥

వెంటనే ఆసనము నుండి లేచి యెదురేగి ఆనందముతో నాతని గట్టిగా కౌగిలించుకొని, తన హంస తూలికా తల్పమున కూర్చుండబెట్టి, యాతని పూజ చేయుటకు తగిన ద్రవ్యముల తెప్పించి యా కుచేలుని పాదములను కడిగి లోకపావనుడును జ్ఞాన శక్తి బలైశ్వర్య వీర్యతేజో నిధియగు శ్రీకృష్ణుడు ఆ తీర్థమును తన శిరస్సున ధరించెను.

ఆళ్వార్లును తిరువాయ్‌మొళ్ళి 5వ పత్తులోని రెండవ దశకములో మొదటి రెండు పాశురములలోను

"............... కడల్‌వణ్ణన్ పూతఙ్గళ్ మణ్మేల్
మలియ పుగున్దు ఇశైపాడి యాడి యుఴిదరక్ కణ్డోమ్"

సముద్ర వర్ణుడగు సర్వేశ్వరుని భక్తులు భూమిపై సమృద్ధిగా ప్రవేశించియుండి శ్రీమన్నారాయణుని కల్యాణగుణముల పాడుచు ఒడలెరుంగక యాడుచు సంచరించుచున్నారు, ఇరుగో మనము చూచుచున్నాము. వీరికి దృష్టిదోషము తగులునేమో యని భయపడి వారికి "పొలిగ పొలిగ పొలిగ" యని యార్తితో ననేక పర్యాయములు మంగళాశాసనము గావించిరి.

రెండవ పాశురములో "కణ్ణోమ్ కణ్ణోమ్ కణ్ణోమ్ కణ్ణు క్కినియన కణ్ణోమ్ తోల్లీ రెల్లీరుమ్ వారీర్ తొళుదు తొళుదు నిన్నార్త్తుం"

భగవంతుడిచ్చిన కన్నులు సార్థక మగునట్లుగా నేత్రభోగ్యమగు భాగవతగోష్ఠిని సేవించితిమి, సేవించితిమి, సేవించితిమి. మీ రందరును వేంచేయుడు. నాతో కలిసి వారిని తృప్తిగా సేవించి యా సంతోషము లోపల నిముడక ఉచ్చై స్స్వరముతో వెలిబుచ్చుడని అనంద పారవశ్యముతో సేవించిరి.

అట్టి యనుభవము నపేక్షించునది యీనాడు లేపబడు గోపాంగన

## పదునైదవ పాశురము

ఎల్లే! యిళఙ్గిళియే ఇన్నమ్ ఉఱఙ్గుతియో,
శిల్లెన్ఱళైయేన్మిన్ నఙ్గైమీర్! పోదరుకిన్ఱేన్,
వల్లై ఉన్ కట్టురైకళ్ పణ్డేయున్ వాయఱి తుమ్,
వల్లీర్ కళ్ నీఙ్గళే నానేతాన్ ఆయిడుక,
ఒల్లై నీ పోదాయ్! ఉనక్కెన్న వేఱుడైయై,
ఎల్లారుమ్ పోన్దారో? పోన్దార్ పోన్దెణ్ణిక్కోళ్,
వల్లానై కొన్ఱానై మాత్తారై మాత్తఴిక్క
వల్లానై, మాయనై ప్పాడేలో రెమ్బావాయ్.

— తాత్పర్యము —

ఆండాళ్లమ్మ మొదలగువారు ఈనాటి గోపికను "ఓ లేత చిలుకా! ఇంకను నిద్రించు చున్నావా ? ఇది యేమి యాశ్చర్యమే!" అనిరి. (బ్రాహ్మీ ముహూర్తములో పడకపై నుండియే పరమాత్మను ఏకాంతముగా ధ్యానించుచున్న గోపాంగన) "పూర్ణులైన పూబోడులారా! ఇదుగో వచ్చుచున్నాను" అనెను. బైటనున్న గోపికలు "శీఘ్రముగా లేచిరా" అనిరి. దానికి లోపలనున్న గోపిక "అబ్బా! గొల్లుమని యులికి పడునట్లు గట్టిగా గొంతెత్తి చెవులు గడియ పడునట్లు పిలువకుడు, వచ్చుచున్నా"నని నెను. బైటిగోపికలు "ఓ చిన్న చిలుకా! నీవు మాటలలో చాల చమత్కారము కలదానవు. నీ నేర్పరి తనము,

నీ కఠినపు చెప్పుడు మాటలు మే మిదివరకే యెఱుంగుదుము" అనిరి. లోపలి గోపిక "మీరే అట్టి సమర్థులు, నేనేమియు కాదు. పోనిండు, మీరు చెప్పినట్లు నేనే అట్టి దాని నగుదు. రావలసిన వారం దఱు వచ్చినారా?" బైటి గోపికలు "ఆఁ, అందరు వచ్చియున్నారు. నీవు బైటికి వచ్చి లెక్కపెట్టి చూచుకొనుము" లోపలి గోపిక "నేను వచ్చి చేయవలసిన పని యేమి?" బైటి గోపికలు "కువలయాపీడమను కంసుని యేనుగును, కంసాది శత్రువులను సంహరించిన సర్వేశ్వరుని కల్యాణగుణములను స్తుతింతము. లేచిరమ్మా."

## — వి శే షా ర్థ ము —

ఇంతకు ముందు గోపాంగనను లేపుచు "పఙ్గియ కణ్ణానై ప్పాడ" అని లేపిరి. ఆ పాటను ఈ పాశురములోని గోపిక విని, అది యామెకు మిక్కిలి భోగ్యముగా నుండుటచే దానినే మృదు మధుర స్వరముతో అనుసంధించ మొదలంగెను. అది యా లేపుచున్న గోపికల చెవిని బడి పరుగిడి యీామె యింటికి వచ్చి "ఎల్లే యిళఙ్గిళియే" అనుచున్నారు.

ఎల్లే యిళఙ్గిళియే - ఓ బాలచిలుకా!

వీణను వాయించువారు పాడదలంచిన పాటను వీణపై పలికించి అది సరిపోయినచో తమ కంఠమును దానితో కలిపి పాడుచుందురు. అటులనే పైవారి పాటకు ఈమె పాట. "ఆహా! ఏమి నీ కంఠస్వరమాధుర్యము!" అన్నదానినే అనుట చిలుక స్వభావము. వారన్న శ్రీసూక్తినే యీామె యనువదించుటచే 'చిలుకా' యనుచున్నారు. ఈమె బాల్యమును బట్టి 'లేత చిలుకా' యనుచున్నారు. నాయికా నాయకులు ఏకాంతముగా పరుండి శృంగారముట్టిపడు సూక్తులను పలుకుచుండిరి. అచ్చటనే యున్న పెంపుడుచిలుక ఆ పలుకులను బట్టి పగలందరిలోను పలుకదొడంగెను. నాయిక సిగ్గుపడి "దాడిమ ఫలవ్యాజేన వాగ్బంధనమ్" అన్నట్లు దానిమ్మగింజల తినిపించి దాని నోటిని కట్టివేసెను. ఈమె కంఠస్వరము, ఆ పాటకూర్పును వాల్మీకి మహర్షి వ్రాసిన శ్రీరామాయణమును కుశలవులు శ్రీరాముని అశ్వమేధావసరములో పాడినట్లున్నది.

కుశలవులు సీతారాముల బిడ్డలు. దీపమునుండి వచ్చిన పెద్దదీపములవలె వెలుగొందుచున్నారు. బ్రహ్మచర్యాశ్రమవేషములు. అసలు వారు గాయకసార్వభౌములు. వారు పాడునది అపూర్వఛందోబద్ధమును, అపుడే జరిగిన మృతసంజీవనమగు శ్రీరామవృత్తాంతమును. ఇక ఆ పాటలో భోగ్యత కేమి కొఱత? దానిని వినిన ఋషిపుంగవులందరును

"సాధు సాధ్వితి తే హ్యూచుః । పరం విస్మయ మాగతాః ।
అహో! గీతస్య మాధుర్యం । శ్లోకానాం తు విశేషతః ॥"

"ఆహా! ఆ కంఠము లెంత మధురము! అంతకన్నను ఆ శ్లోకముల సౌష్ఠవ మెంత ఆశ్చర్యావహము!" అని పొగిడి పొగిడి యొక ఋషి కమండలమును, ఒకరు నారబట్టలను, వేరొకరు కృష్ణాజినమును, కమండలమును, ఇంకొకరు యజ్ఞోపవీతమును, మౌంజిని బహూకరించిరి. మరికొందరు ఆశీస్సుల నందజేసిరి.

అట్లున్నది యీ గోపాంగన గీతము అందుచే పైవారు వ్యాముగ్ధులై "ఎల్లే! ఇలజ్జిళియే!" అనుచున్నారు. ఈ అనుసంధానమునకు అంతరాయమును కలిగించుట చాల ధర్మహానియే. అటులే వినుచు పడియుండదగినరి. కాని ముందు కార్యభారముండుటచే లేపవలసివచ్చుచున్నదని చాల బాధపడిరి.

ఎల్లే ! -

ఆశ్చర్యార్థకము గాని 'హజ్జే, హజ్జో' అనునట్లు సంబోధనముగాని కావచ్చును. ఈ పిలుపులోని గూఢార్థమును ఆ లేపబడు గోపాంగన యిట్లు గ్రహించినది.

"నాకు ముందు లేపు గోపాంగనను 'నాణాతాయ్ = సిగ్గులేనిదానా!' 'నావుడైయాయ్ = నాలుక మాత్రము కలదానా!" అనుచు దెప్పుడు మాటలతో లేపిరి. ఆమెకన్నను నే నాలసించి పరున్న నన్ను దూషింతురు గాని భూషింతురా? "ప్రపన్నులు ప్రాకృతుల నిందను స్తుతి గాను, వారి స్తుతిని నిందగాను భావింపవలె"నని శాస్త్రము కలదు. అని సిగ్గుపడి మాట్లాక పరుండెను.

ఇన్నమ్ ఉఱంగుడియో - ఇంకను నిద్రించుచున్నావా?

ఇంతవరకు భాగవతగోష్ఠి నంతను సేవించవలెనను ఆశతో పరున్నావని తలంచుచుంటిమి. మేము వచ్చి పిలచినను లేవకుండుటచే నిది నిద్రబద్ధకమనియే భావించుచున్నాము.

ఎట్టి పాషాణహృదయులైనను ఇతరుల ఆర్తిని జూచి "అయ్యో' అనక ఉండలేరు. మేము శ్రీకృష్ణ విరహముచేతను, నీ మధురవాక్కులు వినిపించక పోవుటచేతను ఎంత కృశించి బాధపడుచున్నామో! "ఏ హి పశ్య శరీరాణి" (మా శరీరములను చూడుము.) అని ఋషులు తన యొద్దకు వచ్చి తమ కష్టములను వినిపించగా శ్రీరాముడు "హ్రీరేషా హి మమాతులా । యదీ దృశై రహం విప్రై రుపస్థేయై రుపస్థితః" సేవించబడతగినవారిచే సేవించబడుచున్నానే. ఇది యెంత లజ్జాకర"మని యెంత బాధ పడెనో వినలేదా? నీ వెట్లింకను పరున్నావమ్మా" అనుచున్నారు.

మనకు ఉత్కృష్టమైన శ్రీకృష్ణానుభవమునకు ఏకాంతమగు సమయము మనకు లభించినను అనుభవించక నిద్రించుచున్నావమ్మా? శ్రీరామచంద్రానుభవమునకు ఏకాంతస్థలమని కదా మన సీతమ్మతల్లి "క్లిష్టం గ్రావసు మాలతీమృదుపదం" అని యెన్ని కష్టముల నైనను సహింతునని వాదించి అరణ్యమునకు వెంబడించినది! నీకా యవస్థలేదు కదా!

శిల్లెన్నళై యేన్మిన్ -

ఇట్లందరును కలసి యేక కంఠముగా "ఎల్లే! యిళఙ్కిళియే! ఇన్నమ్ ఉఱఙ్గుతియో" అని గొల్లుమనగా లోపలపరుండియున్న గోపాంగన చేయుచున్న శ్రీకృష్ణానుభవమునకు విఘ్నమై యామెకు బాధను కలిగించగా "గొల్లుమని పిలువకుడు" అనెను. వీరి పిలుపే ఆమె కంత బాధను కలిగించెనా? యన్నచో

శ్రీరంగమున పెరుమాళ్ల కోవెలకు వెనుకనున్న చంద్రపుష్కరిణికి ఎడమవైపుగా పెద్ద పొన్నవృక్షమున్నది. అది యొక యేకాంతస్థలము. పెద్ద లచ్చట భగవద్విషయ కాలక్షేపము చేయు ఆచారము కలదు. మంచి రసవద్ఘట్టములలో బలిహరణకై పెరుమాళ్లు వేంచేయుచుండిరి. ఆ సమయమున నందరును వారిని సేవించుటకొరకై వెళ్లుటవలన రసభంగము కలుగుచుండెడిది. దానిని సహించలేక భక్తులా పెరుమాళ్లను కాలక్షేవిరోధియనుచుండిరి. దాని నెరింగి పెరుమాళ్లు అర్చకముఖముగా నా సమయములో తమ నా ప్రక్కకు వేంచేపుచేయవలదని యాదేశించిరట.

మరియు, శ్రీమన్నారాయణు డొకతరి శ్వేత ద్వీపమునకు వేంచేయుచుండగా శ్రీ నారద మహర్షి వారిని వెంబడించెను. నారదుడనగా పెరుమాళ్లు పిరాట్టి మారులతో నేకాంతముగా నున్న సమయమందును దీపపు సెమ్మా, పతద్గ్రహ పాత్ర మొదలైన వెట్లచ్చటనే యుండునో అట్టులనే ఆటంకము లేక యుండు అప్తుడు పెరుమాళ్లు శ్వేతద్వీపపు అవరణములోనికి ప్రవేశించుచు శ్రీ నారదుల వారితో-

"మీ కాఠిన్యము నచ్చట వాస్తవ్యులు సహించ లేరు. వారు ప్రశాంతముగా ధ్యాన నిమగ్నులై యుందురు, కాబట్టి నేను వచ్చువరకు మీ రిచ్చటనే వేచియుండు" డని అయనను బైట నిలిపి పెరుమాళ్లొక్కరే లోపలికి వేంచేసిరి.

దీనిని బట్టి నిర్మల భగవదనుభవ నిష్ఠులకు ఇతర ధ్వని యే మాత్రమైనను దుస్సహ మగుటచే నీమె "శిల్లెన్నళై యేన్మిన్" అనుచున్నది.

ఆ మాట పైవారికి కత్తివేటువలె తోచి "అమ్మ తల్లీ! నిన్ను విడచి యొక్క క్షణమైన బ్రతుక జాలని మమ్ముల నింత మాటయంటివి. మేమన్నను, మా దర్శన మన్నను, మా మాట యన్నను నీ కింత యసహ్య మగుటకు కారణము నీ పూర్తియే కదా! ఎంత పూర్ణురాలవమ్మా!" అనిరి. ఆ మాట లోనున్న గోపాంగనకు బాధకమైనది.

## నజ్జైమీర్! పోదరుకిన్డేన్ -

"ఆ! కాకేమి? నా స్వభావమెరుంగక "ఇలజ్జిళియే" అని దెప్పుడు మాటలతో నన్ను బాధించు మీరా? నేనా? పూర్ణులము? ఆళ్వారులకు కోపము వచ్చిన "శ్లేష్మంగారు" "మనస్సుగారు" అని దెప్పు దురు. అటులనే యున్నవి మీ మాటలు. మీరు నోరు మెదపక యున్నచో నేను బైటకు వత్తు" ననెను.

## వల్లై ఉన్ కట్టురైకళ్ -

మాట నేర్పు కలవారు తమపై మోపబడిన నేరమును ఇతరులపై త్రోసివైచి తమపై నేరమా లేకుండ తప్పించు కొందురు. లక్ష్మణస్వామి, సీతాన్వేషణలో సుగ్రీవుని ఔదాసీన్యమును సహించలేక శ్రీరాముని పంపున కిష్కింధకు వెళ్లి అందరును త్రుళ్లిపడునట్లు ధనుష్టంకారమును జేయగా సుగ్రీవుడు భయపడి ఆయన సన్నిధికి తారను పంపెను. కోపమును (నిప్పును) ఆర్పునది తారయే (నీటి ధారయే) గదా! ఆమె వెళ్లి కోపముతో మండిపడుచున్న లక్ష్మణస్వామిని జూచి

"కిం కోపమూలం మనుజేన్ద్రపుత్ర! కస్తే న తే తిష్ఠతి వాఙ్నిదేశే"

ఇది యేమి? రాజా? నీకింత కోపమేల? నీ యాజ్ఞను పాలించని వారెవ్వ రున్నారని నీవింత మండిపడుచున్నావు? సుగ్రీవు డసలే కోతి. చాలకాలము సంసారసుఖమును బాసి యున్నాడు. అట్టి వాని కిద్దరము ముద్దు భార్యలము. దానికి తగ్గట్లు వర్తస్తువు. మీరు "ఈ నాలుగు మాసములును యథేష్టముగ రాజ్యభోగముల ననుభవించు"మని సెలవిచ్చి పంపితిరి మీ యాజ్ఞానుసారమే భోగానుభవ నిమగ్నునిపై మీకింత కోపమా?" అని తిరిగి మాట్లాడకుండ కట్టివైచినది.

ఇది నోటిబలమున్నవారి నేర్పు. ఆ నేర్పు నీకు బాగుగా నున్నది. నీవేమీ తారకు తీసి పోవులే. నీవు మమ్ములను "నజ్జైమీర్" అనుట మనకున్న సంబంధమును త్రెంచు పుల్లవిరుపుమాట కాదా? ఈ నేర్పు నీకున్నదని మాకు నేడా తెలిసినది? అబ్బో! యీ మాట మాకేనాడో తెలియును.

పక్షేయున్ వాయజితమ్ -

గుణమని, దోషమని వేరుగా నున్నవా? నీవు చెప్పినది గుణము. మేము చెప్పినది దోషము. ఇదియే గదా నీ నిఘంటువులోని గుణదోషములకు లక్షణము

వల్లిర్కళ్ సెట్టిగళే -

"ఆ మాటనేర్పుకలవారు మీరే!" అని లోనున్న గోపాంగన అనుచున్నది.

ఇట్లు పరస్పరసంభాషణము ముదురుట కారంభించగా లోనున్న గోపాంగన భాగవత వైభవము నెరింగినది కావున నీమెకు చట్టున శ్రీవైష్ణవస్వరూపము గుర్తునకు వచ్చినది. "అయ్యో! మనకు తిరుమంత్రములోని ప్రణవము తనలోని మూడుపదములచేతను భాగవతశేషత్వమును బోధించుచుండ నేనేమి యిట్లు మాట్లాడుచున్నాను?

"కైఙ్కర్యనిత్యనిరతైః భవదేకభోగైః ।
నిత్యై రనుక్షణనవీన రసార్ద్రభావైః ।
నిత్యాభివాఞ్ఛిత పరస్పరనీచభావైః ।
మద్దైవతై రపి జనై స్తవ సఙ్గసీయ ॥"

"స్వామీ! నిత్యమును నీ సేవలనే చేయవలెననెడు ఆసక్తిని కలిగియున్నట్టియు, నీ కన్న యితరములగు నే పదార్థములందును భోగ్యతాబుద్ధిలేనట్టియు, ప్రతిక్షణమునందును నిన్నపూర్వముగా ననుభవించుటచే గలుగు ఆనందముచే కరుగుచున్న హృదయములుకలవారును, తమలో తామొకరి కన్న నొకరు నీచుల మని భావించునట్టి నిత్యసిద్ధులగు నీ భక్తబృందము నాకు పూజ్యులు. నేను వారితో కలసియుందును గాక!" యని దీనినే ఆత్మస్వరూపముగా పెద్దలు సాయించిరి.

మరియు, మన ఆళ్వారులును తిరువాయ్మొళ్ళి 3-7-10 లో ....... ..........ఎన్నై ప్పిరాన్ తనక్కు అడియారడియార్ తమ్ అడియా రడియార్ తమ క్కడియారడియార్, తమ్మడియా రడియోజ్గళే. శ్రీమన్నారాయణునకు దాసులకు దాసులకు దాసులగువారికి దాసులైనవారికి మనము దాసుల మని పాశురము పట్టునంతవరకు దాసవర్గము నుగ్గడించి యిక చోటు చాలక వారికి దాసుల మని ముగించిరి.

కులశేఖరులును "త్వద్భృత్య భృత్య పరిచారక భృత్య భృత్య భృత్యస్య ఇది మాం స్మర లోకనాథ!" అనియు, ఇట్లాత్మస్వరూపమును పెద్దలు సాయించుచుండగా వినియును నేనిట్లు మాట్లాడుట నా స్వరూపవిరుద్ధము. అందువలననే రామాయణమున అయోధ్యాకాండలో భరతుడు

"న మన్థరాయాః న చ మాతు రస్యాః ।
దో షో న రాజ్ఞః న చ రాఘవస్య ।
మత్పాపమేవాత్ర నిమిత్త మాసీత్ ।
వనప్రవేశే రఘునన్దనస్య"

శ్రీసీతారాముల కీ దురవస్థకు అందరి తప్పులను తన తలపై నిడుకొని తానే కారణమని యీ సిద్ధాంతము ననుష్ఠానములో చూపెను గదా యని తెలివిని తెచ్చుకొని తనయందు లేని దోషము లనైనను వైష్ణవులు తనపై నారోపించినచో కాదనక అంగీకరించుటయే శ్రీవైష్ణవ లక్షణమని

నానేతా నాయిడుగ -

అట్టి యపరాధిని నేనే కానిండు. మన్నింపుడు. నేను ఇప్పుడు మీకు చేయవలసిన సేవ నాదేశింపుడనెను. అంత పైవారు

ఒల్లై నీ పోతాయ్ - "నీవు శీఘ్రముగా లేచి రమ్ము" అనిరి.

శ్రీవైష్ణవగోష్ఠిలో చేరుటయే యొక యతిశయమని పెద్దల శ్రీసూక్తి కదా! నీవు బైటకు వచ్చుటలో నొక్క క్షణమాలసించిన మాకది ప్రాణహానియే, నీకది యనర్థమే.

ఉన క్కెన్న వేరుడై మై - నీకి యొంటరితన మేల నమ్మా?

తదీయారాధన సన్నిహితమైయున్నను స్వయంపాకమునకు ప్రాకులాడుదు వేమమ్మా? ఇంతమందిమి మేము. మాతో కలసి భగవదనుభవమును గావించుటలోగల యానందము ప్రత్యేకానుభవములో నుండునా? శ్రీవైష్ణవగోష్ఠి నుపేక్షించి గావించు భగవదనుభమునకున్ను, దేవతాంతర భజనమునకున్ను భేదమేమి?

అనగా లోపలగోపిక "మీరన్న నాకెంతప్రేమయో మీరెరుంగనిదికాదు. అట్టితరి నేను కొన్ని కఠినములగు మాటల నాడితిని. నిజమే. దానికి మీరు "అయ్యో! మనయందు ప్రాణముల నుంచుకొని బ్రతుకుచున్న యీమె యీనాడిట్లనుచున్నదేమి? భగవద్విషయములో నెంత గాఢముగా అవగాహించియున్నదో" యని కొంచెమైనను విచారించక మాట్లాడుచున్నారే యని మనస్తాపముచే నాలసించితి నంతియే. ఇక లేపవలసినవారు లేరని మీరందరను వేంచేసిన తర్వాత లేచి యీ గోష్ఠిని సేవించవలెనని యాశతో పడియున్నాను. సరియే.

ఎల్లారుమ్ పోన్దారో - అందరు వచ్చినారా?

అయ్యో! శ్రీకృష్ణవిరహమును సహించలేక చిన్నపిల్లలవరకు అందరును లేచి నిన్ను సేవిం చవలెనని నీయింటికి వచ్చి నీ వాకిట పడిగాపులు పడియున్నారు.

పోన్దు ఎణ్ణిక్కొళ్ -

"నీవు బైటకి వచ్చి లెక్కించుకొనుము" అని లేపుచున్న గోపిక లనిరి. ఇట్లనుటలో వీరి యుపదేశము —

1. "సకృత్త్వదాకారవిలోకనాశయా । తృణీకృతానుత్తమభుక్తిముక్తిభిః
మహాత్మభిర్మామవలోక్యతాం నయ । క్షణేఽపి తే యద్విరహోఽతి దుస్సహః"

ఆళ్వందార్లు పెరుమాళ్లను "స్వామీ! నిన్నొక్కసారి సేవించవలెననెడి యాశతో సర్వశ్రేష్ఠము లగు భుక్తి ముక్తులను గడ్డిపరకను వలె పరిగణించు మహాత్ములను నీ వొక్క క్షణమైనను ఎడబాయ జాలవు గదా! అట్టి మహాత్ముల కటాక్షమునకు నన్ను పాత్రుని గావింపు" మని ప్రార్థించి నటుల వీరీ గోపాంగన కటాక్షపాతమును ఆశించుచున్నారు.

2. ఒక్కొక్కరే ఆమెను సేవించవచ్చుననియు. 3. తమ నామధేయముల నామెకు విని పించవచ్చుననియు. 4. ఆమె లెక్కపెట్టుటలో నామె కరస్పర్శ లభించి సుఖించవచ్చుననియు. 5. తాము సంఖ్యాతీతలై యుండుటచే ఆమె లెక్కపెట్టుచున్నంత కాలము ఆమెను సేవించుచుండ వచ్చుననియు వీరి యాశ.

లోని గోపాంగన - మనమందరము కలిసి చేయవలసిన పనియేమి?

బైటి గోపికలు - ఆ శ్రీకృష్ణ గుణములను, వీరచరిత్రలను నీవు పాడగా మేము వినవలెనని ఆశపడు చున్నాము. ఆ చరిత్ర లేవి యనగా-

వల్లానై కొన్రానై -

"ఓ రానై క్కాత్తు ఓ రానై క్కొన్రు" అనునటుల ఆయన యొక యేనుగును (గజేంద్రుని) రక్షించి, యొక యేనుగును (కువలయా పీడమును) ద్రుంచెను. ఈ రెండు వీరకృత్యములలో వీరికి రెండవ కృత్యమే ఉపాదేయము. అది యట్లు జరుగనిచో మనకు ప్రభువేడి? అని వీరి యభి ప్రాయము. ఈ వృత్తాంతము శ్రీభూనీళాదేవులకును, మన ఆళ్వార్లందరకును మిక్కిలి ఆదరించ

దగినది. కావున నీమె యా వృత్తాంతమును పాడగా వీరు వినగోరుచున్నారు. మన స్త్రీత్వాభిమానము ఆ కువలయా పీడమున కే మాత్రమును తీసిపోదు. అట్టి అభిమానమును మంటగలిపిన మహనీయుడు గదా! కానిచో, ఆయన నందగృహముననే, మనము మనయింటనే యుండెడివారము కదా!

## మాత్తారై మాత్తళిక్క వల్లానై -

చాణూర ముష్టికులను చంప సమర్థుని గూర్చి.

శ్రీరామచంద్రుడు రెండు పొరపాటు పనులను గావించి యనర్థపడెను. మొదటిది మారీచుని సుబాహునివలె బూడిదగావించక దూరమునకు బాణముతో చిమ్మివేయుట. అంత మాయావి రావణుని పరివారములో మరియెవ్వరును లేరు వాడేగదా సీతాపిరాట్టి వియోగమును కల్పించినవాడు? వానిని చంపియున్న శ్రీరామున కీపాట్లుండకపోవును గదా! రెండవది, లంకలో రామరావణయుద్ధము జరిగినపుడు రావణుడు దీనదశలో నుండగా నొక బాణమును ప్రయోగించి వాని దుంపతెంపక "గచ్ఛానుజానామి" అని విడచిపెట్టుట. మన శ్రీకృష్ణు డట్లు చేయక చాకలిని చరచి బట్టలను తీసికొని ధరించి కుబ్జ ప్రేమతో సమర్పించిన చందనమును తిరుమేనిపై నలదుకొని, మాలాకారుడు భక్తితో సమర్పించిన పుష్పమాలికను కంఠమున ధరించి, కంసుని ప్రాసాదమున కేతెంచి, దారి నరికట్టిన కువలయా పీడ మదగజ చతుర్దంతముల ననాయాసముగ పెరికి, దానిని జంపి, రంగమున కురికి సోదరు లిద్దరును చాణూర ముష్టికులను ఇద్దరు మల్లురను అనాయాసముగ జంపి, ఉన్నతమగు మంచెపై నధిష్ఠించి యున్న కంసునిపై కురికి, సింహ మొక మృగమును వలె వానిని క్రింది కీడ్చి కాలితో త్రొక్కి చంపి, తన కేమి యుపద్రవము వాటిల్లునో యని కడుపులు పినుకు కొనుచున్న నాగరిక మధురానారీమణుల నానందింపజేసెను. ఇన్ని చేసినను శరీరచందనము చెరగనే లేదు. కంఠము నందలి మాలలు నలుగనే లేదు ఆహా! యేమి యాశ్చర్యము! వీనిని నీవు పాడగా మేమానందముతో విన నాశపడుచున్నాము. కువలయాపీడమునకు తీసిపోని మన స్త్రీత్వాభిమానమును పోగొట్టెను. శ్రీకృష్ణునితో కలువనీయ రాదను మన గోపవృద్ధుల సంకల్పమును పోగొట్టెను ఇంత బలాఢ్యుడై యిట్టి వీరకృత్యములను చేసియు మనకు తానోడి విధేయుడై యున్నాడు చూడుము. ఇది యంతయు గొప్ప యాశ్చర్య వ్యాపారమగుటచే "మాయనై" అనుచున్నారు. దీనిని పాడుటయే మన కర్తవ్యము. దాని కొరకే నిన్నింతగా లేపుచున్నది. పెద్దల నిర్బంధముచే మన నాలుకలు శ్రీకృష్ణుని నామానుసంధానము లేక అర్చుకొని పోయినవి. ఇప్పుడవి యూటలూరునటుల పాడుదము. "కృష్ణేత్యక్షర యో రయం మధురిమోద్గారః క్వచి ల్లక్షితః?" మధురాతి మధురములగు పదార్థములను మెక్కినను 'కృష్ణ' అనుటవలన స్రవించు మకరందధార యెక్కడనైనను కలదా? ఆండాళ్ తల్లి అవతారమున్ను, వ్రతానుష్ఠానమున్ను భగవత్కల్యాణగుణములను తాను పాడి, అందరిచే పాడించి పరమ పురుషార్థమును లభింపజేయుటకే.

ఇదియే భగవంతుడు చేయలేని పని. ఆయన పాడుడనునే గాని పాడలేడు. ఈమె పాడనూ గలదు, పాడించనూ గలదు. కనుకనే యీ పాశురములలో "పరమ నడి పాడి" (2 పా)

ఉత్తమన్ పేర్ పాడి (3 పా)

వాయినాల్ పాడి (5 పా) - (ఇవి అవతారక్రమ పాటలు)

కేశవనై ప్పాడి (7 పా)

ముగిల్వణ్ణన్ పేర్ పాడి (11 పా) - (ఇది శరీరసౌందర్యమునకు పరవశయై పాడినపాట)

కీర్తిమై పాడి (13 పా)

పాడి పఱై కొణ్డు (27 పా) - (ఇవి విరోధులను పోగొట్టి శౌర్యమును ప్రశంసించు పాటలు)

ఇటులే అనేక స్థలములలో భగవద్గుణాను సంధానము కనిపించుచున్నది.

## — వేదాంతార్థము —

ఈ పాశురములో నెరుంగవలసిన సంప్రదాయ రహస్యములు.

1. భగవద్విషయమున రుచిగల భాగవతుల శ్రీసూక్తియు వారి వలె యుద్దేశ్యమే.
2. "ఇన్నమురఙ్గుదియో" భాగవతసహవాసము లభించినచో అన్యవిషయాసక్తి దోషమే.
3. "శిల్లెన్నరైయేన్మిన్" రుచికలవారు భాగవతు లెన్ని యన్నను సహించవలెను.
4. "నఙ్గైమీర్ పోదరుగిన్ఱేన్" వారే మన్నను లెక్కచేయక వారిపట్ల గౌరవముట్టిపడునట్లు మాట్లాడవలెను.
5. "వల్లైయున్ కట్టురైగళ్" వీరు ప్రపన్ను లగుటచే నొకరి పుల్లవిరుపు మాటలును ఒకరికి ఉపాదేయములే.
6. "నానేదా నాయిడుగ" పరులదోషములనున్ను తనపై ఆరోపించినచో వాని నంగీకరించుచు, వారితో వాదించక వారిని నొప్పించకుండవలెను.
7. "ఒల్లై నీ పోతాయ్" భాగవతసంశ్లేషము తన సత్తకి నిదానము,

8. "ఉనక్కెన్న పేరుడైమై" శ్రీవైష్ణవుల ఆచారముల ననుసరించి నడచుకొనకుండుట దోషావహము

9. "ఎల్లారుమ్ పోన్దారో" శ్రీవైష్ణవు లందరును మనకు ప్రాప్యభూతులే.

10. "పోన్దెన్నిక్కొళ్" భాగవతులలో నొక్కరు కొరతవడినను అది భగవదనుభవమునకు కొరతయే

11. "వల్లానై కొన్దానై" భాగవతోత్తము లొకచో చేరినచో వారికి ధారకపోషకభోగ్యములు భగవద్విషయానుభవమే. తన ప్రయత్నముచే గాని, ప్రాయశ్చిత్తాదులచేగాని తొలగని పాపములను తొలగించువాడు నారాయణుడే. మిగిలిన కామక్రోధాదులను పోగొట్టువాడును అతడే. ఇట్టి మహోపకారియగు భగవంతుని గుణములను పాడి నాలుకను సార్థకపరచుకొనవలెను. ఇట్టి భాగవత వైభవమును చెప్పుటలో భగవంతు నాశ్రయించినవారిని అతడు రక్షించు విధానమే ముఖ్య తాత్పర్యము.

"సర్వేషా మేవ ధర్మాణాం ఉత్తమో వైష్ణవో విధిః
రక్షతే భగవా న్విష్ణుః । భక్తా నాత్మశరీరవత్ ॥"

భగవంతునకు ప్రియమైన ధర్మములలో వైష్ణవధర్మ ముత్తమమైనది. దానికి కారణము భగవంతుడు భక్తులను తన శరీరమును కాపాడుకొనునట్లు కాపాడుటయే. కంసుడు పంపిన రాక్షసుల నందరను చంపి తన శరీరమున కెట్టి యాపదయు రాకుండ కాపాడుకొన్నటులనే, కాళీయమర్దనము గావించియు, దావాగ్నిని మ్రింగియు, అశ్వాసురుని జంపియు, గోవర్ధనపర్వతము నెత్తి రాళ్లవర్షము నడ్డియు ఇట్లెన్నియో అఘటిత ఘటనలను సల్పి తన భక్తు కాపాడెను.



# ఆళ్వారుల మేలుకొలుపు

ఈ తిరుప్పావై ప్రబంధములోని ఆరవపాశురము మొదలు 15వ పాశురమువరకు గల పది పాశురములోను పదిమంది ఆళ్వార్లను లేపుచున్నట్లు పూర్వాచార్యులు తమ వ్యాఖ్యానగ్రంథములలో సూచించిరి. ఆ విధానము స్వల్పముగా నిచ్చట పొందుబరచబడుచున్నది. పాఠకులు దీనిని గమనింతురు గాక!

## పుళ్లుం శిలమ్బినగాణ్ :-

ఈ పాశురమున "పిళ్ళాయ్" అను సంబోధనము కలదు. ఇది పెరియాళ్వార్లను సూచించు సంబోధన. ఈ పదము అజ్ఞానమును సూచించును. ఆ యజ్ఞానమున్ను పామరుల అజ్ఞానమువంటిది కాదు. అది జ్ఞానవిపాకము వలన పుట్టినది. అది మన కుపాదేయతమము. "జ్ఞానవిపాకకార్యమాన అజ్ఞానత్తాలే వరుమవై యెల్లామ్ అడిక్కళుక్కు పెరుమ్" అని శ్రీవచనభూషణసూక్తి అనగా, జ్ఞానము పరిపక్వము కాగా పుట్టు అజ్ఞానముచే సంభవించునవన్నియు శ్లాఘ్యముగా నాదరించతగినవియే యని. ఈ ఆళ్వార్లు శ్రీవిల్లిబుత్తూరులో నవతరించి, అచ్చట వేంచేసియున్న వటపత్రశాయికి పుష్పకైంకర్యమునకై యొక నందనవనమును నిర్మించి, పోషించుచు భగవంతునకు పుష్పకైంకర్యమును చేయుచుండిరి. ఒకతరి పాండ్యదేశపు రాజగు వల్లభరాయుడు పరతత్త్వనిర్ణయమునకై గొప్ప విద్యాశుల్కము నేర్పరచి, పండితుల నందర నాహ్వానించెను. పెరియాళ్వార్లును భగవంతుని ప్రేరణచే నా సభకు వేంచేసి "గురుముఖ మనధీత్య ప్రాహ వేదా నశేషాన్" అనునటుల భగవంతుడు పలికించగా శ్రుతీతిహాసపురాణాది ప్రమాణముల నన్నిటిని ఉపన్యసించి స్వయముగనే తెగిపాదముల సన్నిధిని పడిన విద్యాశుల్కమును పరిగ్రహించిరి. వల్లభరాయుడు వీరి విజయోత్సవమున వీరిని యేనుగుపై కట్టిన అంబారిలో వేంచేపుచేసి యూరేగించుచున్న సమయమున శ్రీమన్నారాయణుడు శ్రీభూనీళాదేవులతో గరుడవాహనారూఢుడై వేంచేయగా వీరు పల్లాణ్డు ప్రబంధముచే వారికి మంగళాశాసము గావించిరి. ప్రేమదశ తలయెత్తినపుడు జ్ఞానదశ అడుగంటును. ఇది జ్ఞానపరిపాకకార్యమని శ్రీవచనభూషణములో సమర్థించిరి. అట్లు భక్తిపారవశ్యముచే గలిగిన అజ్ఞానదశ వీరికి గలదని యీ సంబోధన తెలుపుచున్నది.

2) వీరు నిర్మించిన నందనవనమున పోషణబలముచే పుష్పములయందు మకరంద మధికముగా నుండుటచే తుమ్మెదలు, చిన్న చిన్న పక్షులు అక్కడి మొక్కలను ఆశ్రయించి ధ్వని చేయుచుండెడివి ఈ విషయము "పుళ్ళుం శిలమ్బినకాణ్" అను పదముచే సూచింపబడినది.

3) వీరు తమ పల్లాణ్డు ప్రబంధమున ఐశ్వర్యార్థులను, కైవల్యార్థులను, మోక్షార్థులను పిలచి తమతో చేర్చుకొని కైంకర్యము గావింప సంకల్పించుకొనిరి. ఈ విషయ మీ పాశురమున "వెళ్లై విళిశఙ్గిన్ పేరరవమ్" అను పదమున సూచింపబడినది.

) పెరియాళ్వార్లు పాయించిన తిరుమొழி ప్రబంధములో "పేయ్చ్చిములై యుణ్డై తన్నిట్టు (1-2-5) అను పాశురములో పూతనా సంహారమును, అచ్చటనే 11వ పాశురమున "తాళై నిమిర్త్తు శకటత్తై చ్చాదిప్పోయ్" పాదముల నెత్తి అసురావేశము కల శకటాసురుని పడగొట్టిన" అనియును పూతనా, శకటాసుర సంహారముల ననుసంధించునటుల యీ పాశురమున "పేయ్ములై నఞ్జుణ్డు, కళ్లచ్చగటం కలక్క ழிయ కాల్ోచ్చి" అని పెరుయాళ్వార్లతో సామ్యము ఈ పాశురమున సూచింపబడినది.

వేదము నుచ్చరించుటకు ముందును, అధ్యయనమును ముగించిన పిమ్మటను ప్రణవము నుచ్చరించవలెనని విధి యున్నట్లే వీరి పల్లాణ్డు ప్రబంధమును ద్రావిడ వేదాధ్యయనమునకు మున్ముందుగా అనుసంధించవలెనను నియమమున్నది. ప్రణవ మెట్లు చేతనుడు సర్వేశ్వరునకు సర్వ దేశ, సర్వకాల, సర్వావస్థల యందును, సర్వవిధ కైంకర్యములను చేయవలెనని యాదేశించు చున్నదో యట్లే పెరియాళ్వార్లును, ఐశ్వర్యార్థులను, కైవల్యార్థులను, మోక్షార్థులను పిలచి తమతో చేర్చుకొని కైంకర్యముచేయ నిశ్చయించు కొనిరి.

పెరియాళ్వార్లు శెన్ని యోఙ్గు అను తాము పాయించిన ప్రబంధములో

"పని క్కడలి ల్పళ్ళికోళై పழకవిట్టు, ఓడివన్దు ఎన్

మన క్కడలిల్ వాழவల్ల మాయమణాళ నమ్బి!"

చల్లనైన పాలసముద్రపు పడకను విడిచి పరుగిడి వచ్చి నా మనస్సను సముద్రమున నిత్య వాసము చేయుచున్న ఆశ్చర్య చేష్టితములు గల "ఓ శ్రియఃపతీ" అని పాయించినటుల ఈ పాశురము "వెళ్ళత్తరవిల్ .......... మునివరుమ్, యోగిగళుమ్" అని పాయించిరి వీరు విష్ణుచిత్తులు గదా! అట్టి క్షీరాబ్ధినాథుని మనమున నిదుకొనిన మననశీలురును, ఉపాయజ్ఞులును మన పెరియాళ్వార్లే కదా !

## 7. కీశుకీశెన్ఱెఙ్గుం -

ఈ పాసురమున శ్రీ కులశేఖరాళ్వారులను లేపుచున్నారు.

కేరళ దేశములో కోళియను పట్టణము గలదు. దానిని దృఢవ్రతుడను రాజు పాలించు చుండెను. అతనిది చేరకులము. అయనకు పరాభవ సంవత్సర కుంభ (మాఘ) మాస శుక్లపక్ష దశమీ పునర్వసు నక్షత్రయుక్త గురువారమున కౌస్తుభాంశమున కులశేఖరు లను కుమారులవతరించిరి.

ఇందు "పేయ్ పెణ్ణే" "నాయకప్పెణ్పిళ్ళాయ్" "తేశముడైయాయ్" అను మూడు విశేషణములు కలవు. అవి వీరిని జ్ఞాపకము చేయుచున్నవి.

1. పేయ్‌ప్పెరుమ్! — ఎవరికి దేనియందు ఎక్కువ ప్రావణ్యముండునో దాని యందవడి వారికి పిచ్చిగా వ్యవహరింపబడును. వీరికి శ్రీవైష్ణవుల యందు ప్రావణ్యము మెండు. అందుచే వీరికి శ్రీవైష్ణవుల పిచ్చి యని చెప్పుదురు. వీరు తమ గ్రంథమున తమను "పెరియ పేయర్" పెద్ద పిచ్చి వాడని సాయించిరి.

2. నాయక ప్పెణ్ పిళ్ళాయ్ — వీరు ఆళ్వారుల రత్నమాలలో మధ్య నాయకమణిగా వేంచేసి యుండుటచే వీరిని 'నాయకప్పెణ్ పిళ్ళాయ్' అనుట యుక్తమే ."స ఏవ వాసుదేవోஉసౌ సాక్షాత్పురుష ఉచ్యతే స్త్రీప్రాయ మితరత్సర్వం ........." అను దానిని బట్టి వీరిని "పెణ్పిళ్ళాయ్" అనుట యుక్తమే.

3. తేశముడై యాయ్ — భగవద్గీత 18వ అధ్యాయములో "శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం" అను శ్లోకమున తేజస్సు క్షత్రియ ధర్మమని భగవాను డానతిచ్చెను. వీరు క్షత్రియులే కదా! ఆచార్య హృదయమున భగవచ్ఛేషత్వమున కనుకూలమైన జన్మమే తేజస్సని సాయించిరి. వీరట్టివారు.

4) ఈ పాశురములో "ఆనైచ్చాత్తం కలన్దు" అనుచోట "ఆనైచ్చాత్తు" అను పదము వాడబడినది. ఇది ఆ దేశమున నవతరించిన కులశేఖరాళ్వారులను సూచించుచున్నది.

5) "వాశనరుం కుళ్ళలాయ్‌చ్చియర్ మత్తినాల్ ఓశైప్పడుత్త" అను విషయమును వీరు ఆనతిచ్చిన పెరుమాళ్ తిరుమొళ్ళిలో ఆరవ తిరుమొళ్ళిలో "కెణ్డై యొణ్‌కణ్ మడనా ళొరుత్తి కీళ్ళై యగత్తు తయిర్ కడైయ కణ్డు" "పొరుగింటిలో నొక స్త్రీ పెరుగు తరచుటను చూచి శ్రీకృష్ణుడు ఆ పెరుగును నేను చిలికెదనని లోన ప్రవేశించి" అని సాయించిరి.

6) నారాయణన్ మూర్తి కేశవనై ప్పాడవుమ్ — శ్రీకృష్ణావతారమున అశ్వాసురుని జంపిన వృత్తాంతమును శ్రీకులశేఖరులు తమ ప్రబంధములో "మావినై వాయ్ పిలన్దు గన్దమాలై" అని అశ్వాసురుని నోరు చీల్చిన స్వామి యని సాయించిరి.

7) కేట్టై కిడత్తియో — శ్రీకులశేఖరులు పండితులు శ్రీరామాయణము చదువుచుండగా విని యొక్కొక్క ఘట్టము అప్పుడు జరుగుచున్నట్లు భావించి ఉన్నచోట నుండజాలక శ్రీరామచంద్రునకు సహాయము చేతునని సేనలతో పయనమగుచుండిరి. ఆ చరిత్ర యీ వాక్యముచే సూచింపబడుచున్నది.

8. కీళ్వానమ్ -

ఈ పాశురమున నమ్మాళ్వార్లను లేపుచున్నారు.

1) ఇందు "కోతుకులముడైయ" అను పదమున 'కోతుకుల' మనగా ఆశ. దీనికి గోపికలకు కృష్ణుని యందును, కృష్ణునకు గోపికలయందు నని రెండువిధములుగా చెప్పవచ్చును. శ్రీభట్టరువారు నమ్మాళ్వార్లవిషయమై సాయించిన 'పరాంకుశాష్టకము'లో

"ఋషిం జుషామహే కృష్ణ తృష్ణాతత్త్వమివోదితమ్"

కృష్ణునియందు గల కుతూహలమే నమ్మాళ్వార్లుగా రూపొందినదని సాయించిరి. ఇచ్చట 'కృష్ణ తృష్ణ' అను దానికి ఆళ్వారులకు కృష్ణునియందుగల ఆశయనియు, కృష్ణునకు ఆళ్వారుల యందుగల యాశ యనియు రెండు విధములుగాను చెప్పవచ్చును.

2) ఈ పాశురమునందలి "పావాయ్" అను సంబోధనము నమ్మాళ్వారులకు చేరవచ్చును. "శూళ్ వినై మాట్టియేన్ పావైయే" స్వామీ! ఆవరించుకొనియున్న పాపముగల నాకుమాత్రె యీమె" యనియు, "ఎన్పావై పోయ్ తన్ పళ్ళన తిరుక్కోళూర్కే" "నా బిడ్డ చల్లని నీటితో గల చెరువులుగల తిరుక్కోళూరుకే పోయినది" అని యిట్లనేక స్థలములలో ఆళ్వార్లు తమను "పావై"గా చెప్పుకొని యున్నారు.

3) ఎళున్దిరాయ్ — (లెమ్ము) కూర్చొనియున్నవారిని గదా లెమ్ము అనునది. మిగిలిన ఆళ్వారులందరును కైంకర్యనిమగ్నులై నిలచియే వేంచేసియున్నారు. ఆళ్వారు లొక్కరుమాత్రమే "పద్మాసనో పవిష్టం పరపదయుగళే నివిష్ట చైతన్యం" అన్నట్లు పరమాత్మయొక్క పాదారవిందముల ధ్యానించుచు పద్మాసనముగా కూర్చొని వేంచేసియున్నారు. అందువలనే 'ఎళున్దిరాయ్' లెండని ప్రార్థించి లేపవలసి వచ్చినది.

4) కీళ్వానమ్ వెళ్ళెన్రు — సూర్యోదయ కాలమునకు ముందు తూర్పు దిక్కు తెల్లబడును. ఇచ్చటను కలియుగమున వకుళభూషణ భాస్కరుల యొక్క ఉదయమగుటచే అజ్ఞానాంధకారము పోయి లోకమునకు జ్ఞానోదయమైనది. "ఉళైక్కవల్లారున్ వైకున్ద మాగుం తమ్మూరెల్లామ్" తిరువాయ్ మొళి అవతరించుటచే లీలావిభూతి కంతకును ప్రకాశము కలిగి పరమపదమైనదని యర్థము.

5) ఎఱుమై శిఱువీడు పెఱువాన్ — ఇచ్చట వీడు అనగా మోక్షము. శిఱువీడు అనగా కైవల్యము- అని నమ్మాళ్వారు 4-1-10 పాశురమున సాయించిరి. 'ఎఱుమై' యనగా తామస ప్రకృతి గల పురుషులు, దీనిచే ఆళ్వారు లవతరించుటకు పూర్వము తామస ప్రకృతి గల చేతనులు కైవల్యార్థులై పరమాత్మ నాశించక యీ యాత్మానుభవ రూపమగు కైవల్యమునే ఆశించుచుండిరి. నమ్మాళ్వార్లవతరించి దానిని విడచి భగవత్కాములై మోక్షమును బడయుడని సాయించిరి.

6) ఉన్నై క్కూవువాన్ వన్దు నిన్ఱోమ్ — ఆళ్వార్లు "కూవి క్కొళ్ళుం కాల మిన్నుం కుఱుకాదో" "కూవిక్కొళ్ళాయ్ వన్దన్దే" అని పరమాత్మను ప్రార్థించగా భగవత్ప్రేరణచే భాగవతోత్తములు పెంచేసి "ఉన్నై క్కూవువాన్ వన్దు నిన్ఱోమ్" అనుచున్నారు.

7) దేవాది దేవనై శెన్ఱు నామ్ శేవిత్తాల్ — ఆళ్వార్లు తమ ప్రథమ ప్రబంధమగు తిరువాశిరియము నందు మొదట భగవంతుని "దేవాదిదేవ" అనియు, చివరి ప్రబంధమగు తిరువాయ్మొళికి మొదటిలో "అయర్వఱు మమరర్గళదిపతి" యనియు దేవాధిదేవునే ముందుగా సేవించిరి. నేనట్లు సేవించి నా అభీష్టమును బడసితిని. మీరును అట్లే బడయుడు.

ఇట్లీ పాశురము నందలి వాక్యము లన్నియు నమ్మాళ్వార్ల విషయమై సాక్షాత్తుగా సమన్వయించుటచే నీ పాశురమున గోపికలు నమ్మాళ్వార్లను లేపినట్లుగ సంగ్రహింపబడినది.

## 9. తూమణి మాడత్తు -

దక్షిణ భారతమునందు సార్థకనామముగల మహీసారక్షేత్ర మొకటి యుండెను. దానికి ద్రావిడమున తిరుమొళిశై యని పేరు. అచ్చట నొక వనమున భార్గవముని తపస్సు చేయుచుండగా కనకాంగి యను నొక అప్సరస అయనను వశపరచుకొని యాయన మూలముగా విభవ సంవత్సర పుష్య బహుళ దశమీ గురువారమున మఖానక్షత్రయుక్తమగు తులాలగ్నమున చక్రాంశసంభూతులగు భక్తిసారులను ఒక మాంసపిండాకారముగ ప్రసవించి స్వర్గమునకు వెడలిపోయెను. భార్గవమహర్షియు మరియొక వనమున కేగి తపస్సు కొనసాగించుకొనెను. ఖర్గుడను పేరుగల యొక మేదరి మనుష్యాకారముతో ప్రకాశించుచున్న ఆ బాలుని తీసికొనిపోయి పంకజవల్లి యను తన భార్య కొప్పగించెను. ఈ బాలుడే భక్తిసారులు. వీరు బ్రహ్మానుభవానందముచే తృప్తిజెంది పాలుత్రాగకయే తృప్తిజెంది పరమాత్మానుగ్రహమున పెరుగుచుండిరి. ఆ గ్రామమునందున్న ప్రాజ్ఞుడను పేరుగల యొక శూద్ర వృద్ధుడు తన భార్యతో కూడ కాచిన పాలను గొనితెచ్చి ఆ బాలుని ముందుంచి త్రాగుమని మిక్కిలి ప్రార్థించగా ఆ పాలను మాత్రము త్రాగుచుండెను. అయన త్రాగగా మిగిలిన పాలను త్రాగుటచే ఆ

దంపతులకు యవ్వనముదయించి ఆ భక్తిసారులకు శిష్యులుగా మెలగుచుండిరి. క్రమముగా వారు ఆ మేదరి కుటీరమును విడచి ఆధ్యాత్మికచింతాపరాయణులై బౌద్ధజైనాది మతములు మొదలుకొని యన్నిమతములందును ప్రవేశించి వెయి సంవత్సరములు గడపి యవి నిస్సారములని గ్రహించి శైవమతమున ప్రవేశించిరి అప్పటినుండి వారికి 'శివవాక్యు'లను పేరు ప్రసిద్ధి జెందెను. వారికి మహదాహ్వయులను పేయాళ్వారులతో వాదము జరిగి చివరకు వారు వైష్ణవ మతావలంబకులైరి. వీరు అష్టాంగయోగనిష్ణాతులు.వీరు వాదములో రుద్రునిగూడ యోడించిరి వీరు రెండువేల సంవత్సరములు జీవించిరి వీరు 96 పాశురములుగల "నాన్ముగన్ తిరువన్దాది" అనియు 128 పాశురములుగల "తిరుచ్చన్ద విరుత్తం" అనియు రెండు గ్రంథములను ద్రావిడభాషలో రచించిరి. ఇవి నాలాయిరాంతర్గతములు. వీరు తమ గ్రంథములలో శ్రీరంగాది 11 క్షేత్రములను పాడిరి. అట్టి మహానుభావులీ పాశురమున లేపబడుచున్నారు.

1) ఈ పాశురమున 'మామాన్ మగళే' యని వీరిని సంబోధించిరి. అందుచే ఆండాళ్‌తల్లికి వీరితో నేదో యొక సంబంధమున్నదని తెలియుచున్నది. శ్రీవేదాంత దేశికులు గోదాస్తుతియందు "సన్తః పయోధిదుహితుః సహజాంవిదుస్త్వామ్" అని సాయించిరి. దీనిని బట్టి యామె లక్ష్మీదేవి సహోదరి యని తెలియుచున్నది. లక్ష్మీదేవి అమరకోశమున "భార్గవీ లోకజననీ" అని భృగువు కుమార్తెగా చెప్పబడినది. ఇతిహాస పురాణాది ప్రమాణములను బట్టి లక్ష్మీదేవియు, గోదాదేవియు భృగుకులమున జన్మించిరని తెలియుచున్నది. తిరుమళిశై యాళ్వారును భృగుకులమునందే యవతరించిరి. ఇట్లు వీరును భృగుపుత్రులే యగుటచే ఆండాళ్‌తల్లికి వీరితో సంబంధము కలదు. అందుచే 'మామాన్ మగళే' అనుచున్నారు.

2) ఈ ఆళ్వారులు ఋషికులమున జన్మించి మేదరికులమున పెరిగినటులనే మన ఆండాళ్ తల్లియు బ్రాహ్మణకులమున పెరియాళ్వార్లకు పుత్రికగా జన్మించి భావనాప్రకర్షచే గోపవనితగా నైరి. వీరిరువురకును నిదియొక పోలిక. (మామాన్ అయిన మగళె, జగత్తంతయు స్త్రీప్రాయమే గదా)

3) తూమణిమాడత్తు - శ్రేష్ఠమగు మాణిక్యపు కుప్పెలో నున్న దీపము బైటకు తన కాంతిని వెదజల్లును. ఈ ఆళ్వారుల దివ్యమంగళవిగ్రహమున్ను తూమణిమాడము వంటిదే, పెరుంగుళి యూరను నొక గ్రామమున కొందరు బ్రాహ్మణులు వీరి పాండిత్యముచే మహాత్ములని గుర్తించి అచ్చట జరుగుచున్న యొక యజ్ఞశాలకు వీరిని వేంచేపుచేసికొని వెళ్లి వీరి కచ్చట పూజలను గావింపగా కొందరు గర్వించి అశ్లీలముగా మాట్లాడిరి. అపుడీ యాళ్వారులు తమ తమ అనుయాయుల అనురోధముచే తమ హృదయమందు వేంచేసియున్న పెరుమాళ్లను

"పైనాగ్ కిడన్దు వణ్ణాయ్ పై పెరుమ్ప్లస కాట్టినై" అనగా ఓస్వామీ! నీవు నా హృదయమున నే లీలగా వేంచేసియున్నావో యా రీతిగా బైట అందరకును పశ్యన మొసంగుమని ప్రార్థించగా నాస్వామి యట్లే గాన్పించెను. అంత నా నిందించినవారందరును వారికి పాదదాసులైరి.

4) శుత్తుమ్ విళక్కెరియ - ఇచ్చట విళక్కనగా జ్ఞానదీపము. ఈ ఆళ్వార్లు సకలమతముల యందును ప్రవేశించి సర్వతోముఖముగా జ్ఞానము నార్జించిరి, ఇవియే చుట్టును ప్రకాశించు దీపములు.

5) తూపం కమ్మ — కేవలము జ్ఞానమున్నంత మాత్రమున చాలదు. అది పరిమళించవలెను. ఇచ్చట పరిమళ మనగా వేరొక దైవమును సేవించకుండుటయే. ఆ విషయమునే వీరు "మఱ స్డం పుఱమ్ తొళా మాన్దర్" అని పాయించిరి. అనగా, "ఒక స్త్రీ తనభర్తను ప్రేమించక సేవలు చేయక యున్నను అంత దోషము లేదు కాని పరపురుషుని ప్రేమించి యాతనికి సేవలు చేయుట దోషమగునట్లు భగవంతుని సేవించకున్నను, మరచియైనను దేవతాంతరములను సేవించని మానవులే విశుద్ధులగు శ్రీవైష్ణవు" లని పాయించిరి.

6) తుయిలమై మేల్ కణ్వాళరుమ్ — వీరు తమ ప్రబంధములలో అనేక స్థలములను పాడిన డియు అట్లు పవళించి యున్న పెరుమాళ్లను గూర్చియే.

"నాగత్తణై కుడన్దై" "నాగత్తణై అరజగన్" "పేరమ్బిల్ నాగత్తణై" అని యిట్లు పాయించిరి.

7) తుయిలమైమేల్ ……… మగళే — 'మగళ్' అను పదము పుత్రుని విధేయత్వమును చెప్పుచున్నది. బిడ్డ ప్రార్థించినట్లు తండ్రియు, తండ్రి చెప్పినట్లు బిడ్డయు విని వర్తించుట సదాచారము, ఇచ్చట 'మామాన్' అనగా మహామహులని యర్థము. అట్టి వారు శ్రీకాంచీ పుర మున వేంచేసియున్న యథోక్తకారులు, ఒకనాడు ఆ దేశము నేలుచున్న రాజు ఈ ఆళ్వార్ల ప్రియ శిష్యుడగు 'కనికణ్ణన్' అని వానిపై కోపముతో నాతనిని తన రాజ్యము నుండి పొమ్మ"ని యాదేశించెను. ఆ మాటను ఆ కనికణ్ణన్ తన ఆచార్యులగు తిరుమళిశై యాళ్వార్లకు విని పించెను. అంత నా యాళ్వార్లు పెరుమాళ్లతో "స్వామీ! కనికణ్ణన్ మనను విడిచిపోవుచున్నాడు. నేనును ఆతని వెంట పోవుదును. మీరును నావెంట రావలసియుండును. కావున మీరు వెంటనే మీ శేషతల్పమును చుట్టి చంకనిడుకొని బయల్వెడలుడు" అని ప్రార్థించగా పెరుమాళ్లు నట్లే చేసిరి. తిరిగి రాజు ప్రార్థనచే ఆళ్వార్లు యథాస్థానమునకు చేరి "నేను మీ కోవెలను విడచి వెళ్ళుట లేదు. కావున మీరు మీ ప్రక్కవిప్పి పరుండు" డనగా పెరుమాళ్లట్లే చేసిరి.

కుంభకోణమున వేంచేసియున్న శార్ఙ్గపాణి పెరుమాళ్లను ఆ యాళ్వార్లు "ఎళ్న్దిరున్దు పేశు వాళ్ కేశనే" "స్వామీ! పడకనుండి లేచి నాతో మాట్లాడు"డని ప్రార్థించగా ఆ పెరుమాళ్లట్లే గావించి రని ప్రసిద్ధము. ఈ సంబోధనచే నీ ఘట్టములు సూచింపబడుచున్నవి.

8) ఉన్ మగళ్ లూన్ ఊమైయో — నోరు తెరవకయే సంజ్ఞలతో పనిచేయుట మూగివారి పని. ఆటులనే యీ యాళ్వార్లు పెరుంబులి యూర్ గ్రామములో నుండి వేంచేయుచుండగా "పద్యు హ వా ఏతత్ శ్మశానం, తస్మా చ్ఛూద్ర సమీపే నాధ్యేతవ్యమ్" అను శ్రుతి ననుసరించి యచ్చట వేదములు చదువుచున్న విప్రులు వీరు వినకూడదని వేదములు చదువుట మానిరి. ఈ యాళ్వార్లు దాటి వెళ్లిన పిమ్మట వారికి నిలిపిన వేదభాగము జ్ఞాపకము రాక తటపటాయించుచుండిరి. అంతట నీ యాళ్వార్లు ఆ నిలిపిన వేద భాగమును నోటితో జ్ఞాపకము చేయక అచ్చట పడియున్న యొక నల్లని ధాన్యపుగింజను తీసి కొని గోటితో గిల్లిపారవైచిరి. అంతట వారికి "కృష్ణానాం వ్రీహీనాం నఖనిర్భిన్నం" అను మంత్రము జ్ఞాపకము రాగా యీ యాళ్వారుల వేద, తదర్థపరిజ్ఞాన, వినయ సంపదల కాశ్చర్య పడిరి. ఇదియే వీరి మూగతనము.

9) అన్ఱి చ్చెవిడో — చెప్పిన మాటలు చెవికెక్కకున్నచో చెవుడందురు. అట్టి చెవుడు వీరికిని కలదని వీరి చరిత్ర తెలుపుచున్నది. పైన చెప్పిన విధముగా యాగశాలలో వీరికి అగ్రపూజను గావించగా అచ్చటనున్న కొందరు రాభాస పండితు లెన్నియో దుర్భాషలాడిరి ఆ మాటలను వీరు వినిపించుకొనలేదు. ఇదియే వీరి చెవుడు.

10) అనన్దలో — అనగా దుఃఖము (బద్ధకము) వీరికిని ఆ దుఃఖము కలదు. బాహ్యవిషయము లపై మనస్సు ఏ మాత్రము ప్రవర్తించినను అది వీరికి దుఃఖము. వీరీ గ్రంథమును దీవిధ మగు దుఃఖమును చూపించిరి.

11) ఏమప్పెరున్దుయిల్ మన్దిర ప్పట్టాళో — ఇతరాళ్వారుల కంటె వీరు విలక్షణమగు పరమై కాంతులు. అదియే యిచ్చట గుర్తించదగినది.

ఏమప్పట్టాళో — అనగా, కావలి పెట్టబడినదా?

పెరున్దుయిల్ మన్దిర ప్పట్టాళో — అనగా, గాఢ నిద్ర పట్టున ట్లెవ్వారి చేతనైనను మంత్రించ బడినదా? దేవతాంతరములను, సాధనాంతరములను, ఫలాంతరములను చేపట్ట కుండునట్లు శ్రీవైష్ణవులను కాపాడునది అష్టాక్షరీ మంత్రములోని "నమః" పదము. గాఢ నిద్రయనగా, ఏ

విషయమగు ప్రవృత్తియు లేకుండుట. ఇది ప్రపన్నుని లక్షణము. దీనిని తెలుపునది మంత్ర త్రయము. దానిని వీరి కుపదేశించిన వారు పేయాళ్వారులు.

12) మాతవన్ — మాతవన్ అనగా శ్రియఃపతి. ఈ ఆళ్వారులు "మాతవనై ఏత్తాదార్ ఈనవరే" శ్రియఃపతిని స్తుతించనివారు హీనులే యనియు, "తిరువిల్లా తేవరై తేఱేన్మిన్ తేవు" లక్ష్మి సంబంధము లేని దేవతలను దేవులనుగా భావించకుడు అని సాయించిరి.

ఈ కారణములను బట్టి యీ పాశురమున తిరుమழிశైయాళ్వార్ల సంబంధ మధికముగా కనబడుటచే దీనిలో వీరిని లేపుచున్నట్లు పూర్వాచార్యులు సమన్వయ పరచిరి.

## 10. నోత్తుచ్చువర్కమ్ -

భూతయోగి, సరోయోగి, మహాయోగి యను ముగ్గురిని ముతలాళ్వార్లు, అనగా, ఆళ్వార్లకు మొదటివారని యాదరించుచున్నారు. బంగారు పద్మములతో గూడిన సరస్సున బంగారు పద్మములో నుండి యుదయించి శ్రీమన్నారాయణుని మంగళాశాసనమునకై సూర్యుని హారతిగా జేబట్టినవారు కాసారయోగి పుంగవులు. వీరు ఆశ్వయుజ మాసమున శ్రవణ నక్షత్రమునందు శంఖాంశ నవతరించిన వారు వీరినే కాసారయోగులందురు.

వీరవతరించిన మరుచటి దినమునందే ఆశ్వయుజ మాసమున శ్రవణ నక్షత్రమునందు సముద్ర తీరమున నున్న శ్రీమల్ల పురమునందు ఒక పొదరింటి నుండి భగవంతుని గదాంశమున భూతమునీంద్రు లవతరించిరి.

అనంతరము ఆ మరుచటి దినమున ఆ మల్లపురమున కుత్తరమున మైలాపురమున వేంచేసిన శ్రీ కేశవ పెరుమాళ్ళ కెదురుగా "లతిక" యను పేరుగల నూతియందు ఎర్రకలువలో నందక మనెడు ఖడ్గాంశమున మహదాహ్వయు లవతరించిరి.

ఈ పాశురములో వీరి ముగ్గురిలో నొకరగు పేయాళ్వార్ల (మహాయోగి) ను లేపుచున్నారు. ఈ ముగ్గురును ఒకరితో నొకరికి సంబంధము లేకయే యెవరికి వారు తిరుగుచుండిరి. వీరు మహాజ్ఞాన, భక్తి, వైరాగ్యాది గుణసంపన్నులగుటచే వీరి చేర్తిని అనుభవించవలెనని పెరుమాళ్లకు సంకల్పము కలిగెను. ఒకనాటి రాత్రి ఆయన సంకల్పముచే పెద్ద వర్షము కురిసెను. ఆ సమయము నకు భగవత్సంకల్పముచే నీ ముగ్గురున్ను "తిరుక్కోవల్" అను గ్రామమునకు ఎవరికి వారే చేరుకొనిరి. అందు మొదట పొయ్గై యాళ్వార్లు ఒక గృహస్థుని అనుమతిని బడసి వీధి గదిలోనికి చేరి పరుండిరి పిమ్మట పూదత్తాళ్వార్లు అచ్చటికి వేంచేయగా వీరు వారిని లోపలికి ప్రవేశపెట్టి ఇరువుర

కును పరుండుటకు చోటు చాలకపోవుటచే కూర్చొనియుండిరి. ఇంతలో పేయాళ్వార్లు అచ్చటికి వేంచేయగా ముగ్గురకును కూర్చుండుటకు చోటు చాలకపోవుటచే ముగ్గురును నిలచియేయుండిరి. ఆ గోష్ఠిని సేవించుటకై పెరుమాళ్లు గరుడవాహనారూఢులై పిరాట్టిమారులతో వచ్చి యా గోష్ఠిలో చేరి యిరికిరి. అటులనే శ్రీకృష్ణుడు కూడ గోపబాలికల నందరిని వర్షము కురియుటకై నోమువ్యాజమున నొక్కచో జేర్చి వారిగోష్ఠిలో చేరి వారి ననుభవించెను. పొయగై, పూదత్తాళ్వారు లిద్దరును జ్ఞాన దీప మును వెలిగించి చీకటిని పోగొట్టగా పేయాళ్వార్లు పెరుమాళ్లను పిరాట్టులతో సేవించిరి. ఈ విషయ మును వీరు "తిరుక్కణ్డేన్" అను పాశురములో సాయించిరి. అటులనే యిచ్చట గోపాంగన లంద రును వచ్చి యీ గోపికను లేపగా నీమె వారితో కలిసి శ్రీకృష్ణుని నప్పిన్న పిరాట్టితో సేవించెను.

నోత్తుచ్చువర్క్కం పుగుగిన్ఱ వమ్మనాయ్ —

ఈ గోపిక తన సుకృతవిశేషముచే స్వర్గసుఖము ననుభవించునటుల ఈ ఆళ్వార్లును నిరతిశ యానంద స్వరూపుడగు శ్రియఃపతి ననుభవించిరి.

వాశల్ తిఱవాదార్ —

పొయ్గై యాళ్వార్లు పూదత్తాళ్వార్లకు తలుపు తెరచిరి. పూదత్తాళ్వార్లు పేయాళ్వార్లకు తలుపు తెరచిరి. ఈ పేయాళ్వార్లకు ఇంకెవరికిని తలుపు తెరువవలసిన అవసరము రాలేదు. అందుచే మొదటి వారిద్దరును "తిరన్దార్" ఈ పేయాళ్వార్లు "తిరవాదార్".

ఈ పాశురమధ్యములో ఆండాళ్ తల్లి శ్రీరాముడు గావించిన కుంభకర్ణవధ వృత్తాంతమును సాయించినట్లే యీ పేయాళ్వార్లును తమ "మూన్ఱామ్ తిరువన్దాది"కి మధ్యలో "ఇలఙ్గాపురమెరిత్తా నెయ్దు", అనియు, "ఎయ్దరువుమ్ తెన్నిలఙ్గైక్కోన్ వీழ" అనియు లంకాపుర దహనమును, రావణవధను సాయించుటచే ఉభయులకును పోలిక కనిపించుచున్నది.

ఆత్తవనన్దలుడైయాయ్ — మితిమీరిన నిద్రగలదానా! అని దీని కర్థము. ఇది భగవచ్ఛాస్త్ర ములో కొనియాడబడు పరమైకాన్తికత్వమునకు చివరి హద్దును తెలుపును. ఎట్లనగా,

"ఉరో విన్యస్త హస్తా స్తే నిద్రాయన్తే సునిర్భరాః"

అనగా, తమ రక్షణభారమును భగవంతునియందుంచిన పరమైకాంతులు. గాన ఆ భారము తమకు లేకపోవుటచే గుండెలపై చేతులుంచుకొని సుఖముగా నిద్రింతురు. ఇట్టివా రీ యాళ్వారులు.

అపజ్జలమే — మాకు కిరోషణమైనదానా! యని దీని కర్థము అనగా, పరమాత్మ యొక్క కృపకు అపూర్వమైన సత్పాత్రమని భావము.

ఈ పెయాళ్వారులును తాము సాయించిన 3వ తిరువన్దాది మొదటి పాశురములో "తిరు క్కణ్డేన్ పొన్మేని కణ్డేన్' అనగా లక్ష్మీదేవిని సేవించితిని. ఆకర్షకమగు దివ్యమంగళవిగ్రహమును సేవించితిని బ్రహ్మానందముతో ప్రారంభించిరి. ఇందులకు కారణము వీరు భగవంతుని పరమకృపకు పాత్రులగుటయే ఇట్టివారు మరియొక ఆళ్వారు లేరని చెప్పవచ్చును.

తేత్తమాయ్ వన్దు తిఱ — స్వామీ! మీపేరే పేయాళ్వార్లు. కాబట్టి ఆ పిచ్చితనమునకు తగి నట్లుగా రాక తెలివితో వచ్చి మా అజ్ఞానమును తొలగించి మాకు భగవద్దర్శనమును ప్రసాదించుమని ప్రార్థించిరి

కత్తుక్కఱవై -

ఈ పాశురమున పూదత్తాళ్వారులను లేపుచున్నారు. "కుత్త మొన్నిల్లాత కోవలర్ తమ్ పొఱ్కొడియే" యను సంబోధనము వీరికి తగియుండును. "కోవలర్" 'కో' అనగా 'గో' అన్నట్లు, 'గో' శబ్దమునకు "స్వర్గేషు పశువాగ్వజ్ర" అను కోశానుసారముగా ఇచ్చట 'వాక్' అను అర్థమును తీసికొన వలెను. 'గోవలర్' అనగా మంగళాశాసనాత్మకములగు శ్రీసూక్తులను ప్రసాదించు ఆళ్వారులే. ఇందు లకే శ్రీవిష్ణుచిత్తులకు పెరియాళ్వారులను పేరు సార్థకమైనది. "పొఙ్గుం పరివాలే విల్లిబుత్తూర్ పట్టర్ పిరాన్ పెత్తాన్ పెరియాళ్వారెన్నుం పెయర్" (ఉపదేశరత్నమాల)

కుత్తమొన్నిల్లాత — దోషమొక్కటియును లేని.

ఈ విశేషణము ముతలాళ్వార్లు ముగ్గురకే చెల్లును. వీరు అయోనిజులు. ఇతరాళ్వార్లు అంద రును యోనిజులు.

పొఱ్కొడియే — స్పృహణీయమైన తీగఅయినదానా !

వీరు సాయించిన ఇరణ్డాన్దిరువన్దాదిలోని 27వ దగు 'పడియమ్మైన్దునాడి' అను పాశురములోని "గతిమిగుత్తుఅఙ్గోల్ తేడి యోడుమ్ కొళున్దదే, పోన్దదే మాల్‌తేడి యోడుమ్మనమ్" అను పాశురములో "భగవంతుని వెతుకుకొనుచు వేగముగా పరిగిడు నా మనస్సు, అందమగు ప్రాకుకొయ్యను (పందిల కెక్కించు కొయ్యను) వెతుకుకొనుచు పోవుచున్న తీగవలె నున్నది" అని తమను తీగగా పోల్చుకొనిరి.

ఇచ్చట ప్రాకు కొయ్యు భగవంతుడే. ఆతనిని తీగవలె వెతకుకొనుచు పోవువారు తమరే అ యర్థ మీ సంబోధనచే సూచింపబడుచున్నది.

శెత్తా తిఱలళ్గియ శెన్ఱు శెరుచ్చెయ్యుమ్ —

ఈ లేపబడు గోపికవంశీయులు శత్రువులున్న చోటికి వెళ్లి వారితో వాగ్యుద్ధమును జేసి వారి వాదబలమును నశింపజేయు వీరులని ఆండాళ్ తల్లి వర్ణించిరి. ఈ ఆళ్వారులును తమ ఇరణ్డాన్దిరు వన్దాదిలోని 14వ దగు "పణ్డి ప్పెరుమ్బదియై" అను పాశురములో "ఎణ్డిశైయుమ్ పేర్ త్త కరనాన్గు డైయాన్ పోరోది ప్పెదైకాళ్, తీర్ త్తకరర్ ఆమిన్ తిరిన్దు" ఓ భాగవతులారా! ఎనిమిది దిక్కులను త్రోసిపుచ్చునట్లుగా (త్రివిక్రమావ తారమున) పెరిగిన చతుర్భుజములు గల శ్రియఃపతి యొక్క తిరు నామము ననుసంధించుచు శ్రీవైష్ణవ సిద్ధాంతమునకు విరుద్ధముగ వాదించువారిని జయించి ఆ దేశమునంతను పవిత్రముగా జేయుడు. అని కలదు.

పుత్తర వల్ కుల్ —

ఈ పదము నడుముయొక్క సౌందర్యమును వర్ణించును. వేదాంతములో నడుమనగా "భక్త్యతిశయము". జ్ఞాన భక్తి విరక్తులలో భక్తి మధ్యదిగదా! తమిళ భాషలో 'ఇడై' అను పదమునకు మధ్య ప్రదేశమనియు, నడుమనియు అర్థములు కలవు. వీరు తమ గ్రంథావసానమున "ఎన్దన్ యాళ వన్దాల్ యానుడైయ వన్బు" "ఓ శ్రియఃపతీ! నాకు నీయందు గలిగిన భక్తి ఉప్పొంగుచు నాలో నిముడకున్నది. దానిని నా యదుపులో నుంచితివేని అదియే నాకు పరమోపకారము" అని తమ భక్తిని గురించి ప్రసంగించుటచే ఈ విశేషణము దానికి తగియున్నది. వీరీ గ్రంథమున "అన్బే తగ ళియా" అని ప్రారంభించి "యానుడైయ వన్బు" అని ముగించిరి.

పున మయిలే —

అడవిలో స్వేచ్ఛగా సంచరించు నెమలివంటిదానా! ఈ సంబోధనయును వీరికి తగియున్నది. వీరు అవతరించినది "తిరుక్కడల్ మల్లై" లో, అది మేఘములు నీరు త్రాగుటకు వచ్చు స్థలము సముద్రతీరమే. నెమళ్లకు మేఘముల జూచిన కుతూహలము మెండు. కావున వీరి యవతార స్థల మందు నెమళ్లు స్వేచ్ఛగా ఆనందించును.

శుత్తత్తుత్తోళిమార్ —

పొయ్ గై యాళ్వారులును, పేయాళ్వార్లును వీరితో కలిసి మెలిసి యుండు సఖులారా. ఈ విశేషణము ఈ విషయమును తెలుపుచున్నది.

తనై త్తు -

ఈ పాశురములో పొయ్‌గై యాళ్వార్లను లేపుచున్నారు. ఈ పదుండియున్న గోపాంగనను "తన్నాయ్" యని సంబోధించుచున్నారు. "తన్నై" యని మహాలక్ష్మికి పేరు. ఈమె తామర పువ్వు నందు అవతరించినదని ప్రతీతి కలదు. అటులనే యీ యాళ్వారులును తామరపువ్వు నుండియే అవతరించిరి. ఈ పోలికను బట్టి "తన్నాయ్" అని శ్రీ పొయ్‌గై యాళ్వారులను పిలచుట తగియే యున్నది.

ననైత్తిల్లమ్ శేఱాక్కుమ్ —

శ్రీరామచంద్రుడు రావణుని సంహరించి లంకనుండి అయోధ్యకు వేంచేయుచు మధ్యే మార్గమున భరద్వాజా శ్రమమున విడిసెను. శ్రీరామచంద్రుడు భరద్వాజుని అయోధ్యావృత్తాంతమును గూర్చి ప్రశ్నించెను. ఆయన

"పఙ్కదిగ్ధస్తు జటిలో భరతస్త్వాం ప్రతీక్షతే"

"శ్రీరామా! తన మూలముగా నీకును, నీ దేశప్రజలకును గొప్ప దుఃఖము దాపురించినదని భరతుడు ఏడ్చియేడ్చి తానున్న స్థలమునంతను తన కన్నీళ్లతో బురదను గావించి ఆ బురదలోనే పొరలుచు నీ కొరకై యెదురుచూచుచున్నా"డని చెప్పిరి. ఆటులనే పొయ్‌గైయాళ్వారులును తమ ముతల్ తిరువన్దాది యందు 16వ పాశురమున "పళుదే పలపకలు పోయిన" అని తమ జీవితమున అధికభాగము వ్యర్థముగా పోయినదని యేడ్చియేడ్చి తమ కన్నీటితో తమరు వేంచేసియున్న స్థానము నంతను బురదగావించిరి. మరియు వీరవతరించినది పుష్కరిణియందే. అది బురదగనే యుండును గదా! కావున వీరికీ విశేషణము తగియే యున్నది.

ఇళఙ్గత్తెరుమై — లేత దూడలుగల బర్రెలని యర్థము.

ఇచ్చట 'ఎరుమై' యను శబ్దమునకు లక్షితలక్షణచే 'లక్ష్మి' యని యర్థమును చెప్పవచ్చు నందురు. అనగా 'ఎరుమై' అనగా మహిషి. మహిషి యనగా "దేవదేవదివ్యమహిషీం" అనుటచే లక్ష్మి యని కొంచెము క్లేశముతో అర్థమును చెప్పవచ్చును. దీనిని బట్టి యీ ఆళ్వారులు పిరాట్టితో సమానులని సూచింపబడుచున్నది.

ఇళమ్ కన్దు — లేత దూడపలుకలది.

లక్ష్మీదేవి లోకమాతగదా! భూలోకమందున్న మానవులందరును ఆమెకు బిడ్డలే, అటులనే యీ యాళ్వార్లు మొదటివారగుటచే వీరిని తల్లిగను, ఇతరాళ్వార్లను వీరికి వత్సలుగను చెప్పవచ్చును. లక్షిత లక్షణమనగా, 'ద్విరేఫము' అను నొక పదము కలదు, దాని యర్థము రెండు రేఫలుగల భ్రమరము. అది తుమ్మెద. కావున ద్విరేఫ శబ్దమునకు తుమ్మెదయని యర్థమును చెప్పవచ్చును ఇట్లే 'ఎరుమై' శబ్దమునకు "దేవదేవ దివ్యమహిషీం" అని అర్థమును జెప్పుట లక్షితలక్షణ వలననే.

కన్టుకిన్ఱజ్జి —

ఈ ఆళ్వార్లు ముతల్ తిరువన్దాది ప్రబంధమును పాయించిరి. మొదలియాణాన్ వీరి విషయములో సాయించిన తనియలో "వైయత్తడియవర్కళ్ వాழ" అనగా, భూమియందున్న భాగవతులందరు సుఖించునట్లుగా అని సూచింపబడినది.

నినైత్తు ముల్లైవ్వాయోనిన్దు పాల్ శోర —

వీరు భగవత్కల్యాణగుణములను మనస్సులో తలంచినతోడనే అదే యూటగా పాలవంటి మధురమైన శ్రీసూక్తులు స్రవించుట కారంభించును.

పనిత్తలై వీழనిన్‌వాశల్ కడై పత్తి —

ఈ ఆళ్వారులు పుష్కరిణిలోని పద్మమున నావిర్భవించిరి గాన వీరి గృహద్వారము నాశ్రయించినవారికి నీటిమంచుపడుట సహజమే గదా! ముదలాళ్వారులు ముగ్గురును వర్షోదకము తలపై పడగా తిరుక్కోవలూరులో గదిగుమ్మపుద్వారమును బట్టి నిలచుట సూచింపబడుచున్నది.

శినత్తినాల్ తెన్నిలఙ్గై ఇత్యాది —

ఇది శ్రీరామయణ ప్రసంగము. మహర్షులకును జ్ఞానచక్షుష్షునకును గోచరించని యొక రామ చరిత్ర. అది యీ యాళ్వారులయొక్క మనోనయనమునకు విషయమైనట్లు వీరు సాయించిరి.

................................ పూమేయ
మాదవత్తోన్ తాళ్ పణిన్దవాళరక్కన్ నీళ్ ముడియై
పాదమత్తా వెణ్ణినాన్ పణ్బు. (1. తిరువన్దాది. 45)

పూర్వము కృతయుగమైన రావణుడు పద్మాసనుడును, మహాతపస్వియునునగు చతుర్ముఖ బ్రహ్మ యొక్కపూజకు తన తలలను మరుగుపరచి వరములను బడయుటకై వచ్చి సేవించెనట. ఆ సమయమున నారాయణుడు చిన్న పిల్లవాడై బ్రహ్మచేతిలో నుండి తన పాదముతో వాని తలలను లెక్కించి బ్రహ్మకు "పదు పదిమనుజుడు" అని తెలిపెనట.

ఇనిత్తా నెళున్దిరాయ్ —

"పళుదే పలపగలుమ్" (అనేకదినములు వ్యర్థముగా గడచిపోయినవి) అను పాశురమును సాయించిన ఏమ్మాటి కూడ నిద్రించుట తగునా?

ముముక్షుప్పడి వ్యాఖ్యానములో "పళుతే పలపకలుమ్ పోయిన వెన్ఱు ఇనైన్దనాళైక్కు కూప్పి డుగిఱవనుక్కు ఉఱక్కమ్ విరకిల్లై" (భగవదనుభవము లేకయే వ్యర్థముగా గడచిపోయిన దినములకు దుఃఖించువారలకు నిద్రించుట కవకాశముండునా?) అని చెప్పబడిన శ్రీసూక్తి యిచ్చట అనుసంధించ దగినది.

అనైత్తిల్లత్తారు మఱిన్దు —

ఈ ఆళ్వార్లు "అఱియు మలగెల్లామ్ యానేయు మల్లేన్, (1 తిరువన్దాది 22 పా) నేనే కాదు ప్రపంచ మంతయు నీ విషయము నెరుంగును" అని సాయించిన పాశురము నిచ్చట అనుసంధించవలెను.

## పు ళ్ళి న్ వా య్ -

ఈ పాశురమున **తొండరడిప్పొడియాళ్వార్లను** లేపుచున్నారు. చోళదేశమున మణ్ణంగుడి యను పేరుగల నొక బ్రాహ్మణాగ్రహారము కలదు. అచ్చట పురశ్చూడులైన ఒక బ్రాహ్మణోత్తముడు భార్యతో నివసించుచుండెను. శ్రీమన్నారాయణుని యనుగ్రహమున నా దంపతులకు కలియుగమున 180 సంవత్సరములు గడువగా ప్రభవనామ సంవత్సరమందు ధనుర్మాసమున జ్యేష్ఠా నక్షత్రమున భగవంతుని వనమాలాంశతో తొండరడిప్పొడియాళ్వారు జన్మించిరి. వీరికి తండ్రిగారు విప్రనారాయణులనియు, భక్తాంఘ్రిరేణులనియు తిరునామముల నుంచిరి. వీరు యుక్తవయస్సున సదాచార్యులవలన సాంగోపాంగముగ వేదములను, శాస్త్రములను అభ్యసించిరి. వీరికి సాక్షాత్తుగ విష్వక్సేనులు పంచసంస్కారముల గావించి మంత్ర, మంత్రార్థముల నుపదేశించిరి. వీరు సర్వ శాస్త్ర పారంగతులై, వైరాగ్య భూషితులై శ్రీరంగనాథునకు పుష్పకైంకర్యము చేయు సంకల్పముతో పుష్పతులసీ

వనము నేర్పరచుకొని సర్వకాల, సర్వావస్థలయందును పెరుమాళ్లకు పుష్పమాలల సమర్పించుచు భిక్షాటనముతో జీవితమును గడుపుచు నా యారామముననే నివసించుచుండిరి ఆ గ్రామమున లోకైక సుందరియగు నొక వేశ్యాయువతి నివసించుచుండెను. ఒకానొక సమయమున నా దేవదేవి తన సోదరియగు నలివేణితో ఆ మహాత్ముని సేవించి, యాతనిని తనకు స్వాధీనపరచుకొందునని ప్రతిజ్ఞచేసి వైరాగ్య భూషణవలె వేషమును మార్చుకొని యాయనకు ఉద్యానవన కైంకర్యమునందు సహకరించుచుండెను. ఆయన విషయము దేవదేవి ప్రయత్నములన్నియు వ్యర్థమయ్యెను. ఆమె తన ప్రతిజ్ఞను సఫలపరచుమని శ్రీరంగనాథుని ప్రార్థించెను. భగవంతుడు దేవదేవి ప్రార్థనను ఆదరించి లక్ష్మీదేవితో "నీకొక విలక్షణమైన సంఘటనము చూపింతు"నని యాశపెట్టి క్రమముగా విప్రనారాయణుని దేవదేవికి అధీనము గావించెను. ఇతరాళ్వార్లందరును శంఖ గదా శార్ఙ్గాద్యంశ సంభూతులగుటచే వారిని లీలగా నుపయోగించుటకు తగదని యుపేక్షించి యీ యాళ్వార్లు వనమాలాంశ సంభూతులగుటచే వీరిని తన విలాసకు పాత్రులను గావించుకొనెను.

పోదరికణ్ణినాయ్ —

పోదు = పుష్పములను, అరి = గ్రహించుటలో, కణ్ణినాయ్ = ప్రసరించునట్టి దృష్టికల దానా!" యని దాని కర్థము. ఈ ఆళ్వార్లు పుష్ప కైంకర్యపరులు. "తొళ్తై తుళవముమ్, గూడైయుం పొలిన్దు, తోన్నియ తోళ్ తొణ్డరడిప్పొడి". "అందముగా కట్టబడిన దివ్యమైన తులసీమాలలతో నిండిన భుజమున ధరించి సదాసేవ సాయించుచుండు తొండరడిప్పొడి అను దాసుని" అని సాయించుటచే వీరి కెప్పుడును తాము పెంచిన చెట్లకు పూసిన పువ్వులను కోయుటయందే దృష్టి పడుచుండును. ఆ పూలను కోసి మాలలను కట్టి గూడ బుట్టలో నుంచుకొని దానిని భుజమున తగిలించుకొని శ్రీరంగ నాథుని సన్నిధికి వేంచేసి వానిని సమర్పించు ఆచారము కలదు.

పావాయ్ —

అనగా పతివ్రతాశిరోమణి యని యర్థము. పతివ్రత అనగా శాస్త్రీయముగా వివాహము చేసి కొనిన భర్తకు మాత్రమే వశమై యుండు స్త్రీ, అటులనే యీ యాళ్వార్లు రంగనాథుని మాత్రమే యాదరించి, యితర దివ్యదేశములందలి పెరుమాళ్లను మనస్సునందైనను దీక్షితులు. కావున నీ విశేషణము వీరికి సరసముగా సమన్వితమగుచున్నది.

నన్నాళాల్ —

ఆండాళ్‌తల్లి "మార్గళి త్తిజ్గళ్ మతినిఱైన్ద నన్నాళాల్" అని భగవంతుని సేవించవలెనను బుద్ధి పుట్టిన దినమే మంచి దినమని మార్గశిర మాసమును కొనియాడిరి. అట్లే యిచ్చటను తొండరడి ప్పొడి యాళ్వార్లు అవతరించినది మార్గశిరమాసమే యగుటచే దీనిని కూడ 'నన్నాళాల్' అని ప్రశం సించుట యుక్తమే.

కళ్వం తవిర్న్దు —

ఈ యాళ్వార్లు పాయించిన తిరుమాలై ప్రబంధమున 16వ

శూదనాయ్ క్కళ్వనాగి ........ పట్టళున్దు వేనై, ప్పోదరే యెన్ఱు శొల్లి "అను పాశురమున-" జూదము నం దాసక్తుడనై, దొంగతనమున దిగినవాడనై, ధూర్తులతో కలసియున్న కాలమున స్త్రీల (దేవదేవి) నేత్రములనెడి వలలో చిక్కుకొని అణగి పడియున్న నన్ను శ్రీరంగనాథుడు తన యొద్దకు పిలచి నా హృదయమున ప్రవేశించి తనయందు ప్రేమను పెంచెను" అని పాయించిరి.

ఇటులనే అనేకమారులు తమ దోషములను తమ ప్రబంధమున తెలిపియుండిరి. వీరి చరిత్రలో శ్రీరంగనాథుని స్వర్ణపాత్రను దొంగిలించిన నేరారోపణమున్ను, దానికై వీరనుభవించిన క్లేశ మున్ను తెలుపబడుచున్నవి. వీరు శ్రీరంగనాయకి పురుషకారముచే పోగొట్టబడిన పాపము కలవారై "అళియ నెన్నరుళి ఉన్నడియా ర్క్కాళ్ పడుత్తాయ్" "అనాథుడనని దయచేసి నీ దాసులకు దాసునిగా చేసితి" వని వారే పాయించిరి.

కుళ్ళ కుక్కరి కుడైన్దు నీరాడాతే పళ్ళికక్కిడత్తియో —

అనినట్లు ఈ ఆళ్వారులును దేవదేవితో సంపర్కము ముదిరిన పిమ్మట స్నానాది నిత్య కర్మాను ష్ఠానమును మాని ఆ వేశ్యయొక్క పాన్పుపై పరుండుట మొదలగు కృత్యముల గావించిరని తెలుపబడుచున్నవి.

"పుళ్ళనోవాయ్ కీణ్డానై" అని కృష్ణుని యొక్కయు, "పొల్లా వరక్కనై క్కిళ్ళి క్కళైన్దానై" అని శ్రీరాముని యొక్కయు కీర్తిని పాడినట్లుగనే యీ యాళ్వారులును తాము పాయించిన తిరు మాలై ప్రబంధము యొక్క చివరలో కువలయాపీడమును చంపిన కృష్ణుని చరిత్రను, "మాముని వేళ్వియు కాత్తు" ఇత్యాదిగా తిరుప్పళ్ళి యెళుచ్చి గ్రంథములో శ్రీరామ వృత్తాంతమును పాడియుం డుటచే ఈ పాశురము వీరికి సరసముగా సమన్విత మగుచున్నది.

పుళ్ళుం శిలమ్బిన కాణ్ —

అను ఆరవ పాశురములో చెప్పబడిన పెరియాళ్వారు వలె వీరును పుష్పోద్యాన వాసము కలవారగుటచే దానిని సూచించుచు ఈ పాశురములో "పుళ్ళుమ్ శిలమ్బిన కాణ్" అనుచున్నారు. పక్షులధికముగా తిరుగునది పూల తోటలోనే కదా!

## ఉజ్గళ్ పుళైక్కడై -

ఈ పాశురమున తిరుప్పాణియాళ్వార్లను మేల్కొలుపుచున్నారు. వీరు కలియుగమున 162 సంవత్సరము పిమ్మట దుర్మతినామ సంవత్సర కార్తీక శుద్ధ పూర్ణిమా తిథియుక్త రోహిణీ నక్షత్ర యుత బుధవారమున నిచుళాపురమున నొక బ్రాహ్మణుని పొలములో భగవదాజ్ఞచే వరివెన్నునుండి శ్రీవత్సాంశమున నవతరించిరి. వీరికి 'సాణు' లనియు, "మునివాహను"లనియు పేరులు కలవు. వీరెచ్చట పుట్టినను, ఎచ్చట పెరిగినను జ్ఞానవైరాగ్యసంపన్నులగుటచే జన్మసిద్ధ వైష్ణవులై విష్వక్సేనుల కృపావశమున పంచసంస్కారసంపన్నులై ఉపదేశనిరపేక్షముగనే శాస్త్రముల నన్నిటి నెరింగి విరాగులై, మహానుభావులై యుండిరి. వీరు కావేరికి ఆవలియొడ్డుననున్న నిచుళానగరమున నివసించుచు తిరువాయ్ తుళై యందు వీణను చేబూని నిశ్చల మనస్కులై భగవద్గుణములను గానము చేయుచుండిరి. వీరు గొప్ప సంగీతవిద్వాంసులు. వీరు ప్రతిదినము కావేరి యావలి యొడ్డున నుండి సప్త ప్రాకారములతోగూడిన శ్రీరంగము నంతను జ్ఞానదృష్టితో దర్శించి యినుకతిన్నెలయందు దానినంతను చిత్రించి ఆ విధముగా శ్రీరంగనాథు ననుభవించి వానియందే లగ్నమనస్కులై యుండిరి. ఒకనాడు శ్రీరంగనాథార్చకులగు లోకసారంగులనువారు శ్రీరంగనాథుని కైంకర్యమునకై కావేరీ తీర్థమును తీసికొని వెళ్ళుటకై వేంచేయగా నచ్చట వీరు శ్రీరంగనాథుని ధ్యానించుచు తన్మయులై యుండుటచే నా యర్చకు లెంత గద్దించినను వినకయుండిరి. ఆ యర్చకులు వారిని రాళ్లతో గొట్టినను దుఃఖము గాని కోపము గాని లేనివారై ముఖమునుండి స్రవించురక్తముతో మెలకువ తెచ్చుకొని "మహాపచారమును గావించితి" నని యచ్చటినుండి తొలగిపోయిరి. శ్రీరంగనాథుడా యర్చకునకు స్వప్నములో సాక్షాత్కరించి, శ్రీపాణుల వైభవము నెరింగించి "వారిని భుజములపై వేంచేపుచేసికొని రమ్మని" యాదేశించగా వారట్లుచేసిరి.

ఈ పాశురమున "నఙ్గాయ్" "నాణాదాయ్" "నావుడైయాయ్" అని యీ గోపాంగనకు మూడు విశేషణములు కలవు. అవి యీ యాళ్వార్లకు చక్కగా తగియున్నవి.

నజ్ఞాయ్ — గుణపూర్ణుడా యని యర్థము. లోకసారంగులను అర్చకులు శ్రీరంగనాథుని ముఖతః శ్రీపాణుని వైభవము నెరింగి భగవంతుని యాజ్ఞానుసారముగా శ్రీపాణులను తన భుజము లపై వేంచేయుడని ప్రార్థించిరి. శ్రీపాణులది తప్పని తలంచక భాగవతపారతంత్ర్య స్వరూపమునకు తగినదని, భగవద్భాగవతాజ్ఞా కైంకర్యమను దృష్టితో వేంచేసిరి. ఇది వీరి పూర్ణతకు నిదర్శనము.

నాణాదాయ్ — నాణ్ అనగా సిగ్గు అనియు, అహంకారమనియు అర్థము. దీనిచే అహం కారము లేనివారని యర్థము. వీరు శ్రీరంగనాథుని ప్రధానార్చకులకు లోకసారంగ మహామునుల భుజ ములపై కూర్చొని ఆ వార్యపురుషుల తిరుమాళికల ముందునుండి వేంచేయుచున్నను చేతులు జోడిం చుకొని అహంకారములేక శ్రీరంగనాథుని మనమున ధ్యానించుచు "అడియార్కెన్నై యాళ్ పడుత్త విమలన్" నీ దాసులకు నన్ను దాసునిగాజేసిన నిర్మలుడా! యని సాయించుటచే నాణాదార్ - అహం కారము లేనివారని తెలియుచున్నది. నావృడైయాయ్ - వీరు సాయించిన పదిపాశురములుగల "అమల నాదపిరాన్" ప్రబంధమును గూర్చి శ్రీ వేదాంతదేశికులవారు "తిరుప్పాణీయాళ్వారు పాడిన పదిపాశురములను అనాది సిద్ధమగు వేదములయొక్క గంభీరార్థములను ప్రతిపాదించునవని అనుసం ధింపుడు" అని యాదేశించిరి. ఇట్లు పది పాటలలో వేదాంతార్థముల నన్నిటిని సమగ్రముగా సాయిం చిన వారగుటచే "నావృడైయార్" అను సార్థకమైన, సమర్థమైన నాలుకగలవారని సూచింపబడు చున్నది.

శఙ్గొడు శక్కరమేన్దుం తడక్కైయన్ పఙ్కయక్కణ్ణానై పాడ —

అని ఆండాళ్ తల్లి సాయించినట్లుగా వీరును తమ ప్రబంధమందలి యేడవ పాశురమున "కైయినార్ శురిశఙ్గు నలాదియన్" శ్రీహస్తములయందు సౌందర్యముతో పూర్ణమైన దక్షిణావర్తమగు పాంచజన్యమును. శత్రువులపై అగ్నిజ్వాలల కక్కునట్టి సుదర్శనమును" అని శంఖచక్రములను ధరించిన అనుభవము తెలుపబడుచున్నది. మఱియొక పాశురమున "నల్లని, విశాలమై చరించుచున్న వాత్సల్యముచే నెరబారిన విశాలమైన ఆ నేత్రములు పాషాణహృయుడనగు నన్ను కూడ ప్రేమచే తడిసిన మనస్సుకలవానినిగా జేసినవి. ఎంత యాశ్చర్యము!" అని భగవంతుని భగవంతుని నేత్రసౌం దర్యమును గూడ అనుభవించుచు పరవశులై రి.

"ఎజ్ఞక్కై మున్నం ఎళుప్పవాన్ వాయ్ పేశుమ్ నఙ్గాయ్" —

ఈ వాక్యమున నొక విలక్షణమగు నర్థము ధ్వనించుచున్నది, 'ఎజ్ఞళై' అనగా భాగవతులను. 'ఎళుప్పవాన్' అనగా 'మోసికొనిపోవుట' ఈ యర్థమునుబట్టి చూడగా తిరుప్పాణీయాళ్వారే 'మున్నం' మొదటి పాశురములో "అడియార్కెన్నై యాట్పడుత్త విమలన్" అని సాయించిరి గదా! దానిని బట్టి

మీరు మమ్ములను మీ భుజములపై నెక్కించుకొని పెరుమాళ్ సన్నిధికి గొనిపోవుదురనుకొంటిమి. మీ కథ యట్లు లేదే? మహాభాగవతశిఖామణియగు లోకసారంగమహామునుల భుజములపై మీరే వేంచేసి పెరుమాళ్లసన్నిధికి వేంచేసినారే! దీనిని బట్టి చూడగా మొట్టమొదట మీరు సాయించిన భాగవతశేషత్వము "వాయ్‌పేశుం" మాటపలుకుట మాత్రమే యని తోచుచున్నది - అని యొక వినోద మగు అర్థము తోచుచున్నది.

## ఎల్లే యిళఙ్గిళియే -

ఈ పాశురమున తిరుమంగై యాళ్వారులను లేపుచున్నారు. కావేరీ నది యొడ్డున చోళదేశములో 'పరిరంభ' పట్టణ మొకటి కలదు. దానికిని కమలానగరము (తిరువరైయూర్) నకును మధ్య అన్యూనపట్టణ మొకటి కలదు, దానిని శివభక్తిపరుడును, శిక్షావక్షుడును నగు ఆవినాడుఢైయార్ అను నొక శూద్రరాజు పాలించుచుండెను. అతనికి కలియుగమున 217 సంవత్సరములు గడువగా నళ నామసంవత్సర కార్తీక శుద్ధ పూర్ణిమ కృత్తికా నక్షత్రయుక్త గురువారమున నీ పరకాలుడు భగవంతుని ధనురంశతో అవతరించెను. ఈతని తండ్రి యాతనికి నీలుడను పేరుంచెను. క్రమముగా నీతడు యౌవనవయస్కుడై, సర్వశాస్త్రవిచక్షణుడై ఆ దేశపు ప్రభువగు చోళరాజునకు మిక్కిలి యిష్టుడై దేశాధిపత్యమును బడసెను. వీరు చిన్నతనమున సాంసారికభోగనిరతులై సంగీతసాహిత్య నృత్య గీతాదులతో కాలమును గడపుచు ఆత్మజ్ఞానహీనులై యుండిరి. కొంతకాలమునకు నాగపుర సమీపమున నొక శ్వేతహ్రదతీరమున నొక దేవతాబాలిక మనుష్యశరీరధారిణియై యొంటరిగా సంచరించుచుండగా నాగపట్టణవాసియును, వైద్యపుంగవుడునునగు నొక వైష్ణవుడు ఆ బాలిక యొక్క వృత్తాంతము నంతను నెరింగి తన యింటికి తీసికొని వచ్చి పుత్రికవలె పెంచుచుండెను. ఆ వైద్యుడు ఆమెకు కుముదవల్లి యని పేరుంచెను. నీలుడను నీ యుద్యోగి యుక్తవయస్సు వచ్చిన ఆ బాలిక యొక్క అందచందములగూర్చి విని యామెను పెండ్లాడగోరెను. తల్లిదండ్రులు కుముదవల్లి నడుగగా "నేను పంచసంస్కార సంపన్నుడగు "శ్రీవైష్ణవం వినా నాన్యం తం వృణేఽహం కదాచన" అని చెప్పి పైచెను. అంత నీలుడు వెంటనే అచ్చటినుండి శ్రీనివాసస్థలమున కేగి పూర్ణులను నొక వైష్ణవస్వామి సన్నిధిలో పంచసంస్కారముల బడసి వచ్చి యామెను పెండ్లాడగోరెను. అంత కుముదవల్లి "మీరు ప్రతిదినము 1008 మంది శ్రీవైష్ణవులకు షడ్రసోపేతముగ సదక్షిణ తాంబూలములతో భోజనము నొసంగి వారి శ్రీపాదతీర్థమును, తళియప్రసాదమును ఆదరముతో స్వీకరించుచు అవిచ్ఛిన్నముగా నొక సంవత్సరము గడపినచో మీకు భార్యనై యుపకరింతు" నని చెప్పగా నీలుడు దాని కంగీకరించి యట్లే సల్పి యామెను పరిణయమాడెను.

ఈ పాశురమున చెప్పబడు గోపికకు వారి పోలిక లనేకములు గలవు. వీరు తమ ప్రబంధమున "మాన మరుగి మెన్నోక్కి" అను పాశురమును నిద్దరు గోపికలకు సంవాదరూపముగా పాడించిరి. ఈ పాశురముగూడ నట్టిదే గాన నీ యోజనము తగియున్నది.

వీరు పాడించిన దివ్యప్రబంధములలో నాయికావస్థలో తల్లిమాటగా "కిళిపోల్ మిడత్తి నడన్దు" "మెన్ కిళిపోల్ మిగమిళత్తు మెన్ పేదైయే" అని యిట్లు పలు పాశురములలో తమను కిళిగా నిరూపించుకొనిరి. అందుచే ఈ గోపికను 'కిళి' యని చెప్పుట సమంజసమే.

పలికినదానినే పలుకుట చిలుకస్వభావము, అటులనే వీరు మాఱన్ పణిత్త తమిళ్ మఱైక్కు మంగైయర్ కోన్ ఆఱఙ్గ మ్కూఱ" అని ఉపదేశరత్నమాలలో పాడించినట్లు నమ్మాళ్వారు పాడించిన నాలుగు వేదముల సారమును నాలుగు ప్రబంధములకును అరంగములనునట్లుగా ఆరు ప్రబంధములను వారి శ్రీసూక్తుల ననుసరించి పాడించిరి. దీనిని బట్టియు వీరిని చిలుకతో పోల్చిరి.

"ఉన్నైక్కన్న వేఱుడైయై" — వేఱుడైయై యనగా, వైలక్షణ్యము. ఆ వైలక్షణ్య మేమనగా వీరు పాడించిన శిఱియ తిరుమడల్, పెరియతిరుమడల్ అను ప్రబంధములు నాలాయిరములో విలక్షణములైనవి. ఆ వైలక్షణ్యమే వీరి వైలక్షణ్యము.

ఈ గోపిక యొక్కరును మిగులకుండ అందరు గోపికలను సేవించవలెననెడు ఆశతో "ఎల్లారుం పోన్దారో" అని బైట గోపికలను ప్రశ్నించెను. అటులనే వీరును ఇతరాళ్వారు లందరును అవతరించిన పిమ్మటనే చివర కవతరించిరి.

వల్లానై కొన్ఱానై మాయనై ప్పాడ —

వీరు కువలయాపీడ వృత్తాంతమును వీరి తిరుమొழிలో అధికముగా పాడించిరి. అది యొక గొప్ప సాహస కృత్యమని వీరి కాదరము. "కువళైయానై కొమ్బొశిత్త కణ్ణన్" ఇట్లనేక పాశురము లీ ప్రబంధములో కలవు.

మాత్తారై మాత్తళిక్క వల్లానై మాయనై ప్పాడ —

పెరుమాళ్ల విషయమై విరోధించువారి యొక్క గర్వమును ఆశ్చర్యముగా అణచివేసినట్టి చరిత్రలలో గోవర్ధనోద్ధరణ ఘట్టము మిక్కిలి శ్రేష్ఠమైనది. ఈ ఘట్టములో ఇంద్రుని కేమాత్రమును అనర్థము లేకుండగనే ఆతని దుష్ప్రయత్నము ననాయాసముగా నణచివైచెను. ఈ కథయందు వీరి

కాదరము మెండు. కావుననే పెరియ తిరుమొழி ప్రబంధమును ముగించుచు "కున్ఱ మెడుత్తు ఆనిరై కాత్తవన్ఱన్నై" "పర్వతము నెత్తి గోవులను రక్షించిన వానిని గూర్చి" అని సాయించి ముగించిరి. వీరి చివరి ప్రబంధమగు తిరునెడున్దాణ్డకమును ముగించునపుడును "కున్ఱ మెడుత్త తోళినానై" "గోవర్ధన పర్వతము నెత్తిన భుజబలముగలవాని" నని సాయించి ముగించిరి.

వీరి చరిత్రలో ప్రతికూలుర నెందరినో రూపుమాపిన ఘట్టములను వీరి గ్రంథములలో జూడ వచ్చును.

ఇట్లు తిరుప్పావులోని ఆరవ పాశురము మొదలు పదునైదవ పాశురము వరకు ఆళ్వార్లను లేపు సమన్వయము సంగ్రహముగా తెలుపబడినది,

ఇక పైన ఈ పది పాశురములకు ఆచార్యుల మేల్కొలుపు పరముగ గురుపరం పరా ప్రబోధ పర యోజన-చూపబడుచున్నది.

ఈ ప్రబంధము మొదటి పాశురము మొదలు అయిదు పాశురముల వరకు ప్రపన్నుని నిష్ఠాక్రమమున్ను, ప్రపత్త్యుడగు శ్రియఃపతి అత్యంత సులభుడగుటకు మూలమైన అవతార క్రమమును, తెలుపబడినవి. ఆ పైన ఆరవ పాశురము మొదలు పదునైదవ పాశురము వరకును ప్రపత్తికి ముందుగా నుండవలసిన వాక్య గురుపరం పరాప్రభావము తెలుపబడినది. భగవత్ప్రాప్తికై ప్రయత్నించువారు గాని, అధికముగా భవగద్విషయమున అవగాహించువారు గాని మనకు సమముగా ఉద్దేశ్యులే అని చెప్పబడుచున్నది.

❁ ❁ ❁ ❁

## అస్మద్గురుభ్యో నమః

ఆరవ పాశురమున "పిళ్లాయ్ యెళున్దిరాయ్" అను సంబోధనము గలదు. దీనిచే "అస్మద్గురుభ్యో నమః" అను అర్థము సూచింపబడుచున్నది. ఎట్లనగా, సదాచార్యుల నాశ్రయించి పంచ సంస్కారముల బడసి మంత్ర మంత్రార్థములను, సంప్రదాయ రహస్యములను బాగుగా నెరింగి తాము తమ ఆచార్యుల వలె సిద్ధాంత ప్రచారమునకై ప్రారంభించిన వారగుటచే "పిళ్లాయ్" అనుచున్నారు. ఇందు లేపబడు గోపికయు భగవద్విషయముకన్న భాగవతవిషయము చివరి మెట్టని యెరుంగక భగవదనుభవము మాత్రముచే తృప్తి జెంది దానియందే మునిగియుండుటచే ఈమెను "పిళ్లాయ్" అని పిలచిరి.

## అస్మత్పరమగురుభ్యో నమః

ఏడవ పాశురమున "నాయక పెణ్పిళ్ళాయ్" అని సంబోధించుటచే "అస్మత్పరమగురుభ్యో నమః" అని సూచింపబడినది. మన ఆచార్యులకు గూడ ఆదరణీయులగుటచే మన ఆచార్యులను శ్రీవైష్ణవ మార్గములో నడపించువారు గాన మనకు పరమగురువులైరి. 'నాయక' శబ్దమునకు నడపించువారని యర్థము కదా!

## అస్మత్సర్వగురుభ్యో నమః

ఎనిమిదవ పాశురమున 'కోదుకులముడైయ పావాయ్' అని సంబోధించుటచే నీ యర్థము సూచింపబడుచున్నది. ఇచ్చట 'కోదుకుల' (కౌతూహల) శబ్దము సామాన్యముగా చెప్పబడుటచే వీరికి భగవంతుని యందును, భాగవతులయందును ఉన్న కౌతూహలమని గాని, వారికి వీరియందున్న కౌతూహలమని గాని, చెప్పవచ్చును. ఇట్టి పరినిష్ఠులు పరమాచార్యులు కావలెను. అట్టివారు అందరిచే కొనియాడదగినవారుగ నుండుటచే "అస్మత్సర్వగురుభ్యో నమః" అను నర్థము తగియున్నది.

## శ్రీమతే రామానుజాయ నమః

తొమ్మిదవ పాశురమున 'మామాన్ మకళే' అను సంబోధనముచే శ్రీమతే రామానుజాయ నమః అను నర్థము సూచింపబడుచున్నది. "జ్ఞాతార స్తనయాః" అనుటచే ఆండాళ్లమ్మ అందరకు తల్లి. "భ్రాతాచే ద్యతిశేఖరః" అనుటచే ఉడైయవర్లు ఈమెకు అన్నగారగుచున్నారు. తల్లి తోడబుట్టినవారు మేనమామగదా! 'మగళే' యనుటచే పారతంత్ర్యము సూచింపబడుచున్నది. భగవద్భాగవత పరతంత్రులగువారు రామానుజులే గదా!

## శ్రీ పరాఙ్కుశదాసాయ నమః (పెరియనమ్బిగారు)

శ్రీఆళ్వారందార్లు శ్రీరామానుజులను పంచసంస్కార సంపన్నులను గావించుటకై తమ శిష్య కోటిలో వీరి నుత్తములుగా భావించి వీరిని కాంచీపురమునకు పంపిరి. వీరిని లేపుటకై "నోత్తుచ్చు వర్క్కమ్ పుగు కిన్ఱ వమ్మనాయ్' అని సంబోధించిరి. "నోత్తు" అనగా సిద్ధసాధననిష్ఠకలవారు. అనగా, పరమాత్మయే ఉపాయమను నమ్మకము కలవారు. కావుననే వీరి భారమంతయు నారాయణుడే వహించును. ఇచ్చట 'శువర్క్కమ్' అనగా మోక్షానందము. వీరిని "వాశల్ తిఱవాతార్" అనుచు న్నారు. అనగా భగవదనుభవమునకు విరోధియగు అహంకారమమకారములు తమలో ప్రవేశించుటకు అవకాశము నీయనివారని యర్థము. అట్టియోగ్యత కలవారుగనుకనే ఆళ్వందార్లు వీరిని జగదాచార్యులగు రామానుజులకును ఆచార్యపదవికి నియోగించిరి "మాత్ మున్ఱారారో" అనుటచే రామానుజులవారి ధర్మపత్నియగు తంజమాంబతో తమ ధర్మపత్నికి జగడము జరిగెనని తెలిసి రాత్రికి రాత్రియే యెవ్వరికిని చెప్పక తమ కుటుంబముతో శ్రీరంగమునకు వేంచేసిరి. కుమ్భకర్ణుడు నిద్రనొసగుట యనగా దేవతాంతర, ఉపాయాంతర, ఫలాంతరప్రాప్తికి హేతువులైన జాగృతిని హరించి వానివిషయమై స్తబ్ధత నొసంగుట. "ప్రాజ్ఞేనాత్మనా సమ్పరిష్వక్తః న బాహ్యం కిఞ్చన వేద, నాన్తరం" అనినటుల పరమాత్మయందు పరిపూర్ణ విశ్రాంతిని బడసి బాహ్యప్రపంచ విషయానుభవ మును మరచియుండుట. "అరుఙ్గలమే" (శిరోభూషణమైన దానా!) ఉదయవరుల కాచార్యులగుటచే మనకు వీరు శిరోభూషణులే. "తిఱవే" (తలుపుతెరువుము). రామానుజులును వీరిని ద్వయమంత్రా ర్థము తెలుపుడని ప్రార్థించి బడసిరి. అదియే తలుపుతెరచుట.

## శ్రీ మద్యామున మునయే నమః

"కోవలర్ తమ్ పొఱ్కొడియే" అను సంబోధనచే "శ్రీ మద్యామున మునయే నమః" అను నర్థము సూచింపబడుచున్నది. కోవలర్ అనగా, గోపాలురు. వారు అనన్య దైవత్యులు. శ్రీకృష్ణుడే వారికి పరతత్త్వము. భగవదనన్యార్హ శేషభూతులు. అపారమైన అనన్యభగవద్భక్తి కలవారు ఇట్టివారు నాథమునులు. "లోకేవతీర్ణ పరమార్థ సమగ్రభక్తి యోగాయ నాథమునయే" అని స్తోత్రరత్నమున సాయించిరి. అట్టి వంశములో పుట్టిన 'పొఱ్కొడియే'. అందరిచే నాదరింపబడు యామనమునులు తీగె యనుటచే వీరి పారతంత్ర్యము సూచింపబడుచున్నది.

"కత్తుక్కఱవై క్కణఙ్గళ్ పల" వీరికి సిద్ధాంత ప్రచారమునకు తగిన వయస్సులోనున్న శిష్యులు అనేకమంది కలరు. వారిలో 1. తిరుకోట్టియూర్‌నమ్బి. 2. తిరుమలనమ్బి. 3. తిరు

వరంగ ప్పెరుమాళ్ అరైయర్. 4. తిరుక్కచ్చినమ్బి. 5. తిరుమాలైయాణ్డాన్ - అను నైదుగురును ముఖ్యులు.

కఱ్ఱ —

- పితృకువాప. అనగా శిష్యుల కొరకై జ్ఞానదుగ్ధమును ప్రసాదించిన మహాత్ములు.

నెత్తార్ తిఱలిక్కైయ చ్చెన్ఱు శెరుచ్చెయ్యుమ్ —

చోళరాజు అనేకమంది సామంతరాజుల నుండి కప్పమును కట్టించుకొనుచున్నట్లే ఆయన ఆస్థానమునందున్న అక్కియాళ్వాన్ అను పేరుగల విద్వజ్జనకోలాహలుడున్ను పండితుల నుండి కప్పమును కట్టించుకొనుచుండెను. యామునాచార్యులవారు మహాభాష్యభట్టరు నొద్ద విద్యాభ్యాసము చేయుచుండగా ఆ పండితునకు ఆ మహాభాష్యభట్టరును కప్పమును కట్టనీయకుండ తాము రాజ్యసభకు వెళ్ళి వాదములో ఆ పండితు నోడించి తమ గురువుగారా పండితునకు పన్ను కట్టనవసరము లేకుండ చేసిరి.

కుత్తమొన్ఱిల్లాత —

ఆత్మ వినాశకరములగు దేహాత్మభ్రాంతి మొదలగు అయిదు దోషములు లేనివారు.

## శ్రీరామ మిశ్రాయ నమః

నల్లాల్వాన్ తణ్ణాయ్ —

అను విశేషణముచే శ్రీరామ మిశ్రులు తెలుపబడుచున్నారు. వీరి "నల్లెల్వం" (మంచి సంపద) ఏదియనగా "కనైత్తిళఙ్గత్తెరుమై ............ శెఱాక్కుమ్" దీనికి బాహ్యార్థము బాల సంతానము గల బర్రెలు తమకు దూడలపై గల ప్రేమచే నవి దూరములో నున్నను వానిని తలచుకొని పాలను చేపి పితుకువా రాలసించుటచే చనికట్ల నుండి పాలను ప్రవహింప జేసి పశువుల కొట్టమునంతను బురదయొనర్చగా అందులోనే గోపాంగనలు ఇంటివారును, పైవారును మునిగి తేలవలసి వచ్చుచున్నది-అని. ఈ విశేషణముచే శ్రీరామ మిశ్రుల ఆచార్యనిష్ఠ సూచింపబడుచున్నది.

వీరు శ్రీ పుండరీకాక్షుల అంతరంగ శిష్యులు. వీరు ఆచార్య తిరుమాళికలో సమస్త కైంకర్యములు చేయుచుండిరి. వీరొకనాడు ఆచార్య పుత్రికల నిరువురను స్నానమునకై దూరములో నున్న యొక పుష్కరిణికి తీసికొని వెళ్లిరి. తిరిగి వచ్చుటలో నొకచోట మాత్రము బురదను దాటి రావలసి

వచ్చినది. ఆ పిల్లలు బురదను త్రొక్కుటకు సంకోచించుచు అచ్చటనే నిలచిపోయిరి. దానిని గుర్తించి వీరు ఆ పిల్లలాబురదను దాటుటకు వీలుగా ఆ బురదలోనే పరుండి తమ వీపుపై నుండి వారిని దాటించిరట. ఈ విశేషణము ఈ ఘట్టమును సూచించుచున్నది.

శ్రీరామమిశ్రులకు శ్రీరామావతారమందు ప్రీతి యధికము. అది వీరి తిరునామమునకు తగియున్నది. వీరికి శ్రీరామచంద్రస్తుతి ప్రియమైనది. దానిని ఈ గోపాంగనలు వీరి ప్రీతికై పాడదొడంగిరి. ఈ విషయము "శినత్తినాల్ తెన్నిలఙ్గై ........ పాడవుమ్" అనుదానిచే సూచింపబడుచున్నది, వాయ్ తిఱవాయ్ - నోరు తెరవకున్నావు.

వీరు దానిని ఆనందముచే వినుచు నోరు తెరువరైరి. వీరు మాట్లాడినచో ఆ రసము భంగమగునని వీరికి భయము.

ఇనిత్తానెళున్దిరాయ్ —

వీరు తమ ఆచార్యులగు పుండరీకాక్షుల ఆజ్ఞతో వెళ్లి అర్ధరాజ్యమును లభించి పాలించుచున్న యామునాచార్యుల సన్నిధికేతెంచి వారి విషయప్రావీణ్యమును మాన్పి భగవత్ప్రవణుల గావించిరి. ఈదెన్న పేరుఱక్కమ్ — "యా నిశా సర్వభూతానాం" అని గీత రెండవ అధ్యాయములో చెప్పినట్లుగ వీరికి పరమాత్మవిషయమై జాగరూకతయు, తదితరవిషయమై స్తబ్ధతయు తెలుపబడుచున్నది. ఇదియే వీరి నిద్ర.

## శ్రీపుండరీకాక్షాయ నమః

పోతరి కణ్ణినాయ్ — దీనిచే పుండరీకాక్షాయ నమః - అను నర్థము సూచింపబడుచున్నది. పుష్పమువలెను. లేడి కన్నులవలెను ఉన్న కన్నులుగలది యనియు, పూవులో తుమ్మెద వాలినట్లున్న కన్నులుగలదనియు, పువ్వుయొక్క అందమును తన కంటిఅందములో ఇముడ్చుకొనునది యనియు, పువ్వుతో పోటీచేయుచున్న కన్నులుగలదనియు చెప్పవచ్చును. ఏ విధముగ జెప్పినను నేత్రసౌందర్యాతిశయమునే యీ పదము తెల్పును. కన్ను అనగా జ్ఞానము, దానికి సౌందర్యమనగా సర్వతోముఖముగా నుండుట. ఇట్టి జ్ఞానసంపన్నులు శ్రీపుండరీకాక్షులు.

## శ్రీమన్నాథమునయే నమః

ఉఙ్గళ్ పుళైక్కడై అనుపాశురమున

నావుడైయాయ్ — అను పదము శ్రీమన్నాథమునులను సూచించుచున్నది. నాలుక లేని వారుండరు గదా! అందుచే భగవంతుడు ప్రసాదించిన నాలుకను పూర్తిగా భగవత్కల్యాణగుణాను

సంధానమునకె వినియోగించువారని యర్థము. వీరు కణ్ణినుణ్ శిరుత్తామ్బును జపించి నమ్మాళ్వార్ల అనుగ్రహమువలన నాలాయిరదివ్యప్రబంధముల బడసి దేవగానముతో స్వయముగా పాడి తమ యిరువురు మేనల్లుళ్ళచే పాడించి ఆ దివ్యప్రబంధమును లోకమందంతటును వ్యాపింపజేసిన నాలుకబలముకలవారు.

ఈ పాశురమునకు వ్రాయబడిన వేదాంతార్థములోని "ఉజ్గళ్ పుళైక్కడై మొదలు వాయ్ కూమ్బినకాణ్" వరకు చెప్పిన యర్థములన్నియు వీరికి సరిగా నన్వయించును.

శెజ్ఞొప్పాడ కుర్కై — దీనికిని వేదాంతార్థములో వ్రాసిన తిరుమలనంబిగారి నిర్వాహము వీరివిషయములో సరిపోవును.

ఎజ్ఞక్కై మున్న మెళుప్పువాన్ — వీరు ఆచార్యగోష్ఠిలో మొదటివారు. వీరు "నాథముని కారికలు" అని ప్రసిద్ధిజెందిన సిద్ధాంతార్థప్రతిపాదకములగు శ్లోకములను రచించి సిద్ధాంతమును లోకమున కందజేసిరి.

నజ్ఞాయ్ — పూర్ణురాలా! అనుటయును వీరి విషయమై యెంతయో సమంజసముగా సరిపోవుచున్నది. వీరు సాంగోపాంగములగు వేదములయందే గాక, అష్టాంగయోగమునందును పరినిష్ఠితులు.

నాణాదాయ్ — వీరు యోగమున శ్రియఃపతిని సేవించి సిగ్గును వీడి ఆడుచు పాడుచు సంచరించుచుండువారు. ఆ విషయమే "నావుడైయాయ్" అనియు "శజ్గొడు శక్కరమేన్దుం ........ పాడ" వరకుగల పాశురార్థము సూచించుచున్నది.

## శ్రీమతే శఠకోపాయ నమః

"ఎల్లే" అను పాశురము "శ్రీమతే శఠకోపాయ నమః"అను వాక్యార్థము సూచింపబడుచున్నది.

ఇలజ్ఞిళియే — ఓ బాలచిలుకా! ఈ సంబోధన నమ్మాళ్వార్లకు చక్కగా తగియున్నది. వీరు ఆళ్వార్లందరిలోను చిన్నవారు, వీరి వయస్సు 32 సంవత్సరములు లోపుగనే యుండును, దీనిని బట్టి వీరిది బాల్యావస్థయే యని చెప్పవచ్చును. అందుచే "ఇలజ్ఞిళియే" అని లేపుచున్నారు. చిలుక మనము పలికించిన పలుకులనే పలుకును. అట్లే వీరు తిరువాయ్‌మొళ్ళి ప్రబంధమును పెరుమాళ్ళు వీరికి సంతగా జెప్పి పాడించిరని సాయించిరి. మధురములైన మాటలను చిలుకపలుకులందురు. అటులనే వీరి శ్రీసూక్తులలోనుండి మకరందము స్రవించుచుండును. అది అనుభవైకవేద్యము.

చిలుకరంగు పచ్చగానుండును. వీరు పైట సర్వావయవములందును, లోన హృదయము నందును పెరుమాళ్లు పిరాట్టిమారులతో నెల్లప్పుడును వేంచేసియుందురని సాయించిరి. ఛాందోగ్యోప నిషత్తునందు "ఆ ప్రణఖా త్సర్వ ఏవ సువర్ణః" అని స్పృహణీయమగు రంగుగలవాడని చెప్పబడినది. ఈ పచ్చదనము భగవంతునకు లక్ష్మిసంబంధముచే వచ్చినదని సంప్రదాయ రహస్యము. ఇట్టి భగ వంతుడు ఆళ్వార్లకు "అంతర్బహి శ్చ" వ్యాపించియుండుటచే వీరికిని అదే వర్ణమువచ్చినది. కావున వీరిని చిలుకతో పోల్చుచున్నారు.

ఇన్నమ్ ఉఱజ్గుదియో —

వీరు 16 సంవత్సరముల వయస్సువరకును బాహ్యవిషయములలో నిద్రించుచునే యుండిరి. ఇంతమంది భక్తులము ఆర్తులమై మీ శ్రీసూక్తులను విని తరించవలెనని వేచియున్నను దేవరవారికను కన్నులు తెరువక జ్ఞానములో నిమగ్నులైయున్నచో మాకు గతి యేమి? యనుచున్నారు.

నజ్గైమీర్ — పూర్ణులారా!

ఈ భగవద్భక్తి భాగవతుల వరకు పర్యవసించుటయే దానికి పూర్తి. అట్టి పూర్తి వీరికి కల దని "పయిలుమ్ శుడరొళి" (3-7) అను దశకమునందును, "నెడు మార్కడిమై" (8-10) అను దశ కము నందును సాయించిరి.

వల్లానై ............ వల్లానై —

సర్వేశ్వరుని గూర్చి మన మందరము కలసి పాడుదమని వీరి యభిలాష. అది యెప్పుడు లభింతుమా యని వీరాశింతురు. అందుకనే వచ్చియున్నాము. మీరు లేచి మాతో భగవద్గుణాను సంధానమును చేయుడని ప్రార్థించుచున్నారు.

అందుచే నీ పాశురము "శ్రీమతే శఠకోపాయ నమః" అను వాక్యముతో చక్కగ సమన్విత మగుచున్నది.

ఈ పైన 'నాయకనాయ్' అను 16వ పాశురము మొదలు 5 పాశురములలో శ్రీమతే విష్వక్సే నాయ నమః, శ్రియై నమః, శ్రీధరాయ నమః అను అర్థములను, ఆ చేర్తిలో చేతనులు పురుషకార పూర్వకముగా ఆశ్రయించినచో లభించు అతిశయమున్ను తెలియబడుచున్నవి.

## శ్రీమతే విష్వక్సేనాయ నమః

ఇచ్చట 'నాయకనాయ్' అను పాశురములో "కోయిల్ కాప్పానే", "కొడిత్తోన్ఱుం తోరణవాశల్ కాప్పానే" అను విశేషణములు రెండును శ్రీ విష్వక్సేనులకే చెల్లును. పరమపదమున రాజభవనమును కాపాడువారు వీరే, అక్కడ ఉన్నవియును మాణిక్యకవాటములే.

"నాయకనాయ్" అను విశేషణము విష్వక్సేనులకే చెల్లును. వీరు వైకుంఠ సేనానాయకులు, వీరు తెరచిననే వైకుంఠ ద్వారముల గుండా ఎవరైనను లోనికి వెళ్లగలుగుదురు.

## శ్రియై నమః

'ఉక్ష మదగళిత్త' అను పాశురముచే "శ్రియై నమః" అను నర్థము సూచింపబడుచున్నది.

## శ్రీధరాయ నమః

ఆ పైన ముప్పత్తు మూవర్, ఎత్తక్కలజ్గళ్

మొదలగు పాశురములు శ్రీధరాయ నమః అను నర్థమును తెలుపుచున్నవి.

అపై పాశురములచే శ్రియఃపతి యొక్క విశేషకటాక్షమునకు పాత్రులగునట్లు అపేక్షించుటయు (మారిమలై', పెరుమాళ్ళు సభామంటపమున దివ్య సింహాసనముపై వేంచేసియుండుటయు, వారికి గోపాంగనలు మంగళాశాసనము చేయుటయు (అన్ఱి) పిమ్మట కైంకర్యోప కరణముల ప్రార్థించుటయు వీరందరు కలసి స్నానమాడుటయు (మాలే), ఫలమునకు తగిన సాధనములను భగవంతునే అర్థించి లభించు ప్రీతి పూర్వక కైంకర్యమున్ను, అది యావదాత్మభావిగా నుండవలెననుటయును (మాలే, కూడారై) తెలుపబడినది.

ఇట్లు ప్రబంధము గురుపరంపరాను సంధాన పూర్వకమైన ద్వయమంత్ర వివరణ మగుటచే ప్రపన్నుడగు శ్రీవైష్ణవుడు ప్రతిదినమును దీనిని అనుసంధించుచుండవలెను.

## తిరుమంత్ర వివరణము

ఈ ప్రబంధమున "ఊఴిముతల్వన్" అనుటచే అకారార్థమగు కారణత్వమున్ను "పైయత్తుయిన్ఱ" అనుటచే రక్షకత్వ చింతయును చెప్పబడుటచే శేషిత్వ స్వరూపమున్ను, 'నమక్కే' అనుటచే ఉకారార్థమగు అనన్యార్హ శేషత్వమున్ను. దీని చేతనే మకారార్థమగు ప్రకృతి కంటె విలక్షణమైన భగవచ్ఛేషభూతుడగు ఆత్మస్వరూపమున్ను చెప్పబడుటచే ప్రణవార్థము సంగ్రహముగా సూచింపబడుచున్నది.

"తూయోమాయ్‌వన్దు నామ్" "తూయోమాయ్‌వన్దోం" "అభిమాన బజ్గమాయ్ వన్దు" "మత్తై నఙ్గామఙ్గళ్ మాత్తు" అను వాక్యములచే నమశ్శబ్దార్థ మగు పారతంత్ర్యమున్ను.

'కదిర్ మతియమ్పోల్ ముకత్తాన్ నారాయణనే' అనియు, 'నారాయణన్ మూర్తి' అనియు అనుటచే నారాయణ శబ్దార్థమున్ను, "ఉఱవేల్ నమక్కు ఇఙ్గొఴిక్క వొఴియాతు" అనుటచే నారాయణ పదార్థమగు సర్వవిధ బంధుత్వమున్ను,

"ఎత్తైక్కు మేళేళు .................. నామాట్చేయ్‌వోమ్" అనుటచే నారాయణ పదముతో చేరి యున్న చతుర్థీవిభక్తికి అర్థమగు కైంకర్యమున్ను సంగ్రహింపబడుటచే తిరుప్పావై తిరుమంత్రార్థ వివరణ మగుచున్నది.

## చరమశ్లోక వివరణము

'కఱవైగళ్ పిన్‌శెన్ఱు' అను పాశురమున 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అని ప్రపత్తి కంగముగా తెలుపబడిన కర్మయోగాదులందలి యుపాయత్వ బుద్ధి పరిత్యాగమున్ను, 'ఉన్నై యరుత్తిత్తివన్దోమ్' అనుటచేతను, 'శిత్తం శిఱుకాలే వన్దున్నై చ్చేవిత్తు' అనుటచేతను 'మామేకం శరణం వ్రజ' అను అర్థమున్ను 'వాయినాల్ పాడి.............పుగుదరువా నిన్ఱనవుమ్' అనుటచే "అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి" అను అర్థమున్ను, 'వరుత్తముం తీర్న్దు మకిళ్న్దు' అనుటచే 'మాశుచః' అను నర్థ మున్ను సూచింపబడుటచే తిరుప్పావునందు చరమశ్లోకార్థము సంగ్రహముగా చెప్పబడినది.

## ద్వయమంత్రార్థ వివరణము

తిరుప్పావై ప్రబంధము ద్వయమంత్రవివరణాత్మకమగుటయు సంగ్రహముగా సూచింప బడుచున్నది.

"నప్పిన్నై నఙ్గాయ్! తిరువే! తుయిలెళాయ్" అనుటచే శ్రీ శబ్దార్థమున్ను, "ఎత్తనై యేలుమ్ పిరివాత్త గిల్లైయాల్" అనుటచే మతుప్ ప్రత్యయార్థమైన నిత్య సంబంధమున్ను "ఓఙ్గియులకళన్ద" అను పాశురములో సౌశీల్యమున్ను, "తాయైక్కుడల్ విళక్కం శెయ్‌త దామోదరనై" యని సౌలభ్య మున్ను, "తేవాది దేవనై శెన్ఱు నాం సేవిత్తాల్" అనుటచే స్వామిత్వమున్ను, 'శెప్పముడై యాయ్' అనుటచే ఆర్జవమున్ను, 'తిరలుడై యాయ్' అనుటచే బలము అను గుణములున్ను, 'అలినిలై యాయ్' అనుటచే అఘటితఘటనా సామర్థ్యమున్ను, 'కుఱై వొన్ఱు మిల్లాత గోవిన్దా' యనుటచే వాత్సల్యమను తెలియబడుటచే నారాయణ పదార్థమున్ను,

"పార్కడలుళ్ పైయత్తుయిన్ఱ పరమన్ అడి" "ఓఙ్గియులగళన్ద" "అన్ఱివ్వులకు మళన్దాయ్" అనుటచే చరణశబ్దార్థమున్ను,

"కార్మేని—.........ముకత్తాన్" అనియు, "ఊళిముతల్వ నురువమ్పోల్ మెయ్ కరుత్తు" అనియు, "ముగిల్వణ్ణన్ పేర్‌పాడి" "శఙ్గొడు శక్కర మేన్దుం తడక్కైయన్", "పఙ్గయక్కణ్ణానై" యను టచే దివ్యమంగళవిగ్రహ విశిష్టత్వమున్ను,

"కుఱైవొన్ఱుమిల్లాత గోవిన్దా" అనుటచే కల్యాణగుణవిశిష్టుడగు నారాయణుని యొక్క ఉపాయత్వప్రాప్యత్వమున్ను,

"అఱివొన్ఱు మిల్లాత ఆయర్‌క్కులమ్" "అఱియాత పిళ్ళైగళోమ్" అనుటచే అధికారికుండ వలసిన ఆకిఞ్చన్యమున్ను,

"తూయోమాయ్‌వన్దు" "తీయినిల్ తూశాగుమ్" అనియు, "వన్దు తలై ప్పెయ్‌దోమ్" అనియు చెప్పుటచే అనిష్టనివృత్తికిని, ఇష్టప్రాప్తికిని తప్పని ఉపాయముగా స్వీకరించుట యనెడు ఉపాయ వరణమున్ను,

"ఆవావెన్ఱారాయ్‌న్దరుళ్" "అఙ్గణ్ఇరణ్డుమ్ కొణ్డుమ్ ఎఙ్గళ్ మేల్ నోక్కుదియేల్" అనియు, "ఇత్తైవా నీ కారాయ్ పత్తై" అనియు నారాయణునియొక్క పరగతస్వీకారవైభవమున్ను తెలుపబడినవి.

"నాత్తత్తుళాయ్ ముడి నారాయణన్" అనుటచేతను, "తేవాదిదేవనై" అనుటచేతను, "ఉమ్బర్ కోమానై" అనుటచేతను ద్వయమంత్రమందలి ఉత్తరవాక్యములోని నారాయణపదముచే తెలుపబడు శేషిత్వమున్ను, "ఉక్కముం తట్టొళియుం తన్దున్ మణాళనై" అనుటచేతను, "ఇప్పాతే నీరాట్టు" అనుటచేతను, "మాలే మణి వణ్ణా" "కూడారై వెల్లుమ్ శీర్" అను రెండు పాశురములలోను పూర్తిగా ఉత్తరవాక్యమునందలి 'నారాయణాయ' అను చతుర్థీవిభక్తిచే కోరబడు కైంకర్యోపకరణములు తెలుపబడుచున్నవి.

"ఉనక్కే నామాట్చెయ్‌వోమ్" "మత్తైనఙ్గామఙ్గళ్ మాత్తు" అనుటచే 'నమః' పదముచే తెలుప బడు కైంకర్య విరోధినిరసన ప్రార్థనము తెలుపబడుచున్నది.

ఈ విధముగా తిరుప్పావై ప్రబంధము ఆపాదచూడము ద్వయ మంత్రార్థ వివరణమని తెలియుచున్నది.

ఈ విధముగా గురుపరంపరాను సంధాన పూర్వకమైన ద్వయ మంత్రముయొక్క పురు షార్థమును ఈ ప్రబంధము ప్రతిపాదించుచున్నది.

కావుననే ఉడైయవర్లు దీనిని ప్రతినిత్యము తప్పక అనుసంధించు, అర్థము ననుష్ఠానములో నుంచుకొనుచు "తిరుప్పావై జీయర్" అను తిరునామమును బడసిరి. కావున ఈ ప్రబంధము మనకు నిత్యమును అనుసంధించదగినది.

❋ ❋ ❋ ❋